





# చరిత్ర

హిందూ దేశ,ఆంధ్రుల,సాహిత్య,తత్వ

# తెలుగు సాహితీ వస్తు పరిణామం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2040100047342

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# తెలుగు సాహితీ వస్తు పరిణామం

**డా. కొలకలూరి మధుజ్యోతి**
అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలుగు అధ్యయన శాఖ
శ్రీపద్మావతి మహిళా విశ్వవిద్యాలయం, తిరుపతి - 517 502

జ్యోతి గ్రంథమాల
129, తపోవనం నగర్, అనంతపురం - 515 004

# నేపథ్యం

నేను శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. గోల్డ్ మెడల్‌తో ౧౯౯౧ మార్చిలో పరిశోధనార్థం అడుగుపెట్టాను. చేరగానే ౧౯౯౧ అక్టోబర్‌లో యు.జి.సి. నిర్వహించిన నెట్‌లో ఉత్తీర్ణత సాధించి ఫెలోషిప్-కం-లెక్చరర్‌షిప్ పొందాను. ఈ అర్హత నాకు ౧౯౯౩ మార్చిలో తెలుగు అధ్యయన శాఖ, శ్రీపద్మావతి పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం, తిరుపతిలో ఉద్యోగం అర్జించి పెట్టింది. పరిశోధన, నూతనంగా చేరిన బోధనల నడుమ ఉక్కిరి బిక్కిరి అవుతూనే ౧౯౯౪లో పరిశోధన ముగించాను. ౧౯౯౮ ఫిబ్రవరిలో డాక్టరేటు పొందాను. అన్నీ త్వరితగతిన సాగాయి. ౨౦౦౧లో పరిశోధనా వ్యాస గ్రంథానికి ప్రచురణ యోగం లభించింది. ఈ ప్రచురణకు పూర్వం రెండు పుస్తకాలు ప్రచురించాను. ఇది ముచ్చటగా మూడో బిడ్డ. పరిశోధనలో చేరటానికి పూర్తి చేసి నేను పట్టా పుచ్చుకొని నలుగురికీ ఈ గ్రంథం హస్తభూషణం కావటానికి మధ్య దశాబ్ది కాలం గడిచింది. నేడు ఈ గ్రంథం నన్ను సాహిత్య పరిశోధన విమర్శ రంగాలలోనికి తీసుకెళ్తూ ఉంది. అది ఎంతో సంతోషమూ గర్వకారణమూనూ!

నా సాహిత్య పరిశోధనకు సారథ్యం వహించారు డా. ఎం.కె. దేవకీ గారు. పరిశోధనాపరంగా అనుభవం పూజ్యమే అయినా, దానిని అర్థం చేసుకొని పరిశోధనకు నన్ను ప్రోత్సహించి నా పరిశోధన ఉద్యోగ కారణాన ఆలస్యం కాకుండా హెచ్చరిస్తూ పూర్తి చేయించిన వాత్సల్యమూర్తి ఆచార్య ఎం.కే. దేవకీ గారు. వారికి ధన్యవాదాలు. పరిశోధనకు అవకాశం కల్పించిన శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం, పరిశోధన సమర్పించటానికి తమ వంతు ప్రోత్సాహోన్నందించిన శ్రీ పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం, తెలుగు అధ్యయన శాఖ అధ్యాపక బృందం, లైబ్రరీలకు నేను కృతజ్ఞతలు చెప్పకోవాలి.

ఈ పుస్తక ముద్రణకు ఆర్థిక సహాయం అందించిన సంస్థలకు కృతజ్ఞతాంజలులు.

నా పరిశోధనకు స్ఫూర్తిదాతలు, కృషి నిర్విఘ్నంగా నిర్విరామంగా ఆటంకరహితంగా సాగడానికి, కారకులు మా నాన్నగారు ఆచార్య కొలకలూరి ఇనాక్ గారు అమ్మ శ్రీమతి భాగీరథీ, తమ్ముడు డా.కె. సుమ కిరణ్‌ల ప్రోత్సాహం మరువరానిది. పరిశోధన ముద్రణకు అంకురార్పణ అయినది మొదలు సంపూర్ణ రూపం సంతరించుకొనే వరకు సమస్తం తన చేతులు మీద నడిపిన వారు శ్రీవారు డా. చిలుమూరి శ్రీనివాసరావు గారికి, తన చిన్నారి పొన్నారి మాటలు, బుడిబుడి అడుగుల కాలాన్ని తస్కరించినా, బోసినోటి నవ్వులతో గడపవలసిన సమయాన్ని దొంగలించినా సహించిన చిన్నారులు చి. సరయ, చి. ఆశీస్ ప్రభాత్‌లు, నా ఈ చౌర్యాన్ని పెద్దయి నిందించరని ఆకాంక్ష. వీరందరికీ నా కుటుంబ సభ్యులందరికీ నేనెంతో కృతజ్ఞురాలిని.

ఈ పుస్తకం అందమైన ముద్రణకు డి. టి. పి. పనిని సమర్థవంతంగా పూర్తి చేసిన యస్. వి. సుబ్బారావు గారికి, నాతో పాటు ప్రూఫ్ చూసి ప్రూఫ్ చూడటంలో తమదే అన్నంత శ్రద్ధ కనబరచిన పరిశోధక మిత్రులు కుమారి ఎం. ఎస్. శ్రీదేవికి, కుమారి మంగమూర మునిలక్ష్మికి, పుస్తక రూపంలో అందించిన శ్రీ సుధాకర్ రెడ్డిగారు, స్టూడెంట్స్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ తిరుపతి వారికి ప్రత్యేక కృతజ్ఞతలు.

డా. కొలకలూరి మధుజ్యోతి

# సిద్ధాంత గ్రంథ పరిచయం

సంస్కృత లాక్షణికులు సాహిత్యాన్ని, రచనా విధానాన్ని, విశ్లేషించిన తీరును, కావ్య రచనా ధోరణికి ఉన్న ప్రాధాన్యాన్ని, ఇతివృత్త విశ్లేషణకున్న పరిమిత ప్రాముఖ్యాన్ని గుర్తించటం అవసరం. ఇతివృత్త ప్రాధాన్యం సంభావించి దాని వికాసం స్పష్టం చేసుకోవటానికి ప్రాచీన సాహిత్య లక్షణాలను పరిశీలించి, ఇతివృత్త పరిణామం పరిశీలనార్హమైన అంశంగా గుర్తించి, దాని ప్రాధాన్యం వైశిష్ట్యం స్పష్టం చేసుకోవలసి ఉంది. దాని కేంద్రమయిన వస్తువుపై దృష్టి సారించటం కర్తవ్యమని గ్రహించి వస్తుతత్త్వం ఆవిష్కరించటం ముఖ్యం ఇంతకు పూర్వం తెలుగులో జరిగిన కృషి ఫలితాలు లేకపోవటం వల్ల, మౌలిక కృషి మూల సాహిత్యమయిన భారత రామాయణ భాగవతాది సృష్టిని దర్శించి, వస్తు విశ్లేషణాత్మకంగా చూడటం లక్ష్యం ఇందుకు తెలుగు సాహితీ వస్తు పరిణామం పరిశోధనాంశంగా గ్రహించటమయింది. ఈ పరిశోధన సిద్ధాంత గ్రంథం ఆరు అధ్యాయాలలో ఉంది.

ప్రథమాధ్యాయంలో, ఇతివృత్తం కావ్య స్వభావాన్ని నిరూపిస్తుందనీ, వస్తువు కావ్య ప్రాణం ఆవిష్కరిస్తుందనీ, భావించటమయింది. తెలుగు సాహిత్యం మీద ఉన్న సంస్కృత ప్రాకృత ఉర్దూ ఆంగ్ల సాహిత్య ప్రభావం స్థూలంగా పరికించటం జరిగింది. అవి తెలుగులో ప్రవేశపెట్టిన విభిన్న ప్రక్రియలను గుర్తించి, వాటి ఇతివృత్త స్థితి, వస్తుగతి, గ్రహించి, సంస్కృతాంగ్ల సాహిత్యం అందించిన భిన్న ఆలోచనా ధోరణులను పరిశీలించి, సంస్కృతం అందించిన ఇతివృత్త తత్త్వాన్ని, ఆంగ్లం అందించిన వస్తుతత్త్వాన్ని గమనించి, వస్తు – ఇతివృత్త సంబంధం దర్శించటమయింది. ఇతివృత్త స్థితి, వస్తు లక్షణం స్వీకరించి, నిఘంటువులు, విమర్శలు, పరిశోధనలు లభ్యమయిన మేరకు పరిశీలించి, చేసిన వివేచన వల్ల వస్తు · ఇతివృత్త సంబంధం స్పష్టం చేసుకొని వస్తు ప్రాముఖ్యం పతిపాదించటమయింది.

ద్వితీయాధ్యాయంలో, చరిత్ర నిరూపించే ఘట్టాలు కావ్యాలుగా రూపొందటం పరికించి, భారత రామాయణాలను చరిత్ర నేపథ్యంలో, శైవ వైష్ణవ విశ్వాసాలు అందించే సాహిత్యాన్ని మత చరిత్ర ప్రాముఖ్యంలో, పల్నాడు, కాకతీయుల, రాయల చరిత్రలను ఆధారంగా చేసుకొని అవతరించిన సాహిత్యాన్ని ఆంధ్రదేశ చరిత్ర ప్రాంగణంలో, భిన్న ప్రాంతాలలో ప్రముఖంగా కనిపించిన చరిత్ర ఆధారంగా వెలువడ్డ సాహిత్యాన్ని స్థానిక చారిత్రకావరణంలో; భారతదేశం పొందిన ఆధునిక చైతన్యంతో వెలువడ్డ సాహిత్యాన్ని స్వాతంత్ర్యోద్యమ భూమికలో; పరిశీలించి చారిత్రక వస్తు పరిణామం గుర్తించే కృషి జరిగింది.

తృతీయాధ్యాయంలో చరిత్రకందని కాలం నాటి చరిత్రగా గోచరమవుతున్న సాహిత్యం దైవీయ స్పర్శ కలిగి ఉండటం గ్రహించటమయింది. చరిత్ర పూర్వ యుగాలలో దైవ మానవ సంబంధం గుర్తించి, పురాణ ఉప పురాణాలలో ప్రపంచితమయిన సాహిత్యం అవలోకించి, పురాణ లక్షణం గ్రహించి వంశ సాహిత్యం తిలకించి, వంశం ప్రతిపాదించిన మాహాత్మ్యం దర్శించి, మాహాత్మ్యం ప్రకటించిన విలాస సాహిత్యం సందర్శించి, విలాసం ప్రచలితం చేసిన ఖండ సాహిత్యం స్వీకరించి, ఇతివృత్త వ్యాప్తి పరికించి, దైవీయ సాహితీ వస్తు పరిణామం విశదం చేసే ప్రయత్నం రూపొందింది.

చతుర్థాధ్యాయంలో, చారిత్రక స్పర్శ స్ఫురింపచేస్తూ, దైవీయ తత్త్వం గుర్తింపచేస్తూ, సంపూర్ణంగా వినోదార్థం ఉద్దిష్టమైన సాహిత్యంలో, కథాకావ్య సమూహం లక్షణాలు గ్రహించటమయింది. అందులోని చారిత్రక, జంతు, తంత్రాది నేపథ్యం అందించే వినోద దర్శనం చేసి, ప్రబంధ, యక్షగాన, శతకాది ప్రసిద్ధ ప్రక్రియలందించే వినోద స్థితి గుర్తించి, జానపద సాహిత్యం సామూహికంగా సమర్పించే విశిష్ట ధర్మం వివరించి, ఆధునికాంధ్ర సాహిత్యంలో వినోద విశిష్టంగా రూపొందిన కవిత్వ నాటక నవలా సాహిత్యం పరిశీలించి, వినోద వస్తు పరిణామం ప్రకటించటమయింది.

పంచమాధ్యాయంలో, ప్రపంచ వ్యాప్తంగా జరిగిన చారిత్రక పరిణామాల వల్ల, భారతదేశంలో ఆధునిక కాలంలో మారిన పరిస్థితుల వల్ల, తెలుగు సాహిత్యంలో సంక్రమించిన నూత్న భావజాలం దర్శనం పొందింది. నూతనంగా ఆధునిక మానవుడికి వారసత్వంగా సంక్రమించిన స్వేచ్ఛా స్వాతంత్ర్య సమానత్వాలు గుర్తించి, ఇటువంటి విలువలు ప్రాచీన కాలంలోని శైవ సాహిత్యంలో, వేమన కవిత్వంలో, కాలజ్ఞానాదులలో దర్శించటం జరిగింది. ఆధునిక కాలంలో జాతీయంగా, అంతర్జాతీయంగా రూపొందిన ప్రాథమిక హక్కులు, మానవ హక్కులు నేపథ్యంలో తెలుగులో వెలువడ్డ భావ, అభ్యుదయ, దిగంబర, విప్లవ కవిత్వాలను, నాటక నవల కథానికాది సాహిత్యాన్ని, దళిత స్త్రీ, సాహిత్యాలను సంభావించి మానవీయ వస్తు పరిణామం పరిశీలించటమయింది.

షష్ఠాధ్యాయంలో, చారిత్రక వస్తురాశిలోని చారిత్రక, దైవీయ, వినోద, మానవీయ వస్తు ప్రాంగణాలు దర్శించటం, రస వస్తురాశిలోని శృంగార వీర అద్భుత హాస్య రస వస్తు తీరాలు పరికించటం, విలువ వస్తురాశిలోని నిరుద్ధత్రయం గ్రహించి, వికాసత్రయం పరిశీలించి, స్వేచ్ఛా స్వాతంత్ర్య సమానత్వ వస్తువు పొందే వ్యాప్తి స్వీకరించటం, చారిత్రక వస్తు రాశి వైశిష్ట్యం ప్రాముఖ్యం సంపూర్ణత్వం నిర్ణయించటం, ఇతివృత్త వ్యాప్తిలో కాలక్రమంలో విలువల వినిమయం, విలువల వ్యత్యస్తం సంభావించటం, ఈ త్రివిధ వస్తు రాశుల స్వభావాల నేపథ్యంలో తెలుగు సాహితీ వస్తు పరిణామం గుర్తించటమయింది.

తెలుగు సాహిత్యంలోని వస్తు ప్రాముఖ్యం ప్రస్తావించి, చారిత్రక వస్తువ్యాప్తి తెలిపి, దైవీయ వస్తు ప్రాధాన్యం పరిశీలించి, వినోద వస్తు విశిష్టం నిర్ణయించి, మానవీయ వస్తు ప్రాథిక్యం ప్రకటించి ఈ చారిత్రక వస్తు రాశి ప్రాముఖ్యంతో పరిశీలన పొందిన తెలుగు సాహితీ వస్తు పరిణామం ఈ సిద్ధాంత గ్రంథంలో ప్రకటితమయింది.

★★★

# విషయసూచిక

---

# తెలుగు సాహితీ వస్తు పరిణామం

## 1. వస్తు వివేచన

సాహిత్యంలో కావ్యాత్మ, కావ్యశరీరం అనే రెండింటిని గూర్చి ప్రధాన విషయాలుగా పరిశీలనం జరిగింది. ఈ ఆలోచన ప్రాచ్య దేశ సాహిత్య పరిధికి పరిమితంగా ఉంది. సంస్కృత సాహిత్యం కలిగించిన ఈ దృక్పథం ప్రధాన ప్రాచీన సాహిత్య పరిశీలన నేపథ్యంలో గుర్తింపదగ్గ అంశంగా ఉంది. కావ్యశరీరం ముఖ్యం కాదన్న దృక్పథమూ ఉంది. కావ్యాత్మ వాదాలుగా ఉన్న ఎనిమిది వాదాలు కావ్య మూల తత్త్వం పరిశీలించే మార్గంలో సాగాయి. కావ్యాత్మగా భావించిన వాదాలు ప్రధానంగా రస, ధ్వని, అలంకార, అనుమితి, ఔచిత్య, వక్రోక్తి, రీతి, గుణ మార్గాలలో సాగాయి. కావ్యశరీరం కావ్య బాహిర నిర్మాణంగా భావిస్తే, బాహిర నిర్మాణం దృష్టి గోచర అంశంగా గ్రహిస్తే, సాహిత్యాకృతి కావ్యశరీరమవుతుంది. రచనా విధానం, భాషా విషయం, ఛందస్సు కావ్యశరీర గుణాలుగా గుర్తింపవచ్చు. నిశిత పరిశీలన మరింత లోతుగా పోతే కావ్యశరీర నిర్మాణంలోని ప్రధానమైన భాగాలన్నీ లోపలున్నా, బయటఉన్నా, అంతర బహిర అసంబద్ధత లేకుండా కావ్యశరీర విషయాలే అవుతాయి. అందువల్ల చర్మ చక్షు గోచరమయ్యే సాహిత్య సంబంధమైన సమస్త విషయాలు కావ్య శరీరాంతర్భాగాలుగానే గ్రహింపవలసి ఉంటుంది. శరీరంలో ఉన్నాయని భావించే హృదయం కానీ, ఆత్మకానీ ఉంటాయని గుర్తిస్తే ఉనికి తెలియని ఈ భావనలు శరీరాన్ని ఆశ్రయించుకొనే ఉంటాయన్నది స్పష్టం. అందువల్ల కావ్య శరీరం నయనేంద్రియ గోచరం కాగా, కావ్యాత్మ హృదయ నయన గోచరం అవుతుంది.ఇప్పుడు కావ్యాత్మ అనుభూతి గోచరం అనవచ్చు. సాహిత్యంలో కావ్యశరీరం బాహిరమనీ, కావ్యాత్మ అంతరమని భావింపవచ్చు.

అయితే రీతివాదం, గుణవాదం రచనా విషయాలుగా భావించి, కావ్య శరీర సృష్టిని ప్రపంచించేవిగా కనిపించే అవకాశం లేకపోలేదు. వక్రోక్తి నిజానికి సాహిత్యానుశీలనంలో వికాసం, విస్తృతి పొందిన అలంకారమే. సాహిత్యంలో అలంకారం నిర్మాణ దశలో అనుభూతి మాధుర్య దర్శనం పొంది ఉండటమన్నది సత్యం. పోలిక అలంకారానికి ప్రాణం. పోలిక కోసం సాహిత్య నిర్మాణంలో జరిగే ప్రయత్నం సాహిత్య స్రష్ట అనుభవసారం నుంచి ఆవిర్భవించే మాట వాస్తవమే. అయితే అనుభూతి అందించిన అంశం సాహిత్యంలో ప్రవేశించేసరికి అది రచనా రూపంగానే మిగులుతుంది. కావ్యాత్మగా సంభవించే అలంకారం, వక్రోక్తి ప్రభవించిన అనంతరం కావ్యశరీరంగా దర్శనమిచ్చే గుణాన్ని సంతరించుకొనే సందర్భం అనివార్యం.

అనుమితి, అనుమాన ప్రమాణం మీద ఆధారపడిన హేత్వంశం. అగ్ని ఉంటే పొగ ఉంటుంది. కావ్యశరీరం ఉంటే కావ్యాత్మ ఉంటుంది. అగ్ని లేకపోయినా పొగ

ఉండటానికి వీలున్నప్పుడు కావ్యాత్మ లేకపోయినా, కావ్యశరీరం ఉండటాని. వీలుంటుందన్న అంశం అంగీకరించి, కావ్యాత్మ లేని మృతప్రాయమైన కావ్యశరీరం ఉంటుంది అని గ్రహింపవలసిన స్థితి ఏర్పడుతుంది. ఔచిత్య వాదంలో ఉచితం అనుచితం వింగడింపు మీద, ఇది సహజం ఇది అసహజం అనే దృష్టి నిలుస్తుంది లౌకికమైన ఔచిత్యం మీద ఆధారపడిన అలౌకికమైన ఔచిత్యం దర్శించే అవసరం ఏర్పడుతుంది. అయితే ఉన్న దాని మీద ఆధారపడి లేనిదాని దర్శనం చేసుకోవలసి వస్తుంది. ఇది ఔచిత్యం, ఇది అనౌచిత్యం అనటానికి లౌకిక ప్రమాణమే ప్రధానం. ఈ ప్రమాణం సాహిత్య దృష్టిలో కావ్యశరీరం మీద ఆధారపడుతుంది. అందువల్ల ఒక ప్రమాణం మీద ఆధారపడే అంశం ఒక ప్రాంగణానికి పరిమితమవుతుంది. ఇక్కడ అనుమాన ప్రమాణం, లోక ప్రమాణం, అనుమతి ఔచిత్యవాదులకు మూల తత్వాలు అవుతూఉన్నాయి. అందువల్ల బాహిరావరణాలు వీటికి ప్రధానావసరాలుగా ఉన్నాయి.

రీతి గుణ వాదాలకు కావ్యశరీరావసరం ఉంది. అలంకార వక్రోక్తి వాదాలకు అనుభూతి తాదాత్మ్యం ఉన్నప్పటికిని, అవి అభివృద్ధి దశలో కావ్యశరీర సంబంధం అనివార్యంగా వాంఛిస్తూ ఉన్నాయి. అనుమితి, ఔచిత్యం బాహిరావాస దశను కోరుకోక తప్పని పరిస్థితుల్లో ఉన్నాయి. అందువల్ల రస ధ్వని వాదాలు వీటికంటే భిన్నంగా ఉండగలిగాయి. ధ్వని వాదంలో ఉన్నదాన్ని ఆధారంగా చేసుకొని బాహిరేంద్రియాల గోచరం కాని స్ఫూర్తి ఉంటుంది. ఈ స్ఫూర్తి బహుధా బహుదా దర్శనమిస్తుంది. ఇది కావ్యమంతటా వెల్లివిరియవచ్చు. రసం కూడా కావ్యమంతటా విస్తరించి ఉండే అంశం. ధ్వనికి ప్రముఖంగా కావ్యశరీరం దోహదం చేస్తుంది. కావ్యశరీరంలో గోచరం గాని తత్త్వం, ధ్వని రూపంగా హృదయేంద్రియానికి అనుభూతమవుతుంది. ఇది కావ్యమంతటా ప్రతిక్షణం ప్రత్యక్షం కావచ్చు.

అయితే రసం కావ్యాంశాలు అన్నింటిని కలుపుకొని, కావ్యాత్మ వాదాలు అన్నింటికి కలుపుకొని, కావ్యం యొక్క సమస్త విషయాలకు అనుసంధానం పొంది, క్రమ క్రమంగా వికాసం పొంది, కావ్యాత్మంలో అనుభూతమయ్యే అతీంద్రియాంశం రసం. రసం ప్రధాన కావ్యాత్మ వాదంగా గుర్తింపవచ్చు. దీనిలో ఇతర వాదాలు అంతర్లీనం అయ్యే అవకాశమూ ఉంది. ఇది కావ్యమంతటా క్రమంగా వికాసం పొందుతూ ఉంటుంది. దీనిది పరిమిత సాహితీ ప్రాంగణం కాదు. ఇది కావ్య శరీరమంతా వ్యాపించి ఉంటుంది. ఈ వాదం ఆలోచనకు, అంతకంటే అధికంగా అనుభూతికీ చిక్కుతుంది. మిగతా వాదాలు ఆలోచనకే అందవచ్చు. అందువల్ల రసవాదమే ప్రధానంగా భావించి ప్రముఖంగా శృంగార వీరాలు నిర్ణయించిన సాహిత్యంలో రసవాదం ప్రధాన కావ్యాత్మ వాదంగా గ్రహింపవచ్చు

భిన్న కావ్యాత్మ వాదాలు విభిన్నంగా ప్రముఖాలని ప్రతిపాదించే ఆలోచలునలున్నాయి. కాని, ఒక కావ్యశరీరానికి ఒక ఆత్మ మాత్రమే ఉంటుందని గుర్తిస్తే, ఉండే సుఖం వేరు. ఒక కావ్యశరీరానికి అనేక ఆత్మల ·అన్వేషణ అంత వాంఛనీయం కాదు. అనేక కావ్యశరీరాలకు అనేక కావ్యాత్మలుంటాయని ప్రతిపాదించటం లక్షణమైతే, కావ్యశరీరాలలో అసమతకు అవకాశం ఇచ్చినట్లు అవుతుంది. వైవిధ్యం వాంఛనీయమే

కాని, వైరుధ్యం కాదు. కావ్య సృష్టి, ఆత్మల అనేకత్వంలో వైరుధ్య కారణం కాకుండా ఉండటం కోరుకోదగ్గ విషయం. ఈ సాహితీ సమాలోచనంలో ప్రస్తుతానికి ప్రధానంగా స్వీకరించే అంశం -కావ్యద్వైవిధ్యం కావ్యాత్మ - కావ్యశరీరం అన్న దృష్టితో సంస్కృతాలంకారిక సంప్రదాయంలో విశేషంగా ఆలోచన సాగిందన్న విషయం గుర్తించటం. ఈ మార్గంలోనే ప్రాచ్య సాహిత్య సంప్రదాయం ఉందన్న విషయం పరికించటం ప్రధానం.

కావ్యత్మ కావ్యశరీరం అని ప్రాచ్య దృష్టిఉండగా, సాహిత్య విషయంలో ఆలోచన సాగగా, ఫారం, కంటెంట్ అనే అంశాలమీద పాశ్చాత్యాలంకారికుల ఆలోచన సాగింది. సాహిత్యంలో ఫారమ్ ముఖ్యమని వాదించే వాళ్ళూ ఉన్నారు. కంటెంట్ ముఖ్యమని వాదించే వాళ్ళూ ఉన్నారు. ఫారం బాహిర రూపం. దీనికి అంతర సంబంధం కూడా ఉంది. కంటెంట్ అంతర విషయం. కంటెంట్ అంతరంగా ఉన్నదాని అంతరార్థం అనీ, అంతరాంతర ప్రాంగణాలు ప్రాణం అని గుర్తించారు. ఫారమ్ నయన గోచరం కాగా, కంటెంట్ హృదయగోచరమవుతుంది. ఇప్పుడే ఫారం ప్రాచ్య కావ్య శరీరానికి, కావ్యాత్మ పాశ్చాత్య దృక్పథంలోని కంటెంటుకి సమానంగా కనిపిస్తున్నాయి. సారాంశం ఏమిటంటే సాహిత్యంలో రెండు ప్రధాన దృక్పథాలున్నాయి. అవి కావ్యాత్మ, కావ్యశరీర వాదాలు. ఇవి ప్రాచ్య పాశ్చాత్య దేశాలలోని ప్రాచీన అర్వాచీన సాహిత్యంలోను సుప్రతిష్ఠితంగా ఉన్నాయి.

ప్రాచ్య సాహిత్యంలో కావ్యాత్మ, కావ్యశరీరం రెండింటిని వింగడించి చూచే అలంకారికులు విమర్శకులు ఉన్నమాట వాస్తవమే కాని, కావ్యశరీరాన్ని గూర్చి చేసినంత ఆలోచన కావ్యాత్మను గురించి చేయలేదు. స్థూలంగా ఒక్క మాట చెప్పవచ్చు. కావ్యశరీరం సర్వాంగ సుందరంగా రూపొందితే కావ్యాత్మ సహజంగానే సుందరంగా ఉండకపోతుందా అన్న విశ్వాసం వల్ల కావ్యశరీర తత్త్వం మాత్రమే విమర్శకులు విడమరచి చూశారు. కావ్యాత్మ పేరుతో అమూర్త పదార్థ దర్శనం చేయటానికి ఎంతో దూరం ప్రయత్నించే అవకాశం లేకపోయింది. కావ్య భాష, ఛందస్సు, అలంకారం, రచన, రీతి, గుణం, పద ప్రయోగం, సమాస ఘటనం, నుడికారం, పలుకుబడి, వ్యాకరణం ఆలోచించినంతగా కావ్యాత్మ కావ్య విషయం కావ్య వస్తువు కావ్యేతివృత్తం వివరించి చెప్పలేదు. చెప్పినంత వరకు సూక్ష్మంగా సూత్రప్రాయంగా చెప్పి ముగించారు అలంకారికులు.

కావ్యం ఆకృతి ముఖ్యమా, ఆత్మ ముఖ్యమా అని వితర్కించిన పాశ్చాత్య సంప్రదాయంలో 'ఫారం' ప్రాధాన్యం గుర్తించారు - కంటెంట్ ప్రాముఖ్యం గుర్తించారు. రెండింటిని గురించి అక్కడ నిశ్చితమైన చర్చ జరిగింది. స్పష్టమైన అవగాహన ఏర్పడింది.

ప్రాచ్య సంప్రదాయంలో కావ్య స్వరూపం మీద విశేష కృషి జరిగి, కావ్యాత్మ మీద విపుల వ్యాఖ్యానం కోరే విధంగా, సూత్రప్రాయంగా కావ్యాత్మ దర్శనం ఏర్పడింది. పాశ్చాత్య సంప్రదాయంలో కావ్యాత్మ కావ్యశరీరం మీద విస్పష్టమయిన పరిశోధన జరిగి, రెండింటిని గూర్చిన విపుల కృషి ఉంది. అయినా కావ్యాత్మ విషయికంగా పరిశ్రమ ప్రాచ్య పరిశ్రమ కంటే విశిష్టంగా ఉంది. పాశ్చాత్య కావ్యశరీర దర్శనం కంటే విశిష్టంగా

విస్పష్టంగా విపుల వ్యాఖ్యానం విమర్శనంగా ప్రాచ్య దర్శనం గోచరమవుతుంది. రెండు సాహిత్య దృక్పథాలు రెండు భిన్న సంస్కృతి ప్రాంగణాల నుంచి పుట్టడం వల్ల రెండు ప్రాధాన్యాలు సంతరించుకొని, రెండు దృక్కోణాలు వెలువరించాయి. ఈ ద్వైవిధ్యం నుంచి ఒక సమగ్ర సాహిత్య తత్త్వం సాహితీ లోకానికి అందే స్థితి ఏర్పడింది.

కావ్యాత్మ దర్శనంలో క్రమక్రమంగా కావ్య విషయం గతార్థం కాసాగింది. ఇప్పుడు కావ్యంలోని కథ అనేమాట స్థిరపడింది. కావ్యం లోని కథ ఇతివృత్తం ప్రధాన విషయంగా పరిణామం చెందింది. ఇతివృత్తాలకు స్థానికమైన రంగూ రుచీ వాసనా ఏర్పడతాయి. ఇతివృత్తం, స్థానికత్వం పొందుతుంది. సార్వదేశికం, సార్వకాలికం, సార్వజనీనం కాదగ్గ సాహిత్యం తన ఇతివృత్తాలతో స్థానికం కావటం మాత్రమే కాదు, స్థల కాల పాత్ర ప్రభావం చేత పరిమితం కూడా అవుతూ వచ్చే దశను పొందింది.

ఇతివృత్తం ఒక భౌతిక ధర్మాన్ని, ఒక ప్రాంతీయ లక్షణాన్ని, ఒక కాలం స్వభావాన్ని, ఒక పాత్ర స్వరూపాన్ని, ఒక వ్యష్టితత్త్వాన్ని కలిగి ఉంటుంది. కాని, ఒక సమష్టి తత్త్వాన్ని, ఒక సమగ్ర మానవ స్వరూపాన్ని, ఒక సంపూర్ణ కాల స్వభావాన్ని, ఒక వసుధైక కుటుంబ భావనంగా ప్రపంచాన్ని, భావ భౌతిక వాదసమన్వయంగా ఉండే స్థితిని, ఇతివృత్తం సంతరించుకొంటే అది వస్తువుగా గోచరమవుతుందని గుర్తింపవచ్చు. అంటే ఒక సమగ్ర సాహితీ స్వరూపాన్ని విశ్వ సాహిత్య ప్రాంగణం నుంచి దర్శించటానికి వీలు కలిగించేది సాహిత్య వస్తువు.

విశ్వ సాహిత్య నేపథ్యం నుంచి సాహిత్య వస్తువులను, దాని పరిణామాన్ని, దర్శించటానికి చాలా పెద్ద ప్రణాళికతో, చాలా పెద్ద కృషి, విభిన్న సాహిత్య భాషల పరిశీలన నుంచి జరగవలసి ఉంటుంది. అయితే ప్రాచ్య సాహిత్యానికో పాశ్చాత్య సాహిత్యానికో పరిమితంగా వస్తు పరిశీలన చేయాలన్నప్పటికి విశాల పరిశోధన ప్రాంగణం అవసరమే అవుతుంది. భారతీయ భాషల నేపథ్యం నుంచి సాహిత్య వస్తు పరిణామం పరికించాలని తలంచినా చాలామంది కలిసి చేయవలసిన పరిశోధన కార్యమే అవుతుంది. అందువల్ల సాహితీ వస్తు పరిణామం తెలుగు సారస్వతానికి పరిమితంగా దర్శించే కృషి కూడా విశాల సాహితీ ప్రాంగణంలో వెయ్యేళ్ళ సాహిత్యంలో ప్రత్యేక సన్నివేశాలు ఆధారంగా పరిశోధించటం మాత్రమే సాధ్యమవుతుంది. అది కూడా చాలా స్థూలంగా మాత్రమే సాధ్యమవుతుంది. పరిశోధన పరిధి, ప్రాంతం, ప్రాధాన్యం కారణంగా స్థూలంగా అయినా తెలుగు సాహిత్యంలోని వస్తువు చెందిన పరిణామం దర్శించటం అత్యవసర కర్తవ్యం.

కావ్యశరీరంలో ఇతివృత్తంలో భాగమనుకొనే ప్రాచ్య సంప్రదాయం నుంచి, కావ్యాత్మలో ఇతివృత్తం భాగమనుకొనే ప్రాచీన సంప్రదాయం సమ్మేళనం చేసుకొని, ఇతివృత్త క్రోడీకరణం నుంచి వస్తువు దర్శనం ఏర్పడుతుందని గ్రహించి, వస్తు సమగ్ర దర్శనం నుంచి కావ్యాత్మ గ్రహించే అవకాశం తెలుగులో సంభావించుకొని, సాహిత్యంలోని వస్తువును, దాని పరిణామాన్ని పరిశీలించాలి.

ఇతివృత్తాన్ని గూర్చి విశాల నేపథ్యంలో చర్చ, విమర్శ, ఆలోచన లేని సందర్భంలో వాటి క్రోడీకరణంలో ఏర్పడే వస్తుతత్త్వం గుర్తించే కృషి అకాండతాండవమయ్యే ప్రమాదం ఉంది. అందువల్ల జాగురూకంగా నిర్వహించవలసిన బాధ్యతగా పరిశోధనం సాగుతుంది. లభించే ఆధారాలతో, అలభ్య సూత్రాలు అందుకోవలసి ఉంది.

ఇతివృత్తాలు సాహిత్య స్వరూపాలకు తప్పని సరిగా ఉంటాయి. అవి ఏ ప్రక్రియ అయినా, కావ్యమయినా, నాటకమయినా నవల అయినా ఇతివృత్తాలు తప్పవు. అవి ఏ కాలంలో సృష్టి పొందినా,ఏ పరిస్థితుల్లో ప్రభవించినా, ఎంతో కొంత ఇతివృత్తమో, ఇతివృత్త స్పర్శే ఛాయాబేధమో తప్పనిసరిగా ఉంటాయి. అందువల్ల ఇతివృత్తాల దర్శనం నుంచి, పరిశీలన నుంచి, క్రోడీకరణ నుంచి, వస్తువు - సాహితీ వస్తువును దర్శించే స్థితి ఏర్పడుతుంది. ఇందుకు తెలుగు సాహిత్యమే ప్రథమ సోపానం. ఈ సాహిత్యారాశి నుంచి, ఇతివృత్త దర్శన నేపథ్యం నుంచి, వస్తుదృష్టి ఏర్పడుతుంది.

తెలుగు సాహిత్యం విభిన్న సాహిత్య సంబంధమైన సంస్కృతుల ప్రభావం యొక్క ఫలితంగా గోచరమవుతుంది. తెలుగు సాహిత్యం మీద ఆరంభంలో ప్రాకృత సంస్కృతాల ప్రభావం ఉంది. ఆ గ్రంథానువాదం కూడా మార్గమయింది. ప్రాకృతం బౌద్ధ, జైన మతాలతో పాటు శైవ మత ప్రాచుర్యం సంస్కృతిని వాటి ప్రభావంతో వెలువడ్డ సాహిత్య ప్రాంగణాలలో ప్రవేశపెట్టాయి. తెలుగు ఆ భాషా సాహిత్య సంస్కృతుల ప్రభావం ప్రాంగణంలో ప్రసిద్ధ భాగంగా ఉంది.

అనంతర కాలంలో ఉర్దూ ఆంగ్ల భాషల ప్రభావం తెలుగు మీద ఉంది. వాటి ప్రభావంతో మహమ్మదీయ క్రైస్తవ మత ప్రభావ జన్యమైన సాహిత్యం తెలుగు సాహిత్యం మీద ప్రభావం చూపింది. స్థూలంగా తెలుగు సాహిత్యం మీద ప్రభావం చూపిన భాషలు వాటి సాహిత్యంతో పాటు, సంస్కృతిని కూడా వెంట తీసుకొనివచ్చి తెలుగు నేలలో స్థిరపడ్డాయి.

తెలుగు మీద ప్రభావం చూపిన ప్రాకృత ఉర్దూలు భాష మీద ఎక్కువ ప్రభావం చూపాయి. సాహిత్యంలో పరిమిత ప్రభావం ప్రదర్శించాయి. సంస్కృతాంగ్ల భాషలు వాటి సాహిత్యం తెలుగు సాహిత్యంలో భాగమైపోయేంత అధికంగా తమ ప్రభావం చూపాయి. తెలుగు మీద ఉన్న సంస్కృతాంగ్ల ప్రభావాలు, ప్రాచ్య పాశ్చాత్య ప్రభావ కోణాలను ప్రదర్శించే సామర్థ్యం కలిగి ఉన్నాయి. స్థూలంగా చూస్తే నేటి తెలుగు సాహిత్యం ఒకనాడు సంస్కృతం వల్ల ఈనాడు ఆంగ్లం వల్ల ప్రభావితమై, ప్రాచ్య పాశ్చాత్య సమ్మేళనంగా మారింది. ఈ సాహిత్యరాశి దర్శనం వల్ల ఈ సాహిత్యేతివృత్త పరిశీలనం వల్ల గ్రహించే వస్తుతత్త్వంలో పాటు ఇటు ప్రాచ్యదృక్పథమూ,అటు పాశ్చాత్య దృక్పథమూ కలగలసి మిళితమై, సమ్మేళనం పొంది ఉంటాయి.

అనంతర సాహితీ వస్తు స్వరూప,స్వభావాలు దర్శించటానికి ప్రాచ్య పాశ్చాత్య సంప్రదాయ ప్రభావంతో తెలుగులో ఏర్పడ్డ ప్రక్రియల లక్షణాలు పరికిస్తే కొంత మేలు కలగవచ్చు. ఈ ప్రక్రియల లక్షణాలు ఆధారంగా రచనా ధర్మాలే కాదు ఇతివృత్త గుణాలను,

తన్మూలంగా వస్తుతత్త్వాన్ని, గుర్తించే అవకాశం ఉంది. తెలుగు సాహిత్య స్థూల స్వరూప వర్ణనం వల్ల, ప్రక్రియా లక్షణ పరిశీలనం వల్ల, ఇతివృత్త మార్గం అవగతమై ఆ మార్గానుసారంగా సాహితీ వస్తు తత్త్వం స్పష్టంగా భావించుకోవచ్చు. ఆ స్పష్టత ఆధారంగా తెలుగు సాహిత్యంలో వస్తు పరిణామం పరిశోధింపవచ్చు. అందువల్ల వస్తువు అంటే ఇతిమిత్థంగా నిర్ణయించుకోవటానికి సాహిత్య వికాసం, సాహిత్య ప్రక్రియలు పరిశీలించటం ప్రస్తుత కర్తవ్యం.

1.1. వస్తువు - తెలుగు సాహిత్యం : తెలుగు సాహిత్యం ఆరంభం నుంచి ఆధునిక కాలం దాకా భిన్న ప్రభావాలు విలసిల్లిన స్థితిని దర్శించటం వల్ల వస్తువు పొందిన వ్యాప్తి స్పష్టమవుతుంది. తెలుగు సాహిత్యం స్థూలంగా పొందిన పరిణామం వస్తు పరిణామం-గుర్తించటానికి వీలు కల్పిస్తుంది. సంస్కృతాంగ్ల సాహిత్యాల ప్రభావం వల్ల తెలుగు సాహిత్యంలో పెరిగిన వస్తు దృష్టి విశాలమవుతుంది. అందువల్ల వస్తు వివేచన కోసం తెలుగు సాహిత్యం పరిణామం, చారిత్రక భూమిక ఆధారంగా, పరిశీలించటం అవసరం.

1.1.1. తెలుగు సాహిత్య స్థితిగతులు : తెలుగు సాహిత్య చరిత్రను అనేకులు అనేక విధాలుగా విభజించారు. ఈ విభజనం పరనానికి అనుకూలంగా ఉంది. సాహిత్యానికి చరిత్రకు ఉన్న సంబంధం, రాజాస్థానాలే సాహితీ పోషణ చేయటం వల్ల, గోచరమయింది. సాహిత్యాభిమానం ఉన్న రాజులు తెలుగు ప్రాంతాలను పాలించడం వల్లే ఈ స్థితి కలిగింది.

అనేక సాంఘిక ఆర్థిక రాజకీయ మత కారణాల నేపథ్యంలో తెలుగు సాహిత్యం పుట్టి పెరిగింది. 11వ శతాబ్దిలో భారతం అనువదించిన నన్నయను ఆదికవి అని, అనువదించిన మహాభారతాన్ని ఆదికావ్యమని అన్నారు. ఆదికావ్యమని పేర్కొంటున్న మహాభారతాన్ని నన్నయ మాత్రమే కాక, వివిధ కాలాలలో తిక్కన ఎఱ్ఱనలు సంపూర్తి చేశారు. నన్నెచోడుని కుమారసంభవం ప్రథమాంధ్ర ప్రబంధంగా గుర్తింపు పొందింది. ఈ ప్రబంధ ప్రక్రియకు ఆరంభం 12వ శతాబ్దంలో జరిగినా దానికి ఉత్కృష్ట స్థాయి మాత్రం కృష్ణదేవరాయల కాలంలోనే 16వ శతాబ్దంలోనే వచ్చింది.

1.1.1.1. స్వతంత్ర సాహిత్యం : పాల్కురికి సోమనాథుని సాహిత్య సృష్టి గమనార్హం. శివ భక్తుడైన పాల్కురికి భక్తి పూర్వక రచనలెన్నో చేశాడు. ఇతడు సాహిత్యంలో అనేక ప్రక్రియలు ప్రవేశపెట్టాడు. ఇతడు సృజించిన ఉదాహరణ ప్రక్రియ సంస్కృతం తన సాహితీ ప్రపంచంలో ప్రవేశపెట్టుకొంది. అంత వరకు మార్గ పద్ధతిలో ఉన్న రచనను పాల్కురికి దేశి వైపుకు మళ్ళించాడు. ఛందస్సు, ఇతివృత్తం, భాష అన్ని దేశీయమైనవే గ్రహించి రచించి సాహిత్యంలో కొత్తపుంతలు తొక్కాడు. వృషాధిప శతకము, చతుర్వేద సారము, చెన్నమల్లు సీసములు, గద్యలు, రగడలు, పంచకము అష్టకము స్తవములు మొదలివెన్నో రచించాడు. బసవపురాణం, పండితారాధ్య చరిత్రలనే ద్విపద కావ్యాలను రచించాడు. పాల్కురికి సాహిత్యం ఆధారంగా, దాని ప్రసిద్ధి కారణంగా, దాని ప్రజాభిమానం కారణంగా, తెలుగు సాహిత్యంలో అనువాద సాహిత్యం సృష్టించిన కవులు వైష్ణవ ధర్మం గ్రహించిన వాళ్ళు, శివకవుల రచనా విధానం గ్రహించారు.

ఈ కాలం శివకవి యుగమయింది. శైవమత ప్రచారార్థం వెలసిన సాహిత్యమిది. ఈ కాలంలో ప్రసిద్ధమయిన కవులు నన్నెచోడుడు, పాల్కురికి సోమనాథుడు, మల్లికార్జున పండితారాధ్యుడు మల్లికార్జున పండితుడు శివతత్త్వసారం వ్రాశాడు. సర్వేశ్వర శతకం విరచించిన యథావాక్కుల అన్నమయ్య శివకవి యుగ ప్రసిద్ధుడే.

1.1.1.2. అనువాద సాహిత్యం : 13వ శతాబ్దంలో ప్రథమాంధ్ర రామాయణం గోనబుద్ధ భూపతి సృజించాడు. ఇదే కాలానికి చెందిన తిక్కన భారతం 15 పర్వాలు ఆంధ్రీకరించాడు. విజయసేనం, కృష్ణశతకం, నిర్వచనోత్తర రామాయణం రచించాడు. 13-14 శతాబ్దాల మధ్య కాలానికి చెందిన కవులు నూతన ప్రక్రియలు చేపట్టారు. ప్రథమాంధ్ర పురాణకర్త మారన మార్కండేయ పురాణాన్ని అనువదించాడు. ప్రథమ కథాకావ్యం - కేతన దశకుమార చరిత్ర రచించాడు. ప్రథమ వచన ప్రక్రియగా కృష్ణమాచార్యుడు సింహగిరి నరహరి వచనములు వ్రాశాడు. బద్దెన సుమతీ శతకం, మంచనకేయూర బాహుచరిత్ర ఈ కాలానికి చెందిన కృతులే.

రామాయణం, హరివంశం, భారతారణ్య పర్వశేషం, నృసింహపురాణం రచించిన ఎఱ్ఱన 14వ శతాబ్దివాడు. ప్రోలయ వేమారెడ్డి ఆస్థాన కవి. సమకాలికుడైన నాచన సోముడు ఉత్తర హరివంశం రచించాడు. రంగనాథ రామాయణం లాగే కర్తృత్వ విషయాన చర్చింపబడిన భాస్కర రామాయణాన్ని మల్లికార్జున భట్టు, రుద్రదేవుడు, హుళక్కి భాస్కరుడు,అయ్యలార్యుడు రచించారు.

శ్రీనాథ, పోతన లిరువురూ 15వ శతాబ్దానికి చెందినవారే. శ్రీనాథుడు శృంగార రసపోషకుడు. పోతన భక్తి రసపోషకుడు. శ్రీనాథుని రచనల్లో ప్రఖ్యాతి గాంచనిదంటూ లేదు. కాశీఖండం, పలనాటి వీరచరిత్ర, ఘటికాచల మాహాత్మ్యం, శృంగార నైషధం, భీమేశ్వర పురాణం, హరవిలాసం అన్నీ సుప్రసిద్ధాలే. శ్రీనాథుడు అనువాదానికి అద్భుతమైన సప్తసూత్రాలు చెప్పాడు. పోతన భోగినీ దండకం, నారాయణ శతకం, వీరభద్ర విజయం భక్తి రసానికి పరాకాష్ఠ అయిన ఆంధ్ర భాగవతం రచించాడు. వీళ్ళ సమకాలికులే, విక్రమార్క చరిత్ర రచించిన జక్కన, భోజరాజీయ కర్త అనంతామాత్యుడు, నవనాథ చరిత్ర రచించిన గౌరన, పంచతంత్ర కథలు రాసిన దూబగుంట నారాయణ కవి, శృంగార శాకుంతలం, జైమిని భారతం రచించిన పిల్లలమర్రి పినవీరభద్రుడు, సింహాసన ద్వాత్రింశిక రచించిన గోపరాజు వంటివారు. 15,16వ శతాబ్దాలలో పద సాహిత్యం ఎక్కువగా రూపుదాల్చింది. తాళ్ళపాక అన్నమాచార్య కీర్తనలు, తాళ్ళపాక వారి పదాలు, సంకీర్తనలు ఎన్నో ఆవిర్భవించాయి. క్రమంగా రచన పాటగా ప్రారంభమయి వచన మార్గం పట్టింది.

1.1.1.3. ప్రబంధ సాహిత్యం : 16వ శతాబ్దం ప్రబంధయుగం. స్వయంగా కవి, కవిపోషకుడు అయిన శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో ఉన్న అష్ట దిగ్గజాలు ప్రబంధకర్తలే. కృష్ణదేవరాయలు - ఆముక్త మాల్యద, పెద్దన-మనుచరిత్ర నంది తిమ్మన-పారిజాతాపహరణం, మాదయగారి మల్లన - రాజశేఖర చరిత్ర, రామరాజు భూషణుడు - వసుచరిత్ర, ధూర్జటి-కాళహస్తి మాహాత్మ్యం, తెనాలి రామలింగ కవి - పాండురంగ మాహాత్మ్యము, పింగళి సూరన - కళా పూర్ణోదయం వ్రాశారు. పింగళి

రాఘువ పాండవీయమనే ద్వర్థి కావ్యం ప్రసిద్ధం. ఈ కాలం వాళ్ళే చింతలపూడి ఎల్లనార్యుడు, అయ్యలరాజు రామభద్రుడు,నాదెండ్ల గోపన;ప్రధమ కవయిత్రి మొల్ల, మొదటి అచ్చతెనుగు కావ్యాన్నిరచించిన పొన్నికంటి తెలగన, కందుకూరి రుద్రకవి ఈ యుగం వాళ్ళే.

1.1.1.4. దక్షిణాంధ్ర సాహిత్యం : 17వ శతాబ్దిలో తంజావూరు పాలకుల పోషణలో తెలుగు సాహిత్యం అలరారింది. రఘునాథ నాయకుడే స్వయంగా కవి. ఈయన వాల్మీకి చరిత్ర, రఘునాథ రామాయణం, నలచరిత్ర రచించాడు. అతని ఆస్థాన కవులలో అగ్రగణ్యుడు చేమకూర వేంకటకవి - విజయ విలాసం కర్త, ఈయన సారంగధర చరిత్ర రచించినాడు. ఈ కాలానికి చెందిన కవయిత్రులే రంగాజమ్మ, ముద్దుపళని, తరిగొండ వేంకమాంబ.

17, 18వ శతాబ్దంలో తెలుగుకు దక్షిణ భారతంలో వైశిష్ట్యం ఏర్పడింది. అందుకే దీన్ని దక్షిణాంధ్రయుగం అన్నారు. రఘునాథ నాయకుని తర్వాత విజయ రాఘువనాయకుడు తంజావూరును పాలించాడు. క్షేత్రయ్య పదాలు ఆ కాలానివే. ఈ కాలంలో అనేక సంస్థానాలు తెలుగును పోషించాయి. 17వ శతాబ్ది ఉత్తర భాగంలో జీవించిన వేమన యోగిగా ప్రసిద్ధుడు. వేమన శతకం లోకానుభవ ప్రతిబింబంగా శతక సాహిత్యానికే తలమానికం.

1.1.1.5. పాశ్చాత్య ప్రభావం : 19వ శతాబ్దం నుంచి తెలుగు సాహిత్యం మీద పాశ్చాత్య ప్రభావం కనిపిస్తుంది. పాశ్చాత్య ప్రభావం రాజకీయార్థికాది రంగాలను ప్రభావితం చేస్తున్న రోజుల్లో పాశ్చాత్య ప్రభావం సాహిత్య రంగంపై అధికంగా గోచరమవుతూ వచ్చింది. పాశ్చాత్య సాహిత్య భాషా భావ ప్రభావాలు తెలుగు సాహిత్య రంగానికి నూత్నచైతన్యం కలిగించాయి.

ఈ శతాబ్దంలో కవిత్వం, నాటకం, కథానిక, నవల, సాహిత్యరంగంలో పురోభివృద్ధిని సాధించాయి. వీటి వికాసం ఒకే కాలంలో కనిపించ సాగింది. ముందుగా కవిత్వాన్ని గ్రహిస్తే, పాశ్చాత్య ప్రభావానికి గురి అయిన తర్వాత కవిత్వం ముఖ్యంగా రెండు తోవల అభివృద్ధి చెందింది. అవి భావ అభ్యుదయ కవిత్వాలు. భావ కవిత్వం ఆరంభమైన కొంతకాలానికి అభ్యుదయం కవిత్వం ఆరంభమైంది. మానవునిలోని భావుకత భావ కవిత్వంగా వ్యక్తమయింది. అభ్యుదయ కాంక్ష అభ్యుదయ కవిత్వంగా రూపొందింది.

**1.1.1.6.** భావకవిత్వం : భావకవిత్వాన్ని కాల్పానిక కవిత్వాన్ని ఒకటిగా పరిగణించడం మన సాహిత్యంలో కనిపిస్తుంది. కట్టమంచి రామలింగారెడ్డి 'ముసలమ్మ మరణం' ద్వారా భావకవిత్వాన్ని తెలుగులో ప్రవేశపెట్టాడు. దానికి ప్రఖ్యాతిని కూర్చిన కవులు రాయప్రోలు, గురజాడలు. భావకవిత్వ ధోరణిని వ్యాప్తి చేసిన వారు కృష్ణశాస్త్రి. భావ కవిత్వాన్ని పోషించిన వారిలో ప్రముఖుడు బసవరాజు. వెంకట అప్పారావు. సంప్రదాయవాదిగా కనిపించే విశ్వనాథ సత్యనారాయణ వంటి వారెందరో భావ కవిత్వాన్ని వెలువరించారు. ఈ కవిత్వానికి అనేక శాఖలుత్పన్నమై, కావ్యాలు వెలువడ్డాయి. ఈ

భావకవిత్వ ధోరణికి భిన్నంగా, సామాజిక చైతన్య ఫలితంగా, మార్క్సువాదారంగా అరంభమైంది అభ్యుదయ కవిత్వం. శ్రీశ్రీ మొదట్లో భావకవే అయినా క్రమంగా మార్పు చెందాడు. మహాప్రస్థానం, మరోప్రస్థానం ప్రసిద్ధాభ్యుదయ కవితా సంకలనాలు. శిష్లా ఉమామహేశ్వర రావు, పరాభి, శ్రీరంగ నారాయణ బాబు వంటి ప్రసిద్ధులు అభ్యుదయ కవిత్వం వ్రాశారు. అభ్యుదయ కవిత్వానికి తెలంగాణా పోరాటం మరికొంత సాహిత్యాన్ని చేర్చింది. దాశరథి, అరుద్ర, అవంత్స సోమసుందర్, కుందుర్తి అంజినేయులు వంటి పలువురు ప్రసిద్ధాంధ్ర కవులు తెలంగాణా ఉద్యమ నేపథ్యంలో అభ్యుదయ కవిత్వం వ్రాశారు. ఈ అభ్యుదయ కవిత్వం తర్వాత వచ్చిన దిగంబర కవిత్వం, విప్లవ కవిత్వం అభ్యుదయ కవిత్వానికి అనంతర సోపానాలుగా నిలిచాయి.

1.1.1.7. నాటకం : ఆంధ్ర సాహిత్యంలో నాటక రచన 19వ శతాబ్ది నుంచే ఆరంభమయింది. ఇది ఆంగ్ల సాహిత్య ప్రభావమే. అనువాద నాటకాలు సంస్కృత నాటక లక్షణాలతో గోచరం కాగా, స్వతంత్ర నాటకాలు ఆంగ్ల నాటక లక్షణాలు సంతరించుకొన్నాయి. శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి దీనికి ఆరంభకుడు. మంజరీ మధుకరీయము స్వతంత్రంగా రచించండం ద్వారా ఈ ప్రక్రియకు ప్రారంభకుడు అయ్యాడు. స్వతంత్ర నాటకాలు, సంస్కృతాంగ్ల లక్షణాలతో గోచరం కాగా, సాంఘిక నాటకాలు ఆంగ్ల నాటక లక్షణాలతో అవతరించాయి. నాటక సాహిత్యం, అభివృద్ధి చెందిన స్థాయికి చేరుకొంటున్న కాలంలో, కొంత కాలంపాటు స్తబ్దంగా ఉండిపోయింది. 1943-44 నుంచి తిరిగి పురోగమనం ఆరంభమయింది. ఇక ఇప్పుడు సాంఘిక నాటక సాహిత్యం విజృభించింది. ఆచార్య ఆత్రేయ, త్రిపురనేని రామస్వామి చౌదరి, ముద్దుకృష్ణ, గుడిపాటి వెంకటాచలం, పినిశెట్టి, భోయి భీమన్న, కొప్పరపు సుబ్బారావు వంటి నాటక కర్తలు మంచి సాహిత్యం సృష్టించారు. తెలుగు సాహిత్యంలోకి పాశ్చాత్య నాటక ప్రభావం వల్ల పూర్వం లేని విషాదాంత నాటక రచన మొదలై, విశేషంగా విస్తరించింది. తెలుగు నాటక సాహిత్యం పౌరాణిక చారిత్రక సాంఘిక నేపథ్యంతో వెలువడింది. ఇవి హాస్యభరితంగా, సుఖాంతంగా, విషాదాంతంగానూ ఉన్నాయి. నాటకం, నాటిక ఏకాంకికల ఆవిర్భానికి మార్గం ఏర్పర్చింది.

1.1.1.8. నవల : శ్రీ నరహరి గోపాల కృష్ణమ శెట్టి వ్రాసిన 'శ్రీరంగరాజు చరిత్ర'తో నవలా రచన ఆరంభమయింది. వీరేశలింగం రచించిన 'రాజశేఖర చరిత్ర'తో నవలా సృష్టి పురోగమింపసాగింది. కందుకూరి పిమ్మట చిలకమర్తి అనేక నవలలు వ్రాశాడు. ఆరంభంలో కంటే అనంతర కాలంలో నవలా సృష్టి అధికమయింది. ఎక్కువయ్యేకొద్దీ నవలలు చారిత్రకం సాంఘికాలు ఎక్కువయ్యాయి. వీటన్నికంటే ఎక్కువగా అనువాదాలు అవతరించాయి. బెంగాలీ నవలలు ప్రారంభంలో అధికంగా అనువాదమయ్యాయి. పాశ్చాత్య నవల అనువాదమూ అధికంగానే జరిగింది. క్రమంగా చారిత్రక నవల ఉరవడి తగ్గి సాంఘిక నవలల దృష్టి అధికమయింది. వెంకట పార్వతీశ్వర కవుల 'మాతృమందిరము', 'ప్రమదావనము' 'టేకుమళ్ళ రామచంద్రరావు' 'ప్రణయ వాంచల్యము' 'క్షమార్పణ' నూత్న నవలా రచనా రీతికి ప్రారంభం కావించాయి. ఉన్నవ

లక్ష్మీనారాయణ 'మాలపల్లి' నవలా రచనలో మైలురాయి. గుడిపాటి వెంకటాచలం 'మైదానం' 'దైవమిచ్చిన భార్య' 'శశిరేఖ' స్త్రీ పురుష సంబంధాలలో విప్లవం తెచ్చాయి. విశ్వనాధ సత్యనారాయణ 'ఏకవీర' 'ధర్మచక్రం', 'బద్ధన్న సేనాని' 'వేయిపడగలు' నవలా సాహిత్యంలో సంప్రదాయ బలం పెంచాయి. అడవి బాపిరాజు 'హిమబిందు' గోనగన్నారెడ్డి' శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి - 'ఆత్మబలి' నూత్న దృక్పథం కలిగించాయి. కొడవగంటి కుటుంబరావు - 'చదువు', 'అనుభవం' బుచ్చిబాబు - 'చివరకు మిగిలేది', త్రిపురనేని గోపీచంద్ - 'పరివర్తన', 'అసమర్థుని జీవయాత్ర', 'మెరుపుల మరకలు', రాచకొండ విశ్వనాథ శాస్త్రి 'అల్పజీవి' మానవ మస్తిష్కంలోని మారుమూల ప్రాంగణం దర్శించి, మనిషిలోని అంతర చైతన్యం దర్శించాయి. జి.వి.కృష్ణారావు 'కీలుబొమ్మలు', వట్టికోట అళ్వారు స్వామి - 'ప్రజల మనిషి' 'గంగు', ఉప్పల లక్ష్మణరావు - 'అతడు - ఆమె', మహీధర రామమోహనరావు 'కొల్లాయి గట్టితేనేమి', 'రథచక్రాలు', 'ఓనమాలు' సామాజిక రాజకీయ దృక్పథం ప్రదర్శించాయి. వీరేకాక శ్రీదేవి, రంగనాయకమ్మ, వాసిరెడ్డి సీతాదేవి, యుద్దనపూడి సులోచనారాణి కోడూరి కౌసల్యాదేవి, సి.ఆనందరామం వంటి ప్రసిద్ధ నవలా రచయిత్రులు ఉత్తమ సాహిత్యం స్త్రీ దృక్పథం నుంచి అందించారు. దాశరథి రంగాచార్య, యన్.ఆర్.నంది, రావూరి భరద్వాజ, పాలగుమ్మి పద్మరాజు వంటి వారు అనేకులు, ప్రసిద్ధులు ఉత్తమ రచన కావించి, నవలా సాహిత్యం ద్వారా సామాజిక చైతన్యం సంభావించారు.

1.1.1.9. కథానిక : సమగ్రత సంక్షిప్తత ప్రధానంగా కథానిక అవతరించింది. విస్తృతిలో చిన్నది అయినా విషయ నివేదనలో, భావ వ్యక్తీకరణలో దీనిలో ఇరుకు కనిపించదు. తెలుగులో తొలి కథానిక గురజాడ అప్పారావు 'దిద్దుబాటు' (1910). దీనితో కథానిక ప్రక్రియ సాహిత్యంలో ప్రవేశించి నేటికి ప్రక్రియలన్నింటిలోకి అగ్రతాంబూలంగా నిలిచింది. ఇతనివే 'మెటిల్డా' 'పెద్ద మసీదు' 'మీ పేరేమిటి' మంచి కథానికలు. వేదం వేంకటరాయ శాస్త్రి - 'రాజస్థాన కథావళి', చిత్ర కథా గుచ్ఛము' అనువాదంగా అందిన ఆంధ్ర కథా సాహిత్యం. వాస్తవానికి అవి నేటి కథానికా లక్షణాలకు అనుగుణంగా లేవు. విశ్వనాధ సత్యనారాయణ, తల్లావజ్ఝల శివశంకర శాస్త్రి, అడవి బాపిరాజు, చింతా దీక్షితులు, వొక్కపాటి నరసింహ శాస్త్రి మంచి కథానికలు వ్రాశారు. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి, కొడవటి గంటి కుటుంబరావు, కరుణకుమార, చలం, గోపీచంద్ ఉత్తమ కథానికా రచయితలుగా సుప్రసిద్ధులు. రావిశాస్త్రి, కాళీపట్నం రామారావు ఉత్తరాంధ్ర జీవితాన్ని ఆ భాషలో ప్రకృష్టంగా, కథానిక సాహిత్యంలో సృష్టించారు. కొలకలూరి ఇనాక్, మధురాంతకం రాజారాం, పురాణం సుబ్రహ్మణ్య శర్మ, పులికంటి కృష్ణారెడ్డి, కేతు విశ్వనాథ రెడ్డి అభ్యుదయ దృక్పథంతో కథానికను సృష్టించారు. వాసిరెడ్డి సీతాదేవి, ఇల్లిందుల సరస్వతీ దేవి, లత, ద్వివేదుల విశాలాక్షి ·ముప్పాళ రంగనాయకమ్మ, మాలతీ చందూర్ వంటి కథానికా రచయిత్రులు స్త్రీ జీవిత చిత్రణం అద్భుతంగా రూపొందించారు. ఈ కథానికా సాహిత్యంలో అనువాదం తక్కువ. పౌరాణికాలు తక్కువ. చారిత్రకాలు అరుదు. దాదాపు అన్ని సాంఘికాలే.

1.1.1.10. తెలుగు సాహిత్య గమనం : తెలుగు సాహిత్యంలో వస్తువును దర్శించటానికి ప్రయత్నిస్తే స్పష్టంగా తెలిసే అంశాలు గమన్హారం. ఆరంభంలో సాహిత్యం అనువాదంగా వచ్చింది. అది సంస్కృతమయినా, ఆంగ్లమయినా ఈ పరిస్థితి తప్పలేదు. అనంతర కాలంలో స్వతంత్ర రచన ప్రారంభమయింది. తెలుగు సాహిత్యంలో చాలా ప్రక్రియలు అటు సంస్కృతం నుంచి కాని, ఇటు ఆంగ్లం నుంచి కాని వచ్చి చేరాయి. తెలుగు సాహిత్యానికి ప్రత్యేకంగా కనిపించే యక్షగానం, ఉదాహరణం, అవధానం ప్రక్రియల్లో యక్షగానం దశవిధ రూపక సాహిత్య సంబంధం కలిగి వాటి సమాహార రూపంగా తెలుగులో అవిర్భవించింది.

ఒక సాహిత్య ప్రక్రియ కొంతకాలం ఆదరణ పొంది,అనంతరకాలంలో అంత ఆదరణ పొందలేక ఆగిపోవటం గమన్హారం. ఒక పద్ధతిలో ఒక రచన వస్తే, ఆ పద్ధతి మరికొంత కాలం యధాతధంగా సాగటం గుర్తింపవచ్చు. ఒక గ్రంథం అనువాదంగా వస్తే, ఆ గ్రంథమే అనంతర కాలంలో మరికొందరు అనువాదం చేయటం పరిశీలనార్హం. శైవ వైష్ణవులు పోటా పోటీగా సాహిత్య సృష్టికి మూలమయ్యాయి. రాజాస్థానాల సాహిత్య సృష్టి క్రమంగా ప్రజా జీవితం దాకా ప్రయాణం చేసింది. సాహిత్యం సృష్టించిన వాళ్ళు విభిన్న సామాజిక అంతరువులకు చెందినవాళ్ళు అయ్యారు. పౌరాణిక చారిత్రక దశల నుంచి, సాంఘిక దశకు సాహిత్యం ప్రయాణం చేసింది.

1.1.2. సంస్కృత ప్రాకృత ప్రభావం : తెలుగు సాహిత్యం మీద భాష మీద సంస్కృత ప్రభావం అధికంగా ఉంది. ఆరంభంలో జైన, బౌద్ధ సాహిత్య సృష్టిలో ప్రాకృత సాహిత్య ప్రభావం ఉంది. సంస్కృత ప్రాకృతాలలో సంస్కృతం చూపినంత ప్రభావం షట్ విధ ప్రాకృతాలు చూపలేదు. కాని ఆ సాహిత్యం తెలుగు సాహిత్యంలో అంతర్లీనంగా అల్లుకొని ఉంది.

1.1.2.1. సంస్కృత ప్రభావం : తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును అనికేతన, జనని సంస్కృతంబు సర్వ భాషలకును - అని శ్రీనాథుడు అన్నారు. సంస్కృతం అన్ని భాషలకు తల్లి. అంతగా అన్ని భాషలపై తన ప్రభావాన్ని చూపింది. సంస్కృతం చూపిన మార్గంలో తెలుగు సాహిత్యం నడిచింది. సంస్కృత దృక్పథంతో తెలుగు వ్యవస్థీకరింపబడింది. సంస్కృత రూపం తెలుగులో ప్రతిబింబించింది. సాహిత్యపరంగా తెలుగు రూపాన్ని తీర్చిదిద్దింది. తెలుగు సాహిత్యారంభంలో కావ్యేతివృత్తాలన్ని, సంస్కృతేతివృత్తాలే. రచనా విధానం, ఛందోరీతులు, భావవ్యక్తీకరణ, ప్రక్రియాధోరణి, పాత్రచిత్రణ, అన్నీ అంతా, సంస్కృత లాక్షణికులు బోధించిన మార్గాలలోనే సాగాయి.

సంస్కృత ప్రభావంతో తెలుగులోకి అనేక ప్రక్రియలు ప్రవేశించాయి. పురాణాలు, ఇతిహాసాలు, కావ్యాలు, నాటకాలు,స్థలమాహాత్మ్యాలు వంటివి దృశ్య శ్రవ్య కావ్యాలు, శ్లోక రచన, గద్య రచన చంపూ రచనా ధోరణి అంతా సంస్కృతం నుంచి అవతరించింది.

సంస్కృతం నుంచి పురాణేతిహాసాలతో పాటు కావ్య నాటక సాహిత్యం తెలుగులోకి ప్రవేశించింది. ఆరంభంలో ఆంధ్ర సాహిత్యంలో రూపుదిద్దుకొన్న సాహిత్యమంతా అయితే

అనువాదం కాకపోతే సంస్కృత ప్రభావజన్యం. వేదాలు, ఉపనిషత్తులు, మీమాంస, వేదాంత సాహిత్యమంతా సంస్కృతం నుంచి సంక్రమించింది. ఒక్క మాటలో చెపితే ప్రాచీనాంధ్రుడి సమస్త సాహితీ సమాలోచనం సంస్కృతంతోనే ముడిపడి ఉంది. అంతేకాదు నాటి ఆంధ్రుడి ఆలోచన అంతా సంస్కృత ప్రభావంతో నిండి ఉంది.

1.1.2.2. ప్రాకృత ప్రభావం : ప్రాకృతాన్ని సంస్కరిస్తే సంస్కృతం, సంస్కృతం అపభ్రంశమయితే ప్రాకృతం అయినట్లుగా గుర్తించే రెండు సందర్భాలూ సంస్కృత సమీప సంబంధం సంస్థాపిస్తూ ఉన్నాయి. ప్రాకృత భాషలు ఆరు. ప్రధాన శాఖలు నాలుగు. మహారాష్ట్రీ, శౌరసేని, పైశాచి, మగధి. అర్థమగధి, అపభ్రంశాలతో కలసి ప్రాకృత భాష షడ్విధాలు.

ప్రాకృత పదాలకు సంస్కృత కావ్య పదజాలం కంటే వైదిక పదజాలంతో సంబంధం ఎక్కువ. వేద కాలంలో మాట్లాడే భాష ప్రథమ ప్రాకృతంగా పరిగణింపబడింది. దాని సంస్కార రూపమే సంస్కృతం. పిమ్మట మార్పు పొందిన ప్రాకృతాలు, సంస్కృతాపభ్రంశాలు ద్వితీయ ప్రాకృతాలయ్యాయి. తర్వాత వెలసిన కాశ్మీర, పంజాబీ, గుజరాతీ, మరాఠీ, బెంగాలీ వంటి భాషలు తృతీయ ప్రాకృతాలు.

మహారాష్ట్రీ, ప్రాకృత భాషల్లో ప్రధాన భాష. దండి కాలం నాటికే ఇది ఉంది. పైశాచి కేకయ మగధ శూరసేన ప్రాంతాలలో వాడబడేది. శౌరసేని -శూరసేన ప్రాంతాలలో ఉండి, దక్షిణానికి ప్రాకింది. దీని నుంచే హిందీ, గుజరాతీ, పంజాబీ ఏర్పడ్డాయని వాదన. మగధి-మగధ ప్రాంతపు భాష అపభ్రంశ - భామహుడికి నాటికే ఇది కావ్య భాష. అర్థమాగధి - బౌద్ధ ధర్మ ప్రచారానికి ఏర్పడింది.

సూరి తెలుగును 'సంస్కృత ప్రాకృత తుల్యంబగు భాషతత్సమంబు' లదిసంస్కృత ప్రాకృత భవంబగు భాష తద్భవంబు అని అన్నాడు. కాని ప్రాకృత సాహిత్యం తెలుగుపై చూపిన ప్రభావం పరిమితం. ప్రాకృత పదాలు తెలుగులోకి ప్రవేశించాయి. ప్రాకృత ప్రభావం తెలుగు భాషపై ఉంది. పదపరంగా ప్రభావితం అయింది. కాని, ప్రక్రియపరంగా కాని రచనాపరంగా కాని ఛందోలంకారాల వల్లకాని ఇతివృత్తపరంగా గాని అంతగా ప్రభావితం కాలేదు. బౌద్ధ జైన మత సాహిత్యం ప్రాకృతం వల్లే ప్రపంచానికి అందింది.

1.1.3. ఉరుదూ ఆంగ్ల ప్రభావాలు : తెలుగు భాషా ప్రాంతాన్ని ఎక్కువ కాలం పరిపాలించిన పరాయి పాలకుల ప్రభావం పాలన మీదే కాక, భాషమీద, సాహిత్యం మీద, చూపటం గమనార్హం. 12వ శతాబ్ది నుంచి చెదురుమదురుగా, 15వ శతాబ్ది నుంచి అధికంగా భారతదేశంలో తమ పాలనం కొనసాగించిన మహ్మదీయ పాలకులు మతంతో పాటు ఉరుదూ భాషా ప్రభావం విస్తరింప చేశారు. అదే విధంగా 18వ శతాబ్ది నుంచి భారతదేశాన్ని రెండువందలేళ్ళు పరిపాలించిన ఆంగ్లేయులు, తమ మతంతో పాటు ఆంగ్ల భాషాప్రభావాన్ని భారతదేశం మీద కలిగించారు. అందుకు ఆంధ్రదేశం అపవాదం కాదు. ముందుగా మహమ్మదీయులు, ఆపైన ఆంగ్లేయులు తెలుగు భాషా సాహిత్యాలపై

చూపిన ప్రభావం గుర్తించాలి. ఆంగ్ల భాష ఆంధ్ర భాషపై చూపిన ప్రభావం గమనించాలి. ఆంధ్రుల ఆలోచనను ప్రభావితం చేసిన ఆంగ్ల సాహిత్యం ఆంగ్ల పాలనం, ఆంగ్ల జీవితం అవశ్యం గుర్తింపదగ్గ అంశాలు.

1.1.3.1. ఉరుదూ ప్రభావం : క్రీస్తు శకారంభానికి పూర్వం నుంచే తెలుగు వారికి ఉన్న విదేశీ వర్తక వ్యాపారాలు, విదేశీయుల దాడులు, తెలుగు సంస్కృతికి విదేశీయ సంస్కృతితో సంబంధం ఏర్పరచాయి. ముస్లింల రాజ్యవిస్తరణతో, పాలనతో, ఉరుదూ భాష ప్రభావం తెలుగుపై ఎంతో చూపింది. హిందూ ముస్లింల సంస్కృతుల సమ్మేళన ఫలితంగా రూపొందింది ఉరుదూ భాష. రాజ భాషగా వైభవం పొందుతున్న రోజుల్లో పండితులు కవులు ఉరుదూ వైపు మొగ్గు చూపారు. వీరితో తెలుగులోకి అన్యభాషా పదాలనేకం ప్రవేశించాయి. సాహిత్య ప్రక్రియలైన రుబాయీలు, గజళ్ళు వంటివి అనువాదం పొందాయి. ఉత్తమ ఉరుదూ సాహిత్యంమంతానూ అనువాదం అయింది. ఉరుదూ ముషాయిరాలు తెలుగు సంస్కృతికి కవి సమ్మేళనాల రూపంలో చైతన్యం కలిగించాయి.

అయితే న్యాయస్థానాలలో, రెవిన్యూ కార్యాలయాలలో ఉరదూ పదాలెక్కువగా వాడుతున్నారు. కులీ కుతుబ్-షా పాలనతో గోల్కొండ ప్రాంతంలో ఉరుదూ ప్రభావం విశేషంగా కనబడుతుంది. తెలుగు కవిత్వ సృష్టిని ప్రోత్సహించిన మహమ్మదీయ చక్రవర్తులు ఉర్దూ భాషీయులే.

1.1.3.2. ఆంగ్ల ప్రభావం : ఆంగ్ల సాహిత్యం సాహచర్యంలో ఆంధ్ర సాహిత్యంలో వచన సాహిత్యం పెరిగింది. వీరి రచనా ధోరణులంతా వచన రచనే. ఆంగ్ల ప్రభోదం వల్ల విపరీత వర్ణనలు, అలంకారాలు రచనలో తగ్గాయి. భాషలో క్లిష్టత తొలగింది. రచనలో సరళత, వ్యావహారికత ప్రవేశించాయి.

ఆంగ్ల రచనా విధానం వ్యవహారానికి దగ్గరగా ఉంది.రచనా విధానానికి మార్గం కేవలం కవిత్వమే అనే ఆలోచన ఆంగ్లం వల్ల తగ్గింది. ఆంగ్లంలో విభిన్నంగా నూతన ప్రయోగాలు చేశారు.

ఆంగ్లం నుంచి అనేక ప్రక్రియలో తెలుగులోకి ప్రవేశించాయి. విషాదాంత నాటకం, నాటిక ఏకాంకిక, కథానిక,నవల, నవలిక, వ్యాసం, సమీక్ష, విమర్శ, పరిశోధనం వంటివి అనేకం.

ఇవన్నీ ఆధునిక సమాజ ప్రతిబింబాలుగా ఉండే, ప్రజలకు దగ్గరకు ఉండే, సృజనాత్మక ప్రక్రియలే, వ్యాసం సమీక్ష విమర్శలాంటివి. సృజనాత్మక ప్రక్రియ అయినా కథాత్మకాలు కావు. మిగిలినవి అధిక విస్తృతి, అల్ప విస్తృతి కలిగిన కథాంశాలు,శ్రవ్య దృశ్యాత్మకాలు.

ఆధునిక కాలంలో 19వ శతాబ్దంలో తెలుగుపై ఆంగ్ల ప్రభావం అత్యధికం. అన్ని రంగాలలోని విజ్ఞానాభివృద్ధి మనిషిని అన్ని దిశలను అవలోకించడానికి

మార్గమేర్పరిచింది. అదే కారణం పాశ్చాత్య సాహిత్య ప్రభావానికి లోనుకావడానికి. ఏ ఒక్క వ్యక్తో కాక సంపూర్ణంగా తెలుగు సాహిత్యం ఈ ప్రభావానికి గురైంది. ఆంగ్ల ప్రక్రియలు, ఆలోచనా ధోరణి రచనా విధానం అన్నీ తెలుగులో ప్రతిబింబించాయి.

తెలుగు సాహిత్యం సుసంపన్నం కావటానికి ఆంగ్ల సాహిత్యం దోహదం చేసింది.తెలుగు చైతన్యం విశ్వ విస్తృతం కావటానికి ఆంగ్ల విద్య సహాయపడింది. ఆంధ్రత్వం సంపూర్ణత సంతరించుకొనే మార్గంలో సాధించిన రాజకీయ చైతన్యం ఆంగ్ల పాలనం కలిగించింది. ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ఆంధ్రుడు ఆధునికతాన్వేషణకు దోహదకారిగా ఆంగ్ల సాహిత్యం తోడ్పడింది.

1.1.4. సంస్కృతాంగ్ల రచనా వైవిధ్యం : తెలుగు భాషను పూర్వం నుంచి నేటి వరకు గమనిస్తే దీనిని ప్రభావితం చేసిన భాషలుగా సంస్కృత ప్రాకృత ఉర్దూ ఆంగ్ల భాషలు కనిపిస్తాయి. ప్రాచీన కాలంలో ప్రాకృత సంస్కృతాలు. అర్వాచీనంలో ఉర్దూ ఆంగ్ల భాషలు. ఈ రెండు దశల్లోనూ, ఒక్కొక్క భాష మాత్రమే అధికంగా ప్రభావితం చేసినట్లు కనిపిస్తాయి. సంస్కృత ప్రాకృతాలలో సంస్కృత ప్రభావం ఉన్నంతగా ప్రాకృత ప్రభావమూ; ఆంగ్ల ప్రభావం ఉన్నంతగా ఉర్దూ ప్రభావమూ కనిపించవు.

సంస్కృతం స్థిరమైన భాష. దానికి వివిధ రూపాలు లేవు. కాని ప్రాకృతానికి వివిధ రూపాలున్నాయి. ప్రాంతాన్ని బట్టి అది మారింది. అలాగే ఆంగ్ల ఉర్దూలు. ఆంగ్లం కొంత స్థిరమైంది. ఉర్దూ విభిన్న భాషల కలయిక. అనేక ప్రాంతీయ భేదాలతో వైవిధ్యం కలిగి ఉంది. నిజానికిది హిందీకంటే పదజాలంలో తప్ప విభిన్నం కాదు. సంస్కృతాంగ్ల భాషలకున్న స్థిరరూపం వాటిని ఉన్నత ఉత్తమ భాషలుగా భావించడానికి దోహదపడింది. వీటికి ఉండే ఖచ్చితమైన లక్షణాలు అందరిని ఆ భాషల పట్ల ఆకర్షించాయి. సంస్కృతాంగ్ల భాషలకున్న ప్రభుత ఉర్దూ ప్రాకృతాలకు లేకపోవటం వల్ల తెలుగు భాషపై ప్రభావం ఎక్కువగా లేకపోయింది. అది నిత్యం మారిపోతూ ఉండడం, భాషలో స్థిరరూపం లేకపోవడం, ప్రాంతీయ బేధాలు ఉండడంతో ఆ భాషల్లోనే రచనలు ఎక్కువ లేవు. ఇక దాని ప్రభావానికి గురికావడం అనేది కొంత దూరం అయినది. సాధారణంగా పాలకులతో పాటు భాషలు వచ్చి స్థానికంగా ప్రభావం చూపుతాయి. ప్రాకృతం బౌద్ధ మత విషయికంగా అయినప్పటికిని ఎక్కువ ప్రభావం చూపలేదు. ఉర్దూ రాజ భాషే అయినా సాహిత్య భాష కాలేకపోయింది. సంస్కృతాంగ్లాలు సాహిత్య భాషలయ్యాయి.

సంస్కృత ప్రాకృత భాషల్లో ప్రాకృత ఉర్దూ భాషల ప్రభావం తెలుగుపై చాలమట్టుకు భాష వరకే పరిమితం. ప్రాకృత సమాలుగా భవాలుగా తెలుగులో కనిపించే పదాలు కొన్నే. అయితే ఉర్దూ పదాలు మాత్రం కొంత ఎక్కువగానే కనిపిస్తాయి. పదాలుగా, క్రియాస్థానాలుగా, సమాస భాగంగా కనిపిస్తాయి. సాధారణ జనజీవన వ్యవహారంలో కలిసిపోయిన పదాలే కాక, రెవిన్యూ విద్యా న్యాయ వ్యవహారాల్లాంటి రంగాల్లో కూడా ఈ పదాలు బాగా కలిసిపోయాయి.

సంస్కృతాంగ్ల పదాలు తెలుగులో ఎక్కువ. సంస్కృత పదాలు తెలుగు పదాలు కలసిపోయాయి. ఆధునిక అవసరాలకనుగుణంగా ప్రవేశించిన ఆంగ్ల పదాలు చదువురాని వారికి కూడా చేరిపోయాయి. వాటికి తెలుగు పదాలు రూపొందించాల్సిన అవసరం కూడా లేకపోయింది. అంత విరివిగా సంస్కృతాంగ్ల పదాలు తెలుగు భాషను ప్రభావితం చేశాయి. భాష, సంస్కృతంలో ఉన్నట్లే, అధిక సమాసాలతో కలసి గ్రాంథికంగా ఉండేది. ఆంగ్ల ప్రభావం ఆరంభమవ్వటంతో తెలుగులో గ్రాంథికం పోయినా సామన్య ప్రజానీకానికి దగ్గరగా ఉండే వ్యావహారికం ఆరంభమైంది.

రచనా విధానంపై సంస్కృతాంగ్ల ప్రభావాలు ఎక్కువ. సంస్కృత రీతులలోని పద్యగద్య చంపూ లక్షణాలు కలిసి తెలుగులో ఆరంభ రచనలు వచ్చాయి. ఏ విధమైన రచన అయినా ఇదే ధోరణి. అది సాహిత్యమే కానక్కర్లేదు, జ్యోతిష్యమైనా, దైవ ప్రాధాన్య రచనమైనా, రాజు ప్రాధాన్యమైనా, స్తుతి పూర్వకమైనా, వర్ణనాత్మకమైనా ఇదే ధోరణి కొనసాగింది. ఆధునిక కాలందాకా ఇదే స్థితి కనిపిస్తుంది. ఆధునిక కాలంలో 19వ శతాబ్దంలో ఆంగ్ల ప్రాభవంతో భావ భాషా రచనల్లో వైవిధ్యం, నూతనత ప్రవేశించాయి. ఈ ప్రవేశం పూర్వ ధోరణిని సంపూర్ణంగా మార్చింది. అంతవరకు పద్య కవిత్వ ధోరణి చాలా ఎక్కువగా ఉండేది. ఆంగ్ల భాష ప్రభావంతో రచనా విధానంలోని క్లిష్టత పోయి సరళత వచ్చింది. దీర్ఘ సమాసాలు, విపరీత వర్ణనలు, అనవసరాలంకారాలు, బాహ్య సౌందర్య చిత్రణల్లాంటివి అన్నీ తొలగిపోయి సుకుమారఅంతస్సౌందర్య వర్ణనలు ఆరంభమయ్యాయి. రచనా విధానంలో మారో మార్పు కేవలం కవిత్వయుత ప్రక్రియలు మాత్రమే కాక వచనా రచనా గతులు అధికంగా ప్రవేశించాయి. ఇతివృత్త భరిత రచనలే ాక విమర్శనాయుత ఆలోచనాగత రచనలూ ఆరంభమయ్యాయి.

ప్రాకృత ఉర్దూల ప్రభావం సాహిత్యంపై తక్కువ. వాటి ఇతివృత్తం కాని, భావం ని ప్రభావం చూపలేదు. గజళ్ళు, రుబాయిల్లాంటి ప్రక్రియా విధాన ప్రభావాలు మాత్రం ్యధికం. సాహిత్యంలో ఇప్పుడున్న ప్రక్రియలన్నీ దాదాపు సంస్కృతాంగ్ల ప్రక్రియలన్నీ రంభ ఆధునిక కాలాలలో ప్రవేశించి స్థానం సంపాదించుకొన్నాయి. ప్రక్రియలు మాత్రమే దు. ఇతివృత్తం కూడానూ. సంస్కృతంలో ఉన్న ఇతివృత్తాలన్నీ తెలుగులో ఉన్నాయి. ంగ్ల ఇతివృత్త ప్రభావం తెలుగుపై ఉంది.

భాషా భావ రచన ఇతివృత్తాలను గమనిస్తే సంస్కృత ప్రాకృత ఉర్దూ ఆంగ్ల షల్లో ఎక్కువ ప్రభావాన్ని చూపిస్తున్న భాషలుగా సంస్కృత ఆంగ్ల భాషలు నిలుస్తాయి. కృత ఉర్దూల ప్రభావం కేవలం భాషపై మాత్రమే ఉంది. సాహిత్య దృష్టితో సృష్టిలో టికి ప్రమేయం ఏమీ లేదు. ప్రాచీనకాలంలో ప్రాధాన్యం వహించిన దైవ సాహిత్యం, జ సాహిత్యం, అభూత కల్పనాత్మక సాహిత్యం వంటివన్నీ సంస్కృత భాషలోని షయసామగ్రే. కవిత్వ రచన ఛందోరీతులు అలంకారాలు అన్నీదాని నుంచి పొందినవే. ధునిక కాలంలో ప్రవేశించిన వ్యక్తి, ఆలోచన, స్పందన ప్రాధాన్యం వంటివి, వచన వన సులభశైలి వంటివన్నీనూ ఆంగ్ల భాషనుంచి లభించిన అంశాలే. ప్రాచీన సాహిత్యం ంగార వీర రస భరితంగాను, ఆధునిక సాహిత్యం నవరస ప్రధానంగానూ ఉండడం

ఈ రెండు భాషల ప్రభావం వల్లననే తెలుస్తుంది. సాహిత్యంలో ప్రతిబింబించిన సామాజిక జీవిత చిత్రణ సంస్కృతాంగ్ల ప్రభావ ఫలితం. అయితే సమకాలీనం కాక సంస్కృత కావ్యాలలోని చిత్రణే దాని ప్రతిబింబమే ఆరంభ సాహిత్యంలో ఉంటే సమకాలీన జీవిత చిత్రణ ఆధునిక సాహిత్యంలో కనిపిస్తుంది. తెలుగు సాహిత్యంలో కనిపించే భావజాలం చాలావరకు సంస్కృతాంగ్లాలదే. వాటికనుకూలంగా భావవ్యక్తీకరణ కనిపిస్తుంది. ఆచార వ్యవహారాల పరిధి దాటలేని సంప్రదాయబద్ధ ఆలోచనా ధోరణిలో సంస్కృత పరిచయంతో, సాహిత్యం నాడు ఒద్దికగా నడిచింది. ఆధునిక విప్లవాత్మక ధోరణిలో, ఆంగ్ల పరిచయంతో, స్వేచ్ఛాయుత భావ వ్యక్తీకరణకు సహకరించి సంస్కృతాంగ్ల ప్రభావాలతో ఆంధ్ర సాహిత్యం వికాసం పొందింది.

1.1.5. ప్రక్రియలు : తెలుగులో ప్రవేశించిన ప్రక్రియలు, అయితే సంస్కృతం నుంచి, కాకుంటే ఆంగ్లం నుంచి వచ్చాయి. ఆ ప్రక్రియలు ఆయా బాషా సాహిత్యాలలో ఏ విధమైన జీవితం ప్రతిబింబించాయో, ఆ జీవితంతో సమానమయిన ఆంధ్ర జీవితం కూడా అందించాయి. ప్రక్రియల స్వీకరణ వల్ల ఇతివృత్త రూపం నిర్ణయమవుతుంది. ఇతివృత్త లక్షణం నుంచి వస్తుతత్త్వం గోచరమవుతుంది. కాబట్టి వస్తు స్వరూప స్వభావాలు గుర్తించటానికి ప్రక్రియా పరమయిన పరిశీలనం గత్యంతరం లేని పరమావసరం.

1.1.5.1. సంస్కృత ప్రక్రియలు : తసంస్కృత సాహిత్యం వైదిక లౌకిక సాహిత్యాలుగా కనిపిస్తాయి. వేదాలూ - అపౌరుషేయాలుగా చెప్పబడే వివిధ వేదాలు తత్ప్రకటితాంశాలకు సంబంధించి అభివృద్ధి చెందిన శాఖ వైదిక సాహిత్యం. లౌకిక సాహిత్యం అంతా ఇతివృత్త ప్రాధాన్యంతో కూడి ఉంది.

సంస్కృత సాహిత్యంలో మొదటి ప్రక్రియ పురాణం. సృష్టి మొదలుకొని వంశానుచరితం దాకా వివరించే విశిష్ట ప్రక్రియ. అష్టాదశ పురాణాలు, అష్టాదశ ఉపపురాణాలు ఇందుకు నిదర్శనం. అనంతర ప్రక్రియ ఇతిహాసం. రామాయణ భారతాలు ఇందుకు ఉదాహరణం. కావ్యం మహాకావ్యం ఒకే నాణేనికున్న రెండు ముఖాలు. ఇవన్నీ పురాణం నుంచి, కథేతివృత్తాన్ని గ్రహించి రచింపబడేవి. మహాకావ్యం కంటే విస్తృతిలో కొంత చిన్నది కావ్యం. ఈ రెంటిలోనూ ప్రధాన కథాంశం విస్తరిల్లుతూ ఉంటుంది. కథాకావ్యంలో మాత్రం వివిధ కథలు ఏక సూత్రతను ఆధారం చేసుకొని, ఒకదానికొకటి సంబంధం కలిగి కొనసాగుతాయి. దశకుమార చరిత్ర కాదంబరి లాంటివి గద్య ప్రక్రియలు. కొన్ని చంపూ కావ్యాలు. ఇవన్నీ కావ్యాల కోవలోకే వచ్చినా, రచనా విధానంలో మాత్రమే తేడా. నాటకం ప్రదర్శన కోసమే ఉద్దిష్టమయినా క్రమంగా పఠనగుణం సంతరించుకొంది. శ్రావ్యధర్మం పెరిగింది. నాటక ప్రక్రియ సుఖాంతం కావడం తప్పనిసరి.

విస్తృత కావ్యరీతికి భిన్నంగా క్లుప్తంగా సంక్షిప్తంగా రచనలు వెలువడడం కనిపిస్తుంది. స్తుతి పూర్వకాలైన దండకాలు, శతకాలు వెలువడ్డాయి. నాటక రీతిలోనూ ఈ మార్పు కనిపిస్తుంది. ఏకాంకరూపంలో అవి విస్తృతిని తగ్గించుకొన్నాయి.

1.1.5.2. ఆంగ్ల ప్రక్రియలు : ఆంగ్ల సాహిత్యంలో సమాజంలోని ఉద్యమాలు

కారణంగా మారిన సాహిత్య ప్రక్రియలు గోచరమవుతూ వచ్చాయి. అటువంటి సామాజిక పరిణామం ఉన్నచోట్ల ఈ ప్రక్రియలు ప్రవేశించాయి. ఆంధ్రసాహిత్యంలో కూడా ఈ ప్రక్రియ పరికింపవచ్చు. కవిత్వం విభిన్నరూపాలను సంతరించుకొన్నది. కవిత్వ రూపాలకు కారణం సాంఘికంగా వచ్చే ఆకాంక్షించే మార్పుల ఫలితంగా తలెత్తిన ఉద్యమాలు. రొమాంటిక్ కవిత్వం, మార్క్సిస్టు కవిత్వం, అధివాస్తవిక సాహిత్యం, అస్తిత్వవాద సాహిత్యం, ప్రతీకవాద సారస్వతం, క్లాసిస్టు పొయిట్రీ, నియోక్లాసిస్టు పొయిట్రీ వంటివి అనేకం ఆంగ్లంలో నుంచి ఆంధ్రంలోకి ప్రవేశించాయి.

ఆంగ్లం నుంచి విషాదాంత నాటకం ఆంధ్రంలోకి వచ్చి ప్రత్యేకతను ఆపాదించుకొంది. అధునికంగా ఎక్కువ ప్రాముఖ్యం సంతరించుకొంటున్న రచన నవల. నవల తర్వాత అత్యధికులను ఆకట్టుకొనేది కథానిక. నాటక ఏకాంకిక లాంటివి కూడా బాగా ప్రాచుర్యం పొందిన ప్రక్రియలు. ఆంగ్ల సాహిత్యంలో ప్రత్యేకంగా కనిపించే వ్యాసం, సమీక్ష, విమర్శ వంటివి సృజనాత్మక ప్రక్రియలే అయినా కథాత్మకాలు కావు.

ఆధునిక కాలం నుంచి కొంచెం వెనుకకు చూస్తే కనిపించే సాహిత్యం కొంత క్లిష్టంగా ఉంది. కాని మొత్తం సాహిత్యాన్ని పరికిస్తే ప్రజలకు దగ్గరగా వచన రీతిలో వ్యావహారికంగా కనిపిస్తుంది. రచనలో సరళత ఉంది. సాహిత్యం పండితులకే పరిమితం కాకుండా ప్రజలందరికీ ఉద్దేశింపబడింది. మానవ మానసిక పరిపక్వతకి, అంతస్సౌందర్యానికి ప్రాధాన్యం ఇచ్చే సాహిత్యం ఆంధ్ర భాషలో అవతరించింది.

సంస్కృతాంగ్ల సాహిత్య ప్రక్రియలతో విస్తృతంగా అభివృద్ధి చెందిన, చెందుతున్న ఆంధ్ర సాహిత్య ప్రాముఖ్యం గుర్తించటానికి, ఆ ప్రాముఖ్యం ప్రకటించే వస్తుధర్మం గుర్తించటానికి, ఆయా ప్రక్రియా లక్షణాలు పరికించటం కర్తవ్యం.

1.2. వస్తువు - ప్రక్రియలు

ప్రక్రియ రచనా స్వరూపం. పాశ్చాత్య సంప్రదాయంలో ఆంగ్లరూపం 'ఫారం' అదే దానికి పూర్వం నుంచి ప్రాచ్య సంప్రదాయంలో ఉన్న పేరు ప్రక్రియ. కావ్యశరీరానికి కావ్యఆకృతికి ప్రక్రియ నామాంతరం. ప్రక్రియను రూపం అనీ, కావ్యస్వరూపం అనీ, భావించటం కద్దు. సాహితీ స్వరూపం యొక్క బాహిరాకారం, బాహిరవలయం, ప్రత్యక్షమయ్యే స్వరూపం ప్రక్రియ. మహాకావ్యం అనిపించినా ఇతిహాసం పురాణం అని భావించినా అవి ప్రక్రియలు మాత్రమే. నవల కథానిక వ్యాసం విమర్శలను ప్రక్రియ అనే పిలవటం పద్ధతి.

నిజానికి వస్తువుతో ప్రక్రియకున్న సంబంధం గుర్తించటం ప్రస్తుతం. ప్రక్రియను పొదివి పట్టుకొని తనలో నిక్షిప్తం చేసుకొన్న విషయం ఇతివృత్తం అయితే, ఆ ఇతివృత్త మౌలిక లక్షణాల కూడలి వస్తువు అవుతుంది. ఫారం, కంటెంట్ అనీ, కావ్యాత్మ కావ్యశరీరం అనీ, సంభావించిన సాహిత్య విషయాలలో ప్రక్రియ కావ్యశరీరానికి, ఫారంకు సంబంధించిన అంశమని స్థూలంగా భావింపవచ్చు. ప్రస్తుతం కావ్యాత్మ, కంటెంట్ మౌలిక మర్మం పరిశీలించటమయినప్పుడు ప్రక్రియలను గూర్చి ఆలోచించటం అప్రస్తుతంగా అనిపించే ప్రమాదం ఉంది.

ఇతివృత్తతత్త్వాన్ని దాన్ని మౌలిక ధర్మంగా గోచరమయ్యే వస్తుతత్త్వాన్ని తెలుసుకోవటానికి ప్రధాన మార్గం ప్రక్రియా నేపథ్యమే. ప్రక్రియా గతంగా విషయం, ఇతివృత్తం, కథాంశం, వస్తువు ప్రసక్తమయితే పరికించి, కథాంశ మూలంగా వస్తు విశ్లేషణ చేసే అవకాశం ఉంది. కాబట్టి ప్రక్రియా దర్శనం పరమావసరమవుతుంది.

తెలుగు సాహిత్యంలో ఉన్న ప్రక్రియలు ప్రాచీన సాహిత్యం - ఆధునిక సాహిత్యం నేపథ్యం నుంచి చూడవచ్చు. ప్రాచీన సాహిత్యం ప్రక్రియలు సంస్కృత సాహిత్య వారసత్వ ఫలితాలు. ఆధునిక సాహిత్య ప్రక్రియలు ఆంగ్ల సాహిత్యం నుంచి, పాశ్చాత్య సాహిత్యం నుంచి సంక్రమించాయి. కాబట్టి ప్రక్రియా దర్శనంలో సంస్కృత ప్రక్రియల్ని ఆంగ్ల ప్రక్రియల్ని వేరువేరుగా గ్రహింపవచ్చు. ప్రక్రియా పరిశీలనం వల్ల అభివ్యక్తమయ్యే వస్తువు కోసం ఈ ప్రయత్నం అవసరం.

1.2.1. సంస్కృత ప్రక్రియలు : తెలుగు సాహిత్యంలో ఆరంభంలో ప్రవేశించిన ప్రక్రియలు అనువాదం వల్ల వచ్చాయి. అనంతరం స్వతఃసిద్ధంగా ఆంధ్రంలో అభివృద్ధి చెందాయి. ప్రాచీన సాహిత్యంలో ప్రబంధ యక్షగానం ఉదాహరణం, సంస్కృత సాహిత్యంలో ప్రత్యేకంగా గోచరం కాకపోయినా వాటి ఉనికినే లక్షణ రూపంలో ప్రబంధానికి, నాటక రూపంలో యక్షగానానికి ఆధారాలున్నట్లు భావించటం ఉంది. సంస్కృతంలో లేకపోయినా సంస్కృత సాహచర్యంలో సంక్రమించిన ప్రక్రియలను కూడా ఈ సందర్భంలో పరికించవచ్చు. ప్రక్రియా దర్శనం వల్ల కొంత కావ్యశరీరం గోచరం అవుతుంది. మరికొంత కావ్యాత్మ లక్షణాలు లభించే అవకాశం కోసం అన్వేషించవచ్చు.

1.2.1.1. పురాణం : ప్రాథమిక దశలో తెలుగు సాహిత్యం అంతా అనువాదమే. కొన్ని శతాబ్దాలు ఈ బాటనే ఆశ్రయించింది. ఈ అనువాద దశలో అనేక ప్రక్రియలు ఉద్భవించాయి. అందులో పురాణం ఒక ప్రక్రియ. ఈ ప్రక్రియ తెలుగులో ఇతిహాసం తర్వాత వెలసింది.

పురాణం అంటే దైవసంబంధమైనది. మానవ జిజ్ఞాస ప్రతిబింబం పురాణం. మానవ తార్కిక ఆలోచనల ఫలితంగానే పురాణ లక్షణాలు రూపొందాయి. సృష్టి పట్ల ఉన్న ఆసక్తి పురాణంలో నిక్షిప్తం అయింది. దీనికి అలౌకిక శక్తిని రూపొందించి, దానిని భగవంతునికి ఆపాదించి స్తుతించడానికి పురాణం అవతరించింది. అర్థం కాని సృష్టి స్థితి లయలను అర్థం చేసుకొనే ప్రయత్నం, ఈ పురాణం. పురాణానికి సమానార్థకంగా ఆంగ్లంలో 'మిథ్' అంటారు. పురాణం ప్రాచీనమయినది. వేదం అంత ప్రాచీనమనీ, వేదం కంటే ప్రాచీనమనీ, చర్చ ఉంది. ఇందీయోపనిషత్తులో

"ఋుగ్వేదం భగవోధ్యేమి యజుర్వేదం సామవేద మథర్వణమ్
చతుర్థ మితిహాస పురాణం పంచమం వేదానాం వేదమితి"

వాయుపురాణం "పురాణార సర్వశాస్త్రాణాం ప్రథమం" అని పేర్కొంది. వేదంలోని క్లిష్టతను తొలగించేది, ధర్మనీతి తత్త్వాలను వివరించేదిగా పురాణం కనిపిస్తుంది.

పురాణం,ఇతిహాసం ద్వారా వేదధర్మాలను బోధిస్తుంది. "ఇందులో సృష్టి క్రమము పూర్వరాజుల వంశచరిత్ర, అవతార కథలు, క్షేత్ర మాహాత్మ్య కథలు మొదలగునవి ఉంటాయి" (11)

పురాణ కర్తృత్వం: పురాణాలు ఏ కాలానికి చెందినవో అనేది చెప్పలేనట్లే ఎవరు రచించారో అన్నది కూడా చెప్పటం సాధ్యం కాదు. కొందరు అతి ప్రాచీన కాలంలో అంటే క్రీస్తు పూర్వమే రచింపబడ్డాయి అంటే మరికొందరు 6వ శతాబ్ద ప్రాంతాన రచింపబడ్డాయన్నారు. ఎవరెలా పేర్కొన్నా ఏ కాలంలో రచింపబడ్డాయో స్పష్టంగా చెప్పడానికి తగిన ఆధారాలు లేవు.

అష్టాదశ పురాణాలన్నీ వేదవ్యాసునిచే రచింపబడ్డాయనే రూఢి లోకాన ఉంది. వీటన్నిటికి మూలకర్త బ్రహ్మ అని కూడా చెప్పబడుతూ ఉంది. "మత్స్య విష్ణ్వాది పురాణాలను బట్టి చూస్తే, అసలు పురాణాల మూలకర్త బ్రహ్మ అని, ఆ బృహద్గ్రంథాన్ని 18 పురాణాలు వ్యాసుడు సంగ్రహించి మహర్షుణికి చెప్పగా, రోమహర్షణుడు సూతమహర్షికి చెప్పగా సూతుడు శౌనకాదులకు చెప్పినట్లు ఒకచోట కనిపిస్తున్నది" (2)

ఇందుకు భిన్నంగా వాయుపురాణం వాయు ప్రోక్తంగా, మార్కండేయ పురాణం మార్కండేయ ప్రోక్తంగా ఇలా 18 పురాణాలు చెప్పబడ్డాయని మరో వాదన. అయితే అష్టాదశ పురాణాలు వ్యాసకర్తృత్వం అన్నది సత్యదూరం. కాని అసలు కర్తృత్వం ఎవరిది అన్నది చెప్పడానికి మాత్రం తగిన ఆధారాలు లేవు.

పురాణ శబ్ధ నిరుక్తి :

'పురా పూర్వస్మిన్ భూతమితి పురాణమ్' (అమరకోశం)
'పురా భవమితి పురాణమ్' (శబ్ద కల్ప ద్రువము)
'పురా నవం భవతి పురాణమ్' (యాస్క నిరుక్తము)
'యస్మాత్పురా హ్యనక్తీ దం పురాణం తేన హిస్మృతమ్
నిరుక్త మస్యయో వేద సర్వపాపైః ప్రముచ్యతే' (వాయు పురాణం)
'పురా పరంపరాం వష్టి పురాణం తేన వై స్మృతమ్' (పద్మ పురాణం)
'యస్మాత్పురాహ్య భూచ్చైత త్పురాణం తేన తత్స్మృతమ్' (బ్రహ్మాండ పురాణం)
'పురాతనస్య కల్పస్య పురాణాని విదుర్బుధాః' (మత్స్య పురాణం)

అష్టాదశ పురాణాలు : బ్రహ్మ పద్మ విష్ణు వాయు భాగవత నారదీయ మార్కండేయ అగ్ని భవిష్య బ్రహ్మ వైవర్త వరాహ లింగస్కాంధ వామన కూర్మ మత్స్య గరుడ బ్రహ్మాండ పురాణాలు.

దేవీ భాగవతంలో 'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ' త్రయం 'వ' చతుష్టయమ్

'అ' 'నా' 'ప' 'లింగ' 'కూ 'స్కా' ని.పురాణాని పృథక్" అని శ్లోక రూపంలో అష్టాదశ పురాణాలు చెప్పబడ్డాయి.

పురాణ లక్షణాలు : పురాణ లక్షణ నిర్దేశానికి ఎందరో ప్రయత్నిస్తున్నారు. అమరసింహుడు చెప్పిన పంచలక్షణాలు పురాణానికి ప్రామాణికంగా నిల్చాయి.

'సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వన్తరాణిచ
వంశానుచరితం చేతి లక్షణానాం తు పఞ్చకమ్ (అమరకోశం)
సర్గ ప్రతిసర్గం మన్వంతరం వంశం వంశానుచరితం పురాణానికి పంచలక్షణం.

'సర్గమన నాది సృష్టి. ప్రతి సర్గమనగల్పాంతరమున జరుగు పునస్సృష్టి. దీనికి విసర్గమనినందురు. దేవతల యొక్కయు దేవర్షి బ్రహర్షుల యొక్కయుగోత్రానుక్రమము వంశము. యును ప్రకాశ క్రమమును మనువు పరిపాలన కాలమును వర్ణించునవి మన్వంతరములు. వంశాను చరితములయిన సూర్య చంద్రాది వంశములందు జన్మించిన చక్రవర్తుల చరిత్రములు'. (3)

సర్గంటే అది సృష్టి. సృష్టిలో ఆది అంశం. అంతకు మించిన ప్రాచీనమైనది ఉండదు. అట్టి దానితో ఆరంభమయ్యే పురాణాంశమే సర్గ.

'ప్రతి సర్గము నందు బ్రహ్మాదులోనరించిన సృష్టి విధానము వివరింపబడి యుండును. అందు స్థావరజంగమాత్మకమైన సృష్టి వైవిధ్యము విపులముగా వర్ణితమగును. వంశములందు దేవాసురాది విభేదోత్పత్తియు, బ్రహ్మర్షి వంశకర్తల చరిత్రములును వర్ణింపబడును. గావున సృష్టింపబడిన జీవరాసులలో నేర్పడిన క్రమబద్ధమైన వికాసమందభివర్ణింపబడును. మన్వంతరములందు ధర్మశాస్త్ర ప్రవర్తకులై భువిని శాసించిన పదునలుగురు మనువుల యుత్పత్తియు, వారి పరిపాలన కాలమునందలి విశేషములును వర్ణింపబడును. అనగా నీయంశము నందు ధర్మమును లోకమునాచరింప జేయుట కేర్పడిన విశిష్ట సంస్థల వంటి మహావ్యక్తులను గూర్చి కథలో కీర్తింపబడును. వంశానుచరితమున దైవమూలమైన సూర్యచంద్ర వంశములందు జన్మించి ధర్మ వీరులయి ప్రసిద్ధకెక్కిన మహారాజుల చరిత్రములు వివరింపబడును. సర్గ ప్రతిసర్గ వంశములలో సృష్ట్యారంభమును, వేదోత్పత్తియు, దేవ దానవాదుల యుత్పత్తి వికాసములను వర్ణింపబడగా, మన్వంతర వంశానుచరిత్రములందు మానవజాతి వ్యవస్థయు దత్పతి పాలనమును, దత్ప్రభువుల విధానమును దెలుపబడుచున్నవి'. (4)

పురాణం పంచలక్షణం సమన్వితంగా లక్షణికులు చెప్పినా మానవ జీవితంలో ఎక్కువ ప్రభావం చూపే సంగీత నాట్య వైద్యాది శాస్త్రాలు పురాణాలలో కాలక్రమాన చొప్పించబడ్డాయి.

'వివిధ శాస్త్రాచారాది విధులకు సంబంధించిన విషయ సంఘాతమధికముగ జేరుటవలన ప్రాచీనములై పంచలక్షణములకున్న స్థానము నానాటికి గుంచించుకొనిపోయినది'.(5)

క్రమంగా శైవ వైష్ణవ మత ప్రశస్తికి ప్రత్యేక రచనలు కూడా ఆరంభమవ్వడంతో పురాణంలో పంచలక్షణాలు ఎక్కువై దశలక్షణాలు ఏర్పడ్డాయి.

'భాగవత మహాపురాణం పంచలక్షణ సూత్రము ఉపపురాణములకు వర్తించుననియు, మహాపురాణం దశలక్షణ సమన్వితమై యుండవలెననియు ఒక నూతన నిర్వచనమును ప్రవేశపెట్టినది.

'సర్గో స్యాథ విసర్గశ్చ వృత్తీ రక్షాన్త రాణిచ
వంశో వంశానుచరితం సంస్థాహేతు రపాశ్రయః(6)
ఈ దశ లక్షణాలను బ్రహ్మవైవర్తం బలపరుస్తూ ఉంది.

సంస్కృత ఉపపురాణాలు పద్దెనిమిది. ఇవి సనత్కుమారయు, నారసింహ నారద శివధరణీ దౌర్వాస నారదీయ కాపిన వామన ఔశ సన మానవ వారుణ కల్కి మహేశ్వర, సాంబ సౌర పారాశర మారీచ భార్గవ పురాణాలు.

'వేదములలో కథలను పెంపొందించి ఉపాఖ్యానములతో నీతిబోధకముగా, లోక వృత్తము ప్రతిబింబించునట్లు రచించుట పురాణ పద్ధతి. పురాణములందలి కథా వస్తువంతయు ఉపన్యాసముల కూర్పు. అది ఏదైన ఒక ధర్మమును గాని, తత్త్వమును గాని, ఒక సత్యమును గాని, ఒక నీతిని గాని బోధింపవచ్చును. లేదా, ఒక్కొక్క ఉపాఖ్యాన మొక్కొక్క విశిష్ట ప్రయోజనమును ప్రతిపాదింపవచ్చును. పురాణములందలి ఉపాఖ్యానములు స్థూలముగానో సూక్ష్మముగానో లోకవృత్తమును ప్రదర్శించుచుండును. వేదోక్తములైన నీతి ధర్మతత్త్వాది విషయములనే పురాణములు కథోపాఖ్యానముల మూలమున వివరించుచు పాఠకుల యందాసక్తి బుద్ధిని పెంపొందించును'.(7)

తెలుగులో పురాణాలు అనువాదాలు. కనుకనే సంస్కృత పురాణ లక్షణాలన్నీ తెలుగు పురాణాలకు వర్తించాయి. తెలుగులో మొదటి పురాణం - మారన మార్కండేయ పురాణం. 13వ శతాబ్దపు మార్కండేయ పురాణానికి పూర్వమే బసవ పురాణం రచింపబడినా అది పేరుకు మాత్రమే పురాణం. 11వ శతాబ్దపు భారతాన్ని కొందరు పురాణమన్నా అది ఇతిహాసంగానే పరిగణింపబడింది. కనుక మారన మార్కండేయ పురాణమే ప్రథమాంధ్ర పురాణం. సర్గ ప్రతిసర్గలు, మన్వంతరం సంపూర్ణంగా, వంశ వంశానుచరితాలలో సూర్యవంశ చరిత్ర వర్ణింపబడింది. పురాణ లక్షణాలను సంపూర్ణంగా నిలుపుకొన్న పురాణమిది అని ప్రతీతి.

'ఈ పురాణమునకు కథాగమనము ప్రధాన లక్షణము .... అందలి కథలు ప్రాచీనములయ్యును నవ్య వాతావరణ బంధురములైన కల్పనా మహనీయములై నూతన సంప్రదాయ ప్రబోధైక దృష్టులు గాక, శిల్పరమణీయములై భాసిల్లుచున్నవి. ఆ కల్పనల వెన్నుక, నెట్టి నిర్దిష్ట ప్రయోజనాపేక్ష యున్నట్లు తెలియవచ్చుట లేదు. కనుక, గళానివ్వమైన పౌరాణిక భావనా శక్తియేం ఈ పురాణ కథా నిర్మాణమునకాధారమైనది'. (8)

మారన ఏర్పర్చిన ఈ కథాకథనం సంప్రదాయంగా మారి అన్ని పురాణాలలో అంతస్సూత్రంగా కనిపిస్తుంది. 14వ శతాబ్దంలో వెలువడిన ఎర్రన హరివంశం, నృసింహ

పురాణం, నాచన సోముని ఉత్తరహరివంశం, 15వ శతాబ్దంలో వచ్చిన పోతన భాగవతం, నారదీయపురాణాలు తెలుగులో వచ్చిన ప్రసిద్ధ పురాణాలు.

'దైవ వైశిష్ట్యాన్ని తెల్పేవి పురాణాలు. 'విష్ణు పురాణం వక్కాణం ప్రకారం ఆరు పురాణాలు విష్ణు మాహాత్మ్య ప్రతిపాదకాలు, ఆరు పురాణాలు బ్రహ్మ మాహాత్మ్య ప్రతిపాదకాలు, ఆరు పురాణాలు శివ మాహాత్మ్య ప్రతిపాదకాలుగాను ఉన్నట్లు కనిపిస్తుంది.' (9)

ప్రాచీన మానవుని ప్రథమ రచనా వస్తువుగా దైవం కనిపిస్తుంది. దైవం పట్ల మానవుని భయం భక్తి శ్రద్ధ దైవలీలలలోని అద్భుతం దాని పట్ల మానవ విశ్వాసం ఆధారంగా పురాణం వెలిసింది. పౌరాణికతే కాక పురాణానికున్న మరో గుణం విస్తృతి. పురాణం దైవారాధంగా రచింపబడిన విస్తృత రచన.

1.2.1.2. ఇతిహాసం : ఇతిహాసం ప్రధానంగా చరిత్ర. చారిత్రక పురుషుని ప్రాధాన్యం ఉన్న కావ్యం. చారిత్రక పురుషుని ఉన్నత వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించడానికి దైవత్వ లక్షణాలు ఆపాదించబడతాయి. చారిత్రక పురుషుని దైవంలా భావించడం పూజించడం కనిపిస్తాయి. దైవ ప్రాధాన్య ప్రభావ ఫలమే ఇతిహాస పురుషునికి ఆపాదింపబడిన దైవత్వ లక్షణాలు. దైవ ప్రాధాన్యం కల్గిన పురాణం నుంచి చారిత్రక ప్రాముఖ్యం సంతరించుకొన్న ఇతిహాసం సాహిత్య పరిణామ ప్రథమ దశ.

పురాణేతిహాసాలు రెండు భేదకాలుగా చెప్పబడ్డాయి. ఈ రెండిటికీ ఉన్న సంబంధం ప్రాచీనకాలం నుంచి కనిపిస్తుంది. శతపథ బ్రాహ్మణాదులలో ఇతిహాస పురాణామని చెప్పబడింది. పురాణేతిహాసాల స్పష్టమైన భేదం అథర్వవేదంలో కనిపిస్తుంది. పురాణం జగత్ప్రాగవస్థ నుంచి ఆరంభమయ్యే ఇతివృత్తాన్ని చెప్తే, ఇదిట్లా జరిగింది అని చూసి చెప్పుకొనే చారిత్రక సత్యం - ఇతిహాసం. ఈ ఇతిహాసాన్ని గూర్చి విద్యారణ్యులు

'దేవాసురా స్సంయత్తా ఆసన్ - ఇత్యాదయః ఇతిహాసా'

అమరసింహుడు 'ఇతిహాసంః పురావృత్తమ్'

భోజుడు 'అతీతార్థ ప్రాధన్య దితిహాసః'

కౌటిల్యుడు 'పురాణమితివృత్త మాఖ్యాయికోదాహరణం

.ధర్మశాస్త్ర మర్థశాస్త్ర చేతిహాసః

'ఇతిహాసః - ఇతిహ పారంపర్యోపదేశ ఆస్తే అస్మిన్ అస ఆధారేఘణ్. ధర్మార్థ కామ మోక్షాణాం ఉపదేశ సమన్వితమ్. పూర్వాయుక్త కథాయుక్తం ఇతిహాసం ప్రచక్షతే. ఇత్యుక్త లక్షణే పురావృత్త ప్రకాశకే భారతాది గ్రంథే'. శబ్దకల్పద్రుమము.

నాట్యశాస్త్ర వ్యాఖ్యానంలో అభినవ గుప్తుడు కర్మఫల సంబంధమైన సర్వార్థాలు ఎందులో ప్రత్యక్షంగా చూపబడతాయో అది ఇతిహాసమన్నాడు.

వీరందరి నిర్వచనాలు ఇతిహాస లక్షణాలు వ్యక్తం చేస్తున్నాయి.

'ఇతిహాసమున ప్రధాన కథ చారిత్రక సత్యమైనదిగా నుండవలయును. మరియు నందు కొంత శాస్త్రము ప్రవర్తించవలయును. ఆ కథకు దేవానంర సంబంధముండవలయును. పారంపర్యోపదేశ క్రమము కలిగి యుండవలయును. ఆ కథా పురుషుని యొక్క కర్మ ఫలానుభవ మిహపర భేదము చేత ద్విధా భూతము గనుక, నితిహాసమున నట్లే పరలోకానుభవమును చూపబడవలయును' (10)

ఇవికాక ఇతిహాసంలో అగుపించే మరికొన్ని లక్షణాలు గమనించాలి.

'ఇతిహాసమున ప్రధానముగ నొక సుదీర్ఘమైన కథ ధీరోదాత్త ధీరోద్ధత ప్రకృతులైన పురుషుల వీర కృత్యములతో ననుసంధింపబడి యుండవలయును. కడు దీర్ఘమైన కథ యుండుట మూలముగ నేర్పడు విసుగుదల తొలగుట కన్యములైన బహు లఘుకథలు మధ్య మధ్య ప్రధాన కథా సంబంధాలుగా చెప్పబడవలయును. ఇతిహాస కథా పురుషులను వారి కృత్యములను దైవశక్తి పరిపాలించుచున్నట్లు అనివార్యముగా నిరూపింపబడవలయును..... ప్రపంచము నందలి అన్ని భాషలలోని ఇతిహాసములను ఒక సుదీర్ఘమైన కథ, యుద్ధము, ఉపాఖ్యానములు, ఆయా దేశముల మత తాత్త్విక దృక్పథములు ఇవన్నియు పడుగు పేకల వలె కూర్చబడి నిబిడ బంధము కలిగియున్నవి'. (11)

ఇతిహాసానికి ఆంగ్లంలోని ఎపిక్ పోయమ్‌కి లక్షణ సారూప్యం కనిపిస్తుంది.

Sir C.M. Bowra : 'An Epic Poem is by common consent a narrative of some length and deals with events which have a certain grandeur and importance and come from a life of action, especially of violent action, such as war. It give a special pleasure because its event and persons enhance our belief in the worth of human achievement and in the dignity'and nobility of man'.

'సుదీర్ఘమైన కథా కథనము, ఉజ్జ్వలమైన జీవిత వృత్తములు గల పాత్రలు, చారిత్రక సత్యనిష్ఠ, పురుషార్థ సాధనామయమైన యున్నత జీవిత లక్ష్యము, రసాత్మకమును ఉపదేశాత్మకమును నైనయితివృత్త నిర్వహణము, కర్మ ఫల సంబంధ నిరూపణాత్మకములైన యాగమికార్థములు ప్రత్యక్ష పరిదృశ్యమానములుగునట్లు చేయుట, ప్రసన్న గంభీరమైన శైలి' (12) అనే లక్షణాలలో సారూప్యం ఉంది.

ప్రాచ్య పాశ్చాత్య భావతో ప్రధానంగా చరిత్ర తెల్పేది ఇతిహాసం. పురాణం తర్వాతి ప్రక్రియ. పురాణానికి భిన్నంగా నిల్చింది. పురాణం విస్తృతమైనది. సర్గ ప్రతిసర్గ వంశ మన్వంతరం వంశానుచరితం వంటి విస్తృత లక్షణ పరిధి నుంచి వంశాను చరితలకు మాత్రమే పరిమితమైన పరిధికి సాహిత్యం రూపుమార్చింది. అత్యంత విస్తృతి నుంచి కొంత సంక్షిప్తానికి పౌరాణికత నుంచి చారిత్రకతకు సాహిత్యం పరిణామం చెందింది.

తెలుగు సాహిత్య చరిత్రలో ప్రధానంగా కనిపించే ఇతిహాసాలు రెండు. అవి మహాభారత రామాయణాలు. తెలుగు సాహిత్య కావ్యరూపమే మహాభారతముతో

ఆరంభమైంది. భారతాన్ని రచించిన వేదవ్యాసుడు తన పూర్వుల చరిత్రను తన కాలం నాటి కథను వ్రాశాడు. మహాభారతంలో వ్యాసుడూ ఒక పాత్రే కనుకనే మహాభారతం ఇతిహాసం అయింది.

'ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, యాధ్యాత్మ విధులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని, కవి వృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వ లక్ష్య సంగ్రహమని, యైతిహాసికు లితిహాసమనియు
పరమ పౌరాణికుల్ బహు పురాణ సముచ్చయంబని, మహిమ గొనియాడుచున్'.

వేదవ్యాసుడు మహాభారతాన్ని, పులుపురికి పలురకాలుగా కనిపించే సమస్త లక్షణాలు ఈ ఇతిహాసంలో నిల్పాడు.

1.2.1.3. కథాకావ్యం : 'మనోరంజనాన్ని కలిగించటంతో పాటు నీతి ధర్మాలను బోధించటమే, కథల ఉద్దేశం. మనోరంజనంతో పాటు కథలు రాజనీతిని, వ్యవహార జ్ఞానాన్ని, కార్య కుశలతను బోధించేవిగా కూడా వున్నవి. ఈ కథలలో మనుష్య పాత్రలతో పాటు పశుపక్ష్యాదులు కూడా చేరి ఉండడం ఒక విశిష్టత' (13) ఈ కథా కావ్యాలు ఎన్నో రకాలుగా ఉన్నాయి. ఈ కథలు

అలంకారిక శైలిలో రచింపబడేవి - దశకుమార చరిత్రలో, సాహసాద్భుతాలు కలిగించేవి - విక్రమార్క చరిత్రలో, రాజనీతి వ్యవహార జ్ఞానాన్ని బోధించేవి - పంచతంత్రంలో, ధర్మబోధనకు పుట్టిన మత సంబంధాలు - బౌద్ధ జైన కథలలో ఉన్నాయి.

మనకు కథగా లభించే మొదటి రచన గుణాఢ్యుని బృహత్కథ. తర్వాత వచ్చినవే కథా కావ్యాలు. వీటిలో ఇతివృత్తం ప్రఖ్యాతం కాదు. అంటే పురాణేతిహాసాల నుంచి ఈ ఇతివృత్తం తీసుకోవడం జరగలేదు. వివిధ కథల సమాహారం కథాకావ్యం. ఈ కథల మధ్య ఒక్కోసారి ఏ సంబంధమూ ఉండకపోవచ్చు. ఇది అద్భుతాశ్చార్యకర సన్నివేశాలు సంఘటనలతో నిండి ఉంటుంది.

1.2.1.4. ప్రబంధం : ప్రకృష్టమైన బంధం కలవి ప్రబంధం అన్నారు. పండితులు అలంకారికులు కావ్యానికి సమానార్థకంగా ప్రబంధాన్ని వాడారు. అలంకార శాస్త్రాన్ని కూడా ప్రబంధం అనేవారు.

దీని లక్షణాలు ప్రధానంగా,

1. ఏక నాయకాశ్రయమై ఉండాలి. 2. వస్త్వైక్యం గ్రహించిన వస్తువు ఆద్యంతం భంగరహితంగా నిర్వహించాలి. 3. స్వతంత్ర రచనై ఉండాలి. కథాంశం మాత్రమే పురాణేతిహాసాల నుంచి గ్రహింపవచ్చు. 4. శృంగార రసం అంగిగా మిగిలినవి అంగాలుగా ఉండాలి. 5. అష్టాదశ వర్ణనలు కలిగి ఉండాలి. కొందరు అష్టాదశ వర్ణనలు కాక ద్వాదశ వర్ణనలుండాలని చెప్పారు.

ఆంధ్ర కవితా పితామహుని మనుచరిత్ర తొలి ప్రబంధమని ప్రసిద్ధి గాంచినా ఆధునిక కాలంలో లభించిన, తత్పూర్వకాలపు నన్నెచోడుని కుమార సంభవమే తొలి ప్రబంధం - అని పండితుల భావన. 'తెలుగు సాహిత్యమున నన్నయ కావ్య

సంప్రదాయమునకు ఆదికవి కాగా నన్నెచోడ కవి ప్రబంధ కవితకు ప్రథమాచార్యుడు. కుమార సంభవము తొమ్మిది రసములతో పది కావ్య గుణములతో పద్దెనిమిది (అష్టాదశ) వర్ణనలతో ముప్పదియాఱలంకారములతో సర్వ లక్షణమై విరాజిల్లుచున్నది - ఇష్టదేవతా స్తుతి. కావ్య ప్రశంస - కవి స్తుతి - సుకవి నింద - షష్ఠ్యంతము అశ్వాసాద్యంత పద్యములు - అశ్వాసాంత గద్యను ప్రబంధ రచనా ప్రణాళిక నేర్పర్చిన కవి నన్నెచోడుడే'. (14)

1.2.1.5. యక్షగానం : సాహిత్యం ప్రవాహంలోనికి నిత్యం నూతన ప్రక్రియలు ప్రవేశిస్తూ కొనసాగుతూ నిష్క్రమిస్తూ ఉంటాయి. అందులో ఒకటి యక్షగానం. యక్షుల పాట యక్షగానం.

'యక్షులనే జాతివారు కులవృత్తిగా గ్రహించి చేసిన గానము, వారాడిన ప్రదర్శనము యక్షగానంగా ప్రసిద్ధి కెక్కింది'.(15)

ప్రాథమికంగా ఇది దేశీ ప్రక్రియ. గాన రూప కథాఖ్యాన ప్రక్రియ. కర్ణాటాంధ్రాలలో ప్రాచుర్యం పొందింది. ప్రాచీనాంధ్రులు జక్కులు, బవనీడులు, వీరనారీమణుల కథలను పాడేవారని ఈ యక్షగాన రూపాధారాలని శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి వివరించాడు. అడవి ప్రాంతాల కోయ కురవల చిందే కొరవంజి. వీరు స్థలమాహాత్మ్యములను తెలుపుతూ ఏర్పరుచుకొన్న గేయనృత్యాలే యక్ష గంధర్వాది వేషాలు ధరించిన కళావంతులు ప్రదర్శించే వారు. కనుక ఇది యక్షగానం అయింది అని వేటూరి ప్రభాకర శాస్త్రి తెలిపాడు. ఇది మత ప్రచారానికి ఏర్పడిందని నేలటూరి వెంకటరమణయ్య అభిప్రాయపడ్డారు.

యక్షగానం ఒక ప్రత్యేకమైన శైలిగా పాల్కురికి సోమనాథుని కాలానికి ప్రాచుర్యం పొందింది. అటుపిమ్మటే సాహిత్యంలో ప్రవేశించింది. శ్రీనాధుని కాలంలో మొదటిసారిగా యక్షగానం అనేపదం ఉపయోగింపబడింది. గాన ప్రధానమైన యక్షగానం నృత్తనృత్యాత్మకమైంది. రూపక రచనైన కారణాన సాహిత్య ప్రక్రియ అయింది.

'యక్షగానము యొక్క ప్రాథమిక స్వరూపమూ వేరే చాటుచున్నట్లు గానమై యుండుట నిర్వివాదము. అయితే పురాణ ప్రసిద్ధులైన యక్ష జాతీయులెవ్వరికిని గానకళా ప్రతిష్ఠలున్నట్లు తగిన యాధారము కానరానందున నెన్నడో యక్ష వేషధారణ యొక్క వృత్తిగానవలంబించిన వారని యూహింపదగిన యొక్క లగాణల జక్కులపురంధ్రుల గాన కళాభిమానములే యక్షగానోత్పత్తికి బీజాక్షర ప్రాయములైనవనియు, ఆ గానము నృత్యాత్మకముగా, గథాఖ్యానోపయోగిగా నృత్యానుకూలముగా నుండెడి యొక ప్రత్యేకశైలికి, చెందియుండుట యక్షగానము యొక్క ప్రాథమికావస్థయై యుండుననియు చెప్పవచ్చును.'(16)

యక్షులే నేటి జక్కులు: 'జక్కుల జాతి ఒకప్పుడు యక్షగాన ప్రదర్శనమును ప్రధానవృత్తిగా అవలంభించిన జాతి అని, వారి వృత్తికి సంబంధించిన 'యక్ష' శబ్దానుక్రమముగా వారికి జాతివాచకముగా పరిణమించి యుండునని భావింపవచ్చును. యక్షగానములను ప్రయోగించుట కారణముగనే ఆ తెగవారికి యక్షులు జక్కులు అను పేరు వచ్చినది'.(17)

లక్షణాలు : తాళ్ళపాక అన్నమాచార్యుల 'సంకీర్తనల లక్షణ'మనే గ్రంథంలో యక్షగానాన్ని గూర్చి 'యక్షగాన పదంబులు నవ్విధమున సముచితానిక విధతాళ సంగతులను నవరసాలంక్రియా సవర్ణంబులగుచు, నలరునవిహరి కీర్తనాచార్యుడనియె' అని పేర్కొనబడింది. యక్షగాన ముఖ్యాంగాలు దరువులు ద్విపదలు గద్యపద్యాలు. ఇది గాన ప్రధానం. పాత్రానుకూల వేషధారణ కలిగి ఉండాలి. రసాశ్రయ ఇతివృత్తం, చతుర్విధాభి నయంతో కూడిన నాట్యం, నృత్త నృత్తాను ప్రాణిత నాట్యం యక్షగానానికి అవసరమైన లక్షణాలు.

'యక్షగానము నందితివృత్త మెట్టిదైన గావచ్చును. రచనా ప్రక్రియ శ్రవ్యము గాని, దృశ్యము గాని కావచ్చును. ఏ ప్రక్రియయందైన గీత ధర్మము విహితము. అందు రాగ తాళములలో నొకదానికి గాని, రెండింటికి గాని తగు ప్రాధాన్యము గల రచనా విశేషములు (రేకు, దరువు, పదము, కీర్తన మొదలగునవి) ద్విపద (మంజరియును), పద్యములు (జాత్యుపజాతి వృత్తములు, అర్ధపద్యములు, సం. శ్లోకములును), వచనము (సంధి ప్రయోజనాత్మకముగాని సంవాదత్మకము గాని వర్ణనాత్మకమైనను గాదగును. చూర్ణికలు విన్నపములు మొదలగునవి) గద్య ప్రభేదములు నుండదగును. ఏలాది గీత ప్రబంధ విశేషముల ప్రయోగమైచ్ఛికము'.(18)

యక్షగానం గూర్చి 12వ శతాబ్దంలో ఆనవాలున్నా, సాహిత్యరూపం 15వ శతాబ్దంలో మాత్రమే దాల్చింది. అప్పటి నుంచి పురోగమించి, 17వ శతాబ్దంలో విస్తృతమైంది. దీనికి కూచిపూడి వారి కలాపం ప్రథమ ప్రక్రియానుబంధమైంది. 19వ శతాబ్దానికి అనేక ప్రక్రియానుబంధాలు వెలిశాయి. ఈ పరిణామ క్రమంలో విభిన్న ఛందోభేధాలు ప్రవేశించాయి. వృత్తగంధి వచన ప్రాయమైన వచనాలు ప్రవేశించాయి. యక్షగానం సంవాద రూపాన్ని దాల్చింది. వీధి నాటక లక్షణాలు ప్రవేశించి క్రమంగా యక్షగానంతో అభేదం పొందింది. దేశి ప్రక్రియగా ఉన్న యక్షగానంలో మార్గనాటక ఛాయలు ప్రవేశించాయి. ప్రౌఢ కవుల రచనలతో యక్షగానం ప్రబంధరూపం దాల్చింది. యక్షగానం మీద అభిరుచితో భాగవత మేళాలుగా సంచారం చేస్తూ ప్రదర్శనలిచ్చేవారు సిద్ధమయ్యారు.

మార్గదేశి రచనలతో, కలాపం బొమ్మలాట హరికథ వంటి ప్రక్రియానుబంధంతో, వెన్నెల పదాలు ఏలలు సువ్వాలలు వంటిఅనేక పద కవితలతో పౌరాణిక చారిత్రక సాంఘిక అద్భుతవస్తు వైవిధ్యంతో వివిధ భాషా ఛందోరూపాలతో, లోకవృత్త ప్రదర్శనలతో కూడిన అద్భుత సాహిత్య ప్రక్రియ యక్షగానం.

తెలుగులో ప్రథమ యక్షగానం ప్రోలుగంటి చెన్నశౌరి సౌభరిచరితము. ఇది అలభ్యము. లభ్య ప్రథమాంధ్ర యక్షగానం కందుకూరి కవి రచించిన సుగ్రీవ విజయము. కరుణ వీర రసాలను అంగి అంగాలుగా గ్రహించాడు. సీతా వియోగంతో దుఃఖించే రామునితో ఆరంభమై, వాలి మరణంతో దుఃఖించే తారతో అంతమైంది. వాలి సుగ్రీవుల పోరులో సుగ్రీవుని విజయమే కథాంశం. ఇందలి కథ ప్రసిద్ధం. సంవాద శైలి కనిపిస్తుంది. కంకంటి పాపరాజు విష్ణుమాయా విలాసము, రఘునాథనాయకుని రుక్మిణీ కృష్ణవివాహము,

విజయరాఘవుని కాళియ మర్దనము, కృష్ణవిలాసము, విప్రనారాయణ, పూతనా హరణము, ప్రహ్లాదచరిత్ర ప్రసిద్ధ యక్షగానాలు.

యక్షగానాలు ప్రథమంగా చారిత్రకాలు 'పౌరాణికేతి వృత్తములతో కూడిన యక్షగానములే మొదట రచింపబడుచుండెడివి. తరువాత పోషకులగు రాజుల జీవిత ఖండములను కథావస్తువుగ గ్రహించి రచింపబడిన శృంగార ప్రధానములగు యక్షగానములు కొన్ని వెలువడినవి'. (19)

కొంత పౌరాణికంగా రచించినా అధికంగా చారిత్రకాలే కనిపిస్తాయి. ఇది ప్రధానంగా స్వతంత్ర ప్రక్రియ. సంస్కృతానువాదం కాదు. దేశి ప్రక్రియ లక్షణ నిర్దేశం లేదు. లక్షణాలు ఒక పరిధిని నిర్దేశిస్తాయి. ఇది లేదు కనుకే ఎంతో అభివృద్ధి చెందింది. అపరిమితత్వం సాహిత్యాభివృద్ధికి దోహదమవుతుంది. ఈ లక్షణరాహిత్యమే, విభిన్న ప్రక్రియానుబంధాలని, అనేక ఛందోరీతులని, నూతనత్వాన్ని నిక్షిప్తం చేసుకోవడానికి సహకరించింది. లక్షణ నిర్దేశానికి దోహదం చేయలేనంతటి నిత్య పరిణామం యక్షగాన ప్రక్రియ పొందింది.

1.2.1.6. చాటువు : కవి అలవోకగా అప్రయత్నంగా వెలువర్చే ఆశుకవితే చాటువు. 'అప్పటికప్పుడు అప్రయత్నంగా చెప్పినవి'. (20) చాటువులు, వాస్తవికత ఉండడం దీనిలోని విశిష్టత. అది ఉన్నప్పుడే ఇవి అందరినీ ఆకట్టుకొంటాయి. సందర్భోచిత ప్రతిస్పందనలే చాటువులు. చాటువులు అవతరించడానికి ముఖ్యకారణం ఆశుకవిత్వమే.

'చాటుషు ప్రేయోలంకారస్య

వ్యాక్యార్థత్వే రసోదయః
అంగభూతాః దృశ్యన్తే' - ధ్వన్యాలోకము
'ప్రేయః ప్రియాయాః ప్రకరోతి చాటుమ్' - ఋతుసంహారమ్,
'పటుచాటు శతైరనుకూలమ్' మేఘసందేశము

'Completes detached poems current epigrams more correct' - C.P.Brown - Telugu English Dictonary.

'Aggreable coaxing speech filattery' (Especially of a lover to his sweet heart) V.S.Apte.

'ప్రియమైన మాట' - శబ్దరత్నాకరము

'అప్పుడప్పుడు కవి ఆశువుగా చెప్పిన పద్యములు' (గ్రంథస్థము కానివి) - ఆంధ్రవాచస్పతము.

'చాటుః అన్న పదానికి మనస్సుకు మోదాన్ని కలిగించే వాక్యం, మిథ్యా ప్రియవాక్యం,ముఖస్తుతి, ప్రియమైన మాట, మధురోక్తి, అర్థవిశేషాలున్నట్లు...' (21) తెలుస్తూ ఉంది.

'చాటు చాటుపద్యమునలగా 'Stray verses a current epigram - a stranza - a song or ballad - small poetry - fugitive verses - a coplet a quartian - a fancy - a short composition' అని బ్రౌన్ నిఘంటువునందు నాల్గైదు కోణములనుండి అర్థము వ్రాయబడియున్నది. మనము చాటువులనుకొనుచున్న వానికి బ్రౌను పండితుని లక్షణాలు కొంత సమీపముగా నున్నదనవచ్చును. లాక్షణిక దృష్టిని విడిచి చాటు శబ్దమును దాని రూఢ్యర్థమును గ్రహించుకొని అర్థము చెప్పుకొనవలయును. అప్పుడు చాటుపద్యములీ క్రింది లక్షణము లన్నింటితో కాకపోయినను కొన్నింటితోనైనా యుండును.

1. ఆశు రచనలై యుండుట. 2. దూషణ భూషణ రూపమున నుండుట. 3. సమస్యా పూరణ రూపమున నుండుట. 4. ముక్తక లక్షణ లక్షితములై యుండుట. 5. చమత్కార ప్రయోజనము కలిగి యుండుట. 6. పొడుపు కథలుగా నుండుట.7. వర్ణనగా నుండుట.8. దైనందిన కష్టసుఖముల తోడి దినచర్యా రచనలట్లుండుట. 9. పేరడీ రచనలుగా నుండుట.10. గాథలుగా నుండుట'. (22)

'చాటువుకి ప్రియమైన మాట అనే అర్థం కనిపిస్తుంది నిఘంటువులలో. అయితే చాటూక్తి, ప్రియోక్తి, మాత్రమే కాదు ప్రచుర ప్రచారం, జనరంజకత్వం, అప్రయత్న మాధుర్యం, చమత్కారం మొదలగునవి' పలు లక్షణాలు చాటువులలో చోటుచేసుకున్నట్లు కనిపిస్తుంది'. (23)

చతుర్విధ కవితల్లో ఒకటైన ఆశుకవిత్వమే చాటువు. చాటువు తక్షణ జనిత భావావేశ ఫలితం. ఈ చాటువుల వల్ల భావం మాత్రమే కాక ఒక్కొక్కసారి స్థానిక చరిత్రలు కూడా లభిస్తాయి.

'ఉపలబ్ధమైన తెలుగు చాటువుల్లో వేములవాడ భీమకవి చాటువులు ప్రాచీనమనాలి'(24)

1.2.1.7. దండకం : నన్నయ కాలం నుంచి నేటి వరకు ప్రచారంలో ఉన్న సాహిత్య ప్రక్రియ దండకం. పాటలుగా పదాలుగా వ్యాపించిన సాహిత్య ప్రక్రియల్లో దండకం ఒకటి. సంస్కృత కన్నడ తమిళ భాషలలో దండకాలు ఉన్నాయి. తమిళ దండకానికి తెలుగు దండకానికి సారూప్యం ఎక్కువ ఉంది.

తెలుగు సాహిత్యంలో దండకాలు రెండు రకాలుగా కనిపిస్తాయి. విజయరాఘవుని రాజగోపాల దండకం వంటివి ప్రత్యేక కావ్యాలుగా వెలువడితే, నన్నయ భారతారణ్య పర్వంలో అర్జునుడు చేసే శివస్తుతి కావ్యాంతర్గతాలుగా వెలువడ్డాయి. అధికంగా కావ్యాంతర్గత దండకాలు దైవ స్తోత్రాలుగాను, ప్రత్యేక కావ్యాలు మానవ సంబంధ దండకాలుగా అగుపిస్తాయి.

తెలుగు దండకాల ఇతివృత్తాలు పురాణం నుంచి గ్రహింపబడ్డాయి. అధికంగా స్వతంత్ర దండకాలూ ఉన్నాయి. మనకు లభించే దండకాలు నాలుగు విధాలుగా వింగడించవచ్చు. దేవతా స్తుతి, మానవ స్తుతి, మానవ నింద, శృంగరాత్మకం అనేవి చతుర్విధాలు'. (25)

తెలుగులో లభించే మొదటి దండకం 15వ శతాబ్దపు నాటి పోతన విరచితమైన భోగినీ దండకం. సర్వజ్ఞ సింగభూపాలుని వలచి, తల్లి వారింపు మందలింపు లెక్క చేయక రాజును అర్థించి ప్రేమికురాలి స్థానాన్ని పొందిన భోగినీ అనే వేశ్య కథ భోగినీ దండకం. తెలుగులో లభించే ఇతర ప్రసిద్ధ దండకాలు చంద్రాననా దండకం, పద్మావతి దండకం, వేదావతీ దండకం ఆరంభంలోని ఉత్తమ దండకాలు.

12.1.8. ఉదాహరణం : తెలుగులో అనువాద సాహిత్యం అధికంగా ఉన్న రోజుల్లో వెలసిన స్వతంత్ర ప్రక్రియ ఇది. సంస్కృతానికి కూడా ఈ ప్రక్రియ తెలుగు నుంచే వెళ్ళి చేరింది. ఇది 13వ శతాబ్దపు సాహిత్య ప్రక్రియ సృష్టి. దేశి సంప్రదాయ సమన్వితమిది. 'ఉదాహరణము అనిబద్ధ వర్గమున చేర్చబడినది. మధుర కవితా శాఖకు చెందును. అక్షర గణబద్ధమనే వృత్త రచన, మాత్రా గణబద్ధమగు పద రచన ఉండి మార్గ దేశి కవితా సమ్మేళనమొనర్చుకొనిన సాహిత్య ప్రక్రియ ఇది'.(26) ఇవి అల్పకావ్యం.

విద్యారణ్యుడు దీని క్షుద్ర ప్రబంధమన్నాడు. దీని గుణాలను లక్షణాలను నిడదవోలు వెంకటరావు - 'భాష యందుగల సప్తవిభక్తులును సంభోదనతో గూడ నీ కృతి యందుదాహరింపబడుట చేత దీనికి 'ఉదాహరణము' అని పేరు వచ్చినది. ఇందొక్కొక్క విభక్తికి ఒక్కొక్క వృత్తము, ఒక కళిక, ఒక ఉత్కళిక యుండును. సంబోధన విభక్తి తరువాత సార్వ విభక్తిక పద్యమొకటి, అంకితాంక పద్యమొకటి - కవి పేరు కృతి పేరుగలది - యుండును. ఇందువలన నెనిమిది విభక్తులకు 16 కళికోత్కళికలు 8 పద్యములు సార్వ విభక్తిక అంకితాంక పద్యము 2. మొత్తముపై 26 మాత్రమే యీ కావ్యము నందు నియతము'.(27) ఈ పద్యాలు సాధారణంగా మత్తేభ శార్దూల వృత్తాలుగా ఉంటాయి. ఈ కారణానే ప్రాచీన కావ్య ప్రక్రియలో ఉదాహరణము అతి చిన్నది.

స్తుత పూర్వకం కనుక రాగ ప్రధానంగా ఉంటుంది. అధికంగా దైవస్తుతి ఉంటుంది. దైవభక్తి, మత విశ్వాసాలే ఉదాహరణ రచనకు కారణం. ఆధునిక కాలంలో దైవస్తుతే కాక రాజు మహాపురుష స్తుతి కావ్యాలు కూడా కనిపిస్తాయి. తెలుగులో లభించే మొట్టమొదటి ఉదాహరణం బసవోదాహరణం - పాల్కురికి సోమనాథుని విరచితం.

1.2.1.9. శతకం : తెలుగు సాహిత్యారంభం నుంచి వస్తున్న ప్రధాన శాఖ. సంస్కృత కన్నడ తమిళాది భాషలలో శతకాలు ఉన్నప్పటికి తెలుగులో ఉన్నంత అభివృద్ధి విస్తృతి ఏ ఇతర భాషలోనూ లేవు.

శతకాలను ఒక్కొక్కరూ ఒక్కొక్క విధంగా పేర్కొన్నారు. వంగూరి సుబ్బారావు భావగీతాలని పేర్కొన్నాడు. ఇవి భావగీతాలు కావని ఆధ్యాత్మికానందాన్ని కలిగిస్తాయి కనుక శతకాలనీ కాశీనాథుని నాగేశ్వరరావు పేర్కొన్నాడు. నిడదవోలు వెంకటరావు కోరాడ రామకృష్ణయ్య - దేశరీతి అన్నారు. సంస్కృత లక్షణాలు గ్రహించింది కనుక దేశి కాదని నిర్ణయించారు లాక్షణికులు. మరికొందరు దీనిని ఉపకావ్యమన్నారు. కొందరు ఖండకృతి అన్నారు.

శతాకాలు దేశి ప్రక్రియని రూఢి ఉంది. అయితే దీనికి సంస్కృత ప్రాకృతాలలోని అష్టక స్తోత్రాలతో ఉన్న సాదృశ్యమే దేశికాదని తెలుపుతుంది. ఆరంభంలో శతకాలన్నీ స్తోత్రాలే. ప్రక్రియను సంస్కృతం నుంచి గ్రహించినా ఆకృతిలో సామ్యంలేకపోవడం వల్లనూ సంఖ్యాభేదం ఉండడం వల్లనూ, తెలుగు స్వతంత్ర రచనా అన్నట్లు రూపొందింది.

సంస్కృతాంధ్రాలంకారికులు దీన్ని విశిష్ట కావ్య ప్రక్రియగా గ్రహించారు. శతకంలో ఆశ్వాస విభజన ఉండదు. దీనికి ముక్తకాదులలో చేర్చిన కారణాన ప్రతి పద్యం స్వతంత్రమై ఉంటుంది. పద్యకావ్య భేదం కనుక ఆ లక్షణాలు కొన్ని ఈ ప్రక్రియలో పొడసూపుతాయి.

సంస్కృత ప్రాకృత వాఙ్మయానికి ప్రతిబింబమై విశిష్ట లక్షణాలు సంతరించుకుంది ఆంధ్రశతకం.

'సర్గబంధో చినేయార్థం తద్వైవాఖ్యాయికా కథా

అనిబద్ధంచ కావ్యాది తత్పునః పంచధోచ్యతే' - భామహుడు.

సర్గబంధంలేనిది అనిబద్ధ కావ్యం. ఆ కోవకు చెందినదే. అమృతానంద యోగి తన 'అలంకార సంగ్రహము'లో స్తోత్రవాఙ్మయంగా ప్రసిద్ధి గాంచిన శతకం గూర్చి పేర్కొన్నాడు.

'అథచాటు ప్రబంధానాం లక్షణం కథ్యతే ధునా
ముక్తకం పద్యమే కంస్యాద్ద్వికం పద్యద్వయమే మతమ్
త్రికం త్రయేణ పద్యానాం పంచరత్నాని పంచరత్నకమ్
అష్టకం గజమాలాస్యాచ్చోడ శేందు కలామతా
గుప్త వింశతి పద్యాని నామ్నా తారావళి మతా
త్రింశతా త్రింశికా పంచశతా పంచిశికేష్యతే
శతేన శతకం ప్రోక్తమష్టోత్తర శతం పరమ్'.

అప్పకవి శతకాన్ని చాటు ప్రబంధం అన్నాడు. '..... శతకమను పేర కావ్య ప్రక్రియను పేర్కొనక సంఖ్యాను బద్ధమగు చాటు ప్రబంధము అను కావ్య భేదమును గ్రహించుట చిత్రముగా నున్నది. శతకమును విస్తృత పరిధిలో చేర్చుటలో అతడు తృప్తి పొందెనని తోచును'. (28)

తెలుగు సాహిత్యంలో ప్రధానంగా పాటింపబడిన లక్షణాలు.

1. సంఖ్యానియమం : సాధారణంగా 100 లేదా 108 పద్యాలుంటాయి. భక్తి శతకాలతో ఆరంభమైన సంఖ్య నియమం క్రమంగా సర్వసామాన్య లక్షణమైంది. 2 మకుట నియమం : అన్యాంకితం ఆత్మాకింతం/గా శతకాలుంటాయి. దానిని అనుసరించే మకుటం ఉంటుంది. పాదాంతాన మకుటం సామాన్యం. అరుదుగా పద్యారంభాన కూడా నిల్పారు. 3. ఛందో నియమం : ఆరంభ పద్యం ఏ వృత్తంతో ఉంటుందో దానితోనే

నడవాలి. 4. రస నియమం : ఏదో ఒక రసం శతకానికి తప్పనిసరి, ఆరంభంలో అధికంగా భక్తిరసంతో వెలువడ్డాయి. క్రమంగా శృంగార వీర హాస్యాదులు ప్రాధాన్యం పొందాయి. 5.ఆత్మాశ్రయ కవితారీతి : ఆత్మానుభూతే శతక విశిష్టత.

సామాన్యంగా ఉండే ఈ లక్షణాలనే కాక ఇతర ప్రక్రియల ప్రభావ కారణంగా కావ్యావతారికా సంప్రదాయమూ,ఆశ్వాసాది విభజనల వంటి మార్పులు ప్రవేశించాయి. శతక లక్షణాలు సమానమే అయినా భక్తి శృంగార వేదాంత నీతి అధిక్షేప కథాత్మకాది శతకాలకు ఆయా కోవలకు తగినట్లు లక్షణాలు నిర్దిష్టమయ్యాయి.

తెలుగులో ప్రథమ శతకం శివతత్త్వసారము, ప్రథమాంధ్ర శతకకర్త మల్లికార్జున పండితారాధ్యుడు. అని పాల్కురికి సోమనాథుని వృషాధిప శతకంలో కొనియాడబడింది. సుమతి భాస్కర దాశరథీ చౌడప్ప గవ్వలచెన్న నీతి శతకాలు తెలుగులో ప్రసిద్ధిగాంచాయి.

శతకాలు విశిష్టమైన ప్రక్రియ. ప్రాచీన కాలం నుంచి నేటి వరకు విభిన్నాంశాలకు ప్రాధాన్యమిస్తూ తన ప్రాముఖ్యాన్ని నిలుపుకొంది. 'చివరకు మనం అనాదర భావంతో చూసే విసనకర్ర చీపురుపుల్ల కుక్క మొదలైనవి కూడా శతకాలపు పుణ్యమా అని చిరంజీవిత్వం గడించాయి'. (30) తెలుగు శతక రచనలు విభిన్నాంశాలతో కూడి సంస్కృత తమిళ కన్నడ హిందీ వంటి భాషల కంటే ఎక్కువ వెలువడ్డాయి. అధికంగా అనువదింపబడ్డాయి.

1.2.1.10. నాటకం : దృశ్య శ్రవ్య కావ్యాలలో దృశ్యకావ్య కోవకు చెందినవి దశ రూపాలు. ఇందులో నాటకం ప్రథమం. ఉత్తమం. దశ రూపకాలను గూర్చి ప్రథమంగా పేర్కొన్నవాడు భరతుడు. ఈ నాటక లక్షణాన్ని గూర్చి భరతుడు నిర్వచించాడు.

'ప్రఖ్యాత వస్తు విషయం ప్రఖ్యాతోదాత్త నాయకం చైవ
రాజర్షి వంశ్య చరితం తథైవ దివ్యాశ్రయోపేతమ్
నానా విభూతి భార్యుతమృద్ధి విలాసాది భిర్గుణైశ్చైవ
అంక ప్రవేశ కాఢ్యం భవతి హి తన్నాటకం నామ
నృపతీనాం యచ్చరితం నానారభస చేష్టితం బహుధా
సుఖదుఃఖోత్పత్తి కృతం భవతి హి తన్నాటకం నామ'.

దీని భావం నాటకమున వస్తువు ప్రఖ్యాతోదాత్తుడు నాయకుడు. రాజర్షి వంశ్య చరిత్రమును, దివ్యాశ్రయోపేతమును, నానా విభూతి యుతమును బుద్ధి విలాసాది గుణ యుక్తమును, అంక ప్రవేశ కాఢ్యమును నాటకమును పేరనొప్పును. సుఖదుఃఖోత్పత్తి కృతమగు నానా రసభావ చేష్టితము బహువిధముల గల నృపతుల చరితము నాటకాఖ్యాబరగును'.(31)

భరతుడు ముఖ్యంగా ఇతివృత్తం నాయకుడు,గుణములు, అంకం గురించి చెప్పాడు. నాటకానికి ఉన్న లక్షణాలు వీటితో కలసి అనేకం.

1. నాంది : 'నందయతీతి నాంది' అని ఒక నిర్వచనం. ఆనందింపచేసేది నాంది అని అర్థం. ఇది క్రియా వాగ్రూపాలుగా ఉంటుంది. తెర వెనుక దేవతా పూజ ఆశీర్నమస్క్రియా రూపమైన మంగళాచరణ పూర్వక నాంది ముగియగానే సూత్రధారుడు ప్రవేశించి సభాముఖంగా నాంది శ్లోకం పఠిస్తాడు. ఇందులో ఎనిమిది కాని పన్నెండు కాని పద్దెనిమిది కాని ఇరవైరెండు కాని పదాలుండాలి. పదం అటే సుప్తిజంతం, పద్యపాదం, వాక్యాలలో ఏదైనా కావచ్చు. ఆశీర్వచన యుక్తంగా, దేవద్విజుల స్తుతి కలిగి ఉండాలి. మంగళాకరాలైన శంఖ చంద్ర అబ్జకోక కైరవాది పదాలు కాని, తత్సమాన పదాలు కాని ఉండాలి. ఏదో విధంగా చంద్రనామాంకితమై ఉండాలి. పరోక్షంగా ఈ శ్లోకంలో కావ్యార్థ సూచన జరగాలి.

2. ప్రస్తావన : దీనిని ఆముఖము, స్థాపన అని కూడా అంటారు. నాంది అనంతరం సూత్రధారుడు ప్రవేశించి నటి మారీష విదూషకులలో ఒకరితో నాటక కర్తను గూర్చి, సదస్సును గూర్చి, తమ ప్రదర్శనను గూర్చి చతురోక్తులతో ప్రస్తావిస్తాడు. నాటకం శృంగార వీర రసాలలో ఒక దానిని పోషించాలి. కనుక తదనుగుణమైన శరదృతు వర్ణన కాని, గ్రీష్మఋతువు వర్ణన కాని చేయడం ద్వారా రసాన్ని సూచించాలి. ఋతు వర్ణన అనంతరం పాత్రలను ప్రవేశపెట్టి సూత్రధారుడు తొలగిపోతాడు. ఈ పాత్ర ప్రవేశం ఐదు రకాలుగా జరుగుతుంది. శబ్దమో, తదర్థసామ్యం ద్వారానో ప్రవేశించడం కథోద్ఘాతం. ప్రవృత్త కాలనుగుణంగా చేసే వర్ణన ప్రకారం ప్రవేశించడం ప్రవర్తకం. ఇదిగో ఇతడు వచ్చుచున్నాడు అనే పలుకుల వెంట ప్రవేశించడం ప్రయోగాతిశయం. పదముల అర్థం పొందుపడనప్పుడు వాని అర్థం పొసగునట్లు ఇతర పదాలతో కూర్చడం ఉద్ఘాత్యకం. ఎక్కడ, ఒక ప్రయోగంలో సమావేశ కారణాన వేరొక కార్యం సాధించబడుతుందో అది అవలగితం.

3. అంకం : ప్రతి రచన కొన్ని భాగాలుగా విభక్తమవుతుంది. ఈ విభజన అంకం. 'ఏకైక దీన సంవృత్తమ్, ఏకసేతృ ప్రయోజనమ్ బహుపాత్ర ప్రవేశార్థమ్, అంకమాసన్న నాయకమ్'. (32)

ఒక రోజు జరిగిన వృత్తాంతం, ఒక నాయకుని ప్రయోజాపేక్ష, బహుపాత్రలు. ప్రతి అంశంలో నాయక ప్రవేశం కలిగి వుండాలి. ఈ అంకాలు నాటకంలో ఐదుకు మించి పదికి తగ్గక ఉండాలి. ప్రతి అంకంలో కథ - అది మధ్యాంతాలు - బీజబిందు కార్య దశలను సూచించేట్లు కొనసాగాలి. ఫలప్రయోజనాపేక్షకు అనుగుణమైన విస్తృతిని పెంపొందిస్తూ ఉండాలి. అంకంలో ప్రదర్శింప వీలుకానివి అర్థపక్షేపకాలలో సూచితమవుతాయి.

4.అర్థోపేక్షపకాలు : నాటకాన ఇతివృత్తం సూచ్యం, అసూచ్యం అని రెండు రకాలు. అసూచ్యాలు దృశ్యమానవుతాయి. సూచ్యాలు నాటక రంగాన ప్రదర్శితం కావు కనుక అర్థోపేక్షపకాలలో సూచింపబడతాయి. విప్లవాది అసంభావ్యాలు, వస్త్రధారణ ఆలింగనం వంటి అనుచితాలు, ప్రాణవధ వంటి ఉద్రేక జనితాలు రంగాన ప్రదర్శించరాదు. కనుక సూచించడం జరగుతుంది. ఈ సూచన ఐదు రకాలుగా జరుగుతుంది. విష్కంభము,

ప్రవేశికము, చూళిక, అంకాస్యము, అంకావతారము. విష్కంభ ప్రవేశికాలు ఒకే రకంగా కనిపించినా కొద్దిపాటి తేడాను కల్గి ఉంటాయి. అదే విధంగా అంకాస్య అంకావతారాలు విష్కంభ ప్రవేశికాలలో పాత్రధారుల సంభాషణ ద్వారా జరిగిన జరగబోయే అంశాలు సూచింపబడతాయి. ప్రవేశికము నీచ పాత్రలతోనూ, విష్కంభము మధ్యమ పాత్రలతోనూ నడుస్తుంది. చూళికలో ఆకాశభాషణం ద్వారా కాని, తెర వెనుక ఉన్న వ్యక్తి ద్వారా కాని కథ సూచింపబడుతుంది. అంకాస్యావతారికలలో అంకం చివరన, అందలి పాత్రలు రాబోవు అంకంలోని కార్యాన్ని సూచిస్తాయి. ఈ పాత్రలపై అంకారంభాన ప్రవేశిస్తే అది అంకావతారము, అట్లు కాక విభిన్న పాత్రలు ప్రవేశిస్తే అది అంకాస్యం. కథా గమనానికి భంగం కలగకుండా నిషిద్ధాలను సూచించడానికి నిర్దేశింపబడినవి ఈ అర్థోపేక్షపకాలు.

5. ఇతివృత్తం : ప్రఖ్యాత ఇతివృత్తం ఉండాలి. పురాణేతిహాసాల నుంచి గ్రహించాలి. అందునా రాజర్షి వంశీయులనే గ్రహించాలి. దివ్యాశ్రయోపేతమైన కథ ఉపకథ అని రెండు రకాలు ఫలప్రాప్తిని దృష్టిలో ఉంచుకొని ఏ కార్యాన్ని సామర్థ్యంతో రచయిత కల్పిస్తాడో అది అధికారికం.

'పరర్థస్య స్వార్థో యస్య్య ప్రసంగతః' (33)

ప్రధాన ఇతివృత్తానికి ఉపకారిగా ఉంటూ, స్వప్రయోజనాన్ని కూడా పొందేది ప్రాసంగికం. ప్రసంగ వశాన కాని, ప్రధాన ఫలప్రాప్తికి సహకరించేది కాని ప్రాసంగికం. నాటకంలో నటనకు వృత్తి అవసరం. సంభాషణలో భారతీ, సుఖదుఃఖ వ్యక్తీకరణలో సాత్వతీ, లలిత శృంగార భావాల అభివృద్ధికి కైశికి, దర్పార్భాటాలకు అరభటీ వృత్తులు అవసరం.

6. పంచ సంధులు : నాటకారంభం నుంచి ముగించే వరకు కథతో కలిసిపోయే కొనసాగే కార్యావస్థలు, అర్థ ప్రకృతుల కలయిక వల్ల పంచ సంధులు ఏర్పడుతాయి. కార్యావస్థలు ఆరంభ ముయత్నము ప్రాప్త్యాశ నియతాప్తి ఫలాగమము. అర్థప్రకృతులు బీజము బిందువు పతాక ప్రకరి కార్యము. యథాసంఖ్య కలయికవల్ల ఏర్పడిన పంచ సంధులు - ముఖ ప్రతిముఖ గర్భ నిర్వహణ అవమర్శ సంధులు.

ముఖ సంధిలో నాయిక నాయకులు పరస్పరాకర్షణ, ప్రతిముఖ సంధిలో అభిలాషను వ్యక్తం చేసుకొని సాధించేందుకు ప్రయత్నం, గర్భ సంధిలో ఆశ నిరాశల నడుమ అస్థిరత వ్యక్తం కాగా, ఫలోన్ముఖమైన కోరికకు విఘ్నం కలగడం అవమర్శ సంధి. కష్టాలు తొలగి ఫలాన్ని పొందడం నిర్వహణ సంధి. ఈ ఐదింటిని నిల్పుకొన్న నాటకమే, సంపూర్ణమైంది.

సంస్కృత నాటకానికి ఎంతో చరిత్ర ఉంది. లభిస్తున్న ప్రథమ నాటకం శారిపుత్ర ప్రకరణం. అశ్వఘోషుడు రచించినది. అయితే అధునిక ప్రక్రియగా తెలుగులో ప్రవేశించింది మాత్రం 17వ శతాబ్దంలోనే. ఈ నాటక ప్రక్రియ బహు ప్రాచీనమైందని, క్రీస్తు పూర్వం కొన్ని వేల యేండ్ల పూర్వమే దీనికి అంకురార్పణం జరిగిందని కొందరి వాదన. మరికొందరు ఇది 'కొరవంజి జక్కుల కథ యక్షగానం, వీధినాటకం, తోలుబొమ్మలాట, పగటి వేషాల

వంటి జానపద రీతులను దాటి సునిర్దిష్ట సాహిత్య ప్రక్రియగా తెలుగులో రూపొందింది'. (34)

అని అడపా రామకృష్ణారావు ఉవాచ. తెలుగులో ప్రథమ నాటకం మాత్రం 1860లో వెలువడింది. తెలుగు నాటకంమీద సంస్కృతాంగ్ల ప్రభావం కనిపిస్తుంది. ఇవి సంస్కృత లక్షణాలనే ఆరోపించుకొని, ఆంగ్ల ప్రభావ ఫలితంగా ఆంధ్రాన వెలువడ్డాయి. ఆంధ్ర భాషలో ప్రథమ నాటకం శ్రీ కోరాడ రామచంద్ర శాస్త్రి రచించిన మంజరీ మధుకరీయం. ఇది స్వతంత్ర రచన. స్వతంత్ర అనువాద రచనలు వెలువడ్డాయి. అనువాదమటు ఆంగ్లం నుండి ఇటు సంస్కృతం నుంచి గ్రహింపబడింది. ఈ రచనలన్నింటిలో ప్రధానంగా కన్పించేది పురాణేతిహాస సంబంధ కథా ప్రాముఖ్య నాటకాలు. తర్వాత చెప్పుకోదగ్గవి చారిత్రకాలు. అరుదుగా సాంఘిక నాటకాలు వచ్చాయి. రాజర్షి వంశ చరిత్రనే చెప్పాలి, అని భరతుని నిర్దేశం ప్రకారం పురాణేతిహాస కథను గ్రహించినా రాజు చరిత్ర మాత్రమే వర్ణితమయ్యేది. చారిత్రక నాటకాలలోనూ చరిత్రే. ప్రఖ్యాతేతివృత్తం అంటే ప్రఖ్యాతమైన కథను గ్రహించాలి. పింగళి లక్ష్మీకాంతం గ్రంథస్థమైనది మాత్రమేకాక, జన సమూహంలో ప్రసిద్ధి గాంచిన వ్యక్తుల చరిత కూడా ప్రఖ్యాతమే అని అట్టి వ్యక్తుల చరిత్రనాధారంగా నాటకాలు వెలువడచ్చుని విప్లవాత్మక సూచన చేశాడు. కనుక నాటకంలో రాజుల చరిత్రనే చెప్పాలి కాని, దివ్యులను గూర్చి కాదు. మానవ సంబంధమైన సుఖదుః ఖ విరహితంగా,నవరస శూన్యంగా ఉండే దివ్యులకు మానవ సంబంధ లక్షణాలను ఆరోపించడం తగదు కనుక వంశచరిత్రే చెప్పాలన్నారు. నాటకం అంటే చరిత్రే చెప్పాలన్నారు. కనుక నాటకం అంటే చరిత్రే.

అధునిక కాలంలో పౌరాణిక చారిత్రక నాటకాలు కాక సాంఘికనాటకాలు విరివిగా రాసాగాయి. ప్రజాదరణ పొందడానికి ముఖ్య కారణం ఇవి ప్రజాజీవనానికి దగ్గరగా ఉండి, సామాన్య మానవుణ్ణి ప్రతిబింబించడమే. సాంఘిక నాటకం వరకు సంప్రదాయ నాటక లక్షణాలను అవలంబించిన ప్రక్రియ సాంఘిక నాటకానికి వచ్చేసరికి ప్రయోగ మారంభించింది. సమకాలీన వ్యవస్థ, సహజ వ్యావహారిక భాష వాస్తవికత, విభిన్న ప్రాపంచిక దృక్పథాలు, తదనుగుణమైన పాత్రచిత్రణ ప్రదర్శనలో సాంకేతిక సహకారం వంటి అనేకాంశాలు వచ్చి చేరాయి. సంప్రదాయానికి పూర్తి భిన్నమైన విషాదాంతాలు వచ్చి నిల్చాయి. సమకాలీన సమస్యలు సంస్కరణోద్యమం వంటివి చోటు చేసుకొన్నాయి. నాటకం చరిత్రను చెప్పే స్థాయి నుంచి, సమకాలీన మానవుని జీవితాన్ని చిత్రించే స్థితికి చేరింది.

సంస్కృతం నుంచి ఇతిహాసం పురాణం యథారూపంలో అనువాద సూత్రం వల్ల తెలుగు సాహిత్యంలోకి వచ్చాయి. వాటి లక్షణాలు పూర్తిగా సంస్కృత మార్గంలోనే ఉన్నాయి. కథాకావ్యం రచనా విధానం సంస్కృతంలో ఉంది. అనువాదంగా అందింది. ఈ అనువాదం దర్శించిన ఆంధ్రులు స్వతంత్రంగా కథాకావ్య సృష్టి చేశారు. ప్రబంధం సంస్కృతంలో ఇదే విధానంలో లేదు. స్థూలంగా లక్షణాలు సంస్కృతంలో లభించాయి. కాని సాహిత్య నిర్మాణం తెలుగులో జరిగింది. నాటక రచనం సంస్కృతం నుంచి

సంక్రమించింది. అది ప్రాచీన కాలంలో తెలుగులో లేదు. ఆధునిక కాలంలోనే దాని అవతరణం జరిగింది. నాటకం మోదాంతంగానే సంస్కృత సంప్రదాయం అందించింది. విషాదాంతంగా నాటక రచనా విధానం పాశ్చాత్య సాహిత్యం సంపర్కం వల్ల సంక్రమించింది. తెలుగులో అనువాద నాటకం కానీ, స్వతంత్ర నాటకం కాని మోదాంత విషాదాంత నాటక సృష్టి కాని లేని రోజుల్లో ప్రదర్శన దృష్టితో, ప్రయోగబలంతో రూపం దిద్దుకొన్న నాటక ప్రత్యామ్నాయ సాధనం యక్షగానం. ఇది దేశి ధర్మ బోధకమే అయినా నాటక ధర్మాన్ని రూపక లక్షణాలను కలగలుపుకొన్న సాహిత్య ప్రక్రియ. శతకం సంస్కృత సాహిత్యంలో లభించే ప్రక్రియ. అయితే తెలుగు సాహిత్యంలో అది విస్తృత పరిధి ప్రవర్తకమయింది. చాటువూ దండకమూ సంస్కృత సాహిత్యంలో లభించే ప్రక్రియలే కానీ, ఆంధ్రంలో వాటి వ్యాప్తి సుప్రసిద్ధమయి సాంఘిక జీవన వ్యాఖ్యాన సమర్థంగా రూపొందాయి. ఉదాహరణం తెలుగులో వెలువడి సంస్కృతంలోకి సాగిన రచనా ప్రక్రియా సంస్కృత స్తుత్యాత్మక గుణ ప్రతీకగా గోచరమవుతుంది.

ఈ ప్రక్రియలో విషయాలను వస్తు దృష్టితో పరికించటం అవసరం. పురాణంలో దైవ సంబంధమైన విషయ ప్రాముఖ్యం ఉంది. నాటకం కూడా పౌరాణిక చారిత్రక నేపథ్యం తెలిపేదిగానే ఉంది. ప్రబంధ ఇతిహాస, పురాణ వస్తు వికృతి కలిగి ఉంది. కాబట్టి దైవత్వ చారిత్రక లక్షణాలనే తనలో నింపుకొంది. యక్షగానం ప్రదర్శనంలో రచనంలో దైవ విషయం, చారిత్రక విషయం, సాంఘిక విషయం కలగలసి ఏర్పడింది. శతకం శృంగరం స్థితిని దాటి భక్తి హద్దులు అతిక్రమించి, నీతి వైరాగ్య మార్గాలు తెలిపి ఉపదేశ రూపంలో సాంఘికంగా మానవ సమీపస్థంగా రూపం దిద్దుకొంది. కథాకావ్యం అద్భుత దృష్టిని అతీంద్రియ స్థితిని కలుపుకొని రాజుల, ప్రజల పరిధిలో పరిఢవిల్లింది. చాటువు భక్తి అయినా శృంగారమయినా కరుణమయినా సమకాలీన సాంఘిక జీవితం దర్శించేది అయింది. దండకం, ఉదాహరణం దైవస్తుతి, రాజస్తుతి పరిధిలో సాగాయి.

ఈ ప్రక్రియా దర్శనం వల్ల సాహిత్య వస్తువు దైవం దైవతత్త్వం కలది గాను రాజు చరిత్ర, చారిత్రక పరిణామం వివరించటం గానూ, అద్భుతాల వల్ల ప్రజల జీవితం పరికించే వినోదాత్మకంగానూ ఉండటం సంభావించవచ్చు. విషయం పరిధి ఇంతకంటే విశిష్టంగా ఉండటం వాంఛనీయమే. పాశ్చాత్య సాహిత్య ప్రక్రియల ప్రాదుర్భావంతో తెలుగు సాహిత్యంలో ఏదైనా నూత్నకోణం ప్రవేశించేదేమో పరిశీలింపవచ్చు.

**1.2.2.** ఆంగ్ల ప్రక్రియలు : ఆంగ్ల సాహిత్య ప్రక్రియలు సాహిత్యంలో ప్రవేశించి నూత్న రచనా మార్గం ఏర్పడటానికి కారణభూతమయ్యాయి. ముఖ్యంగా తెలుగు వచన సాహిత్య విజృంభణకు ఆంగ్ల సాహిత్య ప్రక్రియలు దోహదం చేశాయి. తెలుగులోని ప్రాచీన సాహిత్యం పట్ల ఆధునికంగా ఆలోచించే స్థితికి అవకాశం ఆంగ్ల సాహిత్యం కలిగించింది. సాహిత్యం తెలుగులో అవతరించడానికి పాశ్చాత్య సాహిత్య ప్రభావం దోహదం చేసింది. వచన ప్రక్రియలలో కూడా కొత్త కోణం ఏర్పడింది.

తెలుగు కవిత్వంలో మనుపెన్నడూ లేని నూత్న రచనా రీతులు ఆధునిక యుగంలో ఆరంభమయ్యాయి. ప్రాచ్యనాటక సంప్రదాయం భిన్నంగా పాశ్చాత్య ప్రభావంతో

విషాదాంత నాటక సాహిత్యం తెలుగులో అవతరించసాగింది. వచనంలోనే విశేష కల్పనాత్మక సాహిత్యం నవలా కథానికా ప్రక్రియా గతంగా లభించనారంభించింది.

కొత్త ప్రక్రియలు నూత్న సాహిత్యానికి మార్గం ఏర్పర్చినప్పుడు వెలువడ్డ సాహిత్యంలోని ఇతివృత్తాలలో మార్పు అనివార్యం. ఈ ఇతివృత్తాలలో మునుపెన్నడూ లేనంతగా సమకాలీన జీవన విధానం పెరగసాగింది. ఈ కోణం మరింత బలం పుంజుకొని సమకాలీన జీవితం అంటే వర్తమానంలోని సాంఘిక జీవితం సాహిత్యంలో ఇతివృత్తాలుగా రూపం దిద్దుకోసాగాయి. అందువల్ల ఈ నూత్న ప్రక్రియలు నూత్న సంఘములోని క్రొత్త మార్గాలకు సాహిత్య సమన్వయం సాధించే దృష్టితో విస్తరించాయి. ఈ ఇతివృత్తాల క్రోడీకరణం వల్ల, విశ్లేషణ వల్ల, వస్తు దృష్టి విశాలమవుతుంది. దీని మూలంగా దాని మూలంగా ఆంగ్ల సాహిత్యం ప్రక్రియలు సాధించిన వస్తు పరిణామం గమనింపవచ్చు. ప్రపంచ వ్యాప్తంగా వచ్చిన ఉద్యమాలు ఏ దేశంలో జరిగినా, ఆ దేశానికి పరిమితం కాక అన్ని దేశాలలో ప్రతిధ్వనించటం వల్ల, అన్ని దేశాల సాహిత్యం ఆ ప్రతిధ్వనుల్ని ఆలంకించింది. తెలుగు సాహిత్యం ఈ జాగృతికి దూరంగా లేదు. సమకాల సమాజంలోని మార్పులు సాహిత్యంలో ఇతివృత్తాలుగా, వస్తువుగా పరిణామం చెందటం పాశ్చాత్య సాహిత్య ప్రభావం తెలుగు సాహిత్యం గుర్తించింది. ఈ గుర్తింపు వల్ల ఏర్పడ్డ నూత్న వస్తు దృష్టి పరిశీలనార్హం.

ప్రస్తుతం అధునికాంధ్ర కవిత్వంలో నూత్నంగా ప్రవేశించిన రీతులు వాటి సామాజిక నేపథ్యం నుంచి గుర్తించి గ్రహించటం అవసరం. వర్తమానంలోని కవిత్వం ప్రపంచం అంతటా ఈ ధోరణుల్ని ముందు వెనుకలుగా అందించింది.

1.2.2.1. సంప్రదాయవాదం (Classicism) : సాంప్రదాయిక కళ విషయ నిష్టం. బాహిరాకారం, బాహ్యసౌందర్యం ప్రధానమే. ఈ సౌందర్యానికి అవయవానురూపత, సమతాపాదన, క్రమత సంయమనం ధర్మాలు. సరళత్వం ఋజుత్వం ఉదారత సంపూర్ణతలు దీని గుణాలు. భావోపకరణాలకు సమ్యక్ సమైక్యం ఉంటుంది. ఇందులో వ్యవస్థకున్న ప్రాధాన్యం వ్యక్తికి ఉండదు.

సంప్రదాయం అంటే గతం నుంచి సంక్రమించి ప్రస్తుతం అనుసరించబడే విశిష్ట జీవన సూత్రం. పూర్వం మతం ఆధారంగా సంప్రదాయం ఏర్పడి అనేక శతాబ్దాల అనంతరం దానిని ధిక్కరించి నిలబడడం గమనింపవచ్చు. ఈ సంప్రదాయం బలపడే కొద్దీ సాహిత్యానికి మౌలిక లక్షణాలను చేకూరుస్తుంది. ఎన్ని మార్పులు సాహిత్యంలో వచ్చినా సంప్రదాయాన్ని సమూలంగా తుడిచిపెట్టుకుపోవడం జంగదు. 'ప్రాథమిక ప్రయోగం నుంచి పరిణత ప్రయోగం దాకా పరిణతి సాధించే పద్ధతి .... సంప్రదాయ మార్గమని'(35) అంటారు. 'ప్రాచీన సంప్రదాయానుసరణము, సమిష్టితత్వము నియమబద్ధత మేథో ప్రసన్నత స్తబ్ధత యనునవి క్లాసిజమ్ లక్షణాలు'.(36)

కవితోద్యమాలు ప్రాచీన రచనా విధానాలను తొలగిస్తాయి. ఈ కాలంలో సమానంగా నూతన విధానాలను అనుసరించక తెలుగు సాహిత్యారంభం నుంచి కొన్ని

శతాబ్దాలుగా నిల్చి ఉన్న ఇతివృత్తాలను, ఆ ప్రక్రియా రూపాన, నాటి ఛందోలంకారాది విశేషాలతో రచించడమే సంప్రదాయం. నాటి సంప్రదాయాన్ని నేటికీ మరువక వాటినే సమకాలంలో ప్రతిష్ఠింప చేయడానికి యత్నించడం సంప్రదాయకత. వారినే సంప్రదాయక రచయితలని, వాటినే సంప్రదాయ భావాలను ఆధునిక ప్రక్రియా రీతిలో నిల్పవచ్చు.

1.2.2.2. నవ్య సంప్రదాయవాదం (Neo-Classicism) : నవ్య సంప్రదాయ కవుల్ని నవీన ఐతిహాసిక కవులని, ఈ రచనా మార్గాన్ని నవీన ప్రబంధోద్యమమనీ, నవ్యకావ్య దృక్పథమనీ అంటారు. ఒకనాటి పాత మరోనాటి క్రొత్త అనేది దీనికి నిదర్శనం. సంప్రదాయాలు నూతన ప్రయోగాల ఒరవడిలో మరుగవుతాయి. నూతన ప్రయోగాలలో నవ్యత కనుమరుగు కాగానే ప్రాచీనతలోని కొత్తని చూడడం, కొంత క్రొత్తదనాన్ని ఆపాదించి పాతను గ్రహించడం పరిపాటి. ఇదే నవ్య సంప్రదాయ వాదం.

19వ శతాబ్దం దాకా సంప్రదాయవాదంతో వివిధ ప్రక్రియలు వచ్చాయి. పిమ్మట పాశ్చాత్య ప్రభావంతో అనేక ప్రక్రియలు ధోరణులు వచ్చాయి. దీనితో సంప్రదాయం మరుగు కాసాగింది. అది సహించలేని వారెందరో దాన్ని పునరుద్ధరించ యత్నించారు భాషా భావ ఛందో విషయాలలో - జయంతి రామయ్య పంతులు, కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి వంటివారు చెప్పుకోదగ్గ వారు.

'కాల్పానిక కవితాయుగ చైతన్యం నుంచి విడివడి విశ్వనాథ సత్యనారాయణ గారు 1933-34 ప్రాంతంలో శ్రీ మద్రామాయణ కల్పవృక్షం రచించటం ప్రారంభించిన నాటినుండి నవ్య సంప్రదాయోద్యమం ప్రారంభమైనట్లు విమర్శకులు భావిస్తున్నారు'.(37)

కాని 1882 నుంచి ఎక్కువ ప్రాచుర్యం పొందింది. నేటికి ఇది సాహిత్యంలో కనిపిస్తుంది... 'ఆదర్శ రూపం నుండి ప్రక్రియా వైవిధ్యాన్ని సాధించే ప్రయోగాలను నిర్వహించే పద్ధతి నవ్య సంప్రదాయం మార్గము' (38)ని అంటారు.

'పేరు గాంచిన ప్రాచీన రచయితల రచనలాధరంగా కొన్ని సాహిత్య సిద్ధాంతాలను సూత్రాల నేర్పర్చుకొంటారు. వాటినాధారం చేసుకొని రచించేవి నియోక్లాసికల్ రచనలు. సంప్రదాయవాద సముద్ధరణమే నవ్య సంప్రదాయం. నిజానికి సంప్రదాయవాదం కొత్త వాదం కాదు. సంప్రదాయ వాదానికి పునర్ యౌవనం ప్రసాదించే వాదమిది. సంప్రదాయవాదం గతం. వర్తమానంలో కూడా ఉపయోగకరంగా ఉండగలగేట్టు చేయగలిగేది నవ్య సంప్రదాయవాదం. ఆ ఉండే స్థితిని ఆధునికులు కూడా అంగీకరించేటట్టు చేయటానికి కొత్తరూపం, కొత్త భావం కొత్త మార్గం కొత్త దృక్పథం ఏర్పరచుకొంటుంది.

1.2.2.3. కాల్పానికవాదం (Romanticism) : ఇంగ్లండులో ఆరంభమైన కాల్పనికోద్యమంపై రూసో ప్రతిపాదించారు స్వాభావికతా పునర్ధరణ వాదం, మానవతా వాదం ప్రభావం చూపాయి.

Dr. F.H. Hedge 'It is the sense of something hidden of imperfect relevation'.

Prof. Boyensen '... Romantic poetry invariably deals with longing... not a definite desire but a dia, mysterious aspiration'.

'కాల్పనికోద్యమం ప్రభావంతో వచ్చిన కొత్త కవిత్వానికి శ్రీ రాయప్రోలు సుబ్బారావు 'అభినవ కవిత్వం' అని పేరు పెట్టారు. తర్వాత ఇది 'భావకవిత్వము'గా చలామణి అయింది. (39) దీనిలో ప్రకృతి ప్రణయం ప్రబోధం ప్రాముఖ్యం పొందాయి. భావకవిత్వ శాఖలు ఆత్మాశ్రయ రీతిని దేశభక్తిని ప్రకృతి కవిత్వాన్ని సంఘ సంస్కరణ కవిత్వాన్ని భక్తి కవిత్వాన్ని స్మృతి కవిత్వాన్ని తనలో నింపుకొంది. 'సంప్రదాయ నిరసనము, వ్యష్టి తత్త్వము, నియమ రాహిత్యము, హృదయ స్పందకత, ఆవేగము రోమాంటిసిజమ్‌కు లక్షణములు'.(40)

లక్షణాలు : 1. ఖండ కావ్య ప్రక్రియా రూపాన కవిత్వం వెలువడడం.

2. ఆత్మాశ్రయ రీతి : ఆత్మాశ్రయ రీతిలో ఉన్న కవిత్వం భావకవిత్వంలోనే రాణించింది. అగ్రశ్రేణి స్థాయిని పొందింది.

3. వస్తు నవ్యత : వస్తు నవ్యత బాహ్య వర్ణనలు కాక అంతరంగ వర్ణనలో ఆలోచనా శక్తిని పెంపొందించే విధానంలోనూ వ్యక్తం అయింది.

4. భావ నవ్యత : హృదయాన్ని కదిలించగల శక్తి ఉన్న ప్రతి భావమూ చోటు చేసుకొంది.

5. శైలీ నవ్యత : క్లిష్టత లేకుండా రచన సాగింది.

6. పదప్రయోగం : వ్యవహారంలో లేనివి అనవసరాలు తొలిగాయి. సమకాలీన పద ప్రయోగాలే నిలిచాయి. మాండలికాలకూ ప్రవేశం లభించింది.

7. దేశి కవిత : మాత్రా ఛందస్సుకు ప్రాధాన్యం లభించింది.

8. ప్రక్రియా బాహుళ్యం : భావ కవిత్వాన్నే ప్రకృతి పల్లీజన దేశభక్తి సంఘ సంస్కరణ భక్తి కథా కవిత్వాలు స్మృతి గీతాలు బాలగేయాలుగా ఎన్నో ప్రక్రియలుగా కనిపిస్తుంది.

1.2.2.4. మార్క్సిజం : మార్క్స్ లక్ష్యాలు ప్రాణంగా ఆవిర్భవించింది. అభ్యుదయ కవితా ధోరణి. మార్క్స్ వాదాన్ని జీర్ణించుకున్న కవులే అభ్యుదయ రచనలను చేశారు. మార్క్సువాద మూల సూత్రాలు ఇవి.

1. ఈ వాదంలో ఆధ్యాత్మికతకు చోటు లేదు. కేవలం భౌతికం. ఇది భౌతికవాదం. భావ వాదానికిందులో తావు లేదు. 2. వర్గ సంఘర్షణలు : గతితార్కిక భౌతికవాదం దీని ప్రాణం. తన్మూలంగా రూపొందించిన వర్గసంఘర్షణ ఇందులో ప్రముఖాంశం. 3. శ్రామిక వర్గాధిక్యం 4. ఆర్థిక సమానత్వం ప్రధానంగా కనిపిస్తాయి.

లక్షణాలు : 1943లో అభ్యుదయ రచయితల సంఘ స్థాపనతో కవిత్వం విజృంభించింది. మార్క్సిజాన్ని ఆధారం చేసుకొని ఏర్పడిన కవిత్వ ప్రధాన లక్షణాలు.

1. వర్గ సంఘర్షణ : గత నిరసనము, బూర్జువా వ్యవస్థ తిరస్కారం ఉన్నాయి. శ్రామికులను దోచుకొనే పెట్టుబడిదారీ సమాజాన్ని నిరసించారు.

2. విప్లవ ప్రభోదం : బూర్జువా వ్యవస్థలోని శ్రామికస్థితిని గమనించి వారిని ప్రేరేపింపచేసే ప్రయత్నం చేశారు. అణచివేతను ఎదురుకోవాలంటే సార్వజనీన విప్లవం రావాలన్నారు.

3. వీరగాథా కథనం : బూర్జువా వ్యవస్థ నెదిరించి వణికించి ప్రాణాలను త్యాగం చేసిన విప్లవ వీరులను గూర్చి గేయాలు రాశారు. గానం చేశారు.

4. యుద్ధ విముఖత శాంతి ప్రియత : 'అభ్యుదయ కవులు గెరిల్లా పోరాటమును చిత్రించినంత మాత్రమున వారిని యుద్ధ ప్రియులని భావించుటకు వీలులేదు. సామ్రాజ్యవాదులకు ప్రజాపీడలకు విరుద్ధముగా జరిగెడి పోరాటములను తిరుబాటులను వీరు సమధికోత్సహముతో చిత్రించిరి'. (41)

5. సమసమాజ నిర్మాణం : ఆకలి దారిద్ర్యాలు, అసమానతలు లేని సమ సమాజాన్ని కాంక్షించారు.

1.2.2.5. ట్రాజెడి : క్రీ.పూ. 5వ శతాబ్దంలో ట్రాజెడీ అనే ఒక సాహితీ ప్రక్రియ గ్రీసు దేశంలో ఎక్కువగా వ్యాప్తిలో ఉండేది. ట్రాజెడీ రచించిన వారిలో ఇస్కిలిస్, సోక్లిస్, యూరిపిడిస్‌ల రచనలే లభ్యమవుతున్నాయి.

గ్రీసు దేశీయులు డయోనిసస్ అనే దేవతనారాధించేవారు. సస్యానికి మద్యానికి అమె ఆరాధ్య దేవతం. ఆ దేవత ప్రీతి కోసం ఆనందోద్రేకాలతో ప్రజలు పాటలు పాడుతూ జాతర చేసేవారు. దానిని పాటలే ట్రాజెడి ప్రథమ దశను తెలుపుతున్నాయి. '..... ప్రీతి పాత్రములైన మేషముల వేషములు ధరించి ఆ ప్రజలు నృత్య సహకృతముగా చేసిన బృందగానము ట్రాజెడికి మాతృక యందురు. అసలా మాటకర్థము మేషగీతమనియే'.(42)

క్రమంగా ఇది బృందంగానూ, పూర్వలిఖిత గేయం పాటగానూ మారాయి. ఒక బృందగాన నాయకుడు ఏర్పడ్డాడు. మాస్కులు ధరించటం, అభినయించడం క్రమంగా చేరి కేవలం నృత్యగాన రూపానున్న డితిరాంబు క్రమంగా నాటకీయతను సంపాదించుకొంది.

"Tragedy then, is an imitation of an action that is serious, complete, and of a certain magnitude; in language embelished with each kind of artistic ornament, the sevral kinds being found in seperate parts of the play; in the form of action not of narrative; through pity and fear effecting the proper purgation (Catharsis) of these emotions". (Butcher)

2. Tragedy is then an imitation of a noble and complete action; having the proper magnitude. It employs language that has been artistically enhanced by each of the kinds of linguistic adornament, applied sperately in the various parts of the play. It is presented in dramatic, not

narrative form achieves through the representation of the pitiable if fearful incidents, the catharsis of such pitiable and powerful incidents'. (Leon Golden).

3. 'ఉదాత్తమును స్వయం సంపూర్ణమైన, సముచిత పరిమాణము కలిగియున్న లోకవృత్తము యొక్క (కార్యమును) అనుకరణమే ట్రాజెడి అనబడును. అందు తాళ స్వరయుత గీతాలంకృతి విశిష్టమగు భాష ఉపయోగింపబడును. కొన్ని భాగములు కేవలం ఛందో బద్ధములు కాగా, మరికొన్ని భాగములు గేయ నిబద్ధమునగును. అది అఖ్యాన రూపమును గాక నాటికేయముగ ప్రదర్శింపబడును. శోక భయముల వలన ఆ భావములకే సముచిత క్షాళనము కలుగునట్లు చేయును'.(43)

అరిస్టాటిల్ అభిప్రాయంలో ట్రాజెడి విషాదాంతం కానక్కర్లేదు. విషాదకర ఘట్టాలు సంఘటనలు ఉంటే చాలు. కాలక్రమాన ట్రాజడీ అంటే విషాదాంతమనే అభిప్రాయం నిల్చిపోయింది.

అరిస్టాటిల్ చెప్పిన లక్షణాలు

1. ఇతివృత్తం : ట్రాజెడికిది ప్రాణం. ఏక కార్యనిష్ఠమై ఉండాలి. సంకీర్ణ ఇతివృత్తం మేలు. నాయకుడు ధీరోదాత్తుడు, సత్పురుషుడూ సర్వగుణ శోభితుడు కాదు. పొరపాటు పడడం ఆపదల పాలవడం మానవ సహజం. వ్యక్తి లోపమే వ్యక్తిత్వ పతనానికి కారణం. వ్యక్తి కథాపరంగా పరాజయాన్ని పొందినా నైతికంగా ఘనవిజయం పొందుతాడు. ప్రేక్షకుల సానుభూతి పొందుతాడు. సాధారణ మానవునిలా పొరపాటు చేస్తూ కష్టాలపాలై శోకాన్ని కల్గిస్తాడు.

2. పాత్ర : పాత్రలో Goodness, appropriateness, likeness, consistency ఉండాలి.

3. భావం : సందర్భోచితంగా సంగతంగా ఉన్నదాన్ని చెప్పగలగడం ఒక ఫలాన్ని సాధించాలి అనే నిశిత యోజన సామర్థ్యం.

4. భాష : వ్యావహారికం ఉపయోగించకూడదన్నాడు. 8 రకాల పదజాలాన్ని చెప్పాడు. అందులో.వ్యవహారికం కాని దానికి ప్రయోగార్హత ఉండన్నాడు.

A standard word
A strange word
Metaphor
An ornamental word
A coined word
A word lengthend
A word shortened
An altered word'

5. రంగ ప్రసాధనం ప్రాధాన్యమధికంగా లేదు.

6. గానం విశేష ప్రభావ ప్రాధాన్యాలున్నాయి.

'కథైక్యము, స్థలైక్యము, కాలైక్యము అనునవీ ఐక్యత్రయము పాటింపబడవలెను, నాటక చర్య వస్తు నిర్మాణం నుండి సహజముగను, యుక్తి సహగమును, ఉద్భుధమైనట్లుండ వలెను. వస్తు నిర్మాణం విధిగా అంగాంగి భావ నిభిడ బంధముగా నుండవలెను. నాటక చర్య నుంచి శక్తిని సాధించవలెనన్నచో నాటక కర్త కాలైక్యము పాటించి తీరవలెను. చర్యకాలమెంత స్వల్పమైన అంత మంచిది'. (44)

ట్రాజడీలో కార్యం అతి దీర్ఘం అతి హ్రస్వం కాక ఆది మధ్యాంతాలు కార్యకారణ సమన్వితమై ఉండి ఒక రోజులో ఇమిడేటట్లు ఉండాలి.

అరిస్టాటిల్ శృంగార హాస్య కరుణ ఉద్ధత రసాలను పేర్కొంటూ శృంగారంలో క్షాళనం చేయదగినంత మాలిన్యం ఉండదన్నాడు. ఉద్ధత రసమైన భయానకాన్ని కరుణ రసం ద్వారా ట్రాజెడి, హాస్యం ద్వారా కామెడి జనిస్తుందన్నాడు.

ఇది సామాజికునిలో ఒక నైతిక ప్రయోజనాన్ని కలిగిస్తుంది. ట్రాజెడి సామాజికుని భయభ్రాంతుని చేసి, కరుణను జనింపచేసి చివరకు ఆ భావాలను క్షాళనం చేస్తుంది.

1.2.2.6. నవల : నవల అనే ఆంగ్ల పదం Novella అనే ఇటాలియన్ పదం నుంచి వచ్చింది. ఆధునిక కాలంలో ప్రసిద్ధి పొందిన సాహిత్య ప్రక్రియ ఇది. సమకాలీన సాంఘిక జీవిత చిత్రణకు అధిక అవకాశం కల్గిన ప్రక్రియ. ఇందులో చర్చకు చోటు చేసుకోని అంశమంటూ లేదు. అంతటి విస్తృతి కల్గి ఉంది.

సంస్కృతంలో 'నవాన్ విశేషాన్‌లాలి, గృహ్ణాతీత్ నవలా' అన్నారు. The novel is not a transcript of life; to be judged by its exatitude; but a simplication of source side or point of life, to stand or fall by its significant simplicity' - R.L.steven Son.

'యదార్థ జీవనాన్ని యదార్థ దృష్టితో అధ్యయనం చేసి దానిని గద్యరూపంలో వ్యక్తం చేసేది నవల' - రిచర్డ్ క్రాస్.

'సజీవమైన జగత్తులో పరిచయం చేసే కళాకృతి నవల. చాలా విధాల యీ జగత్తు మన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని పోలి ఉంటుంది.' -లార్డ్ డేవిడ్ సెసిల్.

పాశ్చాత్య నవలలో ముఖ్యంగా ప్రణయ కథలు, సాహస యాత్రలు, అద్భుత కథలు ఉన్నాయి. 18వ శతాబ్దం నుంచి విస్తృత వ్యాప్తి చెందుతూ వస్తున్న నవల తెలుగులో ఎంతో వైవిధ్యాన్ని పొందింది. సాంఘిక చారిత్రక మనస్తత్వ దర్శనాత్మక మనోవిశ్లేషణాత్మక అపరాధ పరిశోధనాత్మక చైతన్య స్రవంతి వంటి నవల అనేకం.

రచయితకున్న జీవితానుభవం సూక్ష్మ పరిశీలనా శక్తి, ఆలోచనా నిశితత, సామాజిక నేపధ్యం, సమాజ పోకడలకనుగుణంగా తలెత్తే అభ్యుదయ విప్లవ ధోరణలును అర్థం చేసుకునే శక్తి నవలా రచనకెంతో తోడ్పడుతుంది. నవలా రచనకు ప్రత్యేక నియమం అంటూ లేదు.

1. వస్తువు : '... అను నిత్యము మనకాసక్తి జనకమైన విశాల విశ్వమానవ జీవిత గమనమున గల సుఖదుఃఖములు, నరనారీ సాధన మార్గములు అందులో వారు పడు యాతనలుమున్నగు వాని పాదు నుండి బాహిరిల్లిన వస్తువులను కలిగియుండునది గొప్ప నవలనిపించుకొనును'. (45) వస్తువు ఏక కృతిగా కాని సంకీర్ణంగా కాని ఉండవచ్చు. కాని కథకీ కథనం మాత్రం సమర్థవంతముగా ఉండాలి.

2. కథాకథనం : కథాకథన సామర్థ్యం ఒక్కొక్క రచయితకొక్క రకంగా ఉంటుంది. కొందరు జరిగిన సంఘటనల క్రమంగా చెప్తే ఇంకొందరు సంఘటన చెప్పిన దానికి దారితీసిన కారణాలు (flash back) వ్యక్తం చేస్తారు. ఏ విధానమైనా రచయిత చెప్పే తీరును బట్టి కథాకథన చాతుర్యం ఆధారపడి ఉంటుంది.

3. పాత్రచిత్రణ : రచయిత ప్రత్యక్షంగా పాత్రలను వర్ణించడం పాత్రల పరస్పర చర్చల భాషణలలో పరోక్షంగా పాత్ర చిత్రణ జరగడం పాత్రలను గూర్చి తెల్పే రెండు మార్గాలు.

4. సంభాషణ : సంభాషణలెప్పుడూ పాత్రోచితంగా, సందర్భానికి తగినట్లుగా సహజంగా సజీవంగా ఉండాలి. వాస్తవికతకు దగ్గరగా పాత్రోచిత భాషను ప్రయోగించడం సహజత. సంభాషణ కథాగమనానికే కాదు పాత్రల మనస్తత్వావిష్కరణకూ మార్గాలే.

5. కథాకాలం : రంగం ఎప్పటిదైనా, ఎక్కడిదైనా కావచ్చు. ఆధునిక ప్రాచీన వేద కాలపు నాటివి కావచ్చు. ఆధునిక సమాజం, దేవలోకం ఏదైనా రంగం కావచ్చు. అయితే గ్రహించిన వస్తువు కనుగుణంగా ఈ రెండూ గ్రహించాలి.

6. వర్ణనలు : రచనకివి ఎప్పుడూ సౌందర్యం హేతువులే. నాటుకొనేట్టు విషయం చెప్పడానికి తగిన మార్గం. దీనికి అలంకారాలు ముఖ్యంగా స్వభావోక్తి వంటివి నవలలో తోడ్పడతాయి.అయితే భాష సరళంగా ఉండాలి. దీర్ఘ సమాసాలవల్ల భాషా కాఠిన్యం వస్తుంది.

7. శైలి : అఖ్యాన వర్ణనాత్మక సంవాద శైలి అత్యవసరం. పాత్రచిత్రణకు సంవాదశైలి అవసరం. ఈ రెంటికీ సమన్వయం కుదిర్చేది వర్ణనాత్మక శైలి. ఆద్యంతం చదివించగల శక్తి శైలీ చమత్కార మహిమ.

8. జీవిత దర్శనం : మిగిలిన అన్ని ప్రక్రియల కంటే నవలకే సమాజంతో సంబంధం ఎక్కువ. అధికుల మనస్తత్వాలను, అనేకులకు కష్ట సుఖాలను, పలువురి జయాపజయాలను, మానవ జీవితాశయాదర్శావేశాలు అన్నీ నవలలో ప్రతిబింబిస్తాయి. ఒక రీతినో ఒక జీవిత సత్యాన్నో నవలలో వ్యక్తం చేయడానికిది సహకరిస్తుంది.

తెలుగులో 19వ శతాబ్దపు ఆరంభంలో ప్రవేశించింది ఈ ప్రక్రియ. మొదటి వల నరహరి గోపాల కృష్ణమచెట్టి 'రంగరాజు చరిత్రము'.

1.2.2.7. కథానిక : ప్రపంచ సాహిత్య ప్రక్రియలో అత్యంత ప్రాచుర్యం పొందిన ్రక్రియ కథానిక. ఏ వస్తువును గ్రహించినా ఏ జీవిత కోణాన్ని గ్రహించినా దాని వైఖరిని ట్టి ఒక నిర్ణయం చేయడమో వ్యాఖ్యానించడమో జరుగుతుంది.

'కథా కల్పిత వృత్తాంతా సత్యార్థ 2 ఖ్యాయికామతా' శివతత్త్వ రత్నాకరము.

'అఖ్యాయికా కథాఖండ హరికథ తథా కథానికేతీ మస్యంతే గద్య కావ్యంచ ంచధా!' అగ్ని పురాణం.

'భయానకం సుఖపరం గర్భేచ కరుణారసః'

'అద్భుతోంతే సుక్లపార్శ్వా నోదాత్త సా కథానిక' అగ్ని పురాణం.

'A short story is a prose narrative, requiring fiom half an hour to ne or two hour in its perusal'. - Edger Allen Poe.

లక్షణాలు : కథానికలో భావించిన వస్తువును మనస్సుకు హత్తుకునేలా ేయగలగాలి. దీనిలో వస్తు నిర్వహణకు అవకాశం తక్కువ. ఉత్కంఠత ఆద్యంతాలు ులవాలి. ఎత్తుగడకు పూర్వపు కథ ముగింపు తర్వాతి జీవితం కథానికలో చర్చించడం ురగదు.

1. ఎత్తుగడ : కథా హృదయ ప్రవేశద్వారం ఎత్తుగడ. కథానికారంభం ఎప్పుడూ ుత్కంఠ భరితంగా, సంభ్రమం కల్గించే విధంగా ఉండాలి.

2. ఇతివృత్తం : ఒక అంశం ప్రధానంగా ఉండాలి. అది సన్నివేశమో, ంఘటనో, జీవితకోణమో అయి ఉంటుంది. ఉదాత్తంగా ఉండి, వస్తువు పెంచడానికి ందించడానికి వీల్లేని తీరులో ఉండాలి. form (రూపం), substance వస్తువు, if ossible fantasy (వీలైతే కల్పన) ఉండాలంటే అగ్ని పురాణకర్త క్లుప్తత,అనుదాత్త థాదిలో భయానకం, కథామధ్యంలో కరుణ, కథాంతంలో అద్భుతం ఉండాలన్నాడు.

కవిత్వం, విషాదాంతం, నవల, కథానిక ప్రక్రియలను మాత్రమే పరిశీలించటం ురిగింది. వ్యాసం, విమర్శనం, జీవిత చరిత్ర, స్వీయ చరిత్ర పరిశోధనం వంటివి అనేక ప్రక్రియలు ఆంగ్ల ప్రభావం వల్ల సంక్రమించినా వాటిని ప్రస్తావించలేదు. కారణం సృజన ప్రక్రియలనే గ్రహించటం వల్ల. విమర్శన ప్రక్రియలలో కంటే సృజన ప్రక్రియలలోనే, ఇతివృత్తం ఉండటానికి కల్పనాత్మక చేరటానికి, కథాంశం రూపొందటానికి, వస్తుతత్త్వం గోచరం కావటానికి అవకాశం ఉంటుంది.

విషాదాంతం నాటకం వల్ల మృత్యు విషయంలో సహృదయుడి దృక్పథం విశాలమయే అవకాశం ఉంది. గతానికి వారసత్వంగా సంప్రదాయ నవ్యసంప్రదాయ వాదాలు విలసిల్లుతూ ఉండగా భవిష్యత్తు మీద ఆశను ఆకాంక్షను కాల్పనిక వాదం మార్క్సు కవితావాదం కలిగించాయి. వర్తమాన మానవుడి జీవితం వ్యాఖ్యానించటానికి ఈ ప్రక్రియా సాహిత్యంలో అవకాశం గోచరమవుతుంది. పూర్వం తెలుగు సాహిత్యంలో

ఇంతగా సమకాలీన సమాజ జీవితానికి సాహిత్య వస్తువు అయ్యే అవకాశం లేకపోయింది. ఆంగ్ల ప్రక్రియల్లో ఆధునిక మానవాభ్యుదయం ప్రకాశించే అవకాశం స్పష్టంగా తెలిసి. వస్తు దృష్టి పొందిన నూత్న లక్ష్యం, పరిణామం, విశదం కాసాగింది.

3. ఏకాగ్రత : రచయిత ఏకాగ్రత కథానికకు అవసరం. ఎక్కడా నీరసత్వం కాని పలచబడి పోయినట్లు, కుంటి నడక నడచినట్లు కాని ఉండక మనస్సునాకట్టుకొనేటట్లు రచించగలగాలి.

4. సంక్షిప్తత : వస్తువు పరిమితంగా ఉంటుంది. దానిని విస్తృతం చేస్తే, చెప్పాల్సిన విషయంలో చెప్పే తీరులోనూ తీవ్రత లోపించి ఆశించిన ఫలితం లభించదు. స్వల్పకాల పఠన యోగ్యంగా ఉండాలి.

5. సన్నివేశ కల్పన : ఏక సూత్రత కథానికకు అవసరం. వివిధ సన్నివేశాలతో కథానికను కూర్చినా, వాటిని ఏకసూత్రం పై నడపగలగాలి. వాస్తవికతకు దగ్గరగా సన్నివేశ కల్పన చేయాలి.

6. స్వయం సమగ్రం : సంక్షిప్తమే అయినా సమగ్రంగా ఉండాలి. అంతమాత్రాన విస్తారంగా ఉండాలనీ కాదు. చెప్పిన విషయం సంపూర్ణంగా ఆవిష్కృతం కావాలి.

7. ముగింపు : కథారంభం ఎంత అవసరమో ముగింపూ అంతే అవసరం. ముగింపు ఎప్పుడూ పాఠకుణ్ణి పునరాలోచింప చేసేటట్టు ఉండాలి. చమత్కారంతోనో కొసమెరుపుతోనో సందేహంతోనో ప్రశ్నార్థకంతోనో ముగించటం కథానిక ఉత్తమతకు నిదర్శనం. ఆశ్చర్యపరిచే విధంగానో సంతృప్తి పర్చే విధంగానో ముగింపు ఉండాలి.

8. ఉండకూడనివి : కథానికలో ఉండకూడనివి దీర్ఘ వర్ణనలు అధిక పాత్రలు అప్రస్తుతాంశాలు.

కథానికకు బ్రాండర్ మాథ్యూస్ అగ్నిపురాణ కర్త చెప్పిన లక్షణాలలో కొంత సామ్యత కనిపిస్తుంది. బ్రాండర్ మాథ్యూస్ Originality (మౌలికత) Unity (ఏకత), Compression (క్లుప్తత), Brilliancy of style (శైలీ రమ్యత), Action (క్రియాశీలత) Form (రూపం) Substance (వస్తువు), If possible fantasy (వీలైతే కల్పన) ఉండాలంటే అగ్నిపురాణ కర్త క్లుప్తత, అనుదాత్తత కథాదిలో భయానకం, కథా మధ్యంలో కరుణ, కథాంతంలో అద్భుతం ఉండలన్నాడు.

కవిత్వం, విషాదాంతం, నవల, కథానిక ప్రక్రియలను మాత్రమే పరిశీలించటం జరిగింది. వ్యాసం, విమర్శనం, జీవిత చరిత్ర, స్వీయ చరిత్ర పరిశోధనం వంటి అనేక ప్రక్రియలు ఆంగ్ల ప్రభావం వల్ల సంక్రమించినా వాటిని ప్రస్తావించ లేదు. కారణం సృజన ప్రక్రియలనే గ్రహించటం వల్ల. విమర్శన ప్రక్రియలలో కంటే సృజన ప్రక్రియలలోనే, ఇతివృత్తం ఉండడానికి, కల్పనాత్మకత చేరటానికి, కథాంశం రూపొందించటానికి, వస్తుతత్త్వం గోచరం కావటానికి అవకాశం ఉంటుంది.

విషాదాంతం నాటకం వల్ల మృత్యు విషయంలో సహృదయుడి దృక్పథం విశాలమయ్యే అవకాశం ఉంది. గతానికి వారసత్వంగా సంప్రదాయ నవ్యసంప్రదాయ వాదాలు విలసిల్లుతూ ఉండగా భవిష్యత్తు మీద ఆశను ఆకాంక్షను కాల్పానిక వాదం మార్క్సు కవితా వాదం కలిగించాయి. వర్తమాన మానవుడి జీవితం వ్యాఖ్యానించటానికి ఈ ప్రక్రియా సాహిత్యం అవకాశం గోచరమవుతూ ఉంది. పూర్వం తెలుగు సాహిత్యంలో ఇంతగా సమకాలీన సమాజ జీవితానికి సాహిత్య వస్తువు అయ్యే అవకాశం లేకపోయింది. ఆంగ్ల ప్రక్రియల్లో ఆధునిక మానవాభ్యుదయం ప్రకాశించే అవకాశం స్పష్టంగా తెలిసి, వస్తు దృష్టి పొందిన నూత్న లక్ష్యం పరిణామం, విశదం కాసాగింది.

1.2.3. ప్రక్రియా తత్త్వం : తెలుగు సాహిత్యంలోకి ప్రవేశించిన సంస్కృతాంగ్ల సాహితీ ప్రక్రియలు ప్రధానంగా చతుర్విధ సాహితీ వస్తువుల్ని గ్రహించటానికి అవకాశం ఇచ్చాయి. ఒక వస్తువు విభిన్న సాహితీ వస్తువులుగా రూపొందటానికి అవకాశం ఉంది. ఆ స్థితిలో ఈ చతుర్విధ సాహితీ వస్తు ప్రపంచం చతుషష్టి సాహితీ వస్తు సమాలోకనంగా గోచరమయ్యే స్థితి లేకపోలేదు. అందువల్ల ఈ విభజన చాలావరకు స్థూల దృష్టితో గ్రహించిందిగా గుర్తించటం అవసరం.

1.2.3.1. పురాణ ప్రక్రియ తెలుగులో విచిత్ర సందర్భంలో ఆరంభమయింది. బసవ పురాణం - నిజంగా పురాణ లక్షణాలు లేని స్థానిక,వస్తు, రచనా, భాషతో కూడిన రచన. ఇది రూపొందించటం అసలు పురాణం అనువాద కార్యానికి మార్గం సుగమం చేసింది. బసవ పురాణం సాహిత్యం మీద విప్లవ శంఖారావం. పురాణ లక్షణాలు లేకుండా రూపొందించటమే కాదు, అసలు పురాణాలు అవతరించటానికి అది తోవ ఏర్పరిచింది. శివ భక్తులు పురాణం వ్రాస్తే విష్ణుభక్తులు ఊరుకుంటారా? అసలు పురాణాలు అనువాదం చేశారు. ఇప్పుడు అసలు పురాణాలు అంటే అర్థం చేసుకోవాలి. అందులో పంచలక్షణాలుండాలి. సర్గ, ప్రతిసర్గ, వంశం వంశానుచరితం, మన్వతరం, ఈ లక్షణాలు సృష్టి అరంభం, పురాణ రచన ఆరంభం కావటం, అనంతరం బహుకాలానికి పునస్సృష్టి జరగటం, ఈ పునస్సృష్టి నుంచి భగవంతుడి వంశం అభివృద్ధి కావటం, ఆ వంశం క్రమంగా ప్రసిద్ధ వ్యక్తుల ప్రాధాన్యం పొందటం దేవ దానవ సంఘర్షణ ఉండటం, దేవతలు విజయం పొందటం, 32 మనువులు పుట్టటం, ఈ మనువులు మనుజులకు నీతి న్యాయం బోధించటం స్థూలంగా ప్రతి పురాణంలో ఉంటాయి. అంతటి రచనా ప్రణాళికతో ఒప్పుతూ ఉంటుంది పురాణం. ఈ మార్గంలో 18 పురాణాలు, 18 ఉప పురాణాలు, ఇతర వంశ గాథలు ప్రబంధాలు మాహాత్మ్య లక్షణాలు, దైవ విషయాలు క్షేత్ర కథలు పౌరాణిక యక్షగానాలు దండకాలు, ఉదాహరణలు, నాటకాలు, నవలలు అనేకం ఉన్నాయి. వీటి మౌలిక లక్షణం దైవ ప్రాధాన్యం చుట్టూ పరిభ్రమిస్తూ ఉంది.

1.2.3.2. ఇతిహాస ప్రక్రియ చరిత్ర ప్రాధాన్యం కలిగి ఉంటుంది. భారత రామాయణాలలో చారిత్రక జీవితమే ఉంది. కౌరవ పాండవ చక్రవర్తుల పూర్వాపర జీవితం భారతంలో రఘువంశ ప్రసిద్ధులలో ప్రసిద్ధుడైన రాముడి జీవితం రామాయణంలో కనిపిస్తాయి. చరిత్రకు దైవ విషయం ప్రముఖం కాదనిపిస్తుంది. కాని, భారతంలో

శ్రీకృష్ణుడు, రామాయణంలో రాముడు శ్రీమహావిష్ణువు అవతారాలే అయినా, దైవాంశ ప్రదర్శనం జరిగినా అక్కడ శ్రీకృష్ణుడు ఇక్కడ శ్రీరాముడు దేవుళ్ళుగా కాక మానవులుగా కనిపించే రీతిలో రచన జరిగింది. నిజానికి ఈ నాయకులు దైవీయ వ్యక్తులే అయినా మానవులుగా గోచరమవుతారు. భారత రామాయణాలలో దైవ విషయం పూర్తిగా విస్మరింపబడదు. దానికి కారణం రాజు దేవుడనే విశ్వాసం కవులు మహర్షులనే నమ్మకం వల్ల చారిత్రక సాహిత్యం ఆరంభంలో దైవత్వం అల్పంగా ప్రత్యక్షంగానూ, అధికంగా పరోక్షంగానూ గోచరమవుతూ వచ్చింది. భారత కథలు ఆధారంగా అనేక సాహితీ స్వరూపాలు తెలుగులో వెలువడ్డాయి. రామాయణమే పలువురు పలు విధాలుగా వ్రాయటానికి మూలమమయింది. రామాయణ గాథలు గ్రహించి అనేక రచనలు వెలువడ్డాయి. భారత రామాయణ గాథలలో ప్రబంధాలు యక్షగానాలు నాటకాలు అనేకం అవతరించాయి. ఈ చారిత్రక విషయాలే కాక అనంతర కాలం అనేక రాజుల చరిత్ర కావ్యత్వం పొందింది. చారిత్రక దృష్టితో నాటి నుంచి నేటిదాకా విశేషంగా సాహిత్యం ఆవిర్భవించింది. విస్తృతంగా సాహిత్యంలో చారిత్రక వస్తువు స్థిరపడింది.

1.2.3.3. : కథాకావ్యాలలో కొంత దైవత్వమూ కొంత చరిత్రా ఉన్నప్పటికిని అవి నిజంగా దైవత్వానికి గానీ, చరిత్రకు గాని ప్రాతినిధ్యం వహించవు. వీటి మీద ఆధారపడినట్లు కనిపించినా, వీటితో ఏ మాత్రం సంబంధం లేని సాహితీ ప్రాంగణాలకు అవి అపరిమితంగా పరిమితాలు. ఇందులో అద్భుతాంశాలకు అంతులేనంత చోటు ఉంటుంది. అపురూప వస్తువులుంటాయి. అసాధరణ ప్రాణులుంటాయి. మానవ పశుపక్ష్యాదులు పాత్రలవుతాయి. మనసుల్లోని ఆశలు ఆకాంక్షలు అభీష్టా అభిమతాలు అడ్డమాకలు లేక నీతి నియమాలు అక్రమ అసహజ అవరోధాల కతీతంగా ప్రాక్తన మానవుల బలహీన భావాలన్నీ సహజ సద్గుణాలుగా చిత్రించటం కనిపిస్తుంది. రాజులుంటారు. దైవత్వం ఉంటుంది. మానవులుంటారు. మనిషి జీవితం విస్తృతంగా గోచరమవుతుంది. అయితే ప్రత్యేకంగా ఈ విషయాలు చెప్పటానికి ఉద్దేశించటం కంటే ఆనందం కలిగించటానికి ఆహ్లాదపరచటానికి వినోదమందించటానికి హేతువుతో ఏ మాత్రం సంబంధం లేని అద్భుతాలు, ఆశ్చర్యాలు జరగటానికి ఈ కథాకావ్య సాహిత్యం సిద్ధించినట్లు కనిపిస్తుంది. ఈ పరిస్థితినే ప్రకటించే యక్షగానాలు సృష్టి పొందాయి. ఈ దశనే ప్రతిబింబించే నవలలు ఉన్నాయి. హాస్యం కోసం సృష్టి పొందుతున్న విశేష సాహిత్యం ఉంది. అద్భుతాల మీద మానవుని మస్తిష్కం పల్టీలు కొట్టటం సాహిత్యం ఆరంభం నుంచి దాదాపు లభిస్తూనే ఉంది. అద్భుత సాహితీ వస్తువు అత్యవసరంగా మానవ అభీష్ట వస్తువు అయి కూర్చుంది.

1.2.3.4. : చాటువులు శతకాలు చాల వాటిలో ఈ మూడు గుణాలు కంటే భిన్న ధోరణి కనబడుతూ ఉంది. దేవుణ్ణి నిందించటం, రాజును తిరస్కరించటం గోచరమవుతుంది. మనిషి ప్రాధాన్యం ప్రస్తుతించటం గోచరమవుతుంది. ప్రాచీన సాహిత్యంలో అంతగా లేదు కాని ఆధునిక సాహిత్యంలో ఇది విశేషంగా కనిపిస్తుంది. మనిషి కోసం జరిగిన అన్ని విప్లవాలు, ఉద్యమాలు సగౌరవంగా గుర్తింపు పొందాయి.

మనిషి వ్యక్తిత్వానికి, అస్తిత్వానికి అర్థం అన్వేషించటం, హేతుయుత మానవుడు, శాస్త్ర మానవుడు దైవత్వాన్ని గుర్తించటం చాలా వరకు మానివేశాడు. రాజు మీద మనిషి తిరగబడి రాజరికం అంతరింప చేసి, ప్రజాస్వామ్యం ప్రతిష్ఠించాడు. ఈ దశల్ని అల్పంగా ప్రాచీన సాహిత్యం అధికంగా ఆధునిక సాహిత్యం ప్రతిబింబించింది. ఆధునిక సాహిత్యంలో సాహిత్యంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యం సమానత్వం నూత్నమైన విలువలుగా రూపుదిద్దుకొన్నాయి. ఈ విలువలు వెలువరించే సాహిత్యంలో మానవత్వం ప్రముఖ వస్తువుగా గోచరమవుతూ ఉంది.

1.2.3.5. : తెలుగు సాహితీ వస్తువు దైవత్వానికి ప్రాధాన్యమంత ఉన్నాయి. చారిత్రకత నుంచి దైవత్వం, అద్భుతత్వం మీదుగా మానవత్వం వైపు ప్రయాణం చేసింది. ఈ స్థితే అన్ని సాహిత్యాలకు స్థూలంగా వస్తుతత్త్వం కావచ్చు. అయితే ఈ వస్తు విభజన చాలా స్థూల అవగాహనం ఆధారంగా రూపొందించుకొందిగా గ్రహించటం అవసరం, మానవత్వం మనిషి ప్రాధాన్యాన్ని చెబుతున్నప్పుడు దీన్ని వస్తువుగా గుర్తించటం సహజమే. ఈ వస్తువు అంతర్గతంగా మరిన్ని భిన్న వస్తువులు ఉండవచ్చు. మానవ స్వేచ్ఛ మానవ స్వాతంత్ర్యం, మానవ సమానత్వం వస్తువులుగా ఇతివృత్తాలు రూపొందవచ్చు. మళ్ళీ మానవ స్వాతంత్ర్యమే ఆర్థిక స్వాతంత్ర్య రాజకీయ స్వాతంత్ర్యం, సాంఘిక స్వాతంత్ర్యం వస్తువులై ఇతివృత్తాలు కథాంశాలు రూపొందవచ్చు. స్వాతంత్ర్యం అరాచకం, దోపిడీ తిరుగుబాటు విప్లవం వస్తువులుగా కథా ప్రణాళికలై భిన్న ప్రక్రియలతో సాహిత్యం అవతరించవచ్చు. విప్లవ వస్తువులో నుంచి మత విప్లవం కులం విప్లవం ఆర్థిక విప్లవం సాయుధ విప్లవం వంటి అనేక వస్తువులు అవతరించవచ్చు.

సారాంశం ఏమిటంటే చాలా వస్తువుల సమాహారంగా ఈ చతుర్విధ వస్తువులు గుర్తింపవచ్చు. కొన్ని వస్తువులు కలిపితే ఒక వస్తు రూపం ఏర్పడవచ్చు. అట్లాంటి రూపాలు మళ్ళీ ఏకం అయి ఒక విశేష వస్తురూపం సిద్ధింపవచ్చు. ఈ వస్తురూపం సాధనంలో ఇక ఏ వస్తువును ఏ ఇతర వస్తువుతోనూ అంతర్భాగంగా భావించటానికి వీలు లేనంత స్పష్టమయిన తత్త్వంతో మౌలికగుణం దర్శించే ప్రయత్నిమిది. ఈ చతుర్విధ వస్తువులు ఒకదానితో ఒకటి అలసిపోయి దేనికది విశిష్టంగా ప్రత్యేకంగా నిలుస్తుంది. ఇప్పుడు ప్రతి వస్తువు అనేక అవాంతర వస్తువుల్ని కలుపుకొన్నదిగా గుర్తించాలి. వస్తువులు మరల అనేక వస్తువులుగా పునర్విభాజనం పొందే స్థితి ఉంది. అంటే అనేక వస్తువులు ఈ నాలుగు వస్తు దృక్పథంతో విలీనమయ్యాయి. అవసరం అయితే ఈ నాల్గింటిలోని ప్రతి వస్తువు అనేక వస్తువులుగా విశ్లేషణ పొందే సామర్థ్యం కలిగి ఉంది.

1.2.3.6. ప్రక్రియా దర్శనం వల్ల వస్తు దృష్టి ఏర్పడింది. ఆ వస్తుదృష్టి మౌలికంగా అతివ్యాప్తి అవ్యాప్తి లేకుండా ప్రధాన కోణాలు నాల్గింటిని దర్శించింది. అయితే వస్తువు మూల గుణమని మౌలిక ధర్మమని అనిపిస్తుంది. కాని, దాని అసలు తత్త్వం అవగతం కావలసి ఆ అవాంతర అవసరం ఉంది. కాబట్టి ప్రక్రియ తత్త్వ దృష్టితో అభివ్యక్తమయిన వస్తువును స్పష్టంగా అర్థం చేసుకోవటానికి ప్రయత్నించటం అవసరం.

ఇతివృత్తాన్ని గూర్చి అస్పష్టంగా ప్రాచ్య సాహిత్యం, కొంత స్పష్టంగా పాశ్చాత్య సాహిత్యం తెలిపిన విషయం వాస్తవమే కాని వస్తువును గూర్చి ఉండవలసినంత వివరంగా లేదు. అందువల్ల అన్వేషణ జరగవలసి ఉంది. సంస్కృతాంగ్లాంధ్రాలలోని నిఘంటువులు విజ్ఞాన సర్వస్వాలు విమర్శ గ్రంథాలు పరిశోధన సాహిత్యం ప్రత్యక్షంగానో పరోక్షంగానో ప్రకటించిన అభిప్రాయాలు క్రోడీకరించి వస్తుతత్త్వం ఇతివృత్త గుణం వస్తు ఇతివృత్త సంబంధం సమీక్షించి వస్తువును గూర్చి స్పష్టమయిన వివరణం విపులంగా వ్యాఖ్యానించుకొంటే, ఆ వస్తువు తెలుగు సాహిత్యంలో పొందిన పరిణామం పరికింపవచ్చు.

1.3. వస్తువు - ఇతివృత్తం : కావ్యకథ, విషయం, కథాంశం, ఇతివృత్తం వస్తువు అనేక పదాలను చాలా సందర్భాలలో సమానార్థకాలుగా వాడటం కనబడుతూ ఉంది. ఏ కొందరో తప్ప వస్తువు ఇతివృత్తం వేరు వేరు అంశాలని, అయినా పరస్పర సంబంధం ఉన్నవని ఆధార ఆధేయ ధర్మం కలవని గుర్తించక పోవటం గమన్హారం. ఇవి వేరు వేరు అంశాలని స్పష్టంగా ప్రతిపాదించిన విమర్శ సాహిత్యం కూడా మృగ్యం. స్థూలంగా చూస్తే వాటి అద్వైతం సహజమే కాని, సూక్ష్మంగా పరికిస్తే వాటిద్వై స్పష్టమే. ఈ చూపు సాహిత్యంలో సాధ్యమే కాని స్థిరం కాదు. సాధించటానికి ప్రసిద్ధమైన ఆధారాలు లభించనిమాట వాస్తమే కాని అంత నిరాధారం కాదు. అక్కడొక మాట ఇక్కడొక మాట వెతికి వాటి ఉనికిని స్పష్టం చేయాలి.

కావ్యకథ, కథాంశం, విషయం, ఇతివృత్తం, కథ, కథేతివృత్తం స్థూలంగా ఒకే విషయాన్ని బోధిస్తాయి. వస్తువు ప్రత్యేక విషయాన్ని బోధిస్తుంది. ఆంగ్లంలో కూడా స్టోరీ, ప్లాట్ ఒక అర్థాన్ని తెలుపుతాయి. అవి ఇతివృత్తంతో సమానమయిన పదాలు. థీమ్ కంటెంట్ ఒక విషయం తెలిపే పదాలు. ఇవి వస్తువుతో సమానార్థకాలు.

కాబట్టి సంస్కృతాంధ్రాలలో ఇతివృత్తం అర్థం గ్రహించి, ఆంగ్లంలో ప్లాట్ వ్యక్తం చేసిన విషయం స్వీకరించి రెండింటిని సమన్వయించి చూచుకోవచ్చు. అలాగే వస్తు పదం అర్థవ్యాప్తి గురించి థీమ్ వ్యక్తం చేసే విషయంలో అనుసంధింపవచ్చు. అందువల్ల సంస్కృతాంగ్లాంధ్రాలలో ఇతివృత్తం వస్తువు వ్యక్తం చేసే లక్ష్యాలు స్పష్టమవుతాయి. ఈ స్పష్టత వాటి పరిధి పరిమితి తెలిసిరావటంతో పాటు వాటి సంబంధం సంశ్లిష్టత విశ్లేషణ పొందుతాయి.

1.3.1. ఇతివృత్తం : నిఘంటువులు, సర్వస్వాలు, విమర్శలు ఆధారంగా ఇతివృత్తం అర్థం గ్రహించి అదే మార్గంలో ప్లాట్ అర్థం స్వీకరించాలి.

1.3.1.1.ఇతివృత్తం - సంస్కృతాంధ్రాలు : 'ఇతివృత్తము : ఇతివృత్తంతు నాట్యస్య శరీరం పరికల్పితమ్ పంచభిఃసంధిభిస్తస్య విభాగః సంప్రకల్పిత ః

ఇతివృత్తము నాట్యశరీరము. ఇది ఐదు సంధులచే విభజింపబడుచున్నది'.(46)

ఇతివృత్తః ;Occurence, Event (47)

ఇతవృత్తమ్: Occurence, Event, a tale story (48)

ఇతివృత్తము : చరిత్రము కథ (49)

1.3.1.2. ఇతివృత్తం - అంగ్లం : Plot : కథావస్తు Arrangement of Plot, వస్తురచనా విన్యాసః (50)

Plot of a play ; నాటకము యొక్క ఎత్తుగడ (51)

Plot : '..... an action consists of incidents and events and arrangements of these incidents and events in plot'. (52)

Plot : Plan or outline (of the events of a story esp. of a novel or drama) (53)

Plot : To devise the plot or story of ( a literary work) (54)

Plot : The interrelationship of the main events in a play novel film etc. (55)

Plot : The plot of a film novel or play is the story and the way in which it develops (56)

Plot : The set of connected events on which a story, play, film etc is based (57)

Plot : The plan of action of a play novel, poem, short story etc. (58)

Plot : The story of a play Novel etc. (59)

Plot : The plot in a dramatic or narrative work is the structure of its action, as these are ordered and rendered towards achieving particular emotional and artistic effects.

Plot : The term used for the plan, design, scheme or pattern of events in a play, poem or work of fiction; and further, the organization of incident and character in such a way as to induce curiosity and suspense in the spectator or reader. (60)

Plot : Plot in criticism is a term of highly varied status. It can mean just the paraphrasable story of a work the simple narrative line which we can then flesh out by considering character and description, tone and texture, pattern and myth... So many work (lyric poems, modernist novels) can be 'without' it. The usage is partly a bastardization of Aristotle's word Mythos in the poetics, commonly translated as plot, and for a richer sense of the term it is worth recalling what he said. Aristotle's plot was the mimesis (i.e. the analogous making) of an action. He distinguished six parts in his exemplary species, tragedy, but did not reduce them to equivalence. Plot constitutes the dynamic whole to which the

other parts relate the necessary order as opposed to the enabling features of development. It is the distilling centre of the choices available to the author; having determined his medium (stage, book) and his mode (lyric, dramatic) he must also choose other essential principles of coherence. His plot must have a shape (e.g. a rise in the hero's fortune followed by effort at particular points (beginning, middle, end); it must have a size (magnitude, duration) which will help determine that shape and sequence. It must have agents and a society for these there must be a language, appropriate not only to them but to the other elements of the structure. It must have a developing psychology culminating internally in good tragedy in the protagonist and externally in an effect on the audience (catharsis); and it must accord with and seek out general human experience (universality).

Few modern critics have taken up this complete usage viewing plot as a necessary order of a fiction. What (here to adopt Aristotle considerably) seems apparent is that the deep definition of plot approximates to the difficulties of the writings process before and during composition it involves recognizing an essential relationship familiar to writers if not always to critics, between plot in its simple story sense and other elements much more complicated than is usually understood - characters, local linguistic devices (speeches, descriptions), general linguistic devices (rhetorical strategies, pervasive symbols), generative sequence in action at narrative and tonal levels, starts and finishes. The tendency in modern criticism to isolate 'human plot' from 'verbal plot' (preferring often the later) or to regard story as a low, summary thread on which to string higher things can be dangerous, diminishing scheme; this is not Aristotle predicate, since he would assume that plots can be of all kinds (eg. a lyric poem must have one). Plot is compositional whole. Even then it can seem a deterministic grid, making the writer of a fiction a God figure whose command over his character is absolute. (This analogue - character as liberal, plot as determinist -has often been a theme in fictions...). This is a possible derivative of the concept of plot and suggests its coherent wholeness. But should we separate out character? Do we not generally need an organizational concept less rigid than this. One that presumes the multiplicity of necessary orders in fictions recognizes that these not all pre-formed but are emergent factors of literary cre-

ation, yet still assumes that the writer characteristically pursues an organizational coherence we can term as a 'plot'. (61)

1.3.1.3. ఇతివృత్త సమన్వయం : సంస్కృతాంధ్రాలలో ఇతివృత్తం అంటే చరిత్రమని వివరణ ఉంది. అది సంపూర్ణంగా సాహిత్యార్థంతో వర్తించదు. సన్నివేశం సంఘటన కథ అనే అర్థాలు ఉన్నాయి. కథ అనే అర్థంతో దీనికి సంబంధం ఉంది.

ఆంగ్లంలోని ప్లాట్ అనే పదం ఇతివృత్తం అనే అర్థంలో కనిపిస్తూ ఉంది. ప్లాట్ అంటే నాటక కథ అని ఒక అర్థం ఉంది. నాటకం కానీ నవల కానీ కలిగి ఉన్న కథ అనీ, కథా ప్రణాళిక అనీ, గుర్తింపవచ్చు. కథా నిర్మాణంగా కూడా దీన్ని గుర్తింపవచ్చు. సాహిత్య సృష్టి కలిగిఉన్న కథా విధానం కూడా ఉద్దిష్టమయింది. నవలలో కానీ, నాటకంలోకానీ, చలన చిత్రంలో కానీ ఉన్న ప్రధాన సంఘటనల పరస్పర సంబంధం ఇతివృత్త గుర్తింపు పొందింది. వీటి కథా వికాసం, క్రమ పరిణామం ఇతివృత్తంగా సంభావింపబడింది. కథానిక నాటకం చలన చిత్రం కలిగి సంబంధం స్పష్టంగా స్థాపించిన సంఘటనల సామస్త్యం ఇతివృత్తమని గుర్తింపబడినది. నవల,నాటకం, కవిత్వం కథానిక మొదలైన వాటిలోని చర్యల ప్రణాళిక ఇతివృత్తమని తలపోయటం జరిగింది. స్పష్టార్థంగా నాటకం నవల వంటి వాటి కథాంశంగా ఇతివృత్తం గుర్తింపు పొందింది.

నవల కానీ కథానిక కాని కవిత్వం కానీ నాటకం కానీ కలిగి ఉండే సంఘటనల తీరుతెన్నులు, ప్రణాళికలు, ఏర్పాట్లు, చిత్రణల వివరణార్థం ఇతివృత్తం ప్రయోగింపబడింది. సన్నివేశాలను,సంఘటనలను,ఏర్పరచి, పాఠకుల్ల ప్రేక్షకుల్లో, శ్రోతల్లో ఆసక్తి ఔత్సుక్యం కలిగించే రచనా రీతికి ఇతివృత్తమని పేరు.

ఇతివృత్తం సాహిత్య ప్రక్రియలోని కథాంశం, పాత్రలు, వర్ణనలతోను, ఉద్దేశం నిర్మాణంతోనూ, పద్ధతి పరిసరాలతోనూ ఒప్పుతూ ఉండే అంతస్సూత్రం. అసలు ఇతివృత్తమంటే సాహిత్యంలోని సామాజిక వ్యక్తి చర్యల సమాహార రూపం, భిన్న కథాంశాల సమ్యక్ సమాహార రూపం. రచనా మాధ్యమం కోరుకునే సంబద్ధతా ప్రధాన సూత్రావళి ఇతివృత్తం. ఇతివృత్తానికొక ఆకారం ఉండాలి. అది పాత్రలతో రూపొందుతుంది. దానికొక సన్నివేశాల ప్రారంభం, పరిణత పరిసమాప్త క్రమత ఉండాలి. దానికొక స్థలరూపం కాలరూపం ఉంటుంది. వీటివల్ల సన్నివేశాల సమాహారంగా ఇతివృత్తం స్పష్టమవుతుంది. కథాంశం బంధంగా ఇతివృత్తం ఉంటుంది. క్రమంగా వికాసం చెందే గుణం అది పాఠకుల్లో రసదృష్టి కలిగించే సామర్థ్యంతో ఒప్పుతూ ఉండాలి. సహృదయులు సామాన్యానుభూతి సంస్థాపించే శక్తిసంపన్నంగా ఇతివృత్తం ఉంటుంది. సృజన సాహిత్యానికి, కల్పనాత్మక సాహిత్యానికి ఇతివృత్తం ప్రధానావసరం. రచనా సమయంలోనూ రచనారంభానికి ముందు విశేషమయిన పరిణామ పరిశీలనకు పాత్రమయ్యేది ఇతివృత్తం. సాధారణ కథ సూత్రంలో కలసివచ్చే పాత్రలు, సాంఘిక సన్నివేశాలు, భాషా సూత్రాలు, చర్యల సమాహార రూపాలు, కథా కథన విధానం, ప్రారంభోపసంహారాలు ఇతివృత్తంలో తప్పని సరిగా ద్యోతకమవుతాయి. సమాజ సామస్త్యాన్ని సర్వసమర్థంగా కూర్చటమే ఇతివృత్తం. ఇతివృత్తం కవి, రచయిత, నాటక కర్త సృష్టి మాత్రమే. ఇవి దైవ సృష్టికంటే

భిన్నమే కాని, దాని మీదే ఆధారపడి ఉంటుంది. కథాంశంలో ఏది వేరు చేసినా, దేన్ని తొలగించినా కథాప్రణాళికతో కూడిన ఇతివృత్తం విస్తృతం కావటం కంటే సాహిత్యంతో పాటు అది సంభవించటం సహజ పరిణామం. రచయిత ఇతివృత్తం నుంచి బంధాలు రూపొందించితే అది రచనతో పాటు రూపొందుతుంది. కవి రచయిత నాటకకర్త ఇతివృత్తం మౌలికాంశాలతో స్వభావం రూపొందిస్తే సాహిత్య సృష్టిలో పాత్రలు సన్నివేశాలు సంఘటనలు మొదలైన విభిన్నాంశాలతో ఇతివృత్తం తన స్వరూపం సంసిద్ధం చేసుకొంటుంది.

1.3.2. వస్తువు : వస్తుతత్త్వం తెలుసుకోవటానికి పరిశీలించగా లభించిన ఎదురుముదురు సమాచారం ఆధారంగా వస్తువు వ్యక్తం చేసే సాహిత్యాంశం పరిగ్రహించి, దానికి సమానంగా ఆంగ్లంలో ఉన్న 'థీమ్' పదం ప్రకటించే సాహిత్యార్థం స్వీకరించి, రెండింటిని కలగలపి వస్తువు వ్యక్తం చేసే ధర్మం నిర్ణయింపవలసి ఉంది.

1.3.2.1. వస్తువు సంస్కృతాంధ్రాలు : వస్తువు : పదార్థము, బండము, A thing, Article, Matter, Substance (62)

వస్తువు : నాటకము నందలి ఇతివృత్తము కథాంశము, సత్యపదార్థము, నిజమైన పదార్థము, పదార్థము, పొత్తధనము, తత్త్వము స్వభాము,వస్తు సాధనమూ, కారణము, వస్తుసారము, కల్పన పన్నుగడం. (63)

వస్తువు :కథ లేక ఇతివృత్తము (64)

వస్తువు : The main plot or subject of a poem or play (dialect) (65)

2. Essence, the true object substance wealth.

3. Object thing.

4. The object of love

5. The subject of a poem or plan. (66)

వస్తు: A really existing thing, the real, a reality, వస్తున్యవస్తారోపోకజ్ఞానమ్. అధవా మృదువస్తు

2. A thing in general an object article, substance matter.

3. Stuff (of which a thing is made) materials, ingredient. ఆకృతి ప్రత్యయా దేవనౌ మానూన వస్తుకామ్ సంభావయామి

4. The plot (of a drama) the subject of matter of any poetic composition.

5. The pith of a thing.

6. A plan, design. (67)

వస్తు: A seat or place of any really existing or abiding substance

or essence, thing, object article.

2. The thing in question matter affair, circumstance.

3. Subject subject matter, contents theme ( of a speech and C) plot (of a drama or poem). (68)

'మనిషి, మానవ సంబంధాలు, సామాజిక జీవితం, అందలి సమస్త వైరుధ్యాలు, వీటన్నిటి యొక్క కళాత్మకమైన ఆవిష్కరణే సాహిత్యంలో వస్తువు. సాహిత్య వస్తువుకీ సమాజ వస్తువుకీ బేధం ఉంది. సాహిత్యంలో కనిపించేవి సామాజిక వాస్తవికత యొక్క కళాత్మక ప్రతిఫలనం. సాహిత్యం రెండో ప్రపంచం, మొదటి ప్రపంచంలోని మామూలుతనం కాక ప్రత్యేకత మాత్రమే ఈ రెండో ప్రపంచంలో ప్రతిఫలిస్తుంది. ఆ క్రమంలోనే కళా విలువలు జోడింపబడతాయి.

సాహిత్య వస్తువులో ఇతివృత్తం ఆశయం అనే ప్రధానాంశాలుంటాయి.

ఇతివృత్తంఅంటే ఒక రచనలో వ్యాఖ్యానింపబడే ప్రత్యేక ప్రాపంచికమైన జీవిత సంఘటనలన విస్తృతి. అది ప్రపంచం నుంచి సేకరించిన సాధారణ పదార్థం కాదు. పరిశీలనకవసరమైన ప్రత్యేక పదార్థం. ఈ పదార్థం రచనలో వివేచింపబడుతుంది. కవి లేదా రచయిత తనకు భౌతిక వాస్తవికతకూ జరిగే సంఘర్షణ నుంచి జీవితానుభవాన్ని (లేదా అవగాహనని) పొందుతాడు. ఆ జీవితానుభవం నుండి నేటి సాహిత్యేతివృత్తం స్వీకరిస్తాడు. సేకరణ దశలో కలగాపులగంగా అపరిష్కృతంగా ఉన్న ఇతివృత్తం రచనా క్రమంలో విశ్లేషించబడుతుంది తీర్చిదిద్దబడుతుంది.

ఆశయం అనేది ప్రాపంచిక సంఘటనల, జీవిత పరిణామాల సారాంశాన్ని వ్యక్తీకరిస్తుంది. దానిని కళాత్మక దృక్పథం నుంచి విలువ కడుతుంది. తద్వారా కొన్ని నైతిక, రాజకీయ, రసాత్మక నిర్ధారణలకు దారితీస్తుంది. సాహిత్యంలో ఈ ఆశయం ఆలోచనావేశాల సమ్మేళన రూపంలో వ్యక్తీకరింపబడుతుంది. అంటే ప్రేమ ద్వేషం, సంతోషం, దుఃఖం, అసహ్యం, అసంతృప్తి, సానుభూతి వగైరా భావావేశాల మొత్తం (ఎమోషనాలిటీ) ద్వారా రచయిత ఆశయం వ్యక్తీకరింపబడుతుంది. ఇందులోనే రచయిత సందేశమూ ఇమిడి ఉంటుంది. (69)

కథావస్తువుని 'నిగూఢ బీజ స్థితి నుంచి వెలికి వచ్చిన విషయాంకురం'.(70)

'కథ మనకు పూర్తిగా తెలిసిన తరువాత 'ఈ కథ ఏం చెబుతోంది' అన్న ప్రశ్న వేసుకుంటే వచ్చే సమాధానాన్ని స్థూలంగా కథా వస్తువు అనవచ్చు...... నవలకు కథ శరీరం వంటిదైతే కథావస్తువు ప్రాణం'.(71)

**1.3.2.2.** వస్తువు - ఆంగ్లం :

Theme: విషయ ప్రకరణమ్, వస్తు ప్రబంధం. (72)

Theme : A subject on which one speaks or writes.

సంగతి విషయము ప్రసంగము ప్రస్తావము.(73)

Theme : Topic, subject of a talk or a piece of writing (74)

Theme : A subject or topic which a person speaks thinks (75)

Theme : The subject of discourse, discussion, conversation meditation or composition a topic.

2.The text of sermon - also a proposition to be discussed.(76)

Theme : A theme is the main idea or subject in a discussion, conversation, lecture etc.

2. A Theme is also an idea, that an artist or writer develops or repeat in his or her work.(77)

Theme : The subject of a talk or piece of writing. (78)

2.A recurring unifying subject or idea, motif often one used decoratively. (79)

Theme : The subject of a discussion, essay etc. (80)

'Motif and Theme : A motif is an element - a type of incident device or formal - which recurs frequently in literature....

Theme is sometimes used interchangeably with motif, but the term is more usefully applied to a thesis or doctrine which an imaginative work is designed to incorporate and make persuasive to the reader. Milton stats as the theme of paradise lost to 'assert ternal providence/ end justify the ways of God to men'; see Didactic literature. In modern criticism it is often claimed that all nontrivial works of literature, including lyric poems, involve an implicit conceptual 'theme' which is embodied and dramatized in the evolving meanings and imagery; see, for example, cleanth Brooks, The well - wrought urn (1947)' (81)

Theme : 'Properly speaking the theme of a work has been not its subject but rather its central idea which may be stated directly or indirectly, for example the theme of othello has been jealousy. (82)

Theme : Traditionally means a recurrent element of subject matter but the modern insistence on simultaneous reference to form and content emphasizes the formal dimension of the term. A theme is always a subject, but a subject is not always a theme. A theme is not usually thought of as the occasion of a work of art, but rather than a branch of the subject which is indirectly expressed through the recurrence of certain events, images or symbols. We apprehend the theme by

inference, it is the rationale of the images and symbols not their quantity.....

However, the term is sensitive and useful precisely because it admits of degrees of abstract reference; it is neither possible nor desirable to restrict all quantitative usages, because theme implies the linearity or extension of a work in a way that other subject matter terms do not.... Thus critics may use 'theme' to refer to those repeated parts of a subject which control aspects of a work which he perceives as formal as well as conceptual'. (83)

1.3.2.3. వస్తు సమన్వయం : సంస్కృతాంధ్రాలలో వస్తువు అంటే నాటకానికి కవిత్వానికి సంబంధించి ఉన్న విషయమని ఒక అర్థం ఉంది. వస్తువు అంటే సాహిత్య సృష్టికున్న కథాంశం అని స్పష్టం. వస్తువు అంటే ఇతివృత్తమని, ఇతివృత్తమంటే వస్తువని పొరపాటుపడడం స్పష్టంగా కనిపిస్తూ ఉంది. వస్తువు అంటే సంస్కృతాంధ్రాలలో నిఘంటుకారులు ఇతివృత్తమనే భావించారు. ఒక పరికరానికున్న సారాంశమన్న సందర్భంలో వస్తుతత్త్వం గోచరమయ్యే స్థితి ఉంది.

సాహిత్య వస్తువులో ఇతివృత్తం ఆశయం అనే ప్రధానాంశాలు ఉంటాయని గుర్తించినప్పుడు, వస్తువు ఇతివృత్తం కంటే విశాలమన్న భావం స్పష్టం అవుతుంది. నవలకు, కథ శరీరం వంటిదయితే వస్తువు ప్రాణం వంటిదని గుర్తించినపుడు వస్తు ప్రాముఖ్యం అవగతమవుతుంది. వస్తువు బీజమయితే ఇతివృత్తం అంకురమని, భావించినప్పుడు వస్తుతత్త్వంలో మౌలిక లక్షణం స్పష్టమవుతుంది.

ఆంగ్లంలో వస్తువు అంటే కేంద్ర భావమని, దాని కథకాదని చెప్తూ ఒథెల్లో నాటకంలోని వస్తువు అసూయ అని వివరించటం గమనార్హం. మిల్టన్ పారడైజ్ లాస్ట్‌ను గురించి దైవాంశ సంరక్షణ వస్తువని పేర్కోవటమూ గమనింపవచ్చు. వస్తువు చెట్టు అయితే శాఖలు ఇతివృత్తాలుగా గుర్తించినప్పుడు వస్తువు విషయం కాగలదు కాని విషయం అన్ని సందర్భాలలో వస్తువు eternal providence కాదని తెలిసి వస్తుంది.

సంస్కృతాంధ్రాంగ్ల నిఘంటు విమర్శ పరిశోధనల వల్ల వస్తువు మూల సూత్రమని, ఇతివృత్తం దానిని ఆధారం చేసుకొని రూపొందే ఆకృతి అని స్పష్టమవుతుంది. వస్తువు కేంద్రం. వస్తువు ఆలోచన. వస్తువు మూలభావం. దీనిని ఆశ్రయించి ఇతివృత్తం విస్తరణ పొందుతుంది. ఈ నేపథ్యం వస్తువు ఇతివృత్తం ఒకటే అన్న అపోహను తొలగించాలి. దానికి, వస్తువు ఇతివృత్తం పట్ల వాటి సంబంధం పట్ల స్పష్టమయిన అవగాహన అవసరం. ఈ అవగాహన ప్రాచ్య పాశ్చాత్య పరిశోధక విమర్శక అభిప్రాయాల వల్ల కలుగుతూ ఉంది. ఈ అభిప్రాయాలు, ముఖ్యంగా పాశ్చాత్యాభిప్రాయాలు, వస్తువు ఇతివృత్తం ఒకటి కాదని ప్రాథమికమైన తేడాను స్పష్టపరచడమే కాదు, వస్తుతత్త్వాన్ని కూడా తెలుపుతున్నాయి. ఈ వస్తుతత్త్వం మరింత విస్తృతంగా గ్రహించటం అవసరం.

**1.3.3.** వస్తుతత్త్వం : వస్తువుకు సాహిత్యంలో ప్రాధాన్యముంది. ఇతివృత్తానికి ప్రాముఖ్యముంది. ఇతివృత్తానికి వస్తువుకు ఉన్న సంబంధం స్పష్టమయితే సాహిత్య పరిశీలనంలో ఇతివృత్తావసరం, వస్తు ప్రాముఖ్యం అవగతమవుతుంది. అందువల్ల ఈ రెండింటికి ఉన్న సంబంధ బాంధవ్యాలు పరికించి వస్తుతత్త్వం గుర్తించాలి. తన్మూలంగా వస్తు వైశిష్ట్యం అభివ్యక్తమవుతుంది.

వస్తువు ప్రాధాన్యం ఇతివృత్తం ద్వారా బహిర్గమవుతుంది. వస్తువు ఆధారంగా అల్లుకొనే ఇతివృత్తం వస్తువు ప్రాధాన్యం వ్యక్తం చేస్తుంది. ఈ వస్తువు స్థూలంగా ఉన్న విషయమైతే, ఇతివృత్తం సూక్ష్మ విషయం అవుతుంది. స్థూలమైన వస్తువు సూక్ష్మమయిన విషయాన్ని గ్రహించి ఇతివృత్తమేర్పడుతుంది. ఈ స్థూలత అనేకానేక ఇతివృత్తాలకు దోహదమవుతుంది. ఉదాహరణకు దైవత్వం. ఇది వస్తువుగా గ్రహించి రచింపబడే ఇతివృత్తాలు అనేకం. తెలుగు సాహిత్యాన్ని గ్రహిస్తే దైవాన్ని అనేక వస్తు ఖండాలుగా చేసి ఇతివృత్తాలను గ్రహించారు. దేవుడి మహిమను చెప్పేది ఒక వృత్తాంతం అయితే దైవశక్తిని తెలిపే కథాంశం మరొకటి. దేవుడి లీలలను చెప్పేది ఒకటైతే దైవభక్తిని చెప్పేది మరొక కథ. భక్తిపరుడు శక్తిని వివరించేది ఒకటైతే దేవుడు నిల్చిన ప్రదేశాలను గూర్చి చెప్పే కథలు కొన్ని. దేవుణ్ణి స్తుతించే రచనలు కొన్ని, దేవుళ్ళను సంతానంగా పొంది ముక్తిని పొందిన జీవితాలను గూర్చి కొన్ని. వీటన్నిటిలో కనిపించే అంశం దైవత్వం. విభిన్న ఇతివృత్తాలుగా దేవతలు, మానవులు, పశుపక్ష్యాదులను గ్రహించి దీనిని అల్లడం కనిపిస్తుంది. కాబట్టి వస్తువు స్థూలమయితే ఇతివృత్తం సూక్ష్మంగా ఉంటుందని విస్పష్టంగా గుర్తింపవచ్చు.

వస్తువు అపరిమితం కాగా ఇతివృత్తం తదంశ రచన దానిలో ఒక భాగాన్ని గ్రహించి ఇతివృత్తం పెరుగుతుంది. అపరిమిత వస్తువు నుంచి పరిమిత ఇతివృత్తాన్ని గ్రహించటం ఇక్కడ జరిగిన పని. చరిత్రను ఉదాహరణంగా గ్రహిస్తే ఇది పరిమితం. విభన్న వంశాలు, వంశాను చరిత్రల కూర్పు చరిత్ర. అయితే ఏ ఒక్క వంశాన్నో వంశాను చరితనో గ్రహించి రచన జరుగుతుంది. ఏ ఒక్క రాజు విజయాలనో ఇతివృత్తంగా గ్రహింపవచ్చు. ఏ ఒక్క ఘటనో, ఇతివృత్త ప్రాధాన్యమో కలిగి ఉంటుంది. కాలగతిని మార్చిన ఒక్క యుద్ధం మాత్రమే ఇతివృత్తం కావచ్చు. ఈ పరిమిత ఇతివృత్తానికి ఒక పరిమితాంశాన్ని వస్తువు అనుగ్రహిస్తుంది.

వస్తువు విశాలమైతే సంక్షిప్తాంశం ఇతివృత్తం. వస్తువు విశాలత లోని ఒక చిన్న కోణాన్ని తీసుకొని చేసిన రచన ఇతివృత్తం. ఒక సంక్షిప్త ఇతివృత్తానికి విశాలమైన వస్తువు దోహదం చేస్తుంది. ఉదాహరణకు మానవీయ వస్తువు. మన సాహితీ పరిణామంలో కనిపించే మరో ప్రధాన వస్తువు. ఈ విశాలమైన వస్తువు నుంచి ఒక సంక్షిప్త అంశం ఇతివృత్తం అవుతుంది. మానవీయ వస్తువు తెలుగులో విశాల వాతావరణం కలిగి ఉంది. దీనిని ప్రాణంగా గ్రహించి వచ్చిన ఇతివృత్తాలు ఆధునిక సాహిత్యంలో కోకొల్లలు. సంఘ సంస్కరణాంశాలన్నీ ఈ వస్తువు ఆధారంగా ఏర్పడిన ఇతివృత్తాలు. జాతీయతా భావం, మానవ సంబంధాలు, ఆర్థిక సంబంధాలు

నియమాలు, మనో విశ్లేషణాత్మకత, స్త్రీ, పురుష సంబంధాలు, బ్రతుకు పోరాటం, వ్యక్తి అస్తిత్వం, భూమి పోరాటం, అనేక ఇతివృత్తాలు ఏర్పడ్డాయి. ఈ ఇతివృత్తాలన్నిటికి మాతృకగా మానవీయ వస్తువు నిలుస్తుంది.

ఒక సమష్టి వస్తువులోని వ్యష్టి ఇతివృత్తం. సమష్టి వస్తువు ఇచ్చే అవకాశాలన్నిటిని వినియోగించుకొని ఎన్నో ఇతివృత్తాలు ఏర్పడతాయి. సమష్టి మానవ జీవన విధానం వస్తువు అయితే ఒక వ్యక్తి జీవన గతి తెల్పేది ఇతివృత్తం. దైవత్వం సమష్టి వస్తువు అయితే ఒక అవతారంలోని ఒక కథ గూర్చి చెప్పేది వ్యష్టి ఇతివృత్తం. ఒక మహిమను గూర్చి చెప్పేది, ఒక శక్తిని గూర్చి తెల్పేది, ఒక భక్తుడి గూర్చి వ్యక్తపర్చేది, ఒక మోక్ష ప్రాంతం వివరించేది, ఒక ప్రాణి భక్తిని తెల్పేది, ఒక త్యాగం వర్ణించేది ఇతివృత్తంగా ఉంటుంది. ఒక సమష్టి వస్తువు వ్యష్టి ఇతివృత్తానికి సృష్టి కర్త అవుతుంది.

వస్తువు సామూహికమైతే, ఇతివృత్తం వైయక్తికం, సామూహికత అంటే చారిత్రకతగా భావిస్తే ఈ వస్తువులో అనేకానేకులు రాజులు, అనేక సన్నివేశాలు,జీవన గతిని మార్చే ఘట్టాలు వంటివి ఎన్నో ఇతివృత్తాలు. సామూహికమైన వస్తువు గ్రహించే ఇతివృత్తం వైయక్తికం.

వస్తువు అనేకం. ఇతివృత్తం ఏకం. అలాగే వస్తువు అనల్పం. ఇతివృత్తం అల్పం. వస్తువు అనల్పం అంటే ఏక కాలానికో ఏక ప్రాంతానికో, ఏక జీవనానికో, ఏక వంశానికో, ఏక స్థితికో, ఏక సామాజిక నేపథ్యానికో సంబంధించింది కాదు. వీటన్నిటి సమాహారం వస్తువు. ఇందులో ఒక విషయమో దానిలోని భాగమో ఇతివృత్తం. అనల్పమైన వస్తువులోని అల్ప విషయం ఇతివృత్తం.

వస్తువు కారణమైతే, కార్యం ఇతివృత్తంం. మానవీయ వస్తువులోని ఒక విలువ స్వేచ్ఛ. ఈ విలువ కారణమై వ్యక్తి స్వేచ్ఛ, జాతి స్వేచ్ఛ, దేశ స్వేచ్ఛ, అణచివేత నివారణం, సమానత్వ కాంక్ష, ప్రతిఘటన, సమ్మె, బంద్, హర్తాళ్, బందిఖానా, లాకవ్ ట్, నక్సలైట్లు, కాల్పులు, మందు పాతర్లు, ఎన్‌కౌంటర్లు వంటివి ఎన్నో ఇతివృత్తాలు ర్పడతాయి. ఈ కార్యాలన్నింటికి కారణమయిన విలువ ఒక్కటే. కనుక వస్తు ఇతివృత్తాలు సంబంధం కారణ కార్య సంబంధం.

వస్తువు ఆధారమయితే, ఇతివృత్తం అధేయం.ఉదాహరణం కుండలో నీరు. కుండ ఉంటే ఏమయినా పోయవచ్చునన్నదీ సత్యమే. నీరు ఎందులోనయినా పోవచ్చునన్నదీ సత్యమే. నీరు లేకుండా కుండ ఉండగలదు. కానీ, కుండ లేకుండా, దో ఆధారం లేకుండా నీరుండటం కష్టం. ఉన్నట్లు చూపే అవకాశం తక్కువ. ఆధారం స్తువు అధేయం ఇతివృత్తం అయినప్పుడు ఆధారంతో ఇతివృత్తానికి అత్యవసరం ంది. అందువల్ల వస్తువు ప్రధానం ప్రముఖం. నూనె ఉన్న దీపపు సెమ్మె కంటే వెలిగే త్తి ప్రధానమయినట్లు, అధారం కంటే అధేయం ప్రధానంగా కనిపించటం పరిసర రిగతులు వల్లనే అని స్పష్టంగా గుర్తించాలి.

వస్తువు బాహిరం, ఇతివృత్తం ఆంతరం. ఒక్కొక్కసారి ఇతివృత్తం కూడా స్తువుగా మార్పు చెందుతుంది. కట్నం వస్తువుగా గ్రహిస్తే కన్యాశుల్కం వరకట్నం

ఇతివృత్తాలవుతాయి. వరకట్నం వస్తువుగా తీసుకొంటే పొలం ధనం వాహనం ఉద్యోగం నగలు వంటివి ఇతివృత్తాలవుతాయి. ఇలా వస్తువు నుంచి ఇతివృత్తం గ్రహించటం, ఇతివృత్తమే ఒక్కొక్కసారి వస్తువు కావటం వల్ల వస్తు ఇతివృత్తాల పట్ల బేధం కనిపించకుండా పోయింది. పర్యాయ పదాల స్థాయి ఈ రెండు చేరాయి.

వస్తువు కేంద్రం, దాని చుట్టూ ఏర్పడే వలయం ఇతివృత్తం. కృష్ణుడు వస్తువయితే, అతడి జీవితం చుట్టూ వ్యాపించిన రాజకీయం, సంసారం, ఎత్తుగడలు, రాయబారాలు, కొంటెపనులు, శృంగార చేష్టలు,రాసలీలలు, పొందిన పరాజయాలు, సాధించిన విజయాలు వంటి కల్పనాంశాలతో కూడిన పరిధి ఇతివృత్తం అవుతుంది.

వస్తువు మూల సూత్రం. చుట్టూ చేసే విస్తృత ప్రణాళికా పరిచర్య ఇతివృత్తం. వస్తువు అస్తిపంజరం అయితే, రక్త మాంసాలతో కూడిన శరీరం ఇతివృత్తంగా గోచరమవుతుంది. ముందు ఒక ప్రాథమిక అంశం ఉండాలి. దానిపైనే ఇతివృత్త నిర్వహణ జరుగుతుంది. నీతి వస్తువు అయితే పశుపక్ష్యాదులతో త్రిలోకాలకు చెందిన వ్యక్తులతో వారి జీవన గమనాన్ని చేర్చి జరిగే మంచి చెడులను తత్ఫలితాలను ఆ వస్తువు చుట్టూ అల్లి ఒక రూపాన్ని ఏర్పరచటం ఇతివృత్తంగా స్పష్టమవుతుంది.

వస్తువు ఒక స్వయం ప్రకాశ కేంద్రమయితే అది ప్రసరించే వెలుతురు ఇతివృత్తం. స్విచ్‌ను నొక్కకపోతే వెలుగే రాదు. వస్తువు లేకపోతే ఇతివృత్త కల్పనే లేదు. వస్తుతత్వాన్ని వెలికి తెచ్చి వెలుగులో నిల్పేది ఇతివృత్తం.

వస్తువు రేఖా చిత్రం కాగా, సంపూర్ణంగా, సర్వాంగ సుందరంగా సమగ్ర రసస్వరూపంగా ఏర్పడ్డ చిత్రం ఇతివృత్తం. వస్తువు ఒక శిల. అది అమూర్తం. దానిని ఒక శిల్పంగా మలచేది ఇతివృత్తం. ఇది మూర్తం. దీనికి భౌగోళిక పరిధి, కాల అవధి, స్వయం వ్యక్తిత్వ శోభ సమకూరుతాయి. అమూర్తం మూర్తం కావటమే వస్తువు ఇతివృత్తంగా పరిణామం చెందటం.

వస్తువును ఇతివృత్తంగా మలచటంలో సాహిత్య సృష్టికి ప్రత్యేక అవసరం ఏర్పడుతుంది. అయితే ఈ వస్తువును తగిన మార్గంలోనే మలచాలి. ఏ వస్తువుకు తగినట్లు ఆ ఇతివృత్తం రూపం దాల్చాలి. దైవత్వాన్ని చెప్పే వస్తువును గ్రహించినప్పుడు హాస్యరసాన్ని, హాస్యభరిత సన్నివేశాలను అంతగా ఆ పాత్రలకు ఆపాదించటం సాధ్యం కాదు. అలాగే చారిత్రకత కూడా. అయినా మానవత్వాన్ని వస్తువుగా గ్రహించినప్పుడు ఇలాంటి రసాలన్నిటిని కూర్చవచ్చు. దైవత్వానికి ఉన్నతస్థితిని ఊహించారు. మానవత్వానికి సామాన్య స్థితి కల్పించారు. సామాన్య స్థితికి భిన్నంగా ఇతివృత్త కల్పన జరగదు. ఒక రకంగా, వస్తువు ఇతివృత్తాన్ని నిర్దేశిస్తుంది. అది పయనించాల్సిన మార్గాన్ని సూచిస్తుంది. అది చేరుకోవలసిన గమ్యాన్ని తెల్పుతుంది. అది సాధించాల్సిన లక్ష్యాన్ని హెచ్చరిస్తుంది. దాని పరిమితిని నియంత్రిస్తుంది. వస్తువు యజమాని సేవకుడు ఇతివృత్తం.

సాహిత్యావిర్భావానికి వస్తువు ప్రధానవసరం. దాన్ని అనుసరించి అనేక ఇతివృత్తాలు అవతరిస్తాయి. ఒక సాహిత్య సృష్టి పఠించిన వాళ్ళకు ఇతివృత్తం స్పష్టంగా తెలుస్తుంది. దాని వస్తువు మాత్రం అనుభవం వల్ల మాత్రమే తెలుస్తుంది, అన్నప్పుడు వస్తువు అతర్నిగూఢమనీ, ఇతివృత్తం బాహిరమయమనీ విశదమవుతుంది. వస్తువన్న భావంలో అమూర్త లక్షణం దాగి ఉంది. దాన్ని మూర్తి మంతం కావించటం నిజంగా రసాయనిక చర్య. సాహిత్యంలో అభివ్యక్తమయ్యే ఇతివృత్తాన్ని నడిపించే మూలసూత్రం వస్తువు. ఒక భావం ఒక కావ్యంగా పరిణామం చెందినప్పుడు ఆ మూలభావం ఆ కావ్యవస్తువు అవుతుంది. స్పష్టంగా చెప్పాలంటే వస్తువు ప్రధాన విషయం కాగా ఇతివృత్తం దానిలోని ఒకానొక భాగం అవుతుంది.

1.3.4. వస్తు వైశిష్ట్యం : వస్తువు ఇతివృత్తం చాలా వరకు సమానార్థకాలుగా, పర్యాయపదాలుగా వాడటం జరుగుతూ ఉంది. వీటిలో భేదం గుర్తించటం కానీ, గుర్తించే ప్రయత్నం కాని ఎక్కువగా జరగలేదు. వస్తు ఇతివృత్తాలలో వైషమ్యమే అధికతరం అన్నది స్పష్టం కావాలి. ఈ రెంటికీ విశాలంగా వైవిధ్యం ఉంది. ఈ వైవిధ్యం స్పష్టంగా కొలత గీచినట్లు ఉండకపోవటం వల్ల అందరి దృష్టిని ఆకర్షించలేకపోతూ ఉంది.

వస్తువు అసూయ అయినప్పుడు ఇతివృత్తం ఒథెల్లో అయిందన్న దృష్టి స్పష్టంగా ఏర్పడితే వస్తు ఇతివృత్త సంబంధం స్పష్టమవుతుంది. వస్తువు దైవాంశ సంరక్షణమయినప్పుడు ఇతివృత్తం పారడైజ్ లాస్ట్ కావటం గమనిస్తే ఇతివృత్త వస్తు సంబంధం అర్థమవుతుంది. వస్తువు ఇతివృత్తమయినప్పుడు దానికి కథ, పాత్రలు, సన్నివేశం, సంభాషణ, వర్ణన, అలంకారం, భాష, దేశకాల పాత్రావధి వంటి అనేకాంశాలు చేరుతాయి. అందువల్ల వస్తువు మూల గుణం అయినప్పుడు ఇతివృత్తం వ్యాపించిన కథాంశాల క్రోడీకరణం అవుతుంది.

వస్తువూ ఇతివృత్తమూ సమానం కాదు.కానీ రెండూ సమాంతరంగా నడిచే లక్షణాలు. రెండింటికీ సాహిత్య సృష్టిలో ఎంతో ప్రాధాన్యం ఉంది. వీటికి ఆధారాధేయ సంబంధం ఉంది.అదే సమయంలో సర్వతంత్ర స్వతంత్ర స్వయం ప్రతిపత్తి ఉంది. సృజనాత్మక సాహితీ సృష్టికి ప్రాణం వస్తువు. వస్తువు రచనకు ముఖ్యం. కావ్యశరీరానికి ఆత్మ వస్తువు.

కావ్యశరీరానికి ఆత్మ ఉందన్నప్పుడు ఆత్మ అగోచరంగా ఉండి, శరీరం గోచరమవుతూ ఉంటుంది. ఆత్మ అగోచరమంటే ఇతిమిత్థంగా హద్దులు, అవధులు, పరిధులు, పరిమితులు గిరిగీసి చెప్పటం సాధ్యం కాదు. కాని వస్తువుకు ఆంగ్ల దృక్పథం నుంచి పరికిస్తే దానికొక ఉనికి ఉంటుంది. అస్తిత్వానికి అర్థం ఉంటుంది. దానికొక ప్రాదేశిక ప్రాంగణం ఉంటుంది. అటువంటి స్థితి ప్రాచ్య అలంకారిక సంప్రదాయంలోని కావ్యాత్మకు ఉండదు. కావ్యాత్మ తెలిపే అన్ని వాదాలలో ప్రముఖమయినది రసవాదం. అది అనుభవానికి మాత్రమే అందుతుంది. కాని వస్తువు ఆలోచన పరిధిలో ఉంటుంది. రసం ఆలోచనకు సంబంధించినది కాదు. అనుభూతికి మాత్రమే అందే కావ్య పరమార్థం. అందువల్ల స్థూలంగా పాశ్చాత్య వస్తువు ప్రాచ్య ఆత్మ ఒకటిగా భావించినప్పటికి వాటికి సూక్ష్మ పరిశీలనలో వైవిధ్యం విశాలంగా కనిపిస్తుంది.

వస్తువు ఇతివృత్తం పరస్పర సంబంధం తెలిస్తే వస్తు ప్రాముఖ్యం ప్రాధిక్యం స్పష్టం అవుతాయి. వస్తువు స్థూలమైన అంశంలో సూక్ష్మంగా సూక్ష్మమైన దానిలో స్థూలంగా గోచరిస్తుంది. అంటే వస్తువు స్థూలంగా సూక్ష్మంగా రెండు రకాలుగా ఉంటుంది. వస్తువు విశాల దేశకాల పాత్ర స్థితి సంబంధించి ఉంటే ఇతివృత్తం పరిమిత స్థితికి ప్రాతినిధ్యం వహిస్తుంది. మానవీయ వస్తువు గ్రహించినప్పుడు అది సువిశాల ప్రాంగణంలో పరిభ్రమించేది అన్న సత్యం స్పష్టమే. అప్పుడు ఆయుధంతో స్వేచ్ఛ పొందిన వీరుడి కథ పరిమిత ప్రాంగణానికి చెందిన ఇతివృత్తం అవుతుంది. వస్తువు పరిమితమయినప్పుడు ఇతివృత్తం అపరిమితం కావటం గ్రహింపవచ్చు. లేశ మాత్రమయిన వస్తువును గ్రహించి అనంతమైన దేశకాల పాత్ర సన్నివేశ కల్పనలో ఇతివృత్త నిర్మాణం జరగటం గమనింపవచ్చు. దీనికి దైవీయ వస్తువు నిదర్శనం. దైవీయ వస్తువు పరిమితం అయితే 18 పురాణాలు, 18 ఉప పురాణాలు, కథా ప్రణాళిక అపరిమిత లక్షణంతో ఒప్పే ఇతివృత్తం అవుతుంది. స్థూల వస్తువు సూక్ష్మ ఇతివృత్తానికి, సూక్ష్మ వస్తువు స్థూలమైన ఇతివృత్తానికి దోహదం కావటం సహజ పరిణామమే.

జుత్తున్నమ్మ ఏ కొప్పుయిన పెట్టుకొంటుందన్నట్లుగా వస్తువుంటే కళాకారులు ఏ ఇతివృత్తమయినా సంకల్పిస్తారు. సాహిత్య చర్యకు ప్రముఖావసరం వస్తువు. ప్రయోగావసరం ఇతివృత్తం. ఒక వస్తువే అనేక ఇతివృత్తాలుగా మారుతుంది. ఇతివృత్తాలు మారుతాయి. కాని వస్తువు మారదు. అనేక ఇతివృత్తాలు అంతస్సారం కాచి వడబోసి క్రోడీకరించి దర్శిస్తే వస్తువు గోచరమవుతుంది. ఈ వస్తువు మారదు. అయితే ఇది ఇతివృత్తాలుగా పరిణామం చెందుతుంది.

తెలుగు సాహిత్యంలో నన్నయ కాలం నుంచి వర్తమాన కాలం దాకా ఉన్న సాహిత్యం విశాలమయి ఉంది. దీని ప్రక్రియలు చాలా ఉన్నాయి.ఇతివృత్తాలు చాలా ఉన్నాయి. రచనా విధానం దాని వ్యవస్థ సుప్రతిష్ఠితంగా ఉంది. ఇదంతా రాశిపోసి చూచి వస్తువు దర్శనం చేస్తే అవి స్థూలంగా చారిత్రక వస్తువు దైవీయ వస్తువు, వినోద వస్తువు మానవీయ వస్తువుగా గుర్తింపవచ్చు. ఈ చతుర్విధ వస్తుగతంగా తెలుగు సాహిత్యమంతా ఒదిగి ఉంటుంది. ఈ వస్తు మౌలిక గుణం తెలిస్తే తెలుగు సాహిత్య గుణాలు తెలుస్తాయి. ఈ వస్తు పరిణామం స్పష్టమయితే తెలుగు సాహిత్యంలో పరిణామం స్పష్టమవుతుంది. ఈ స్పష్టమయ్యే స్థితి దర్శనమే షాహితీ వస్తుసందర్శనం.

వస్తు వివేచన కోసం, విభిన్న ప్రభావాలతో రూపొందిన తెలుగు సాహిత్యంలోని వస్తు స్థితిని దర్శించి, ఈ సాహిత్యంలో ప్రవేశించిన ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య ప్రక్రియా తత్త్వంలో వస్తు స్వభావం గుర్తించి, వస్తువును ఇతివృత్తాన్ని వాటి పరిధిని పరికించి, వస్తు తత్త్వం వస్తు వైశిష్ట్యం గుర్తించి, తెలుగు సాహిత్యంలోని చతుర్విధ వస్తుస్థితిని గ్రహించిన తదుపరి ఈ చతుర్విధ వస్తువు తెలుగు సాహిత్యంలో పొందిన పరిణామం స్పష్టంగా దర్శించటం మునుముందు చేయవలసిన పని.

# అథస్సూచికలు

| | | |
|---|---|---|
| 1. ఆంధ్ర వాఙ్మయ పరిచయము | డా. కోరాడ మహాదేవ శాస్త్రి | పుట 9 |
| 2. నారదీయ పురాణము | డా.జి.వి.సుబ్రహ్మణ్యం | పీఠిక XLiii |
| 3. ప్రథమాంధ్ర మహాపురాణము | డా.జి.వి.సుబ్రహ్మణ్యం | పుట 8 |
| 4. ప్రథమాంధ్ర మహాపురాణము | డా.జి.వి.సుబ్రహ్మణ్యం | పుట 11 |
| 5. ప్రథమాంధ్ర మహాపురాణము | డా.జి.వి.సుబ్రహ్మణ్యం | పుట 11 |
| 6. ప్రథమాంధ్ర మహాపురాణము | డా.జి.వి.సుబ్రహ్మణ్యం | పుట 12 |
| 7. తెలుగు సాహిత్య సమీక్ష I | డా.జి.నాగయ్య | పుటలు 533, 534 |
| 8. ప్రథమాంధ్ర మహాపురాణము | డా.జి.వి.సుబ్రహ్మణ్యం | పుట 59 |
| 9. నారదీయ పురాణము | | పీఠిక XLIX |
| 10. తిక్కన కావ్యశిల్పము | డా.కేతవరపు రామకోటిశాస్త్రి | పుటలు 177,118 |
| 11. తిక్కన కావ్యశిల్పము | డా.కేతవరపు రామకోటిశాస్త్రి | పుటలు119, 120 |
| 12. ప్రథమాంధ్ర మహాపురాణము | డా.జి.వి.సుబ్రహ్మణ్యం | పుట 35 |
| 13. సంస్కృత సాహిత్య చరిత్ర | డా.ముదిగంటి గోపాలరెడ్డి | |
| | డా.ముదిగంటి సుజాతారెడ్డి | పుట 15 |
| 14. నన్నెచోడుని కవితా వైభవం | నిడదవోలు వేంకటరావు | పుట 11 |
| 15. ఆంధ్ర వాఙ్మయ పరిచయము | డా.కోరాడ మహాదేవశాస్త్రి | పుట 91 |
| 16. ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర | డా.యస్వీ.జోగారావు | పుట 95 |
| 17. తెలుగు సాహిత్య సమీక్ష II | డా.జి.నాగయ్య | పుటలు 333, 334 |
| 18. ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర | డా.యస్వీ.జోగారావు | పుట 215 |
| 19. తెలుగు సాహిత్య సమీక్ష | డా.జి.నాగయ్య | పుట 342 |
| 20. తెలుగులో చాటు కవిత్వం | ప్రొ.జి.లలిత | పుట 20 |
| 21. తెలుగులో చాటు కవిత్వం | ప్రొ.జి.లలిత | పుట 22 |
| 22. తెలుగులో పరిశోధన | పుటలు 64, 65 | |
| 23. తెలుగు చాటువు పుట్టుపూర్వోత్తరాలు | డా.చల్లారాధాకృష్ణశర్మ | ఆప్తవాక్య VIII |
| 24. తెలుగులో చాటు కవిత్వం | ప్రొ.జి.లలిత | పుట 40 |
| 25. తెలుగులో పరిశోధన | డా.చల్లారాధాకృష్ణశర్మ | పుట 133 |
| 26. తెలుగు సాహిత్య సమీక్ష | డా.జి.నాగయ్య | పుట 119 |
| 27. తెలుగువాణి | నిడదవోలు వేంకటరావు | పుట 158 |
| 28. ఆంధ్రశతక సాహిత్య వికాసము | డా.కె.గోపాలకృష్ణారావు | పుట 5 |
| 29. తెలుగు సాహిత్య సమీక్ష II | డా.జి.నాగయ్య | పుటలు 114 |

30. తెలుగులో పరిశోధన | డా.చల్లారాధాకృష్ణశర్మ | పుట 122
31. సాహిత్య దర్శనము | డా.కాకర్ల వేంకటరామనరసింహం | పుట 438
32. సాహిత్య శిల్ప సమీక్ష | పింగళి లక్ష్మీకాంతం | పుట219
33. సాహిత్య దర్శనము | డా.కాకర్ల వేంకటరామనరసింహం | పుట 459
34. తెలుగు సాహిత్య వికాసం | డా.కె.కె.రంగనాథాచార్యులు | పుట 124
35. సాహిత్య భావలహరి (మోనోగ్రాఫ్) | డా.యస్వీ.జోగారావు | పుట 53
36. రజతరంజని | డా.జి.వి.సుబ్రహ్మణ్యం | పుట 4
37. రజతరంజని | డా.జి.వి.సుబ్రహ్మణ్యం | పుట 2,3
38. రజతరంజని | డా.జి.వి.సుబ్రహ్మణ్యం | పుట 4
39. రజతరంజని | డా.జి.వి.సుబ్రహ్మణ్యం | పుట 118
40. సాహిత్య భావలహరి | డా.యస్వీ.జోగారావు | పుట 53
41. ఆధునికాంధ్ర కవిత్వము | డా.సి.నారాయణరెడ్డి | పుట 512
42. సాహిత్య భావలహరి | డా.యస్వీ.జోగారావు | పుట 139
43. సాహిత్య దర్శనము | డా.కాకర్ల వేంకటరామనరసింహం | పుట 139
44. సాహిత్య భావలహరి | డా.యస్వీ.జోగారావు | పుట 139, 140
45. సాహిత్య భావలహరి | డా.యస్వీ.జోగారావు | పుట 152
46. నాట్యశాస్త్రము | పోణంగి అప్పారావు
47. Sanskrit English Dictionary | Monier William
48. Sanskrit English Dictionary | Vaman Sivram Apate
49. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు
50. The Students English Sanskrit Dictionary | Vaman Sivaram Apte
51. English Telugu Dictionary | C.P.Brown
52. Poetics | Aristotle
53. Oxford's Advanced Learners Dictionary of Current English | A.S.Hornby
54. Oxford Dictionary Vol.VII
55. Concise Oxford Dictionary
56. Collin Cobuild English Language Dictionary
57. Long New World Dictionary
58. Webster's New World Dictionary
59. Chambers Universal Learners Dictionary
60. Dictionary of Literary Terms | Gagan Raj

61. Dictionary of Modern Critical Term — Roger Fowler
62. తెలుగు ఇంగ్లీషు నిఘంటువు — సి.పి.బ్రౌను
63. శ్రీ సూర్య రాయాంధ్ర నిఘంటువు
64. తెలుగు నిఘంటువు — జి.యన్.రెడ్డి
65. Telugu English Dictionary — P.Sankaranarayana
66. Sanskrit English Dictionary — Theodore Beafey
67. Sanskrit English Dictionary — Vaman Sivaram Apte
68. Sanskrit English Dictionary — Monier William
69. ఆంధ్రజ్యోతి దినపత్రిక 17-221992
వ్యాసం కవిత్వంలో వస్తురూపాలు — డా.పాపినేని శివశంకర్
70. కథానిక స్వభావ స్వరూపాలు — డా.పోరంకి దక్షిణామూర్తి — పుట 239
71. నవలా శిల్పం — వల్లంపాటి వేంకటసుబ్బయ్య — పుటలు 21, 22
72. Sanskrit English Dictionary — Vaman Sivaram Apte.
73. English Telugu Dictionary — C.P.Brown
74. Oxford's Advanced Learners Dictionary of Current English — A.S.Hornby
75. Concise Oxford Dictionary
76. Oxford Dictionary Vol.XI
77. Collin Cobuild English Language Dictionary
78. Longman Active Study Dictionary
79. Webster's New World Dictionary
80. Chambers Universâl Learners Dictionary
81. A Glossary of Literary Terms — M.H.Abrams
82. Dictionary of Literary Terms — Gangan Raj
83. A Dictionary of Modern Critical Terms — Roger Flower

# 2. చారిత్రక వస్తువు

తెలుగు సాహిత్యంలోని ఇతిహాస రచనం చారిత్రక కోణం ప్రకటిస్తుంది. తెలుగులో వెలువడ్డ ఇతిహాస సాహిత్యం సంస్కృతం నుంచి అనుసృజనంగా అవతరించింది. ఆరంభంలోని భారత రామాయణాల అనువాదం చారిత్రక మౌలికాంశాలను పొదివి పట్టుకొన్న సాహిత్య తత్త్వం విశదం చేసింది. సంస్కృతంలో భారత రామాయణ సృష్టికి మూలమైన చరిత్రను గుర్తింపదలిస్తే భారతదేశ చరిత్ర గుర్తించే అవకాశం ఏర్పడుతుంది. భారతదేశంలో సంస్కృత భాష అతి ప్రాచీన సాహిత్య భాషగా గోచరమవుతుంది. సంస్కృతంలో రామాయణ భారతాలు అతిప్రాచీన సాహిత్య స్వరూపం ప్రదర్శిస్తాయి.

ఈ ఇతిహాస రచనకు మూలమైన భాష, దాన్ని కలిగి ఉన్న దేశం అది కలిగి ఉన్న చరిత్ర స్పష్టం కావలసిన అవసరం ఉంది. భారతదేశంలోని అతి ప్రాచీన నాగరికతను, సింధునదీ నాగరికతగా ఈ శతాబ్దం గుర్తించింది. అంతకు పూర్వం భారతదేశంలోని మానవుడి మనుగడ గుర్తించే చారిత్రక అవకాశాలు మృగ్యం. సింధునదీ నాగరికతను క్రమ పరిశోధన ఫలితంగా హరప్పా నాగరికతగా భావిస్తున్నారు. ఈ నాగరికత క్రీ.పూ. 2500 నుంచి 1500 సంవత్సరాల మధ్య కాలంలో విలసిల్లినట్లు చారిత్రక పరిశోధకులు నిర్ణయించారు. ఈ నాగరికత విలసిల్లిన భూభాగం ఉత్తర భారతదేశంగా గుర్తింపు పొందింది. హరప్పా సంస్కృతి గోచరమయిన ప్రదేశం నేటి పంజాబు, హర్యానా, సింధ్, బెలూచిస్థాన్, గురజాత్ మధ్య ఉంది. అది ఉత్తరప్రదేశ్ పశ్చిమ భూమధ్యరేఖ దాకా, అటు కాశ్మీరు దాకా ఇటు నర్మదానది దాకా వ్యాపించి ఉన్నట్లు తర్వాతి కాలంలో విశదమయింది.

సింధునదీ నాగరికతగా, మొహంజదారో హరప్పా నాగరికతగా ప్రసిద్ధి చెందిన ప్రాచీన భారతీయ సంస్కృతి వికాసం దాదాపు వెయ్యి ఉత్తర హిందుస్థానపు ప్రదేశాలకు సంబంధించి ఉన్నట్లుగా స్పష్టమవుతుంది. ఇందులో ఆది సంస్కృతి విలసితంగా ఆరుపట్టణాలు ఉన్నాయి. అవి పంజాబులోని హరప్పా, సింధులోని మొహంజాదారో కాక, సింధులోని మొహంజదారోకి 130 కి.మీ. దూరంలో ఉన్న చనుద్వారో, గుజరాత్‌లోని లోథల్, ఉత్తర రాజస్థాన్‌లోని కాళీభంజన్, హర్యానాలోని బాగావళి నగరాలు. మిగతావి పల్లెలు. మొత్తం మీద నేటి భారతదేశం పాకిస్థాన్‌లను కలుపుకొని అతి ప్రాచీన భారత సంస్కృతి వికాస ప్రాంతం గోచరమవుతూ ఉంది.

మొహంజదారో హరప్పా నాగరికతా కాలం క్రీ.పూ. 2500-1500 కాగా, ఆ నాగరికత వికాస కాలంలో అంటే క్రీ.పూ.2500-1800 సంవత్సరాల మధ్యకాలం. ఈ కాలంలో ఆర్యులు భారతదేశం పట్ల ఆకర్షితులయి క్రమంగా రాసాగారు. అతి ప్రాచీన భారతీయ సంస్కృతి వికాస దశ తిరోగమనం చెందింది. క్రీ.పూ. 1500 నాటికి ఆర్యులు భారతదేశంలో స్థిరపడ్డారు. హరప్పా పట్టణ నాగరికత అడుగంటింది. పల్లె జీవితం వికాసం

పొందింది. ఆర్యుల సంచార జీవనం వల్ల స్థిర జీవనం కంటే చర జీవనం ప్రముఖమయింది.

క్రీ.పూ. 1500 ప్రాంతంలో ఆర్యులు భారతదేశంలో నివాసం ఏర్పరుచుకొన్నారు. ఆర్యులు ఒక్కసారిగా దండయాత్ర చేసి భారతదేశం ప్రవేశించలేదు. రెండు మూడు వందల సంవత్సరాల కాలంలో క్రమ క్రమంగా చిన్న చిన్న గుంపులుగా అంతగా గుర్తింపు లేకుండా భారతదేశంలో ప్రవేశించారు. నివాసం ఏర్పరచుకొన్నారు. మూడు వందలు ఏళ్ళు గడిచేటప్పటికి అతి విశిష్టంగా విలసిల్లిన ప్రాచీన భారతీయ జనజీవనం, వాళ్ళ పట్టణాలు అంతరించి పోసాగాయి. ఆర్యులు నివాసాలు గానీ, చారిత్రక అవశేషాలు కానీ, వాళ్ళ వైశిష్ట్యం తెలిపేవి లభ్యం కావు. ఆర్యులు ప్రత్యేకతను సాహిత్యం తెలుపుతుంది. అందులో ప్రధానమయింది, మొదటిది ఋగ్వేదం. ఆర్యులు ఆగమనానికి కారణమయిన గుఱ్ఱాలు రథాలు వాళ్ళ విజయాలకు కూడా కారణమయ్యాయి. వాళ్ళ సంచార జీవనులు, పశువుల మందలు వాళ్ళ సంపద. వ్యవసాయం ప్రాచీన భారతీయులకు తెలిసినట్లుగా వీళ్ళకు తెలియదు. ప్రాచీన భారతీయులకు తెలిసిన లోహం రాగి. వీళ్ళకు తెలిసిన లోహం ఇనుము. ఆర్యుల విజయానికి ఇనుము ప్రముఖ పాత్ర వహించింది. భూమి ప్రాచీన భారతీయులకి ప్రధానమయిన ఆస్తి. వీళ్ళకు పశువుల మందలు ప్రముఖంగా ఆస్తి. వాళ్ళకు భూసంపద, వీళ్ళకు పశుసంపద జీవనాధారం.

ఆర్యులు ఉత్తర హిందూ దేశంలో స్థిరపడుతున్న కాలంలో భారతదేశంలో పూర్వం నివసిస్తున్న ప్రజలతో పోరాడవలసి వచ్చింది. ముందు వెనుకలుగా భారతదేశంలో వచ్చిన ఆర్యులు తమతో తాము భూమి కోసం గోవుల కోసం యుద్ధాలు చేయక తప్పలేదు. ఆ దశను మహాభారతం ప్రతిబింబించింది. వాళ్ళు దక్షిణ భారతదేశంలోకి రావలసిన పరిస్థితులు ఏర్పడ్డప్పుడు చేసిన ప్రయత్నం కూడా యుద్ధాలకు తోవ తీసింది. ఈ స్థితిని రామాయణం ప్రతిఫలించింది.

భారతదేశానికి ఈ పేరు కౌరవ పాండవుల వల్ల రాలేదు. భారతదేశానికి భరత నామాంకితమయిన తెగవల్ల ఆ పేరు వచ్చింది. భారత జాతిలోని అనేకమైన తెగల్లో 'భరత' తెగ విశిష్టమై ప్రత్యేకతను కలిగిఉన్న విస్తృత ప్రజా సమూహం. పాండవుల భరతుడు ఆర్యసంస్కృతిలో భాగం. భారతదేశం అది భరత తెగ మూలంగా వచ్చిన పేరు. భారతం ఆర్యజాతి కారణంగా వచ్చిన గ్రంథం. భరతుల తెగను గౌరవించే లక్షణంగా ఆర్యులు ప్రాచీనుల నామాన్ని గౌరవించటమే భరతుడు పేరుగా ఏర్పడింది.

రామాయణం ఆదికావ్యంగా, వాల్మీకిని ఆదికవిగా చరిత్ర అస్పష్టంగా ఉన్నప్పుడు సాహిత్యకారులు భావించారు.. కాని, నిజానికి భారతం ముందుగా రచితమయింది. రామాయణం అనంతర కాలంలో ఆవిర్భవించింది.ఈ రెండు ఇతిహాసాలు ఏదో ఒక కాలంలో అకస్మాత్తుగా సంపూర్ణ స్వరూపం పొందలేదు. భారతానికి వ్యాసుడు ఒక్కడే కవి కాదు. అలాగే రామాయణానికి వాల్మీకి ఒక్కడే కర్త కాదు. అవి నిజానికి ఆర్యకర్తృకాలు. ఆర్య సమాజ సామూహిక కర్తృకాలు. అవి కొన్ని శతాబ్దాల పాటు రూపం దిద్దుకొంటూ వచ్చాయి.

ఋగ్వేదం క్రీ.పూ. 1500-1000 సంవత్సరాల మధ్యకాలంలో రూపందిద్దుకొంది. మిగతా వేదాలు బ్రాహ్మణాలు, ఉపనిషత్తులు క్రీ.పూ. 1000-500 సంవత్సరాల మధ్యకాలంలో అవతరించాయి. క్రీ.పూ. 1000-00 సంవత్సరాల మధ్యకాలంలోని ఆర్యుల భారతదేశ నివాస దశను ప్రతిబింబించే క్రీ.పూ. 900 సంవత్సరాల కాలం నాటి భారతగాథ క్రీ.పూ.500 సంవత్సరాల ప్రాంతంలో ఆద్యరూపం సంతరించుకొంది. క్రీ.పూ.500 సంవత్సరాల కాలంలోని ఆర్యులు దక్షిణ దేశాభిముఖ గమనాన్ని తెలిపే రామాయణ గాథ దాదాపు భారత కాలానికి దగ్గర దగ్గరగా ప్రారంభమయింది.

ఈ రెండు ఇతిహాసాలు ఒకే కాలంలో ఒకే కవి సృష్టి కావు. మహాభారతానికి ఆది రూపం ఇచ్చిన స్రష్ట వ్యాసుడే. రామాయణానికి ఆద్య దశ ఇచ్చినవాడు వాల్మీకే. ఆ రెండు ఇతిహాసాలు ఆర్యుల సృష్టులు. అవి ఆర్యులు వ్రాసిన ఇతిహాసాలు. అవి ఆర్యుల చారిత్రక సాహిత్య నిర్మాణాలు. ఆర్యులైన వ్యాస వాల్మీకులిద్దరు మాత్రమే వాటి స్రష్టలు కారు. అవి ఆర్యులు సామూహికంగా సృష్టించుకొన్న ఇతిహాసాలు. ఈ అభిప్రాయం ఇంకా స్పష్టం కావాలి.

క్రీస్తు పూర్వం నాల్గవ శతాబ్దిలో ఆద్యరూపం సంతరించుకొన్న భారతంలో 8800 శ్లోకాలున్నాయి. దానికప్పటి పేరు 'జయ'. ఆర్యుల యుద్ధాలు విజయాలు స్తుతించే ఇతిహాసమిది. దీన్ని 24,000 శ్లోకాలకు పరిమితంగా పెంచి ఆది ప్రాచీనమైన తెగ 'భరత' పేరిట భారతంగా పిలిచారు. ఆపైన లక్ష శ్లోక పరిమితంగా పెంచి మహాభారతమని దీన్ని పిలవసాగారు. అలాగే రామాయణం కూడా మొదట్లో ఆరువేల శ్లోకాలు కలిగి ఉంది. అనంతర కాలంలో దాన్ని పెంచి పన్నెండు వేల శ్లోకాలు కావించారు. మళ్ళీ దాన్ని రెట్టింపు చేసి 24,000 శ్లోకాలు ఇతిహాసంగా రూపొందించారు.

భారతంలోని కథాకథనమంతా కురు పాండవ సంగ్రామానికి సంబంధించిన సమాచారం. ఇది ఆర్యులు తమలో తాము కలహించే దశను ప్రతిబింబించింది. ఈ కురు పాండవ సంగ్రామం మలివైదిక యుగానికి సంబంధించిన కథ. భారతంలోని వర్ణనాత్మక కథాభాగం, చిన్న కథలు, ఉపాఖ్యానాలు ఉన్న భాగం వైదిక యుగానంతర కాలానికి సంబంధించిన కథ. ఇందులోని ఉపదేశాత్మక భాగలన్నీ మౌర్య గుప్త చక్రవర్తుల అనంతర కాలానికి చెందిన కథలు. ఇందులో ప్రధానంగా మూడు దశలు ఉన్నాయి. అది వైదిక యుగానికి, అనంతర దశ వైదిక యుగానంతర కాలానికి, ఆఖరు దశ గుప్తుల కాలానికి చెంది ఉన్నాయి. ఈ మూడు చారిత్రక దశల్లో మొదటి దశ క్రీ.పూ. 1000-500 కాలాన్నీ, రెండవ దశ క్రీ.పూ.500- క్రీ.శ.400 కాలాన్ని, మూడో దశ క్రీ.శ.400-600 కాలాన్ని తెలుపుతుంది. దీని వల్ల భారతం క్రీ.పూ. 500 సంవత్సరాలలో ప్రారంభమయి క్రీ.శ. 600 దాకా రచన రూపొందుతూనే ఉందని స్పష్టం. ఇంతకాలం వ్యాసుడు బ్రతికి ఉండడని,వ్యాసుడు ఒక్కడే రాయలేదని, 1100 సంవత్సరాల పాటు ఆర్యులు భారతాన్ని సృష్టించుకొన్నారని, గుర్తించటం కష్టం కాదు.

అలాగే రామాయణం కూడా భిన్న రచనా దశలను కలిగి ఉంది. రామాయణం అయిదు విభిన్న దశలను కలిగి ఉంది. దానికి నేటి సంపూర్ణ రూపం రావటానికి క్రీ.పూ.

500 సంవత్సరాల నుంచి క్రీ.శ.1200 సంవత్సరాల మధ్యకాలం అవసరమయింది. భారతం 1100 సంవత్సరాలలో రూపం దిద్దుకొంటే రామాయణం నేటిరూపాన్ని పొందటానికి 1700 సంవత్సరాల కాలం కావలసి వచ్చింది.

భారత రామాయణాల ప్రారంభం గూర్చి విభిన్నాభిప్రాయాలున్నప్పటికి భారతం ఆర్యుల మొదటి దశలను చిత్రీకరిస్తే, రామాయణం అనంతర దశలను చిత్రీకరిస్తుంది. భారత సంపూర్ణ రూపం ముందుగా, రూపొందితే, రామాయణ సంపూర్ణరూపం చాలా ఆలస్యంగా సిద్ధించింది. సంప్రదాయంలో రామాయణం ఆదికావ్యంగా, వాల్మీకి ఆదికవిగా ప్రసిద్ధమయినా, భారతం తొలిరచన కాగా రామాయణం మలి రచనగా భారతార్యులు సృష్టించు కొన్నారని గుర్తించటం, ఆర్యమహర్షి భారత కర్తగా, అనార్య మహర్షి రామాయణ కర్తగా గ్రహించటం, ఆర్యులు అనార్యులతో కలసిపోతున్న సామాజిక దశలను తెలుసుకొనే వీలు కల్పిస్తాయి. దాదాపు సమకాలంలో ప్రారంభమయిన భారత రామాయణాలలో రామాయణం ఈషన్మాత్రంగా, ముందుగా ప్రారంభమయి ఉండవచ్చు. అందువల్ల దాన్ని ఆదికావ్యమని పిలిచి ఉండవచ్చు.

క్రీస్తు పూర్వం అయిదు-నాలుగు శతాబ్దాల మధ్యకాలంలో ప్రారంభమయిన భారత రామాయణ రచనా నిర్వహణం అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్న కాలంలోనే పురాణ రచన ఆరంభమయింది. పురాణాలు ఆర్యుల ప్రాచీనతను సృష్టి ఆరంభం నుంచి వివరించటానికి ప్రయత్నిస్తాయి. దైవ వ్యవస్థతో మానవ వ్యవస్థకున్న సంబంధం తెలుపుతాయి. సృష్టి చేసిన వాళ్ళు, ప్రతి సృష్టి చేసివాళ్ళ సృష్టిని విశదీకరించిన,వివరించిన, శాసించిన వాళ్ళు, ఆ శాసనంతో జీవించిన వాళ్ళు, ఆ జీవించిన వాళ్ళ వంశానుగతమైన మహాత్ముల జీవితాలు విపులంగా చిత్రీకరణ పొందాయి. ఈ పురాణాలు భారత రామాయణాల మాదిరిగా పరిమితంగా లేవు. భారత కథ ఒక్కటే ఉపాఖ్యానాలతో, ఉపకథలతో పెరిగింది. అలాగ్గే రామాయణ కథ ఒక్కటే పూర్వాపర అనుసంధానంతో విస్తరించింది. పురాణం ఒక్కటీ కాదు. అవి పద్దెనిమిది. అవి అంతటితో ఆగలేదు. మరో పద్దెనిమిది ఉప పురాణాలు చేరాయి. అవి అంతటితో ఆగలేదు. పురాణ ధర్మప్రరోచకంగా, తదంతర భాగ వినిర్మితంగా, పురాణ సాహిత్యమే విశేషంగా విస్తరిల్లుతూ రూపాంతరం చెందుతూ పెరుగుతూ వచ్చింది.

భారత రామాయణ రచనా ప్రారంభ కాలం తరువాత పురాణ రచన ప్రారంభమయి, అవి రూపాంతరం చెందుతున్న కాలంలోనే, ఇవీ పెరుగుతూ వచ్చి వాటి ప్రభావం, వీటి మీద, వీటి ప్రభావం వాటి మీద పడుతున్న సమయంలో ద్రవరూపంలో ఉన్న భారత రామాయణ ఇతిహాసాలు ఘనీభవించటం జరుగుతున్న కాలంలోనే పురాణాలు అవతరించటం ఆరంభమయింది. సంస్కృతంలో నేటి భారత ఇతిహాస రూపం క్రీ.శ. 6వ శతాబ్దిలో, రామాయణ రచనారూపం 12 వ శతాబ్దిలో పురాణ సాహిత్య సర్వసంపూర్ణ స్వరూపం 18వ శతాబ్దిలో స్థిరపడినా భారతీయ భాషల్లో వీటి నిర్మాణం ఇంకా జరుగుతూ వస్తూ ఉంది.

చారిత్రక నేపథ్యం సాహిత్య నేపథ్యం కలగలసి స్థూలంగా చూస్తే భారతం రామాయణ పురాణాలు ఈ క్రమంలో రచనా రూపాలుగా ప్రారంభమయి, సంస్కృతంలో ఒక విశిష్ట రూపం - వాటి వర్తమాన రూపం - సంతరించుకొన్నాయి.

ఈ సందర్భంలో గుర్తుంచుకోవలసిన మరో చారిత్రకాంశం ఉంది. జైన బౌద్ధమతాల వ్యాప్తి ఒకటి మరువరాని సందర్భం. జైన బౌద్ధ మతాలు భారత రామాయణ పురాణాలు సృష్టించుకొన్న హిందూమతాన్ని తిరస్కరించిన మతాలు. జైన బౌద్ధ మతాలు సృష్టించుకొంటున్న సాహిత్యం మరో ప్రక్క వ్యాప్తి పొందుతూ ఉంది. జైనం మొదటి తీర్థంకరుడి నుంచి చూస్తే దాదాపు క్రీ.శ. 9వ శతాబ్దం నుంచి ఆరంభమయినట్లు భావింపవచ్చు. అయితే జైన సంప్రదాయం 6వ శతాబ్ది నుంచి విస్పష్టంగా సంభావింపవచ్చు. వర్ధమాన మహావీరుడు అరిషడ్ వర్గాన్ని పంచేంద్రియ ప్రలోభాలను జయించినవాడు కావటం వల్ల జినమహర్షిగాను, అతడి మతం జైనంగానూ, ప్రసిద్ధంకావటం గమనార్హం. ఇందువల్ల జైనమతం క్రీస్తు పూర్వం ఆరు-ఐదు శతాబ్దాల కాలంలో మతంగా స్పష్టమయిన పునాదులు వేసుకొంది. గౌతమ బుద్ధుడు అనబడే సిద్ధార్థుడు క్రీ.పూ. 6వ శతాబ్దిలో జన్మించాడు. వర్ధమాన మహావీరుడికి సమకాలికుడు. బౌద్ధమతం కూడా క్రీ.పూ. 5వ శతాబ్దికే విపుల ప్రాచుర్యం పొందింది.

హిందూ మతంలోని యజ్ఞయాగాది సందర్భాలలో జరిగే హింస జైన బౌద్ధమతాలు తిరస్కరించి, అహింసను ప్రధాన సూత్రంగా నూత్న మతాలు స్థాపించాయి. వర్ణవ్యవస్థను ప్రతిష్ఠించి బ్రాహ్మణాధిక్యం స్థాపించే హిందూ మతాన్ని తిరస్కరించిన జైన బౌద్ధమతాలు మానవ సమానత్వం ప్రబోధించాయి. హిందూ మతంలోని బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర తరతమ ఆధిక్య అనాధిక్య క్రమాన్ని ఈ మతాలు తిరస్కరించాయి. క్షత్రియుడికి ఉన్న ఆది వైదిక దశలోని ప్రాధాన్యం క్రమంగా తగ్గి హిందూ మతంలో బ్రాహ్మణాధిక్యం పెరగటంతో ఈ జైన బౌద్ధమతాలు ఈ ఆధిక్యాన్ని ప్రశ్నించే స్థితిని పొందాయి. భారత రామాయణ పురాణ సృష్టి అంతా ఆర్య దృష్టితో బ్రాహ్మణాధిక్యంతో జరగగా, మానవ సమానతా దృష్టితో జైన బౌద్ధమత సాహిత్య నేపథ్య భూమిక నిలిచింది. వాస్తవానికి బ్రాహ్మణాధిక్యం ప్రశ్నించే క్షత్రియ సృష్టిగా గోచరమయ్యే మతాలు జైన బౌద్ధాలు. అవి క్షత్రియులు స్థాపించిన మతాలు. బ్రాహ్మణ వ్యతిరేకతను లక్ష్యంగా ఉంచుకొన్న మతాలు. బ్రాహ్మణ్యం సంపూర్ణంగా తిరస్కరించిన మతాలు.

జైన బౌద్ధాలలో సిద్ధాంత దృక్పథంగా జైనం, ఆచరణీయ మతం బౌద్ధం స్థిరమయ్యాయి. నాడు జైన బౌద్ధాలు స్వీకరించిన ప్రజలు హిందూ మతం ఉనికిని ప్రశ్నించే పరిస్థితి ప్రబలమయింది. జైన బౌద్ధాలు ప్రజా మతాలుగానే కాక, ప్రభువుల మతాలు కూడా అయ్యాయి. ఈ మతాలు క్రీ.పూ. 5వ శతాబ్ది నుంచి విపుల వ్యాప్తి పొందసాగాయి.

వర్ధమాన మహావీరుడికి గౌతమ బుద్ధుడికి సమకాలికుడైన హర్యంక వంశ ప్రముఖుడు మగధ రాజ్య ప్రాభవ ప్రాధిక్య ప్రాణదాత బింబిసారుడు. (క్రీ.పూ.544-493) బౌద్ధమతం స్వీకరించాడు. అశ్వఘోషుడు వ్రాసిన బుద్ధచరిత్ర ఈ కాలంలోనే వెలువడింది.

హర్యంక వంశం తరువాత శిశునాగ వంశం (క్రీ.పూ.375 ప్రాంతం దాక) నంద వంశం (క్రీ.పూ.324 దాకా) మగధను పరిపాలించిన రాజవంశాలు, బింబిసారుడు దృక్పథంలోనే కొనసాగాయి. ఈ నందవంశమే ఆర్యవ్యవస్థ ఆర్థిక ప్రణాళిక రచయిత అర్థశాస్త్ర రచయిత, కౌటిల్యుడు అనబడే చాణుక్యుడు ప్రతీకార ద్వేషాగ్నికి దగ్ధమయిపోయి మౌర్య సామ్రాజ్య స్థాపనకు కారణమయింది. చంద్రగుప్త మౌర్యుడు జైన శ్రవణుడుగా మతం స్వీకరించి, చివరి దశలో జైన శ్రావణ బెళగోళలో మరణించాడు. ఆ తర్వాతి బిందుసారుడు, అతని కుమారుడు అశోకుడు, బౌద్ధ మత వ్యాప్తికి కారకులయ్యారు. కళింగ యుద్ధం తరువాత బౌద్ధ మత దృష్టి నిష్ఠ పెరిగిన అశోకుడు బౌద్ధమత వ్యాప్తికి రాజకుటుంబ సభ్యులను కూడా వినియోగించటం, దేశ దేశాలకు బౌద్ధ రాయబారులను పంపటం, మత వ్యాప్తికి ధర్మవ్యాప్తికి పాటుపడటం విశేష కృషిగా గుర్తింపు పొందాయి. బౌద్ధ సాహిత్యం అతి విస్తృతంగా వ్యాప్తి పొందింది.

క్రీ.పూ. 185-72 ప్రాంతంలో మౌర్యవంశం పతనం తరువాత శుంగులు కణ్వులు బ్రాహ్మణులై వైదిక మత ప్రచారం చేశారు. వీళ్ళు బౌద్ధులను హింసించారు. ఈ దశలో విదేశీ దండయాత్రలు జరిగి, శకులు, కుషాణులు వచ్చి భారతదేశ భాగాలను ఆక్రమించుకొని పాలింపసాగారు. కుషాణులలో ప్రముఖుడు కనిష్కుడు (క్రీ.శ.78-101) బౌద్ధమతం స్వీకరించాడు. ఈతని కాలంలో బౌద్ధమత సభ 'సంగీతి' క్రోడీకరించిన బౌద్ధమత సిద్ధాంతాల గ్రంథం 'మహావిభాష' వెలువడింది. అశోకుని కాలంలో హీనయానం, కనిష్కుని కాలంలోని మహాయానం బౌద్ధంలోని చీలికలకు మూలమయ్యాయి. కనిష్కుడి కాలంలో బుద్ధచరితమే కాదు, 'సూత్రాలంకారం సౌందరనదం' అశ్వఘోషుడు వ్రాశాడు. 'చరకసంహిత' చరకుడు వ్రాశాడు. రాజశేఖరుడు 'కావ్య మీమాంస' వ్రాశాడు. బౌద్ధ సాహిత్యం విశేషంగా సృష్టి పొందిన కాలమిది. ఆంధ్ర శాతవాహనులు (క్రీ.పూ.230-225) ఆరంభంలో బౌద్ధులుగా ఉండి, అనంతరం హైందవం స్వీకరించారు. తరువాతి పాలకులలో శైవం వైష్ణవం బౌద్ధం స్వీకరిస్తూ తిరస్కరిస్తూ సంఘర్షిస్తూ వచ్చిన చారిత్రక సన్నివేశాలు ఉన్నాయి. క్రీ.పూ. 5వ శతాబ్దం నుంచి క్రీ.శ. 5వ శతాబ్ది దాకా భారతదేశం పరిపాలించిన చక్రవర్తులు అనేకులు జైన బౌద్ధాలను స్వీకరించారు. ప్రోత్సహించారు. ప్రచారం చేశారు. హైందవం స్వీకరించిన రాజులు జైన బౌద్ధాలను తుడిచి పెట్టడానికి ప్రయత్నించారు.

ఈ రాజకీయ వాతావరణంలో భారత రామాయణ పురాణాలు అనిశ్చిత స్వరూపం నుంచి నిశ్చిత స్వరూపం పొందే దశలో సాగుతూ వచ్చాయి. ఈ సాంఘిక రాజకీయ మత వాతావరణంఈ ఇతిహాస పురాణాలు సృష్టిలో వాటి స్వభావం నిర్ణయించే స్థితిని కలిగి ఉంది. హిందూమత వ్యాప్తి కోరుతున్న ఈ ఇతిహాస పురాణాలు బ్రాహ్మణ క్షత్రియ ఆధిక్య అనాధిక్య సంఘర్షణలకు బాగా అద్దం పడుతున్నాయి. పాలకులైన క్షత్రియులు, పురోహితులైన బ్రాహ్మణులకు అణిగి మణిగి ఉన్నట్లు ప్రతి సందర్భంలోనూ భారత రామాయణాలు ప్రత్యక్ష సాక్ష్యంగా ఉన్నాయి. ఏ చక్రవర్తి అయినా, బ్రాహ్మణాధిక్యం అంగీకరింపకపోతే శప్తుడు కావటమో, రాజ్యభ్రష్టుడు కావటమో, అష్టకష్టాలు పడటమో, అగచాట్లకు గురికావటమో, స్పష్టంగా భారత రామాయణాలలో దర్శనమిచ్చి, చారిత్రక

నేపథ్యం విశదం చేస్తుంది. ఈ సాహిత్యం స్పష్టంగా అవగాహనలోకి రావాలి. దానిని తిరస్కరించిన దశలలో క్షత్రియాధిక్యం స్థాపించటానికి జైన బౌద్ధమతాలు వాటి సాహిత్యం ప్రయత్నించిన స్థితి విశదంగా దృక్పథంలో నిలవాలి.

ఉత్తర హిందూ దేశంలో భారత రామాయణ పురాణాలు సాహిత్య రూపాలుగా పరిణామం చెందుతున్న కాలంలో దక్షిణ భారతదేశంలో సంగం వాఙ్మయం తమిళ భాషలోకి అవతరించింది. క్రీ.పూ.3వ శతాబ్ది నుంచి క్రీ.శ. 4వ శతాబ్ది దాకా ఉన్న తమిళ దేశ రాజకీయ సాంఘిక జీవితానికి ఈ సాహిత్యం అద్దం పడుతుంది. ఈ సాహిత్యంలో మూడు సంగాలు ప్రసిద్ధాలు. ఆది సంగం కంటే అనంతర సంగాలలో అధికంగా సభ్యులుండేవాళ్ళు. వాళ్ళు పండితులు, కవులు, రచయితలు. వీళ్ళు సాహిత్యం సృష్టించారు. ఈ సాహిత్యాన్ని చోళ, చేర, పాండ్య రాజ్యాల ప్రభువులు ఆరాధించారు. ఈ చక్రవర్తులు వైదిక మతం పట్ల, జైన బౌద్ధమతాల పట్ల అభిమానం చూపించారు. సంగం సాహిత్యకాలంలో దక్షిణ దేశంలో వైదిక, జైన, బౌద్ధ మతాలు సమంగా ఆదరం పొందుతూ వచ్చాయి. సంగం సాహిత్యం దాక్షిణాత్య మనస్తత్వ ప్రతిబింబంగా ఉంది. ఉత్తరాది సాహిత్య ధర్మానికి భిన్నంగా ఉంది. ఈ స్థితి మీద తన ప్రభావం చూపటానికి, దక్షిణ దేశంలోని శైవం మీద ప్రతీకారం సాధించటానికి ఆర్యమతం సిద్ధం కాసాగింది. ఆ దశలో భారత రామాయణ పురాణాలు నూత్న స్వరూప స్వభావ చైతన్య సౌందర్యం సాధించుకొనే మార్పుచేర్పు కూర్పులతో రూపొందుతూ వచ్చాయి.

ఈ భారత రామాయణ పురాణాలు క్రీ.పూ.5వ శతాబ్ది నుంచి క్రమంగా ఆరంభమయి క్రీ.శ. 6, 12, 18వ శతాబ్దాల దాకా క్రమంగా కొనసాగి, అటు అంతగా ప్రజాభిమానంలేని అత్యుత్తమ సిద్ధాంత నేపథ్యం ఉన్న జైనాన్ని; ప్రజాభిమానం, ప్రభ్వభిమానం, ప్రచార సాధనాలు, సాహిత్య నిర్మాణాలు ఉన్న బౌద్ధాన్ని; దక్షిణ దేశంలోని శైవాన్ని; ద్రావిడుల సంగం సాహిత్యంలోని దాక్షిణాత్య దృక్పథాన్ని గ్రహించి, వీటిని తనలో విలీనం చేసుకోగలిగినంత చేసుకొని, తిరస్కరించగలిగినంత తిరస్కరించి, సమన్వయం సాధ్యమయినప్పుడు దాన్ని సాధించి, అసమ సందర్భాలలో వైషమ్యం ప్రకటించి, తన స్వభావాలను పటిష్ఠం కావించుకొని తిరుగులేని స్పష్ట సమాజ సందేశ సమర్థంగా రూపొంది శాశ్వత రూపం పొందాయి. ఇంతకాలం, ఇంత దేశం, ఇంత జనం కోరిక సాహితీ రూపంగా ఈ ఇతిహాస పురాణాలు సిద్ధించాయి. సంఘంలోని తమ ఉనికిని స్థిరపరచుకోవటానికి ప్రయత్నించిన ఆర్యులు భారతవర్షాన్ని ఆర్యవర్తం కావించారు. తమ ఆగమనాన్ని స్థిరపరచుకొని తమ ఉనికికి అర్థం ఏర్పరచుకొని, తమ లక్ష్యం సాధించుకొన్న ఆర్యుల ఆలోచన విధానానికి జీవన దృక్పథానికి ప్రతిబింబాలయిన భారత రామాయణ పురాణాలు క్రీస్తు పూర్వం 5వ శతాబ్ది నుంచి క్రీస్తు శకం పదో శతాబ్దం దాకా ఉన్న భారతదేశ చారిత్రక సత్యాలకు అక్షర రూపాలు. పదకొండో శతాబ్దం నుంచి ఈ సాహిత్య స్వరూప స్వభావాలు తెలుగులో కూడా లభించటం ఆరంభమయింది.

2.1. భారత చరిత్ర : నన్నయ సంస్కృతం నుంచి శ్రీ మహాభారతం అనువాదం చేశాడు. ఈ అనువాదం పునఃసృజనమంతటి విశిష్టంగా కావించాడని ప్రసిద్ధి. అందుకే

అది అనువాదం కాదు అనుసృజనం అని కూడా అనటం ధర్మంగా ఉంది. అనువాదమయినా, అనుసృజనమయినా మౌలిక భారత ధర్మ స్వరూపం తెలుగులోనే సక్రమంగానే అవతరించింది. నన్నయ భారతాంధ్రీకరణం క్రీ.శ.1022-1063 మధ్యకాలంలో క్రీ.శ.1051 తర్వాత జరిగి ఉంటుందని పరిశోధకులు భావించారు. తిక్కన 13వ శతాబ్ది ఆరంభంలో పుట్టి ఆ శతాబ్దాంతంలో గతించినట్లు భావించి క్రీ.శ. 1270 ప్రాంతంలో భారతాంధ్రీకరణం ప్రారంభించి ఉండవచ్చునని తలపోశారు. ఎఱ్ఱన క్రీ.శ.1280 ప్రాంతంలో జన్మించి 1360 దాకా జీవించి క్రీ.శ.1340 ప్రాంతంలో అరణ్య పర్వశేషం ఆంధ్రీకరించి ఉంటాడని తలంచారు. మొత్తం మీద భారతాంధ్రీకరణం కవిత్రయ కృషిగా క్రీ.శ. 1022 నుంచి 1360 మధ్యకాలంలో సుమారు 340 సంవత్సరాల కాలంలో జరిగినట్లుగా గుర్తింపవచ్చు. తెలుగులో భారతం సంపూర్ణంగా వెలువడటానికి దాదాపు మూడు దశాబ్దాల కాలం పట్టింది.

తెలుగులో భారత నిర్మాణానికి రెండు ప్రసిద్ధ కారణాలు గోచరమవుతున్నాయి. ఒకటి రాజరికపు అవసరం. రెండు విజ్ఞానావసరం. రాజరికపు అవసరం రాజ రాజుతో సంబంధించినది. విజ్ఞానావసరం నన్నయతో సంబంధించినదిగా దర్శించవచ్చు. రాజమహేంద్రవరం రాజధానిగా పరిపాలనం చేసిన చాళుక్యనృపతి రాజరాజనరేంద్రుడు, భారతం వినాలన్న కుతూహలం వల్ల, పురు భరత కౌరవ పాండవుల కథ పట్ల శ్రవణాసక్తి వల్ల మహాభారతబద్ధ నిరూపితార్థం ఏర్పడేటట్టుగా తన కుల బ్రాహ్మణుడైన నన్నయను కోరాడు. అలా కోరటానికిది కారణం.

'అప్పుడు జైన తీర్థంకరులు, బుద్ధుడు మొదలైన వాళ్ళు సర్వజన యోగ్యమైన మతాన్ని బోధించారు. జన సామాన్యం స్త్రీ జనం'అమ్మయ్యా' అని నిట్టూర్చి ఆ మతాలను ఆదరించి ఆచరింపసాగారు. అందుకే రాజపురుషులు వైదిక మతానికి ఆశ్రయమిచ్చినా, ఆడవాళ్ళు జైన బౌద్ధ మతాలకు దానధర్మాలు చేయడం, ఆరామాలు కట్టించడం జరిగింది. రాజరాజు కాలానికి వెయ్యేళ్ళకు ముందుగానే తెలుగునాట బౌద్ధ జైనాలు కాళ్ళు నిలదొక్కుకొన్నాయి.

ఆ మతాలు జనసామాన్యపు భాషలలో ప్రబోధాలు చేసేవి. అందరికీ తెలిసే విధంగా పాటలు గాథలు ప్రచారంలో ఉండేవి. జనమంతా ఈ మతాల వైపు ఎగబడ్డప్పుడు బ్రాహ్మణ్యానికి గంగ వెర్రులెత్తాయి. వైదిక మతాన్ని పునరుద్ధరించాలనే సంకల్పం వచ్చింది. కుమారిలభట్టు లాంటి మేధావులు బౌద్ధ జైన శాస్త్రాలను చదివి వాటిని ఖండించసాగారు. శంకరాచార్యులు బుద్ధుడిని విష్ణుమూర్తి తొమ్మిదవ అవతారం చేసి జన సామాన్యాన్ని మంత్రముగ్ధుల్ని చేశారు. అనార్యుల దేవత రుద్రుడు పురాణాలకెక్కడం ఏనాడో జరిగింది. శివపూజ వైదికమతమయింది.

రాజరాజ 'రాజా' సంకల్పం - నన్నయ శ్రీకారం-

చోళుల కాలంలో, దక్షిణాదిని శైవమతం మూడు పువ్వులూ ఆరుకాయలూ కాచినది. రాజరాజనరేంద్రుడు తన అమ్మగారింట ఈ మతాన్ని అభిమానించి ఉంటాడు.

తన తల్లిదండ్రులు జైనులైనా, తాను శైవమతాన్ని స్వీకరించాడు. తన సవతి తమ్ముడితో రాజ్యం కోసం తాను చేసిన యుద్ధాలలో బ్రాహ్మణ్యం తనకు సహాయం చేసి జనాన్ని తనవైపు తిప్పి ఉంటుంది. రాజరాజు బ్రాహ్మణ భక్తి అంతా ఇంతా కాదు. అతడు వర్ణాశ్రమ ధర్మాలపై ఆధారపడే మతాన్ని ఉద్ధరింపదలిచాడు'.(1)

విజ్ఞానపరంగా, విద్యాపరంగా కవితావిష్కరణావసరంగా భారతానువాదం చేయటం నన్నయ భావించాడు. అందుకే భారతం ఈ విధంగా విశిష్టమని గుర్తించాడు.

'ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, యాధ్యాత్మ విదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని, కవి వృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వ లక్ష్య సంగ్రహమని, యైతిహాసికు లితిహాసమనియు
పరమ పౌరాణికుల్ బహు పురాణ సముచ్చయంబని, మహిమ గొనియాడుచుండ
వివిధ వేదతత్త్వ వేది వేదవ్యాసుడాదిముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండ జేసె భారతంబు'. (2)

భారతాంధ్రీకరణమారంభించటం వల్ల నన్నయ స్వామి కార్యం, స్వకార్యం కూడా సాధించినట్లు స్పష్టమవుతుంది.

భారతేతిహాసం భారతదేశంలోని ఒకనాటి చరిత్రను భద్రం చేసిందని విమర్శకులు భావిస్తూ ఉండగా, జాకోబి, మెక్‌డొనాల్డ్ చారిత్రక వేత్తలు భారత కథను పుక్కిటి పురాణంగా తిరస్కరించారు. అది సరిగా చారిత్రక సత్యం గుర్తించని సందర్భంగా తరువాతి కాలంలో గ్రహించటమయింది. భారతేతిహాస గాథ నిజానికి భారత జీవన గాథగా గుర్తించాలి. అందుకోసం భారతేతిహాస గాథనూ, సమకాలంలోని దేశ చరిత్రను కలబోసుకొని పరిశీలిస్తే దాని చారిత్రకత స్పష్టమవుతుంది. అందువల్ల భారతేతిహాస కథాంశ పరిశీలనం అత్యవసరం అవుతుంది.

**2.1.1. భారతేతి హాస కథ :** కౌరవ వంశ పూర్వ రంగం తెలిపే కథా భాగం కొంత చారిత్రక వాతావరణం సృష్టం చేస్తుంది.

## భరత వంశం

యయాతి
↓
పూరువు
↓
(అనేక తరాల అనంతరం)
↓
దుష్యంతుడు
↓
(అనేక తరాల అనంతరం)
↓
ప్రతీపుడు

దేవాపి (తపస్వి) | శంతనుడు | బాహ్లికుడు

శంతనుడు: మొదటి భార్య(గంగ) — ఏడుగురు మరణించారు, గాంగేయుడు (యువరాజు)
శంతనుడు: రెండవ భార్య(సత్యవతి) — చిత్రాంగదుడు మరణించాడు, విచిత్రవీర్యుడు పట్టాభిషేకం
మొదటి భర్త పరాశరుడు → వ్యాసుడు

మొదటి భార్య అంబిక → ధృతరాష్ట్రుడు (గ్రుడ్డివాడు) → భార్య గాంధారి → దుర్యోధనాదులు నూరుగురు
రెండవ భార్య అంబాలిక → పాండురాజు (పాండురోగి)
మూడవ భార్య అంబిక దాసి → విదురుడు

పాండురాజు: మొదటి భార్య కుంతి, రెండవ భార్య మాద్రి

కుంతి: సూర్యుని వల్ల కర్ణుడు, యముని వల్ల ధర్మరాజు, వాయువు వల్ల భీముడు, ఇంద్రుని వల్ల అర్జునుడు
మాద్రి: అశ్వినీ దేవతల వల్ల నకులుడు, సహదేవుడు

భీముడు → హిడంబి వల్ల → ఘటోత్కచుడు
ఐదుగురి భార్య ద్రౌపది → ఉప పాండవులు

అర్జునుడు: ఉలూచి — ఇలావంతుడు; చిత్రాంగద — బభ్రువాహనుడు; సుభద్ర → అభిమన్యుడు + ఉత్తర → పరీక్షిత్తు

యయాతికి శాపం వల్ల వచ్చిన వృద్ధాప్యాన్నితాను గ్రహించి తన యౌవనం తండ్రికిచ్చిన పూరుపు పేరిట వంశం ప్రారంభమయినట్లు గ్రహించవచ్చు. పురువంశ రాజుల్లో ప్రఖ్యాతి గాంచిన రాజు ప్రతాపుడు. ఆ మహారాజునకు ముగ్గురు పుత్రులు. మొదటి వాడు తపమాచరించటానికి పోవడంతో రెండవ పుత్రుడయిన శంతనుడు రాజయ్యాడు. ఆయన ఒకనాడు వినోద విహారంలో గంగను చూచి మోహితుడయ్యాడు. తానేం చేసినా అడ్డు చెప్పకూడదనే షరతు పై గంగ శంతనుడి వివాహానికి అంగీకరించింది. తనకు కలిగిన ఏడుగురు బిడ్డలను ఆమె చంపింది. ఎనిమిదో బిడ్డను అలాగే చేయబోతే శంతనుడు అడ్డగించాడు. షరత్తును ఉల్లంఘించడంతో తాను వెళ్ళిపోతూ పుత్రుడిని విద్యావంతుడిని చేసి పంపుతానని చెప్పింది. ఇరవై నాలుగు సంవత్సరాల పిమ్మట గాంగేయుని గంగానదీ తీరాన గాంచి, తెచ్చి యువరాజుగా పట్టాభిషిక్తుని చేశాడు శంతనుడు.

మత్స్య వనిత సత్యవతి, మత్స్యగంధిగా ప్రఖ్యాత. ఆమె అపురూప సౌందర్యవతి. పరాశరుని వంటి మహామునే ఆ సౌందర్యానికి ముగ్ధుడై ఆమె ద్వారా సద్యోగర్భాన వ్యాసుని పొందాడు. ఈమె వ్యాహాళికి వెళ్ళిన శంతనుడు దృష్టిని ఆకర్షించింది. రాజు తన వాంఛ వెల్లడింపగాఆమె బిడ్డలే రాజ్యాధినేతలు కావాలని సత్యవతి తండ్రి షరతు విధించాడు. ఆ కారణంగా శంతనుడు దుఃఖితుడయ్యాడు. గాంగేయుడు తండ్రిని చూచి విషయం తెలుసుకొని తాను అజన్మాంత బ్రహ్మచారిగా ఉంటానని భీష్మ ప్రతిజ్ఞ చేశాడు. సత్యవతీ శంతనుల వివాహం జరిపించాడు. వీరికిద్దరు పుత్రులు చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు. రాజయిన తర్వాత బలమద గర్వంతో చిత్రాంగదుడు గంధర్వరుని చేతిలో మరణించాడు. అందువల్ల భీష్ముడు విచిత్రవీర్యుని పట్టాభిషక్తుడిని చేశాడు. స్వయంవరం ప్రకటించిన కాశీరాజు పుత్రికలు అంబ అంబిక అంబాలికలను బలపరాక్రమాలతో భీష్ముడు తెచ్చాడు. పరచిత్త అయిన అంబను విడిచిపెట్టి మిగిలిన ఇరువురిని విచిత్రవీర్యునితో వివాహం జరిపించాడు. పరచిత్త అంబ అవమానిత అయి తిరిగివచ్చి భీష్ముడే తనను వివాహం చేసుకోవాలని కోరింది. కాని తిరస్కృత అయింది. ప్రతీకార కాంక్షతో ఘోర తపమాచరించింది. నిరంతరానందాలతో తేలే విచిత్రవీర్యుడు పుత్రహీనుడై క్షయరోగంతో మరణించాడు. సత్యవతి భీష్ముని పిలచి దేవరన్యాయం ప్రకారం వంశాన్నినిల్పమని కోరింది. భీష్ముడు నిరాకరించడంతో వ్యాసుడిని కోరింది. వ్యాసుని వలన అంబికకు ధృతరాష్ట్రుడు, అంబాలికకు పాండురాజు, అంబిక దాసికి విదురుడు జన్మించారు.

2.1.2. రాజకుమారుల గృహస్థ జీవితం : వ్యాసుడి వల్ల కలిగిన సంతానాన్ని వ్యాసుడు పెంచి పెద్ద చేయలేదు. వ్యాసుడి సోదరుడు భీష్ముడు వాళ్ళ ఆలనా పాలనా చూడవలసి వచ్చింది. ఇది ఒకరి సంతానం మరొకరి పోషణలో పెరిగిన సన్నివేశం. కౌరవ పాండవుల బాల్యంలోని స్పర్థలే కురుక్షేత్ర యుద్ధానికి తోవ ఏర్పరచాయి.

భీష్ముని సాన్నిధ్యంలో ధృతరాష్ట్రుడు,పాండురాజు,విదురుడు పెరిగి పెద్దవాళ్ళై విద్యాబుద్ధులు గడించారు. ధృతరాష్ట్రుడు గుడ్డివాడవడంతో పాండురాజు రాజుగా అభిషిక్తుడయ్యాడు. గాంధారరాజు కన్యక గాంధారి ఆమె చెల్లెళ్ళు పదిమందిని ధృతరాష్ట్రునికి

కుంతీభోజుని దత్తపుత్రిక కుంతిని శల్య సోదరిమాద్రిని పాండురాజుకు, దేవకరాజు వద్ద ఉన్న బాలామణిని విదురునికి ఇచ్చి భీష్ముడు వివాహం జరిపించాడు. కుంతి తండ్రి పెంపకంలో ఉండగా దుర్వాసుని సేవించి, వరంగా మంత్రం పొందింది. మంత్రం పరీక్షించ ప్రయత్నించి సూర్య ప్రభావంతో కర్ణుని పుత్రునిగా పొందింది. కవచకుండల ధారుడయిన పుత్రుడిని గంగ ప్రవాహంలో విడచింది. సూత దంపతులకు దొరికిన కర్ణుడు సూతనందనుడుగా రాధేయుడుగా ప్రసిద్ధుడయ్యాడు.

వేటకు వెళ్ళిన పాండురాజు ప్రణయంలో ఉన్న లేడి జంటలో ఒకదానిని చంపాడు. మగలేడి రూపంలో ఉన్న కిందముడనే ఋషి కోరికతో స్త్రీని సమీపించగానే మరణిస్తావని పాండురాజును శపించాడు. శాపం తెలిసిన మాద్రి కుంతి పాండురాజుతో అడవిలో ఉండిపోయారు. కుంతి మంత్ర ఫలంగా యముడు, వాయువు, ఇంద్రుడు వలన ధర్మరాజు, భీముడు, అర్జునులను పొందింది. అశ్విని దేవతల వలన నకుల సహదేవులు మాద్రికి కలిగారు. వసంతకాలంలో ఒకనాడు మాద్రిని సమీపించి, పాండురాజు మరణించారు. మాద్రి భర్తతో సహగమనం చేసింది. పాండు తనయులతో కుంతి హస్తినాపురం చేరింది. ధృతరాష్ట్ర పాలనలో భీష్మ రక్షణలో కురుపాండవులు పెరిగారు. వాళ్ళ మధ్య వైరం కూడా పెరగసాగింది. దుర్యోధనుడు భీమ వధకు ఎన్నో పర్యాయాలు ప్రయత్నించి విఫలుడయ్యాడు. వీళ్ళకు కృపాచార్యుడి వద్ద విద్యాభ్యాసం సాగింది. ద్రోణుడి సామర్థ్యం తెలిసి భీష్ముడు ద్రోణుని ఆచార్యుడిగా తెచ్చాడు. అర్జునుని మేటి విలుకానిగా చేస్తానని ద్రోణుడు మాట ఇచ్చాడు. కుమారుల అస్త్ర విద్యాప్రదర్శనలో వాళ్ళు తమ సామర్థ్యాన్ని ప్రదర్శించారు. అర్జునుడు తనకు తానే సాటి అని చాటుకొనే సమయానికి కర్ణుడు ప్రత్యక్షమై అర్జునితో ధీటుగా నిలిచాడు. దుర్యోధనుడు కర్ణుడిని అంగదేశాధీశునిగా ప్రకటించాడు.

ద్రోణుడు గురుదక్షిణగా తనను అవమానించిన ద్రుపదుడిని కట్టితెమ్మని కోరగా, అర్జునుడు నెరవేర్చాడు. అయితే ద్రుపదుడు తనకు జరిగిన అవమానానికి ప్రతీకారంగా ద్రోణుడిని చంపగల పుత్రుని కోసం యాగం చేసి, కృష్ణ దుష్టద్యుమ్నులను పొందాడు. పాండవుల పట్ల ఏ మాత్రం ఇష్టం లేని దుర్యోధనుడి ప్రవర్తనను ధృతరాష్ట్రుడు గ్రహించాడు. దుర్యోధనుడిని ఆజ్ఞపై వారణావతంలో లక్కగృహం కట్టించి పాండవులకు ఇచ్చారు. విదురుని నర్మగర్భ సూచనతో గృహం దగ్ధం కానున్నదని వాళ్ళు గ్రహించారు. అన్నదానానికి వచ్చిన భిల్ల స్త్రీ ఐదుగురు పుత్రులతో అక్కడే నిద్రించగా ఇల్లు దగ్ధం అయింది. అందరూ పాండువులు మరణించారనే భావించారు. అడవిలో సురక్షితంగా పాండవులు ఉన్నప్పుడు తనను కోరిన హిడంబి ద్వారా భీముడు ఘటోత్కచుణ్ణి పొందాడు.

ద్రుపద పుత్రి కృష్ణ స్వయంవరం ప్రకటించడంతో కురుపాండవులు విచ్చేశారు. బ్రాహ్మణ వేషంలో అర్జునుడు మత్స్యయంత్రాన్ని భేదించి ద్రౌపదిని గ్రహించాడు. అర్జునుడు ఇంటికి వచ్చి భిక్ష తెచ్చానని చెప్పడంతో తల్లి ఎప్పటిలానే ఐదుగురు పంచుకోండి అంది. అయిదుగురితో ద్రౌపది వివాహం జరిగింది. పాంచాలంలో పాడవులున్నారని తెలిసి దుర్యోధనాదులు కల్లోలమయ్యారు. భీష్మ ద్రోణులు వీరికి నీతి గరిపారు. ధృతరాష్ట్రుడు

పాండవులని పిలిపించి ఖాండవప్రస్థం రాజధానిగా అర్ధరాజ్యం ఏలుకొమ్మని చెప్పాడు. శ్రీకృష్ణుడి ఆశీస్సులతో ధర్మరాజు పరిపాలనారంభించినాడు. నారదుడు సందర్శించి నీతిని తెలిపి స్త్రీ కారణంగా సోదరులలో విభేదాలు తలెత్తకుండా సంవత్సరానికి ఒకరి వద్ద ద్రౌపది ఉండాలని, నియమాలను ఉల్లఘించిన వాళ్ళు పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం అనుభవించాలని చెప్పాడు. ఒక విప్ర సహాయార్థం నియమాన్ని ఉల్లంఘించిన అర్జునుడు పన్నెండేళ్ళు వనవాసం చేశాడు. ఈ కాలంలో నాగకన్య ఉలూచి ద్వారా ఇలావంతుడిని, చిత్రాంగద ద్వారా బభ్రువాహనుడిని, సుభద్ర ద్వారా అభిమన్యుడిని పొందాడు. అర్జునుడు సుభద్రా సహితుడయి ఇంద్రప్రస్థం చేరాడు. కృష్ణార్జునులు వనవిహారంలో తమను ప్రాధేయపడి అగ్నికి ఖాండవ దహనానికి సహకరించారు.

2.1.3. మయసభా ప్రాభవం : రాజ్యం పొందిన పాండవులు సంపన్నులు కావటం, శౌర్యపరాక్రమ ప్రకటనం కావించటం,రాజసూయయాగం చేయటం, కౌరవులకు కంటగింపుగా మారింది. అసూయ, అసహనం వల్ల సోదరుల మధ్య మళ్ళీ కలతలు చెలరేగాయి.

ఖాండవ దహనంలో తప్పించుకొన్న మయుడు తన తృప్తికోసం పాండవులకు అనన్యమయిన భవనం నిర్మించి ఇచ్చాడు. ధర్మరాజును సందర్శించిన నారదుడు అతనిలో రాజసూయ యాగ కాంక్షను కలిగించాడు. కృష్ణుడి సలహాపై ప్రథమ అవరోధి అయిన జరాసంధుని భీముడు సంహరించాడు. భీమార్జున నకుల సహదేవులు నలుదిశలు జయించి వచ్చారు. ధర్మరాజు పంపిన ఆహ్వానం అందుకొని పలువురు రాజులు విచ్చేశారు. ధర్మరాజాదులు పూజార్హునిగా కృష్ణుణ్ణి నిర్ణయించి అర్ఘ్యం ఇచ్చారు. దీనిని శిశుపాలుడు అధిక్షేపించి దుర్భాషలాడి కృష్ణుని చేతిలో హతుడయ్యాడు. యాగం నిర్విఘ్నంగా జరిగింది. మయసభ వైభవాన్ని చూడటానికి వచ్చి అందరూ వెళ్ళిపోయినా దుర్యోధనుడు నిల్చిపోయి, నిర్మాణ చాతుర్యం తెలుసుకోలేక నవ్వుల పాలయ్యాడు. తిరుగు ప్రయాణంలో చేసిన దురాలోచన ప్రకారం విదురుడు అడ్డు చెప్పినా దుర్యోధనుడు వినక జూదానికి ధర్మరాజును ఆహ్వానించాడు. అయిష్టమే అయినా,ఆహ్వానాన్ని నిరాకరించలేక ధర్మరాజు హస్తినాపురం చేరాడు. దుర్యోధనుడి తరపున ఆడిన శకుని చేతిలో పందెంగా సిరిసంపదలనూ, సోదరులనూ, చివరకు ద్రౌపదిని ఒడ్డి ఓడిపోయాడు. నిండుసభలో ఏకవస్త్రను వివస్త్రను చేయ యత్నించి కౌరవులు అవమానించారు. తన ధర్మసందేహానికి సమాధానం ద్రౌపది పొందలేకపోయింది. కాని భర్తలను రాజ్యాన్ని వరంగా ధృతరాష్ట్రుడి నుంచి పొందింది. తిరిగి జూదపు ఆహ్వానంలో ఓడి ధర్మరాజు పన్నెండేళ్ళు అరణ్యవాసం, ఒక సంవత్సరం అజ్ఞాతవాసానికి సోదరులు ద్రౌపదితో తరలి వెళ్ళాడు. విదురుడి పాండవ పక్షపాతం తండ్రి సంకోచం చూచి దుర్యోధనాదులు పాండవులను అడవిలోనే చంపచూచి వ్యాసుని మందలింపుతో విరమించారు. వ్యాసుడు ధృతరాష్ట్రుని పుత్రవ్యామోహం తగదని మందలించాడు. దుర్యోధనుడు తనకు హితబోధ చేస్తున్న మైత్రేయుని నిర్లక్ష్యం చేయడంతో కుపితుడైన మహర్షి భీముని చేతిలో తొడలు విరిగి ధుర్యోధనుడు మరణిస్తాడని శపించాడు. అరణ్యవాసానికి ఏగిన పాండవులు తమ పన్నెండేళ్ళు గడపడానికి తగిన ప్రాంతంగా ద్వైతవనాన్ని నిర్ణయించి నెలవు ఏర్పాటు చేసుకొన్నారు. భీష్మద్రోణ కర్ణాదులతో సమంగా

విలువిద్య గ్రహించడానికి అర్జునుడు ఇంద్రునికై తపమాచరించి ఇంద్రుని ప్రత్యక్షం చేసుకొన్నాడు. ఈశ్వర దర్శనానంతరం తాను దివ్యాస్త్రాలను ఇస్తాననడంతో ఈశ్వరునికై తపమాచరించి, మారువేషంలోని శివునితో పోరాడి పిమ్మట పాశుపతాన్ని పొందాడు. దేవతలందరూ దివ్యాస్త్రాలను ప్రసాదించారు. ఇంద్రుడి ఆహ్వానంతో అమరలోకానికి వెళ్ళి చిత్రసేనుని వద్ద నృత్యగానాలు అభ్యసించాడు. ఊర్వశి తనను కాదన్న అర్జునునికి నపుసంకత్వంతో స్త్రీలకు నృత్యం నేర్పమని శపించింది. ఈ శాపాన్ని అజ్ఞాతవాసం కాలంలో ఉపయోగించుకొమ్మని ఇంద్రుడు అర్జునుణ్ణి ఊరడించాడు.

పాండవులు లోమశ మహాముని తో తీర్థయాత్రలు చేసి ఘటోత్కచుని సహాయంతో వెళ్ళటానికి కష్టమయిన గంధమాదన పర్వతాలను అధిగమించి అర్జునుణ్ణి కలిశారు. తీర్థయాత్రల నుంచి తిరిగి వచ్చిన వీరిని కృష్ణ సత్యభామలు పరామర్శించారు. దుర్యోధనాదులు పాండవులు తిరిగి రావటం తెలిసికొని వేట నెపంతో అడవికి బయలుదేరారు. అయితే అడవిలో వాళ్ళు గంధర్వుని చేత బంధితులయ్యారు. అర్జునుడి మాటపై గంధర్వుడు వాళ్ళను విడిచి పెట్టాడు. అవమానం పొందిన దుర్యోధనుడు ప్రయోపవేశం చేయ ప్రయత్నించగా ఆప్తులు నివారించారు. బదులుగా కర్ణుడు దిగ్విజయ యాత్ర చేసి వచ్చాడు. రాజసూయ యాగం చేసిన ధర్మజాడు జీవించి ఉన్నాడు కనుక ప్రత్యామ్నాయంగా వైష్ణవ యాగం దుర్యోధనుడు జరిపాడు.

పాండవులు జీవిస్తున్న ద్వైతవనంలో వన్యజీవాల సంఖ్య తగ్గడంతో క్రూరమృగాల కోరికపై వారు కమ్యకవనం చేరారు. ఒకనాడు అటుగా వెళ్తున్న దుస్సల భర్త సైంధవుడు, ద్రౌపది సౌందర్యానికి మోహితుడై ఆమెను తీసుకుపోయాడు. పాండవులకిది తెలిసి సైంధవునిని బంధించి అవమానించారు. ఘోర తపస్సు చేసి అర్జునునితో తప్ప పాండువులతో పోరాడగల వరం సైంధవుడు పొందాడు.

పాండవుల వనవాసం ముగియ వచ్చింది. ఇంద్రుడు మాయోపాయంతో కర్ణుడి కవచకుండలాలు తస్కరించాలని భావించాడు. ఇది తెల్సిన సూర్యుడు కర్ణుణ్ణి హెచ్చరించి విఫలుడై బదులుగా అమోఘశక్తిని పొందమని చెప్పాడు. ఇంద్రునికి కవచకుండలాలు కర్ణుడు ఇచ్చి అమోఘశక్తిని పొందాడు. పాండవులు వనవాసాంతాన యముని యక్షప్రశ్నలకు సమాధానం చెప్పడం ద్వారా ధర్మరాజు తమనెవరూ అజ్ఞాతవాసంలో గుర్తించకుండా ఉండే వరాన్ని పొందాడు.

తమ పట్ల గౌరవాదరాలు గల విరాటుని కొలువులో అజ్ఞాతవాసం గడపాలని పాండవులు నిశ్చయించుకొన్నారు. ధౌమ్యుని నీతిబోధ ఆశీస్సులు పొంది విరాటుని కొలువుకు బయలుదేరారు. సరిహద్దుల్లోనే తమ ఆయుధాలను జమ్మి చెట్టు మీద పెట్టారు. గంగాస్నానం అనంతరం అజ్ఞాత వేషాలు ధరించి జూదరిగా ధర్మరాజు, బృహన్నలగా ఉత్తర నృత్యగురువుగా అర్జునుడు, వంటశాలలో భీముడు, అశ్వశాలలో నకులుడు, గోశాలలో సహదేవుడు, సైరంధ్రిగా ద్రౌపది విరాటరాజు కొలువులో ప్రశాంత జీవనం గడపసాగారు. సుదేష్ణ సోదరుడు, విరాటుని సేనాని అయిన కీచకుడు, ద్రౌపది అందానికి ఆకర్షితుడయ్యాడు. ద్రౌపదిని పొందుగోరి భంగపడి భీముడి చేతిలో మృతుడయ్యాడు.

తనను నిత్యం కాపాడే తన ఐదుగురు గంధర్వ భర్తలే దీనికి కారణమని చెప్పే ద్రౌపదిని కీచకునితో పాటు దహింప ప్రయత్నించిన ఉపకీచకులూ భీముని చేతిలో మరణించారు. ఈ ఘోరానికి కారణమైన ద్రౌపదిని కొలువు వీడమని విరాట సుదేష్ణలు కోరినా కొన్ని రోజులు మాత్రమే గడువు ఇవ్వమని, తన భర్తల కష్టాలు తీరుతాయని అర్థించి ఉండిపోయింది.

2.1.4. ఉత్తర గోగ్రహణం : అజ్ఞాతవాసంలోని పాండవులను తెలుసుకోగలిగితే వాళ్ళను అరణ్య అజ్ఞాతవాసాలకు మళ్ళీ పంపవచ్చు కాబట్టి, దుర్యోధనాదులు పాండవుల ఉనికి తెలుసుకోవటం కోసం విరాటరాజు మీదికి దండెత్తి వచ్చారు.

దుర్యోధనుడు తమ విరోధి రాజ్యంలో జరిగిన కీచక ఉపకీచకుల వధను చారుల ద్వారా విన్నాడు. ఎంతో చర్చించి విరాట రాజ్యం పైకి గోగ్రహణానికి సిద్ధమయ్యాడు. విరాటుని శత్రురాజులు సహాయం దుర్యోధనుడికి అందించటానికి అంగీకరించారు. దుర్యోధనుడు రెండు భాగాలుగా చేసిన యుద్ధ వ్యూహంలో దక్షిణ దిశ నుండి జరిగిన దాడిని విరాటరాజు ఎదుర్కొన్నాడు. ఉత్తర దిక్కునుండి దుర్యోధనాదులు దాడి చేశారు. ఉత్తరుడు సైరంధ్రి సూచనపై బృహన్నలను సారథిగా చేసుకొని యుద్ధరంగానికి కదిలాడు. కాని అశేష సేనను చూచి భీతి చెంది పారిపోవటానికి ప్రయత్నించగా అర్జునుడు నిలవరించి తన నిజరూపాన్ని చెప్పి శమీకవృక్షంపై దాచిన ఆయుధాలను ఉత్తరుడితో దింపించి గాండీవాన్ని గ్రహించి ఉత్తరుణ్ణి సారథిగా చేసుకొన్నాడు. కౌరవులు అర్జునుని వీరవిహారం ముందు నిలువలేకపోయారు. వారిని సమ్మోహనాస్త్రంతో స్పృహ తప్పించి తలపాగాలను బొమ్మపొత్తకలలుకు తెచ్చారు. విరాటుడు విజయం పొంది తిరిగి వచ్చి ఉత్తరుడు యుద్ధానికి వెళ్ళిన వార్త తెలిసి సహాయంగా సేనను పంప యత్నించాడు. అంతలోనే ఉత్తరుడి విజయయాత్ర తెలిసింది. ఆ రాత్రే ధర్మరాజాదులు అజ్ఞాతవాసం ముగిసింది కనుక విరాటునికి నిజరూపం తెల్పాలనుకొన్నారు. తానింత వరకు ఆశ్రయమిచ్చింది పాండురాజులకని విరాటరాజుకు తెలిసింది. అర్జునునకు ఉత్తరనిచ్చి వివాహం చేయాలనే విరాటరాజు ఆలోచనను తప్పించి, అభిమన్యునకిచ్చి కృష్ణార్జునులు వివాహం జరిపించారు.

వివాహానంతరం కృష్ణాది సమీప బంధుజనంతో కూడి భవితవ్యాన్ని గూర్చి యోచించి, ధృతరాష్ట్రునితో రాయబారం జరపాలని నిశ్చయించి, తగిన వ్యక్తిగా ద్రుపద పురోహితుని నిర్ణయించారు. అజ్ఞాతవాసం ముగియగానే పాండవ కౌరవ పక్షాలలో యుద్ధసన్నాహాలు ప్రారంభమయ్యాయి. దుర్యోధన అర్జునులిరువురు కృష్ణ సహాయం అర్థించారు. దుర్యోధనుడు అశేషసేనను, అర్జునుడు రథసారథిగా కృష్ణుడిని పొందారు. శల్యుడు పాండవ సహాయార్థం సేనాయుతంగా కదలి మార్గమధ్యంలో సేవలు చేసే దుర్యోధనుడిగా తరపున యుద్ధం చేయటానికి ఒప్పుకొన్నాడు. పాండు తనయులను దర్శించి యుద్ధంలో కర్ణుడిని కించపర్చాలన్న వారి కోరికకు తల వూపాడు. సేన సమకూరింది. కౌరవుల వద్దకు రాయబారిగా వెళ్ళిన ద్రుపద పురోహితుడు యుద్ధ ప్రస్తావన లేకుండా తమ రాజ్యం తమకివ్వమని పాండవుల కోరిక తెలిపాడు. వాదోపవాదాలు జరిగిన

అనంతరం తమ దూతను పంపుతామని ధృతరాష్ట్రుడు పురోహితుని పంపాడు. ధృతరాష్ట్రుడు తమ తరపున రాయబారిగా సంజయుడిని పిలిచి, యుద్ధం జరిగితే పాండవ ధాటిని ఎదుర్కొనలేము కనుక తియ్యని మాటలతో స్నేహాన్ని పెంచుకు రమ్మని సాగనంపాడు. ఈ సందేశాన్ని విన్న ధర్మరాజు ఎన్ని అవమానాలు జరిగినా శాంతంగా భరించి శాంతినే కోరుతున్నాం. మా ఐదుగురికి ఐదు గ్రామాలిచ్చినా చాలని చెప్పి పంపాడు. తిరిగి వచ్చిన సంజయుడు ధృతరాష్ట్రుని మందిరంలో కలిసి, రాయబారం సారాంశం చెప్పి ధర్మపరంగా నడుచుకోవటం అవసరమని సూచించి వెళ్ళాడు. మరురోజు నిండు సభలో పాండవులలో ముఖ్యంగా భీమార్జునలలో చెలరేగుతున్న అవమాన జ్వాలలు, ప్రతీకార భాషణలూ, శ్రీకృష్ణుని మాటలూ చెప్పాడు. భీష్మ ద్రోణుల వైరం తగదని చెబుతుండగా దుర్యోధనుడు తన జన బల పరాక్రమాలు చెప్పి ధర్మరాజు పలుకులు, వారి బలం, సంజయుని ద్వారా అడిగి తెలుసుకొన్నాడు. ఇది విన్న ధృతరాష్ట్రుడు కలత చెంది తనయుడిని సంధి చేసుకొమ్మనగా దుర్యోధనుడు తన బల పరాక్రమాలను తెల్పాడు. కర్ణుడు తన స్వసామర్థ్యాన్ని వ్యక్తం చేయటాన్ని భీష్ముడు కించపర్చటంతో రణరంగంలో భీష్ముడు నేలకూలే వరకు తాను ధనుర్బాణాలు పట్టనని కర్ణుడు శపథం చేశాడు.

2.1.5. శ్రీకృష్ణుని రాయబారం : శ్రీకృష్ణుడు యుద్ధం వద్దంటూనే రాయబారం చేయబోయినట్లు వెళ్ళి, యుద్ధానికి రంగం సిద్ధం చేయటం శ్రీకృష్ణ లీలల్లో భాగం. పాండవులు శ్రీకృష్ణుని కలిశారు. రక్తపాతం లేకుండా ఉభయులకూ మేలు కల్గేలా చూడమన్న ధర్మరాజు కోరిక నకుల సహదేవులు ద్రౌపది మాత్రం అంగీకరించక కయ్యానికే సిద్ధపడ్డారు. శ్రీకృష్ణుడు ఇరు పక్షాలు మేలు కొరకు రాయబారం నడుప నిశ్చయించాడు. దేవేంద్రి ఆజ్ఞపై శ్రీకృష్ణునికి బ్రహ్మాండమైన స్వాగతాన్ని దుర్యోధనుడు ఏర్పాటు చేశాడు. ధృతరాష్ట్రాదుల క్షేమాన్ని, ప్రశ్నించి విదురుడి ఇంట నిల్చిన కుంతిని కలసి పిమ్మట దుర్యోధనుడి భవనాన్ని సందర్శించాడు. మరునాడు నిండు సభలో శాంతి ప్రస్తావన వినిపించాడు. మునీంద్రుల మాటలను భీష్మ ద్రోణుల హితాన్ని త్రోసిపుచ్చి దుర్యోధనుడు శ్రీకృష్ణుడిని మాటలకు నిరసనగా సభనుంచి వెళ్ళిపోయాడు. తల్లి ఆదేశంపై తిరిగి వచ్చి పీఠం అధిష్ఠించాడు. తల్లి బోధ పూర్తి అవగానే సమాధానం ఇవ్వక ఆప్తులతో కూడి కృష్ణుని బంధించటానికి ప్రయత్నించాడు. ధృతరాష్ట్రుడు వ్యక్తం చేసిన అసహాయతను కుంతికి తెలిపి శ్రీకృష్ణుడు తిరిగి పయనమయ్యాడు. మార్గమధ్యంలో కర్ణుడిని తన రథంపై ఎక్కించుకొని అతని జన్మరహస్యం తెలిపి, పాండవులలో అగ్రజస్థానం పొందడం వల్ల కల్గే లాభాలు చెప్పాడు. కర్ణుడు మాత్రం పెంచిన ప్రేమను, స్నేహధర్మాన్ని దాటలేనని నిరాకరించాడు. కుంతి కూడా యుద్ధాన్ని ఆపాలంటే కర్ణుడిని పాండవుల పక్షానికి మరల్చాలని భావించి యత్నించి భంగపడింది. కాని ఒక్క అర్జునుడిని తప్ప పాండు తనయులలో వేరొక్కరిని తాను చంపనని కర్ణుడి వద్ద మాట తీసుకొంది. తిరిగి వచ్చిన కృష్ణుడు చెప్పిన మాటలతో యుద్ధం తప్పదని నిర్ణయానికి వచ్చి పాండవులు తమ సేనను కురుక్షేత్రానికి నడిపారు. భీష్ముడు సేనానిగా దుర్యోధనుడు సేనను కురుక్షేత్రానికి పంపాడు. యుద్ధం చేయలేక బలరాముడు తీర్థయాత్రలకు వెళ్ళాడు. ఇరుపక్షాలు యుద్ధభూమిలో నిల్చాయి.

వ్యాసుని కృప వలన ధృతరాష్ట్రుడు సంజయుని ద్వారా యుద్ధవిశేషాలు తెలుసుకోగల శక్తిని పొందాడు. సంజయుడి ద్వారా తెల్పిన యుద్ధ విశేషాలు - భీష్మ ప్రేరణతో కౌరవసేన, భీముని అగ్రాన నిలుపుకొని పాండసేన యుద్ధరంగానికి ఉరికారు. భీకరమైన పోరు సాగింది. భీష్మ శల్య ఉత్తరాభిమన్యుల విహారంతో ప్రథమ దినం భీమార్జున దుష్టద్యుమ్న భీష్మ ద్రోణాదులు భీకరమైన పోరుతో మరునాడు కూడా గడచింది. రోజుకో రకంగా భిన్న వ్యూహాలతో ఇరు పక్షాలు సేనను మోహరింపచేస్తూ యుద్ధం చేయసాగాయి. అనేకులు నిహతులు, క్షతగాత్రులు అవుతున్నారు. దిన దినానికి తేజోవంతమవుతున్న భీష్ముని పోరాటానికి చింతించి పాండవులు భీష్ముని వద్దకేగి తమ విజయానికి దారేదని ప్రశ్నించగా అప్పులను విడిచిన వారితోనూ, నీచులతోనూ, అమంగళ సూచక ధ్వజమున్న వారితోనూ, స్త్రీలతోనూ తాను పోరాడనని, అన్ని ఉన్న శిఖండిని తన ముందు నిల్పమని చెప్పి పంపాడు. దశమదినాన శిఖండిని ముందు నిలుపుకొని అర్జునుడు పోరుకు దిగినా ఆ దిశకు చూడక భీష్ముడు పోరాడుతూనే ఉన్నాడు. సాయం సమయాన కృష్ణుడి ఆజ్ఞతో అర్జునుడు భీష్మశరీరాన్ని బాణాలతో నింపేశాడు. అంపశయ్యగా నేలకొరిగిన భీష్ముడు, ప్రాణాల్ని త్యజించటానికి ఉత్తరాయణం తగిన సమయంగా ఎంచి ఎదురు చూడసాగాడు.

భీష్మ స్థితికి దుఃఖిస్తున్న కర్ణుడిని భీష్ముడే ఓదార్చి, దుర్యోధనాదులు విజయం కోసం ప్రయత్నించమన్నాడు. ద్రోణుడిని సేనానిగా అభిషేకించాడు. ధర్మరాజుని బంధించి ఇవ్వమని దుర్యోధనుడు సేనాని కోరాడు. ఈ వ్యూహం తెలిసిన ధర్మరాజు అర్జునుణ్ణి అండగా నిలుపుకొన్నాడు. పద్మవ్యూహంలో పాండవులతో కూడి ప్రవేశించ యత్నించిన అభిమన్యుడికి ప్రవేశమే తప్ప నిర్గమనం తెలియదు. సైంధవుడు అడ్డుకోవడంతో తానొక్కడే కౌరవులతో భీకరంగా యుద్ధం చేసి అభిమన్యుడు మృతుడయ్యాడు. యుద్ధానంతరం కుమార మరణం విన్న అర్జునుడు కారకుడయిన సైంధవుని మరునాటి యుద్ధంలో చంపుతానని ప్రతిజ్ఞ చేశాడు. కౌర మహారథికులు సైంధవ ప్రాణరక్షణకు పూనుకొన్నారు. ద్రోణుడిని విజృంభణ, కర్ణుడి విహారం ఎలా ఆపాలో తెలియక సతమతమవుతున్న పాండువులు, సాయం సమయమవుతున్న ఆందోళనతో అర్జునుడు ఉన్నారు. ఇది కృష్ణుడు చూచి మాయ కల్పించాడు. సూర్యాస్తమయం అయిందన్న భావనతో తలెత్తిన సైంధవుణ్ణి అర్జునుడు చంపాడు. కర్ణుడిని నిలువరించడానికి ప్రయత్నించి ఘటోత్కచుడు మరణించాడు. ద్రోణుని ధాటిని ఆపడానికి పుత్ర మరణ సూచనే మార్గమని ఎంచిన ధర్మరాజుతో ఏనుగు నెపంతో అశ్వత్థామ మృతి చెందాడని కృష్ణుడే చెప్పించాడు. ధర్మమూర్తి అయిన ధర్మరాజు చెప్పడంతో అస్త్రసన్యాసం చేసి యోగంలో ఉన్న ద్రోణుడిని దుష్టద్యుమ్నుడు వధించాడు. అశ్వత్థామ కుపితుడయ్యాడు.

కర్ణుడిని సేనానిగా చేసుకొని కౌరవ సేన రంగాన తిరిగి విజృంభించింది. కుంతికి ఇచ్చిన మాట కోసం చేతికి దొరికిన నకులుని కర్ణుడు వదిలేశాడు. ధర్మరాజును పరాభవించాడు. కర్ణుడి కోరికపై దుర్యోధనుడు శల్యుడిని సారథిగా చేశాడు. తన వాగ్ధాటికి అడ్డు చెప్పకూడదనే షరతుపై సారథ్యానికి అంగీకరించిన శల్యుడు యుద్ధరంగంలో తన నీచ భాషణలతో కర్ణుడిని క్రుంగదీశాడు. కర్ణుడి చేతిలో అవమానితుడయిన ధర్మరాజును పలకరించి శిబిరానికి వచ్చిన అర్జునుణ్ణి, కర్ణుణ్ణి వధించనందుకు ధర్మజుడు

నిందించాడు. కుపితుడై అన్న మీదకు కత్తి దూసిన అర్జునుణ్ణి, కృష్ణుడు శాంతింపచేశాడు. అర్జునుడు ఆ రోజు తాను కర్ణుణ్ణి చంపుతానని ప్రతిజ్ఞ చేశాడు. భీకర యుద్ధంలో దుశ్శాసనుని చంపి భీముడు రక్తపానం చేశాడు. కర్ణార్జునుల మధ్య తీవ్ర రూపం దాల్చిన పోరులో కర్ణుడి రథం యుద్ధభూమిలో క్రుంగింది. వెలికి తీస్తున్న కర్ణుడిని అర్జునుడు చంపాడు.

శల్యుడు సేనానిగా కౌరవసేన యుద్ధం సాగించింది. ధర్మరాజుతో సాగిన పోరులో శల్యుడు మృతి చెందాడు. గధాధారి అయిన దుర్యోధనుడు యుద్ధ క్షేత్రాన్ని వీడి మడుగులో దాగాడు. దుర్యోధనుని పనికి కృష్ణార్జునులతో చర్చించి యయుత్సుకు దుర్యోధనుడి అంతఃపుర జనాన్ని, రక్షక జనాన్ని అంతఃపురానికి వారి వారి నివాసాలకు చేర్చారు. యుద్ధానికి సిద్ధంగా ఉన్న అశ్వత్థామ, ఉదయం ఆలోచిద్దాం అన్న సుయోధనుని మాటపై నిలిచాడు. బోయల ద్వారా విషయం విన్న పాండవులు మడుగు వద్దకు వచ్చి అవమాన పూరితమైన మాటలతో రెచ్చగొట్టి వెలికి వచ్చేటట్టు చేశారు. దుర్యోధనుడు భీముడితో గదాయుద్ధానికి దిగాడు. శిష్యుల పోరు చూడడానికి బలరాముడు వచ్చాడు. కృష్ణుని సైగతో తనపైకి ఎగిరి దూకుతున్న దుర్యోధనుని తొడలు విరిగేటట్టు గద విసరడంతో దుర్యోధనుడు నేలకూలాడు. ఈ అధర్మమైన గెలుపునకు రోషాగ్ని కురిపిస్తున్న బలరాముని కృష్ణుడు ఉపశమింప చేశాడు. క్షతగాత్రుడయిన దుర్యోధనుడు అశ్వత్థామ కోరికపై అతనిని సేనానిగా చేశాడు. ఆ రాత్రే కృపాచార్యుడు ఎంత నిలవరిస్తున్న వినక అశ్వత్థామ నిద్రాసక్తుడయిన దుష్టద్యుమ్నుడిని, అడ్డుకోవచ్చిన శిఖండిని ఉపపాండవులను సంహరించాడు. ఈ విషయం అశ్వత్థామ ద్వారా విన్న దుర్యోధనుడు పాండవులు మృతిచెందారని భ్రమసి ఆనందంతో కన్నుమూశాడు. పుత్ర శోకంతో ఉన్న ద్రౌపది అశ్వత్థామను చంపి తేగల సమర్థుడు భీముడేనని రెచ్చగొట్టి పంపింది. అడవిలో దాగివున్న అశ్వత్థామను వెదికి అతని ప్రాణాలకుగాను అతనికి ఉన్న శిరోమణిని తెచ్చిచ్చాడు. పాండవ వంశాన్నికై అశ్వత్థామ విడిచిన బ్రహ్మశిరోనామాస్త్రాన్ని కృష్ణుడు అడ్డుకొన్నాడు.

2.1.6. పర్యవసానం : కురుక్షేత్ర యుద్ధానంతరం జరిగిన ప్రాణ నష్టం భరిపంశక్యం కాని దురవస్థను కలిగించింది. అంతటా విషాదం అలముకొంది. దాని నుంచి బయటపడి చేసిన రాజ్యపాలనం సంపూర్ణ సుఖసంతోషాలకు ఆలవాలం కాలేకపోయింది.

యుద్ధఫలంగా పాండవులటు, కృపాచార్యుడు కృతవర్మ అశ్వత్థామలు ఇటు జీవించారని యుద్ధ విశేషాలు చెప్పి ధృతరాష్ట్రుడిని సంజయుడు ఓదార్చాడు. విదుర వ్యాసులు ఉపశమన వాక్యాలు పలికారు. ధృతరాష్ట్రుడు నారీజనంతో కూడి కురుక్షేత్రం చేరాడు. ధర్మరాజు ప్రణమిల్లాడు. కృష్ణుని చాతుర్యంతో ధృతరాష్ట్రుని చేతిలో భీముడు మృతి తప్పించుకొన్నాడు. ధర్మరాజును శపింపబోయిన గాంధారిని వ్యాసుడు అడ్డుకొన్నాడు. భీముడు గాంధారి నిందాపూర్వక వాక్కులకు ఉపశమనం కలిగించాడు. గాంధారి అజ్ఞపై వారు కుంతిని కలిశారు. విగతజీవులై పడివున్న వంశాంకురాలను, వారి పై పడి రోదిస్తున్న అంతఃపుర స్త్రీలను చూచిన గాంధారి శోకానికి అడ్డుకట్ట లేకుండా పోయింది. కృష్ణుడికి తన బాధ చెప్పుకొంది.దుర్యోధన దుశ్శాసన వికర్ణాది పుత్రులను, కర్ణ అభిమన్య శల్య

సైంధవ భీష్మ ద్రోణ శకుని ప్రభృతుల దేహాలను చూచి దుఃఖించింది. ఆ దుఃఖంలో దీనికంతటికి కారణం కృష్ణుడేనని వారిలాగే దిక్కులేని చావు చస్తాడని శపించింది. ధర్మరాజు ధౌమునికి అగ్నికార్యాలు జరిపించమని ఆజ్ఞ ఇచ్చే సమయాన కుంతి కర్ణుడి జన్మరహస్యాన్ని తెలిపింది. అగ్రజ మరణానికి కారణమయ్యానని అర్జునుడు దుఃఖించాడు. యథోచిత కర్మలు, పుణ్యకార్యాలు నిర్వర్తించాడు. దుఃఖితులైన పాండువులను నారదాది మునులు ఓదార్చారు. యుద్ధంలో జరిగిన ప్రాణనష్టం, అగ్రజ మరణాలకు తానే కారణమని దుఃఖించే ధర్మరాజుకు కర్ణుడి శాపాలను నారదుడు చెప్పి ఓదార్చాడు. ఓదార్చ యత్నించిన కుంతిని చూచి రహస్యాన్ని కాపాడే శక్తి స్త్రీ కోల్పోవాలని శాపాన్ని ఇచ్చాడు. వైరాగ్యంతో అడవులకు వెళ్ళి జీవించాలనే ప్రతిపాదనను భీమార్జున నకులసహదేవులు ద్రౌపది ఖండించి, క్షాత్ర ధర్మాని నిర్వర్తించమన్నారు. అయినా సమాధాన పడని ధర్మరాజుకి కృష్ణనారదులు ఓదార్చి క్షాత్రధర్మం చెప్పి పట్టాభిషిక్తుని చేశారు. పట్టాభిషిక్తుడై కూడా ధర్మసందేహంతో ఉన్న ధర్మజుణ్ణి కృష్ణుడు, ఉత్తరాయణం కొరకు ఎదురుచూచే భీష్ముని వద్దకు గొనిపోయి ధర్మ విశేషాలను తెల్పమని కోరగా భీష్ముడు రాజ్యధర్మాన్ని, ఆశ్రమధర్మాన్ని, ప్రజాధర్మాన్ని, పద్నాలుగు విద్యలను సృష్టి క్రమాన్ని, కాలస్వరూపాన్ని, మృత్యువును, బ్రాహ్మణ శక్తిని, స్త్రీ ప్రకృతిని, మరణ సూచనలను, నారీ ధర్మాన్ని దుఃఖ కారణాలను, నరకాన్ని తదితరానేకాంశాలను వివరించి ఉపశమనం కలిగించి పంపాడు. ఉత్తరాయణం సమీపించడంతో కృష్ణధర్మరాజులను భీష్ముడు దర్శించాడు. కృష్ణానుమతితో భీష్ముడు నిర్యాణం పొందాడు. ధర్మరాజు భీష్ముని మృతదేహానికి ఉచిత కర్మలను నిర్వర్తించాడు. స్వజన మృతికి తానే కారణమని దూషించుకొంటున్న ధర్మరాజుని అశ్వమేధయాగం చేయడం ద్వారా మనశ్శాంతి పొందమన్నాడు. మరున్మహరాజు వేద విదురులను దానం చేసిన ధనాన్ని దాచిన విషయం చెప్పి యాగానికి తెచ్చుకొమ్మని ఆదేశించాడు. ధనాన్ని సమకూర్చుకొన్నాడు. ఉత్తర అశ్వత్థామ కారణం వల్ల మృతశిశువుకు జన్మనివ్వడంతో కృష్ణుడు తిరిగి బ్రతికించాడు. అతడే పరిక్షిత్తు. అశ్వమేధపు గుర్రం వెంట అర్జునుడు వెళ్ళి ఎదుర్కొన్న రాజులను ఓడించి వచ్చాడు. యాగం నిర్విఘ్నంగా ముగిసింది.

పదమూడు సంవత్సరాలు గడచిన అనంతరం ధర్మరాజాదులను రప్పించి ధృతరాష్ట్రుడు తాను వానప్రస్థాన్ని గ్రహించదలచినట్టు ప్రకటించాడు. దానధర్మాలు చేసి అందరి వద్ద సెలవు తీసుకొన్నాడు. కుంతి కూడా గాంధారి ధృతరాష్ట్రులతో అడవికి వెళ్ళింది. కొంతకాలానికి ధృతరాష్ట్రులను చూడవచ్చారు. విదురుడు అక్కడే మృతి చెందాడు. దేహకర్మలు చేస్తుండగా వచ్చిన వ్యాసుడు వారికి మృతులైన బంధు జనులను కనిపింప చేసి భర్తలతో వీరస్వర్గం కోరేవారికి గంగా జలాలలో దిగగానే దివ్యదేహాలు కలిగించాడు. తిరిగి ధర్మరాజాదులు రాజభవనానికి చేరారు. ఒకనాడు అడవిలో చెలరేగిన దావాగ్నిలో ధృతరాష్ట్రులు మరణించారని తెలిసి ధర్మరాజు దుఃఖితుడై కర్మలు చేశాడు. ద్వారకలో అల్లకల్లోలం చెలరేగిందని తెలిసి అర్జునుడు పురవాసులను రక్షింపబోగా వాళ్ళు చోరుల బారికి గురయ్యారు. రామకృష్ణుల భార్యలను రక్షించినా వారు ఆత్మాహుతి చేసుకొన్నారని తిరిగి వచ్చి తెల్పాడు.

పరీక్షిత్తును రాజుగా అభిషేకించి పంచపాండువులు, ద్రౌపది వెంట శునకంతో, వానప్రస్థం గ్రహించారు. స్వర్గారోహణం చేస్తుండగా మేరువు సమీపిస్తుండగా ద్రౌపది, పిమ్మట సహదేవుడు అనంతరం నకులుడు అర్జునుడు భీముడు క్రమంగా నేలకొరిగారు. ధర్మరాజు శునకం మాత్రమే ముందుకు సాగారు. ఇంద్రుడు రథంతో రాగా, భార్య సోదరులు కావాలన్నాడు. వారు విగతజీవులని చెప్పడంతో తన వెంట ఉన్న సారమేయాన్ని రానివ్వమని పట్టుబట్టాడు. శునక రూపాన ఉన్న యముడు ధర్మజుని ధర్మపాలనకు సంతసించాడు. స్వర్గనరకాలలోని స్వజనాన్ని చూడాలని, ధర్మరాజు కోరి చూచి మందాకిని స్నానాంతరం దివ్యదేహాన్ని పొందాడు.

2.1.7 భారత కథా నిర్మాణం : ఉపాఖ్యానాలను, హితబోధలను, కర్మకాండలను, ఇటువంటి ప్రధాన కథకు ప్రత్యక్షంగా, పూర్తిగా సంబంధంలేని ఇతరేతర భాగాలను తొలగించుకొని స్థూల కథా స్వరూపం దర్శిస్తే కథా నిర్మాణంలోని పాటిష్యం, ఔచిత్యం, కౌశలం స్పష్టంగా తెలుస్తాయి. భారత ఇతిహాసంలోని కథ అంతా శంతనుడు నుంచి పరిక్షిత్తు దాకా ఆరు తరాలకు సంబంధించి ఉన్నప్పటికీ కథా సూత్రంలో సడలింపు లేదు. యయాతి పుత్రుడు పూరువు నుంచి దుష్యంతుడు దాకా ఉన్న అనేక తరాలకు అంతగా ప్రాధాన్యం లేదు కాని దుష్యంతు శకుంతల భరతుల కథకు ప్రత్యేక ప్రాధాన్యం ఉంది. ఈ ఇతిహాసం భారతం కావటానికి భరత అనే తెగ కాదని, ఈ భరతుడని అనుకొనేవాళ్ళు. ఈ దేశానికి భారతదేశమని, ఆ తెగవల్ల కాదు, ఈ భరతుడి వల్ల వచ్చింది అనుకొనే వాళ్ళు దేశంలో వ్యాపించి ఉండేంత ప్రచారానికి కారణమైన భరతుడి వృత్తాంతం ఈ సందర్భంలో దర్శనమిస్తుంది. దుష్యంతుడు నుంచి శంతనుడు దాకా ఉన్న అనేక తరాలకు పెద్దగా ప్రాధాన్యం భావించనక్కర లేదు. కాని, భారత రాజవంశ ప్రాచీనత పర్యాలోకించటానికి ప్రత్యక్షంగా నిలచిన ఈ వంశావళి వల్ల భారత కథా నిర్మాణంలోని నేపథ్య ప్రాముఖ్యం స్పష్టమవుతుంది.

శంతనుడి సంతానంగా భీష్ముడు చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు గోచరమవుతున్న సందర్భంలో శంతనుడి భార్య సత్యవతి పరాశరుడి ప్రభావంతో ప్రసవించిన వ్యాసుడు కూడా భీష్మాదుల సోదరుడు కావటం, దేవర న్యాయాన్ని భీష్ముడు తిరస్కరించటం, వ్యాసుడు అంగీకరించటం, గమనార్హమైన కథానిర్మాణ కౌశలం విశదమయ్యే సందర్భం. బెస్తకన్య సత్యవతి, క్షత్రియుడు శంతనుడు. బ్రాహ్మణుడు పరాశరుడు కాగా, కలిగిన సంతానం శక్తిసంపన్నంగా చెప్పటంలో కథా ప్రణాళికా పాటిష్యం తెలుస్తుంది. వ్యాస సంతతిగా ప్రభవించిన ధృతరాష్ట్రుడు, పాండురాజు బ్రాహ్మణ క్షత్రియ సంబంధాలు సమన్వయ సూత్రం విశ్లేషించినట్లు స్పష్టమవుతూ ఉంటుంది. ఇప్పటికే ధృతరాష్ట్ర పాండువుల్లో బ్రాహ్మణాంశ మధికం కాగా, కుంతి సురుల వల్ల కర్ణ, ధర్మజ, భీమార్జునులను ప్రసవించింది. ఇప్పుడు పాండవులు దేవసంతానంగా భావించగా, కౌరవులు మానవ సంతానంగా మిగిలిపోయే సందర్భం ఏర్పడింది. నిజానికి సోదరులు మధ్య యుద్ధంగా కనిపించవలసిన కురుక్షేత్రం దేవ దానవ యుద్ధ భూమికగా రూపొందింది. అందుకే దేవ విజయం తథ్యమయింది. బొందితో స్వర్గమేగిన ధర్మరాజు ఈ దైవాంశ సంభూతుడనే సత్యాన్ని స్పష్టం చేసినట్లయింది. భారత కథలో శూద్రుల క్షత్రియుల బ్రాహ్మణుల దేవతల

సంబంధంలో విలసిల్లిన పాండవ కథ విశేష జీవన సత్యం ప్రకటించటం మాట అటుంచితే, కథా నిర్మాణంలో పాటిష్యం స్పష్టమవుతుంది. రేఖా మాత్రంగా కథా ప్రణాళిక పరిశీలించటం, దాని నిర్మాణ కౌశలం స్థూలంగా గుర్తించటానికే.

కార్యకారణ సంబంధం పూర్వోత్తర భాగాలకు సమృద్ధిగా సమన్వయించటం భారత కథలోని విశిష్ట లక్షణం. ప్రత్యంశం ఈ కథా పాటిష్యం పట్టి ఇస్తుంది. ఉదాహరణానికి అంబ శాపం. కాశీరాజ్యం నుంచి తీసుకు వచ్చిన భీష్ముడు తనను వివాహమాడాలని అంబకు తెలిసిన ధర్మ సూత్రం. పెళ్ళి చేసుకోనని ప్రతిజ్ఞ చేసిన భీష్ముడు కాదనటం న్యాయమే. రెండు న్యాయాల మధ్య సంఘర్షణగా ఒక కథాంశం ఉన్నప్పుడు కార్యకారణ సంబంధం కథా సూత్రంలో స్పష్టమవుతుంది.

కుంతీ మాద్రీ దేవతల వల్ల సంతానం పొందే సందర్భంతో సంబంధించిన కథా విషయంలో పాండురాజు దాంపత్యానికి దూరుడు కావటం, దానికి శాపం కారణం కావటం ఆ శాపానికి జంటలోని ఒంటి లేడిని తనే చంపటం వంటి నేపథ్యమంతా బలమైన కథకు పునాది అవుతుంది. ఈ కారణం వల్ల ఈ కార్యం జరిగిందని స్పష్టంగా గుర్తించటానికి వీలుగా కథా ప్రణాళిక ఉంది. అంతే కాదు ఒక కారణం నిజానికి మరొక కారణానికి కార్యం కావటం విచిత్ర కథా ప్రణాళికను ప్రకటిస్తూ ఉంది. మైధునంలోని లేడిని చంపటం కారణంగా పాండురాజుకు శాపం వచ్చింది. ఈ కారణం తాను వేటకు వచ్చిన కార్యం నుంచి పుట్టింది. ఈ కార్యమే ఆ కారణం అయింది. అంటే కార్యాకారణాలు పర్యవసానంలో వ్యత్యస్తం అయ్యాయి. ఇది కథా నిర్మాణంలోని దక్షతకు పాటిష్యానికి గుర్తు.

రాజవంశంలోని అగ్రజుడు సింహాసనానికి అర్హుడు అన్నది సంప్రదాయం ప్రతిపాదించిన రాజనీతి సూత్రం. ప్రతీపుడి సంతానంలో పెద్దవాడయిన దేవాడి తపస్సు చేసుకోవటానికి పోవటం వల్ల శంతనుడు రాజయ్యాడు. ముందు పుట్టిన ఎనిమిది మంది గంగపాలు కావటం వల్ల ఎనిమిదో బిడ్డ భీష్ముడు యువరాజు అయ్యాడు. పెద్దవాడయిన చిత్రాంగదుడు మరణించటం వల్ల విచిత్రవీర్యుడు పట్టాభిషేకం పొందాడు. పెద్దవాడు ధృతరాష్ట్రుడు గుడ్డివాడు కావటం వల్ల చిన్నవాడు సింహాసనం అధిష్ఠించాడు. పాండురాజు చనిపోవటం వల్ల గుడ్డివాడయిన ధృతరాష్ట్రుడు రాజు కాగలిగాడు. కుంతి కొడుకే రాజు కావలసి వచ్చినప్పుడు ఆమెకు మిగతా పుత్రులందరిలాగే ముందుగా పుట్టిన కర్ణుడు రాజు కాలేదు. తరువాత పుట్టిన ధర్మరాజు సింహాసనం ఎక్కాడు. అందుకో అవాంతరం ధర్మసూత్రం ఉంది, ఆమె పాండుపత్ని కాకముందు కర్ణుడు పుట్టటంగా భావించవచ్చు. భారతేతిహాసం అంతటిలో సింహాసం అధిష్ఠించిన వాళ్ళలో పెద్దవాడు లేడు. తపస్వి కావటం వల్ల, చనిపోవటం వల్ల, గుడ్డివాడు కావటం వల్ల, వాళ్ళు సింహాసనం ఎక్కలేదు. ఆ వంశంలో చిన్నవాళ్ళో తరువాతివాళ్ళో చక్రవర్తులయ్యారు. సింహాసనం చిన్నవాళ్ళు అధిష్ఠించిన ఈ స్థితి వల్ల భారతేతిహాసంలోని కథా నిర్మాణం విశేష ప్రాధాన్యం పొందింది. కథాగతికి ఈ స్థితి హేతువయింది.

భారత కథా నాయకుణ్ణి గూర్చి ఆలోచించినప్పుడు ప్రధాన పాత్ర నాయక స్థానంలో ఉండటం అన్న సారస్వత సూత్రమాధారంగా పరికిస్తే ధర్మరాజునే గుర్తింపవచ్చు. కాని అర్జునుడు, భీముడు ప్రధాన పాత్రలే అని నాయక స్థానంలో ఉండదగ్గవాళ్ళని వాదించే అవకాశం భారతేతిహాసమే ఇస్తుంది. ఈ ఇతిహాసంలో వీళ్ళందరికంటే పెద్దవాడు కర్ణుడు అభిజాత్యం ఉండి, అది అవసరం కాకుండా రాజ్యార్హత సంపాదించిన అద్భుత పాత్రగా గోచరమయి, భారతం కర్ణభారతంగా భావించే స్థితి ఉంది. భారతం కథ అంతా ఈ మార్గంలో పయనించటానికి సూత్రధారి శ్రీకృష్ణుడు. భారత ప్రధాన పాత్ర నాయకుడు శ్రీకృష్ణుడుగా సంభావించే స్థితి ఉంది. దుర్యోధనుడు ప్రతినాయకుడిగా సామాన్య దృష్టికి గోచరమవుతున్నాడు. కాని విశేష దృష్టికి విశిష్టవ్యక్తిగా కనిపించే అవకాశం లేకపోలేదు. మొత్తం భారతానికి పెద్ద దిక్కు భీష్ముడు. భీష్ముడే సమస్త రాజరికపు బాధ్యతలు భరించి, నిర్వహించి, నిర్వహింపచేసి భారతేతిహాసం ఆరంభం నుంచి ఈ కథాగతికి దోహదం చేసిన గొప్ప పాత్ర. ఈ పాత్ర భారత కథానాయక స్థానంలో ఉండడం సముచితమే. భారత కథాసూత్రంలో ధృతరాష్ట్రుడు పాండురాజు ప్రత్యేక ప్రాధాన్యం ఉన్న చక్రవర్తులు. వీళ్ళు ప్రధాన నాయకులు కావచ్చుననే భావనకూ అవకాశం ఉంది. మొత్తం కథా ప్రణాళిక తన సంతానం చుట్టూ పరిభ్రమించినట్లు గుర్తించి భారతేతిహాస స్రష్ట వ్యాసుడు అసలు నాయకుడు కావలసిన స్థితి గోచరమవుతుంది. వీళ్ళందరిని నాయక స్థానంలో చూడవచ్చు. చూడటానికి ఉన్న వీలును పరీక్షింపవచ్చు. ఇంతమంది ప్రధానపాత్రలుగా, కథానాయకులుగా ఉండేటట్లు కథా సూత్రం ఏర్పడడంలోనే భారతేతిహాస వైశిష్ట్యం కనిపిస్తుంది.

వీళ్ళు కథానాయకులు అయితే నాయికలు కూడా స్పష్టమవుతారు. నాయికా నాయక వ్యవస్థ స్పష్టమయితే రసస్థితి విశదమవుతుంది. భారతంలోని రస విషయికంగా దృష్టి సారిస్తే నవరసాలూ ఆయా సందర్భాలను బట్టి అంగిరసాలుగా కనిపిస్తాయి. నవరసాలూ భారతేతిహాసంలో అంగిరసాలుగా, అంగరసాలుగా, ప్రతిక్షణం ప్రత్యక్షమవుతూ వచ్చిన స్థితి భారతేతిహాస కథా ప్రణాళికా కారణంగా ఏర్పడింది. అన్ని రసాలకు అవకాశం ఉండటం అన్నది ఈ ఇతిహాస కథా నిర్మాణంలోని వైశిష్ట్యం.

అందుకే నన్నయ భారతంలో అన్ని ధర్మాలున్నట్లుగా గుర్తించి 'ధర్మతత్త్వజ్ఞులు ......' ప్రవచించాడు. ఇన్ని ధర్మాలకు నిలయం కాబట్టే చతుర్వేదాల తర్వాత ప్రభవించినను పంచమ వేదంగా శ్రీమహాభారతం గుర్తింపు పొందింది.

2.1.8. భారతేతిహాసంలో చారిత్రకత : భారతేతిహాసం వల్ల స్పష్టమయిన కథ ఆధారంగా నాటి రాజరికపు వ్యవస్థను సంభావింపవచ్చు. ఈ రాజరికం హిందూ దేశంలో ఏకాలంలో ఏ ప్రాంతంలో ఎంతవరకు వ్యాపించి ఉందో తెలిస్తే ఈ ఇతిహాస గాథకూ చరిత్రకూ ఉన్న సంబంధం స్పష్టమవుతుంది. ఈ చారిత్రక కాలంలోని రాజవంశాలు, అవి వర్ధిల్లిన ప్రాంతాలు, వాటి వ్యాప్తి అస్తిత్వం అర్థం కావటం వల్ల భారతేతిహాస చారిత్రకత స్పష్టమవుతుంది.

భారతేతిహాస కథలో ప్రధాన పాత్ర శంతనుడు. క్షత్రియుడు. అతడి ఇద్దరు భార్యలు గంగా సత్యవతులు. గంగ భీష్ముడికి, సత్యవతికి పరాశరుడి వల్ల వ్యాసుడికి, శంతనుడి వల్ల చిత్రాంగదుడికి విచిత్రవీర్యుడికి జన్మనిచ్చారు. భీష్ముడు తీసుకొని వచ్చి విచిత్రవీర్యుడికిచ్చి పెళ్ళి చేసిన అంబిక అంబాలికలు కాశీరాజు కూతుళ్ళు. ఇక్కడ భరతవంశంతో కాశీరాజ వంశం సంబంధం కలిగి ఉంది.

గాంధారి, ఆమె ఎనిమిది మంది చెల్లెళ్ళు ధృతరాష్ట్రుడి భార్యలు. వీళ్ళు గాంధార దేశరాజు కుమార్తెలు. ఈ విధంగా గాంధార దేశ సంబంధం ఏర్పడింది. కుంతి పాండురాజు భార్య. ఈమె కుంతిభోజుని దత్త పుత్రిక. అతడి రెండో భార్య మాద్రి. ఈమె శల్యుడి సోదరి. దేవకరాజు బాలామణి విదురుడి భార్య. ఈ విధంగా కుంతిభోజ వంశంతో శల్యవంశంతో దేవకరాజు వంశంతో సంబంధం ఏర్పడింది.

కుంతికి సూర్యుడి వల్ల కర్ణుడు, యముడి వల్ల ధర్మరాజు, వాయువు వల్ల భీముడు, ఇంద్రుడి వల్ల అర్జునుడు జన్మించారు. మాద్రికి అశ్వని దేవతల వల్ల నకులసహదేవులు కలిగారు. భరతవంశానికి ఈ విధంగా దేవతా సంబంధం ఏర్పడింది.

ద్రౌపది పాండవ ధర్మపత్ని. ఈమె ద్రుపదుడి కూతురు. ఇది ద్రుపద రాజవంశంతో సంబంధం తెలిపే సందర్భం. భీముడికి ఘటోత్కచుణ్ణి కన్న హిడింబి వల్ల రాక్షస వంశ సంబంధం ఏర్పడింది. అర్జునుడు ఉలూచి ద్వారా ఇలావంతుణ్ణి, చిత్రాంగద ద్వారా బభ్రువాహనుణ్ణి, సుభద్ర ద్వారా అభిమన్యుణ్ణి పొందాడు. ఈ వివాహాల వల్ల నాగవంశంతో, చిత్రాంగద వంశంతో యదువంశంతో భరతవంశానికి బాంధవ్య సంబంధం కలిగింది.

భరతవంశ ప్రతిష్ఠకు మూలమయిన ఉత్తరాభిమన్యుల సంతానం వల్ల విరాటరాజు వంశంతో సంబంధం సుస్థిరమయింది. ప్రతిష్ఠాత్మకమయిన భరతవంశ భవితవ్యానికి చారిత్రకంగా బాంధవ్య బంధం వల్ల దోహదపడ్డ రాజ వంశాలను గమనించాలి.

కాశీరాజు, గాంధార రాజు, కుంతిభోజుడు, శల్యుడు, దేవకరాజు, ద్రుపదుడు, రాక్షస వంశం, నాగవంశం, చిత్రాంగద వంశం, యదువంశం, విరాటరాజ వంశాలతో సంబంధం ఉంది. ఇంతేకాదు, సూర్య యమ వాయు ఇంద్ర అశ్వినీ దేవతల వల్ల సంబంధం, పరాశరుడు వ్యాసుడు వల్ల భూసుర సంబంధం కలిగింది. సురులను భూసురులుగా భావిస్తే క్షత్రియ బ్రాహ్మణ క్షత్రియేతర పాలక, పాలకేతరులతో చాలా భాగం చరిత్ర వల్ల స్పష్టంగా తెలిసే స్థితి ఉంది. బ్రాహ్మణ క్షత్రియ సంబంధాల సమన్వయం కూడా స్పష్టమవుతుంది. కాబట్టి భారతంలో పేర్కొనబడ్డ రాజవంశాలను, కురుక్షేత్ర యుద్ధంలో దోహదపడిన రాజ వంశాలను పరికిస్తే మరింత స్పష్టంగా భారత గాథకున్న చారిత్రక నేపథ్యం స్పష్టమవుతుంది.

సాంఘికంగా భారతదేశంలోకి ఆర్యులు రావటం, వాళ్ళు ఉత్తర హిందుస్థానంలో వ్యాప్తి పొందుతూ ఉండటం జరిగే కాలంలో ఈ ఇతిహాసం ఆవిర్భవించింది. ఈ ఇతిహాసం సృష్టి పొంది మార్పుచేర్పులకు గురిఅవుతున్న కాలంలో జైన బౌద్ధ శైవ మతాల ప్రాబల్యం,

రాజాదరణ, ప్రజాదరణ ఎల్ల హిందూమతంలో సంఘర్షణ జరిగి, సంస్కరణ ప్రయత్నంలో వచ్చిన విజయాలు పరాజయాలు గుర్తిస్తూ మతాంతరీకరణాలు సంభవించిన హిందూమతం నిలదొక్కుకొని మిగతా మతాలను దాదాపు అంతరించే స్థితికో, దేశాంతరం పోయే స్థితికో, అణగిమణగి ఉండే స్థితికో తెచ్చి విజయం పొందటం మీద ఆధారపడి భారతేతిహాస సృష్టిలో మార్పులు చేర్పులు సంభవించాయి.

ఈ కాలంలో కొన్ని గణరాజ్యాలు కలసి ఒక గణతంత్ర రాజ్యంగా ఏర్పడడం ఉండేది. అట్లాంటి గణతంత్ర రాజ్యంగా ఏర్పడిన వంశాలలో యాదవులు, కుహరులు, భోజులు, అంధకులు, వృష్ణులు ఉండేవాళ్ళు. వీళ్ల అందరూ భారతేతిహాసంలో కనిపించే మహారాజ వంశాల వాళ్ళు. గణరాజ్యాలు కొన్ని ఒకటి కావటానికి అవసరం కంటే, మైత్రి బంధుత్వబంధం విశిష్టంగా గుర్తించి, భరతవంశం, అనేక రాజవంశాలతో బాంధవ్యం కలిగించుకొని గణతంత్ర రాజ్యంగా అవతరించింది. క్రీస్తు పూర్వం వెలువడ్డ జైన బౌద్ధ గ్రంథాలలో పేర్కొనబడ్డ పదహారు జనపదాలలో నాలుగు మిక్కిలి పెద్దవి. అవి మగధ, కోసల, వత్స, అవంతి. చిన్న జనపదాలు పన్నెండు. అవి అంగ, కాశీ, వైశాలి, మల్ల, చేది, కురు, పాంచాల, మత్స్య, శూరసేన, గాంధార, కాంభోజ, అశ్మక ఈ రాజవంశాల ప్రస్తావన భారతంలో వస్తుంది.

మహాజనపదాలలో రాజవంశాల వాళ్ళు తమతో తాము కలహించుకోవటం గమనార్హం. The Shakyas and the hlichchavis, living what is today North Bihar, formed important republics. Of the kingdoms the most powerful were Kosala, Magadha and vasta in the ganga valley and Avanti with its centre at Ujjayini. The more powerful kingdoms and republics are sometimes referred to as the Majahanapadas. These kingdoms were constantly at war because they either wished to extend their territory or to control the rivers. In the end it was Magadha which became the most powerful among them'. (3)

మహాభారత కాలంనాటి రాజవంశాలను పాండవ కౌరవ పక్షం వహించిన వాటిని వివరంగా చూడవచ్చు. 'The Mahabharatha unlike the Ramayana which is described as a conflict between the Aryan and the non-Aryans the Mahabharatha war of Kurukshetra affected all the Aryans kings of India who were ranged either on one side or the other. The Pandavas has their allies from Kashi, Kosala, Magadha, Mastya, Chedi and the Yadus of Mathura. The allies of the Kurus were the Yavanas, Sakas, Madras, Kambojas, Kaikeyas, Sindhus, Sanviras, the Bhojas, the Andhra, the rulers of Mahismasti, Avanti and Pragjyothish'.(4)

బింబిసారుడికి (క్రీ.పూ.544-493) మగధ రాజుల రాజధానికి గిరివ్రజనగరం రాజధాని. ఇది గిరివ్రజపురంగా భారతంలో ప్రసక్తమయింది. అజాత శత్రువు (క్రీ.పూ.

493-402) కాలంలో పాటలీపుత్రం కోట నిర్మాణమయింది. ధర్మరాజుకు అజాతశత్రువు బిరుదు ఉంది. తరువాతి కాలంలో అది రాజధానిగా ప్రసిద్ధమయింది. నాగదాసుణ్ణి రాజ్యభ్రష్టుణ్ణి చేసి శిశునాగుడు రాజయ్యాడు. ఇక్కడ నాగవంశం ప్రాధాన్యం గుర్తింపవలసి ఉంది. నంద వంశ ఉత్తరాపథాన్ని పరిపాలించింది. నందవంశ ప్రముఖుడైన మహాపద్మనందుడికి మురకు కలిగిన సంతానం వల్ల మౌర్యసామ్రాజ్యం, నందరాజ్యం వినాశనం తలపెట్టిన చాణుక్యుడి వల్ల రూపొందింది.

స్థూలంగా ఒక్క విషయం స్పష్టం చేసుకోవచ్చు. భారతేతిహాసంలోని కథ, పాత్రలు, స్థలాలు, సన్నివేశాలు వాస్తవంగా జరిగన భారతదేశ చరిత్రలోనివే అన్నది నిర్వివాదాంశం. అయితే భారతేతిహాసంలోని కథ భారతదేశంలో ఎప్పుడు జరిగిందో, ఎప్పుడు ఇతిహాసం రూపం ధరించిందో పరికించాలి.

భారత రామాయణాలు ఆధారంగా భావించే ఐతిహాసిక యుగం క్రీ.పూ.1000 సంవత్సరాల కంటే ముందుగా భావించటం సాధ్యం కాదు. రామాయణం క్రీ.పూ.1000-600 మధ్య కాలంలో జరిగి ఉండవచ్చుననే ఒక ఊహ వాస్తవానికి దగ్గరగా ఉండవచ్చు. భారత కథ ఇంకా అనంతరం జరిగిందే అవుతుంది. రామాయణ కథ చారిత్రకంగా ముందటిదే అయినా సాహిత్యంగా తరువాతిది. భారత కథ చారిత్రకంగా తరువాతిదే అయినా సాహిత్యంగా ముందటిది. భారత రామాయణాలలో ముందు వెనుకలను గూర్చి సాహిత్య వేత్తలలోనూ ఏకాభిప్రాయం లేదు. చారిత్రక పరిశోధకులూ ఏకాభిప్రాయం ప్రకటించలేదు.

రాముడు క్రీ.పూ.2000 సంవత్సరాలకు' చెందినట్లుగా పురాణ సంప్రదాయం విశ్వసిస్తుంది. అయితే అయోధ్య ప్రాచీనత తెలిపే త్రవ్వకాల ఆధారం ఆ తేదీని అంగీకరింపదు. శ్రీకృష్ణుడు మహాభారతంలో పెద్ద పాత్ర నిర్వహించాడు. కానీ మధుర శాసనాలు కానీ, శిల్పాలు కానీ క్రీ.పూ.200 కంటే ముందుగా కృష్ణుడి అస్తిత్వాన్ని చెప్పలేకుండా ఉన్నాయి.

మలివేద కాలం నాటి జీవనంతో భారత రామాయణ సాహిత్యజీవనం పోలుతూ ఉంది. మలివేద యుగం క్రీ.పూ.1000-600 మధ్యకాలానికి చెంది ఉంది. అందువల్ల భారత రామాయణాలలోని జీవితం క్రీ.పూ.1000 కంటే ముందుగా ఉండి ఉండటానికి అంతగా వీలు కల్పించదు.

హస్తినాపురం భారతంలో ప్రధాన పట్టణం. అది రాజధానీ నగరం. తవ్వకాలు ఆధారంగా హస్తినాపురం క్రీ.పూ.900 కు ముందు లేదని స్పష్టం. భారతంలో వర్ణితమయిన హస్తినాపురం కనీసం క్రీ.పూ.900 ప్రాంతంలోది కూడా కాదు. భారతదేశంలో భరతవంశం కథ క్రీ.పూ.400 నాటికి పూర్తి అయింది. భారతంలో వర్ణితమయిన హస్తినాపురం క్రీ.పూ.400 తర్వాత క్రీ.శ.400 కంటే ముందుగా ఏర్పడ్డ నగరాన్ని ప్రతిబింబిస్తుంది.

'The texts shows that the Aryans expanded from Punjab over the whole of Western Uttar Pradesh covered by the Gange-Yamuna

doab. The Bharatas and purus, the two major tribes, combined and thus formed the Kuru people. In the beginning they lived between the Saraswathi and the Drishadvati just on the fringe of the doab. Soon the kurus occupied Delhi and the upper portion of the doab, the area called Kurukshetra or the land of the kurus. Gradually they coalesced with a people called panchalas, who occupied the middle portion of the doab. The authority of the Kuru-panchala people spread over Delhi and the upper and middle parts of the doab. They set up their capital at Hastinapur situated in the district of Meerut. The history of the Kuru tribe is important for the battle of Bharatha which is the main theme of the great epic called the Mahabharatha. This war is supported to have been fought around 950 B.C. between the Kauravas and the Pandavas, although both of them belonged to the Kuru clan. As a result practically the whole of the kuru clan was wiped out'. (5)

హస్తినాపురం క్రీ.పూ. 900 నుండి ఉన్నప్పటికి భారతంలో వర్ణితమయిన నగరం క్రీస్తుశకం లోకి వచ్చే పరిస్థితి ఉంది.

'Excavations at Hastinapur, datable to the period 900 B.C. to 500 B.C. have revealed settlements and faint beginings of town life. But hey do not at all answer the description of Hastinapur in the Mahabharatha because the epic was finally compiled much later in about the fourth century A.D. when material life had advanced much. In later vedic times people hardly knew the use of burnt bricks. The mud structuresthat have been discovered at Hastinapur could not be imposing and lasting. From traditions we learn that Hastinapur was flooded, and the remnants of the kuru clan moved to Kaushambi near Allahabad'.(6)

రామాయణ భారతగాథలు క్రమంగా క్రీస్తుపూర్వం 1000 పూర్వపరా జరిగి ఉన్నప్పటికి వాటిని భారత రామాయణేతిహాసాలుగా వ్రాయటం క్రమంగా క్రీస్తుపూర్వం 500 సంవత్సరాల తరువాతి కాలంలోనే జరిగింది. భారత రామాయణ రచన క్రీస్తుపూర్వమే ప్రారంభమయినా క్రీస్తుశకం 4వ శతాబ్దిదాకా ఆ రచన సాగుతూనే వచ్చింది.

'The two epics and the major puranas seem to have been finally compiled by circa A.D.400. Of the epics the Mahabharatha attributed to Vyasa is older and age and possibly reflecting the state of affairs from the tenth century B.C. to the fourth century A.D. Originally it consisted of 8800 verses and was called Jaya or the collection dealing with vic-

tory. These were raised to 24,000 and came to be known as Bharatha named after one of the earliest vedic tribes. The final compilation brought the verses to 1,00,000 which came to be known as the Mahabharatha or the Satasahasrai Samhita. It contains narrative descriptive and didactic material. The main narrative which relates to the Kaurava Pandava conflict may belong to alter vedic times, the descriptive portion might be used for the post-vedic times, and the didactic portion generally for post-Mayura and Gupta times'.(7)

ప్రాచీన భారతీయ వ్యవస్థకు ప్రధాన ధర్మాలలో వర్ణవ్యవస్థ, ఆశ్రమ ధర్మాలు, పురాషార్థాలు ఉన్నాయి. వర్ణవ్యవస్థ వైదికయుగంలో లేదు. మలివేదయుగంలో అవతరించింది. వర్ణ వ్యవస్థ ఉనికి వల్ల భారతం మలివేద యుగానికి సంబంధించిందిగా విమర్శకులు భావించారు.

'The post-vedic times society was clearly divided into four varnas ; Brahmanas, Kshatriyas, Vaisyas and Sudras. Each varna was assigned well-defined functions, although it was emphasized that varna based on birth and the two higher varnas were given some privileges. The Brahmanas who were given the functions of priests and teachers, claimed the highest status in society. They demanded several previleges, including those of receiving gifts and exemptions from taxation and punishment. In post-vedic texts we have many instances of such previleges enjoyed by them. The Kshatriyas ranked second in the varna hierarchy. They fought and governed, and lived on the taxes collected from the peasants. The Vaishyas were engaged in agriculture, cattle-rearing and trade. They appear as principal tax payers. However, along with the two higher varnas they were placed in the category of dvija or the twice-born. A dwija was entitled to wearing sacred thread and studying vedas from which the shudras were kept out. The shudras were meant for serving the three higher varnas, and along with women were barred from taking to vedic studies. They appear as domestic slaves, agriculture slaves, craftsmen and hired labourers in post-vedic times. They were called cruel, greedy and thieving in habits and some of them were treated as untouchables. The higher the varna the more privileged and purer a person was. The lower the varna of an offender the more severe was the punishment prescribed for him.

'Naturally the varna-divided society seems to have generated tensions. We have no means to find out the reactions of the vaishyas,

and the shudras. But the kshatriyas who functioned as rulers, reacted strongly against the ritualistic domination of the brahmanas and seem to have led a kind protest movement against the importance attanched to birth in the varna system. The kshatriya reaction against the domination of the priestly class called brahmanas, who claimed various previleges, was one of the causes of the origin of new religions'.(8)

ఆశ్రమ జీవితంలోని మొదటి మూడు దశలు వేదకాలంలోనే ఉన్నాయి. ఆఖరి దశ మలివేద కాలంలో రూపందిద్దుకొంది. నాలుగు ఆశ్రమ ధర్మ దశలూ భారతంలో గోచరమవుతున్నాయి. విద్యార్థి దశ బ్రహ్మచర్యంగా, సంసార దశను గృహస్థంగా, అరణ్యవాస దశను వానప్రస్థంగా, మునివృత్తిని సన్యాసంగా ఆశ్రమ ధర్మాలు విశదీకరించాయి. మలివేద కాలంలో ఆశ్రమధర్మంగా గుర్తింపు పొందిన సన్యాసం గురించి భారతంలో ప్రస్తావించటం వల్ల కూడా క్రీ.పూ.1000 సంవత్సరాల ప్రాంతంలో భారతదేశ చరిత్రలో భాగంగా ఉన్న కథ భారతేతిహాసంగా రూపొందిందని స్పష్టంగా గుర్తింపవచ్చు.

భారతేతిహాసం చారిత్రక వాస్తవానికి సాహితీ రూపమని స్పష్టం చేయటానికి చారిత్రకమైన ఆధారాలు గ్రహించటమయింది. భారతకథలోని రాజవంశాలతో రక్తసంబంధం విడమర్చి చూచి, ఆ రాజ వంశాల చారిత్రక నేపథ్యం గుర్తించటం, హిందూదేశం ఆర్యావర్తంగా పరిణమించే సందర్భంలో ఆర్యులు తమలో తాము కలహించిన స్థితిని గుర్తించి చారిత్రక నేపథ్యం స్పష్టం చేసుకోవటం, భారతదేశంలోని రాజవంశాలు భారతేతిహాస గాథతో సంబంధించి ఉండటం, భారతకథాకాలం, భారత రచనాకాలం విస్పష్టం కావించటం వర్ణవ్యవస్థ, ఆశ్రమధర్మం నేపథ్యంతో భారతగాథ చారిత్రక విషయం ఇతిహాస వస్తువుగా చెందిన పరిణామం స్పష్టంగా దర్శించటమయింది.

2.1.9. భారత కావ్యం : భారతంలోని అనేక కథాంశాలను తీసుకొని పలువురు కవులు, నాటకకర్తలు, కావ్యాలుగా, ప్రబంధాలుగా, నాటకాలుగా కావ్యోచితంగా పెంచి కుదించి, అల్పంగా మార్చి వ్రాశారు. సంస్కృతంలో భారతకథాంశం తీసుకొని వ్రాసిన కావ్యనాటకాలు తెలుగులోకి అనువాదంగా కవులు నాటకకర్తలు అందించారు. వాటిని కూడా ఈ సందర్భంలో పరిశీలించటం జరుగుతుంది. భారత కథ ఆధారంగా చేసుకొని వ్రాసిన కావ్యప్రబంధం యక్షగాన నాటక సాహిత్యం భారతకావ్యం భారత ప్రబంధం, భారత యక్షగానం, భారత నాటకంగా పరిశీలించటం జరుగుతూ ఉంది. ఇక్కడ విషయపరంగా వింగడించటంలోని సమస్య వల్ల ప్రక్రియాపరంగా పరిశీలించటం జరుగుతూ ఉంది. కథానేపథ్యం కానీ, పాత్ర నేపథ్యం కానీ, భారత కథలోని పూర్వాపర నేపథ్యం కానీ, ఆధారంగా ఈ సాహిత్యం వింగడించడంలో అవ్యాప్తికి అవకాశం లేకుండా చేయడం కష్టంగా ఉంది. అందువల్ల ప్రక్రియాపరమయిన వింగడింపు సముచితమని గ్రహించటం జరిగింది. ప్రక్రియాపరంగా చూస్తున్నప్పటికి అందులో కాలక్రమ పద్ధతిలోనే చర్చించటమవుతుంది. అయితే ఒక విషయానికి సంబంధించిన విభిన్నాంశాలు ఎక్కడ ఉన్నా, వాటిని అన్నింటిని ఒక్క చోట చెప్పటం అనుకూలంగా ఉంటుందని గ్రహించటమయింది.

ప్రాంతాలలో ఆది అరణ్య విరాట ఉద్యోగ భీష్మ ద్రోణ పర్వాలు, బాల సరస్వతి సభా పర్వం, అత్మకూరు సోమన్న కర్ణపర్వం నుంచి స్వర్గారోహణ పర్వాల దాకా వ్రాశారు. ఈ కవిత్రయ కారణం వల్ల భారతం ద్విపద రూపాన ప్రజలకు దగ్గరయింది.

2.1.9.3. ఇతర భారతాలు : భారంలోని వివిధ ఘట్టాలను గ్రహించి వెలువడిన రచనల్లో 'బాలభారతం' ఒకటి. దీనిని ప్రోలుగంటి చెన్నయ వ్రాశాడు. భారత వీరుల బాల్యాన్ని వచన కావ్యంగా రచించాడు. కాకమాని గంగాధరుడూ 16వ శతాబ్దంలో ఇదే పేరిట కావ్యం రచించాడు. అయితే కొన్ని పద్యాలు మాత్రమే ఉదాహరణాల వల్ల లభిస్తున్నాయి.

కృష్ణార్జున సంవాదాన్ని 'గయోపాఖ్యానం' నాదెండ్ల గోపమంత్రి రచించాడు. భారతకథలోని 'సుభద్రా కళ్యాణా'న్ని తాళ్ళపాక తిమ్మక్క ద్విపద కావ్యంగా రచించింది. భారతంలోని భీమాంజనేయుల సౌగంధికా పుష్పాహరణం ఇతివృత్తాన్ని గ్రహించి రాయసంగణపయ్య 'సౌగంధికాపహరణం'రచించాడు. ఈ కథను రత్నాకరం గోపాలరాజు ద్విపదగా రచించాడు క్రీ.శ. 1575లో పొన్నికంటి తెలగన అచ్చ తెనుగు కావ్యంగా భారతంలోని కథను తీసుకుని 'యయాతి చరిత్ర' వ్రాశాడు. యయాతి దేవయానీ శర్మిష్ఠలను పెళ్ళి చేసుకోవడం, పిల్లలను కనడం వరకున్న కథ చెప్పాడు.

ఎల్లకరన నరసింహ కవి, కృష్ణుడు రాయబారానికి వెళ్ళి విదురుని ఇంట భోజనం చేయడం కథగా 'భారత సావిత్రి' రచించాడు. భీముడిని కథానాయకుడిగా చేసి కాశీరాజ పుత్రికను నాయికగా మలచి భారతకథను పెంచి ఎలకూచి బాల సరస్వతి చంద్రికా పరిణయాన్ని వ్రాశాడు. ఏనుగు లక్ష్మణ కవి 'భీమసేన విజయం', 'ద్రౌపది విజయం' రచించాడు. భీమసేన విజయం అనే కావ్యాన్ని అక్కయ కవి రచించాడు. భీమసేనుని పుత్రిక సునందనుప్రదీపుడు వివాహం చేసుకోవడం కథగా 'సునందా పరిణయం' చింతకుంట కోదండ రామయ్య రచించాడు.

నన్నయ చెప్పిన ద్రౌపది కళ్యాణాన్నే 'పాంచాలీ పరిణయం' అనే అయిదాశ్వాసాల గ్రంథంగా కాకమాని మూర్తికవి రచించాడు. దీనిలో సమకాలీన భాష కనిపించడం విశేషం. కుమార వెంకట రాయలు అయిదాశ్వాసాల కావ్యాంగా 'ద్రౌపదీ కళ్యాణం' వ్రాశాడు. భారతంలోని కొంత భాగాన్ని కొటికెలపూడి వీరరాఘవయ్య రచించాడు.

2.1.9.4. కృష్ణ భారతం : ఆధునిక యుగంలో శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి శ్రీకృష్ణభారతం పేరిట వ్యాసభారతాన్ని అనువాదం చేశాడు. శ్రీకృష్ణుడికి ప్రత్యేక ప్రాధాన్యం ఉన్న భారతంగా దీన్ని భావింపనక్కర్లేదు. ఈ భారతంలోని శ్రీకృష్ణ పదం పురాణ పురుషునికి సంబంధించింది కాదు. అది శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి పేరులో భాగమే. ఈయనే ఈయన పేరుమీద శ్రీకృష్ణభాగవతం, శ్రీకృష్ణ రామాయణం కూడా అనువాదం చేశాడు. అధునిక కాలంలో ప్రాచీన సాహిత్యం విశేషంగా వ్రాసిన సుప్రసిద్ధ పండిత కవి శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి.

2.1.10. భారత ప్రబంధం : భారత కథాంశాలతో వెలువడ్డ ప్రబంధాలు

పరిశీలించటం కర్తవ్యం. భారతంలోని చిన్న కథలను తీసుకొని విస్తృత ప్రబంధాలుగా మలచి రసవత్తర ప్రబంధాలుగా కవులు సాహిత్యమందించారు. భారత కథాంశంతో కూడా ఉన్న ప్రబంధాలను భారత ప్రబంధాలుగా పరికింపవచ్చు.

ప్రబంధ సాహిత్య ప్రక్రియ అవతరణకు పూర్వరంగం నేపథ్యంగా సిద్ధం చేసిన ఘనత శ్రీనాథునికే చెందుతుంది. శ్రీనాథుణ్ణి ప్రథమ ప్రబంధ స్రష్ట అనటం కూడా సాహిత్య విమర్శకులలో పలువురికి అభీష్టం. ఆ దృష్టితో శృంగార నైషధం ఈ సందర్భంలో పరికించటం అవుతుంది. దీనితో కూడా భారత ప్రబంధ పరిశీలనం ఇక్కడే జరుగుతుంది.

2.1.10.1. శృంగార నైషధం : సంస్కృతంలో శ్రీహర్షుడు రచించిన ఇనుపగుండు వంటి నైషధం ఆంధ్రీకరించటంలో శ్రీనాథుని విశేష ప్రతిభా పాండిత్యాలు ప్రదర్శించాడని విమర్శకులు ఏకగ్రీవంగా అంగీకరించటం సమంజసమే. ఇది 'మహా భారతమున అరణ్య పర్వాంతర్గతమగు నలోపాఖ్యానము నందు ఏక దేశమైన నలదమయంతుల వివాహపర్యంత ఘట్టమును గ్రహించి'.(11) రూపొందించిన నైషధాన్ని శ్రీనాథుడు అనువదించాడు.

వీరసేన పుత్రుడు, నిషేధ దేశ పాలకుడు, ధర్మవర్తనుడు నలుడు. విదర్భరాజు భీమరాజు పుత్రిక దమయంతి. వీరిరువురు ఒకరిని గూర్చి ఒకరు విని ప్రేమించుకొన్నారు. నలుడు ఒకనాడు వనంలో విహరిస్తూ కంటపడిన బంగారు హంసను పట్టుకొన్నాడు. అది విడిచిపెట్టమని ప్రార్థించడంతో వదిలాడు. హంస వా ంరువురి మధ్య రాయభారంనడిపి వారిరువురి ప్రేమను గాఢపరిచింది. దమయంతి తండ్రి స్వయవరం ప్రకటించాడు. ఇది విన్న ఇంద్రాది దేవతలు స్వయంవరానికి బయలుదేరారు. దారిలో వారికి నలుడు కనిపించాడు. తమ కార్యం నెరవేరడానికి నలుని రాయబారిగా పంపారు. నలుడు తిరస్కరిణీ విద్యతో దమయంతిని సమీపించి, ఇంద్రాదుల ప్రేమ సందేశం వినిపించాడు. తాను నలుడిని తప్ప వేరొకరిని వరించ్చనని చెప్పిన దమయంతి నిర్బంధంపై తానెవరో చెప్పాడు. దేవకార్యం పాడుచేశానని బాధపడ్డాడు. బంగారు హంస ప్రత్యక్షమై వారిని ఓదార్చింది. అదృశ్యంగా ఉన్న ఇంద్రాదులు నలుని సచ్ఛీలతను మెచ్చుకొన్నారు. స్వయంవరాన సరస్వతీ దేవి విచ్చేసిన రాజులను పరిచయం చేస్తూ ఉంది. నలుని రూపంలో ఇంద్రాదులు ఉన్నారు. మానవ లక్షణంతో నలుని గుర్తించి దమయంతి వరించింది. వెనుదిరిగిన ఇంద్రాదుల ద్వారా కామక్రోధమోహ లోభులు స్వయంవరం విషయం విని, వారిని విడదీయడానికి యోచిస్తూ ఉండగా ఇటు నలదమయంతులు సుఖంగా కాలం గడపసాగారు.

నలచరిత్ర పేరిట ద్విపద కావ్యంగానే చక్రపురి రఘువాచారి వ్రాయగా, మూడాశ్వాసాల ద్విపద కావ్యంగా నలచరిత్రను బట్టిపట్టి తిమ్మయ్య రచించాడు. 17వ శతాబ్దానికి చెందిన రఘునాథనాయకుడు సంపూర్ణంగా నలచరిత్రను ఎనిమిదాశ్వాసాల ద్విపద కావ్యంగా రచించాడు. ఇంకా 'నైషధ పారిజాతం' అనే ద్వ్యర్థి కావ్యాన్ని వ్రాశాడు. ఇది నలచరిత్ర పారిజాతాపహరణ వృత్తాంతాల జోడింపు. ఇది సమగ్రంగా లభించలేదు. పైడిమర్రి వేంకటపతి, నల చక్రవర్తి మనుమడు, సీమంతిని అనే రాజకుమార్తెను వివాహం చేసుకోవడం ఇతివృత్తంగా ఆరాశ్వాసాల ప్రబంధాన్ని 'చంద్రాంగద చరిత్ర' వ్రాశాడు.

2.1.10.2. వసు చరిత్ర : సంగీత కళారహస్యనిధి భట్టుమూర్తి నామాంతరం ఉన్న రామరాజు భూషణుడు నాటకీయంగా ఈ ప్రబంధం రూపొందించాడు. భారతంలోని ఉపరిచర వసు వృత్తాంతాన్ని గ్రహించి రామరాజు భూషణుడు (క్రీ.శ.1510-1580) రచించాడు. మూలంలో చిన్న కథను తీసుకొని వృత్తంగా కథను పెంచి, అష్టాదశ వర్ణనలు కూడించి, శ్లేషాత్మకంగా శృంగారం అంగిరసంగా ప్రబంధం సృష్టించాడు.

చేదిదేశ పాలకుడు వసురాజు. శుక్తిమతి నదీ ప్రవాహాన్ని నిరోధించే కోలాహల పర్వతాన్ని కాలితో మీటి దీనంగా ఉన్న దాన్ని తన క్రీడాద్రిగా చేసుకొన్నాడు. అది చూచి ఇంద్రుడు ముగ్ధుడై వసురాజుకు చెలికాడయ్యాడు. వసంతకాలంలో ఉద్యానవన దర్శనానికి, ఉద్యానవన పాలకుల ఆహ్వానంపై వెళ్తుండగా కిన్నర మిథునం శుభం కలుగుతుందని పలికింది. వసురాజు కోలాహల క్రీడాద్రిలో విహరిస్తుండగా, సుమధుర సంగీతం విని, పొంచి అక్కడ ఉన్న అతివను చూచి వివరాలు కనుగొని రమ్మని నర్మసఖుని పంపాడు. యువతి రూపంలో వెళ్ళి ఆమె కోలాహల శక్తుమతి పుత్రిక గిరిక అని తెలసుకొని, వసురాజు ఆమెను వివాహమాడుతాడని చెప్తూ రాజును ప్రవేశపెట్టాడు. ఇరువురిని ఆశీర్వదించి వెళ్ళి తిరిగి నర్మసచివునిగా ప్రవేశించాడు. తల్లి నుంచి పిలుపు రావడంతో గిరిక నిష్క్రమించింది. వసురాజు గిరిక వియోగం అనుభవింపసాగాడు. గిరిక విరహం చూడలేని మంజువాణి గిరిక హారం తీసుకొని వసురాజు వద్దకు రాయబారిగా వెళ్ళి, తిరిగి వచ్చి గిరికను వసురాజుకు కోరడానికి ఇంద్రుడు వస్తున్నాడని తెలిపి వసురాజు ఇచ్చిన ఉంగరం ఇచ్చింది. చెలులు శుక్తిమతి కోలాహలులకు విషయం తెల్పారు. ఇంద్రుని కోరికను కోలాహలుడు అంగీకరించాడు. వైభవోపేతంగా వివాహం జరిగింది. ఎన్నో బహుమతులు లభించాయి. అలా లభించిన వసుపాదుణ్ణి సైన్యాధిపతిగా వసురాజు చేశాడు. వివాహానంతరం గిరికా వసువులు రాజ్యానికి వెళ్ళి సుఖంగా ఉండసాగారు.

సురభి మాధవరావు 'చంద్రికా పరిణయం' పేరిట వ్రాసిన ప్రబంధం వసుచరిత్రకు నకలుగా ఉంది. దీన్ని కార్బను కాపీ అనికూడా విమర్శకులు భావించారు. అనంతరాంధ్ర సాహిత్యం లోని వసుచరిత్రను మాతృకగా ఉంచుకొని పలువురు ప్రబంధాలు వ్రాశారు. వాటిని పిల్ల వసుచరిత్రలని పిలవటం కూడా కద్దు. వసుచరిత్ర ప్రబంధానికి వీధి నాటక రూపంగా వసురాజు విలాసాన్ని కొదమ గుండ్ల శేషాచార్యులు రచించాడు.

2.1.10.3. చిత్ర భారతం : భారతంలోని ప్రసిద్ధ పాత్రలతో విచిత్రంగా మలచిన కావ్యం చిత్రభారతం. దీన్ని చరిగొండ ధర్మన వ్రాశాడు. 1470-1530 ప్రాంతాలకు చెందిన ధర్మన తెలంగాణా లోని చరిగొండ గ్రామానికి చెందినవాడు. ఓరుగల్లును పాలించిన చిత్తాబుఖానుకు మంత్రి పెద్దయామాత్యుడు. ఈ పెద్దయకు తన ప్రబంధాన్ని అంకితమిచ్చాడు. ఇది ఎనిమిది అశ్వాసాల కావ్యం. 1314 గద్యపద్యాలతో ఉన్న రచన. సూతుడు శౌనకాదులకు చెప్పిన కథను శుకమహర్షి ఇలావంతునికి చెప్పాడు.

ఇందులో కృష్ణార్జునుల యుద్ధం కథ ఉంది. చతర్థనుడనే రాజుకు కృష్ణుడి వలని ప్రాణభయాన్ని తొలగిస్తానని అభయమిచ్చిన అర్జునుడు తన సేనలతో వెళ్ళి కృష్ణునితో పోరాడి మృతుడై, తిరిగి కృష్ణుని వలన బ్రతకడం ఇందులోని ఇతివృత్తం.

కృష్ణార్జునులు బావ బావమరుదులు. వాళ్ళ బంధుత్వం కంటే స్నేహం, ఆత్మీయత, రథసారథి సంబంధం, నరనారాయణ సంబంధం విడదీయరానిది. అటువంటి స్థితిలో వాళ్ళు యుద్ధం చేయవలసి రావటం, దేవుడి మీద మానవుడు యుద్ధం చేయటం విచిత్ర విషయాలు. ఈ విచిత్ర విషయం విన్యస్తం కావటం వల్లనే ఈ ప్రబంధం సార్థక నామధేయమయింది. ఈ ప్రబంధంలో విచిత్రమైన మలుపులు ఉండటాన దీనికి చిత్రభారతం అని పేరు పెట్టాడు కవి.

పూర్వం తుల్యుడనే ముని విష్ణువుకై చేసే తపాన్ని భగ్నం చేయడానికి ఇంద్రుడు పంపగా వచ్చిన రంభ ముని కోపానికి గురై అశ్వంగా మారింది. శాప విమోచనకై కుండిన నగరాధిపతి చతుర్థనుణ్ణి ముల్లోకాలు తిప్పసాగింది. ఒకనాడు దాని మరగ యమునా తీరంలో సూర్యునికి అర్ఘ్యమిస్తున్న కృష్ణుని దోసిట్లో పడింది. కోపంతో కృష్ణుడు కారకుణ్ణి నెలలో సంహరిస్తానని అన్నాడు. రంభ శాపవిమోచనమై వెళ్తూ కారకుడయిన చతుర్థనునికి నారాయణ మంత్రాన్ని ఉపదేశించి వెళ్ళింది. ఇది నారదుని ద్వారా తెలుసుకొని చతుర్థనుడు దేవేంద్రుణ్ణి శివుణ్ణి బ్రహ్మను వేడుకొని విఫలుడై అర్జునుణ్ణి ఆశ్రయించాడు. అర్జునుడు ఎవరిని ఎదుర్కోవాలో తెలియకుండానే రక్షిస్తానని అభయమిచ్చాడు. ఈ కారణంగా కౌరవ యాదవ సేనలు తలపడ్డాయి. జరిగిన భీకర యుద్ధంలో ధర్మరాజు తప్ప కౌరవులు ఎవ్వరూ బ్రతకలేదు. ఎవరిని బ్రతికించాలని కృష్ణుడు కోరడంతో చతుర్థనునికి ప్రాణదానం చేయనన్నాడు. అతని ధర్మపరతకు మెచ్చి కృష్ణుడు అందరినీ బ్రతికించాడు. ఈ చిత్రమైన కథ చిత్రభారతం.

2.1.10.4. శృంగార శాకుంతలం : వాణీ నా రాణి అన్న పిల్లలమర్రి పినవీరభద్రుడు ఈ ప్రబంధం వ్రాశాడు. ఇది కాళిదాసు శాకుంతల నాటకానికి అనువాదం. భారతకథలో శకుంతల కథ ఉపాఖ్యాన ప్రాయం. దాన్ని మధురనాటకంగా కాళిదాసు తీర్చిదిద్దాడు. అందులో అనసూయ ప్రియంవదలు అదనంగా ప్రవేశించారు. ఆ పాత్రలకీ ప్రబంధంలో చోటు ఉంది. ఇది సంస్కృతాంధ్ర మహాభారతాలలోని కథా సూత్రానుప్రాయంగానూ, కాళిదాసు శాకుంతలానికి అనువాదంగానూ, స్వతంత్ర కల్పనలతో వర్ణనలతో రమణీయ ప్రబంధంగానూ రూపొందింది. నాలుగు అశ్వాసాల ప్రబంధంగా రచించాడు.

హస్తినాపుర పాలకుడు దుష్యంతుడు. భృత్యులతో వేటకేగి గొల్లపల్లెలో విశ్రమించాడు. వేటకెళ్ళి దారితప్పి కణ్వాశ్రమం చేరాడు. అక్కడున్న శకుంతల, ఈ దుష్యంతుడు పరస్పరాకర్షితులయ్యారు. దుష్యంతుడు ముని శిష్యుడి వలన ఆమె మేనకా విశ్వామిత్రుల పుత్రిక అని తెలుసుకొన్నాడు. ముని శిష్యుల కోరికపై రాక్షసుల బారినుంచి వారు చేసే యజ్ఞాన్ని రక్షించడానికి ఆశ్రమానికి వచ్చిన దుష్యంతుడు, శకుంతల వల్ల కలిగే పుత్రుడిదే సింహాసనాన్ని అధిష్ఠించే అర్హత అని అంగీకరించి అనసూయ ప్రియంవదల సమక్షంలో శకుంతలను గంధర్వ వివాహం చేసుకొన్నాడు. యజ్ఞాన్ని ధ్వంసం చేయదలచుకొన్న రాక్షసులను వధించాడు. కొన్నాళ్ళు శకుంతలతో గడిపి రాజ్యానికి వెళ్ళాడు. కణ్వమహర్షి సోమతీర్థం నుంచి ఆశ్రమానికి వచ్చి విషయం విన్నాడు. ఆశ్రమానికి వచ్చిన దుర్వాసుడు తన ఉనికి గుర్తించని శకుంతలను శపించాడు. రాజు శకుంతలను

మరచిపోతాడని శాపం. అనసూయ ప్రార్థనపై ముద్రికా దర్శనంతో శాపవిమోచనం అవుతుందన్నాడు. శకుంతల గర్భందాల్చి పుత్రవతి అయింది. కణ్వుని హితవుపై పుత్రుడయిన భరతుణ్ణి, పరివారాన్ని తీసుకొని భర్త రాజ్యానికి వెళ్ళింది. దుష్యంతుడు శాపం వల్ల గుర్తించకపోవడంతో అంగుళీయకం చూపారు. ఆకాశవాణి ప్రకటించింది. గుర్తించక విచారంగా ఉన్న దుష్యంతునికి నారదుడు శాపాన్ని తెల్పాడు. దుష్యంతుడు శకుంతలను అగ్రమహిషిగా స్వీకరించాడు.

ఇదే కథాంశంతో తాళ్ళపాక రేవణూరు వేంకటార్యుడు శకుంతలా పరిణయం రచించాడు. సిద్ధనప్రెగడ కూడా పద్యకావ్యంగా శాకుంతలాన్ని వ్రాశాడు.

2.1.10.5. విజయ విలాసం : చేమకూరు వేంకటకవి రచించిన ప్రబంధం విజయ విలాసం. తంజావూరు పరిపాలించిన రఘునాథ నాయకుడు (క్రీ.శ.1600-31) ఆస్థానంలోని కవి. కళాప్రియుడు సాహితీ పోషకుడు సాహితీవేత్త రాఘునాథనాథుడు. ఆయన కాలంలో సాహిత్యం ఉన్నత గౌరవం పొందింది. అతని స్థానంలో క్షాత్రధర్మం నిర్వర్తించినా, సాహిత్యరంగంలో కూడా రఘునాథుని మెప్పుని పొందాడు.

జాతివార్తా చమత్కారం చేమకూరి వెంకటకవి కవితా ద్రుక్పథం ప్రదర్శిస్తుంది. ఈ చమత్కారం వస్తు విస్తృతి నుంచి పదం, దానిపై ఊత, అలంకార భావన సంభాషణల దాకా కనిపిస్తుంది. విజయ విలాసం చేమకూరి రచనలలో ఉత్కృష్టమయింది. ఇది మూడు ఆశ్వాసాల ప్రబంధం. దీనిని శృంగార ప్రబంధంగా కవి తీర్చిదిద్దాడు.

అర్జునుడు తీర్థయాత్రలకేగి మార్గమధ్యంలో చేసుకొన్న వివాహాల. విజయమే విజయ విలాసం. ఇందులో అర్జునుడు ఉలూచి చిత్రాంగద సుభద్రలను వివాహం చేసుకొన్నాడు. ఈ మూడు వివాహాల కథలే విజయ విలాసం. '..... వేంకట కవి విజయ విలాసమునందు మూడు విధములగు ప్రణయమును నిరూపించినాడు'.(12) 'ఉలూచి నాగకన్య అర్జునుణ్ణి ప్రేమించింది. తానే వరించింది. కనుకిది స్వయంవరం. ఉలూచి అర్జునుల పరిణయం స్వయంవర పర్యవసానం. చిత్రాంగద అర్జునుల వివాహం ఆర్షం. వివాహపూర్వం, మణిపురాధీశుని కుమార్తె చిత్రాంగికి అర్జునుని పట్ల ఏ విధమైన అనురాగం లేదు. పెద్దల అంగీకారం పొంది వివాహం చేసుకొన్నాడు. సుభద్రార్జునులు పరస్పరాకర్షితులు - ఒకరి నొకరు చూసుకోక మునుపే - కృష్ణ సోదరి సుభద్రను చూడక మునుపే అర్జునుడు ఆమెను ప్రేమించాడు. 'ఇది గాంధర్వ వివాహము'.(13)

వివాహాలు మూడు రకాలుగా కనిపిస్తున్నాయి. నాయికలు ముప్వురు. ఈ రెండు అంశాలను సమన్వయం పరచడంలో సమర్థవంతమయిన నిర్వహణ కనిపిస్తుంది. నాగ మర్త్య దేవలోకాలకు సంబంధించిన స్త్రీలు స్వయంవరం ఆర్ష గాంధర్వ వివాహాలను చేసుకోవడం,మానవ సంబంధిత వివాహ విషయంలో అష్టవిధ వివాహాలున్నప్పటికి సంప్రదాయబద్ధమైన, వివాహం చేయడం; కృష్ణ సోదరిగా దైవాంశ స్పర్శ ఉన్న సుభద్ర విషయాన గాంధర్వ వివాహం ప్రశంసనీయమైన కథా నిర్వహణకు నిదర్శనం. ఈ ప్రబంధం సృష్టిలో శ్లేష విశేష వైభవం సాధించింది. తెలుగువాళ్ళ వివాహపద్ధతి వసుచరిత్రలో

మొదలైనప్పటికీ విజయ విలాసంలో విశేష ప్రాముఖ్యం సంతరించుకొని విపుల కార్యకలాప విలాసంగా రూపం దిద్దుకొంది.

2.1.10.6. ఇతర ప్రబంధాలు : బహుళాశ్వ చరిత్రను శ్రీ దామెర్ల వేంగళనాయకుడు క్రీ.శ.1620లో రచించాడు. ఇది ఐదాశ్వాసాల ప్రబంధం. దీనిలోని ఇతివృత్తం 'శ్రీకృష్ణుడు తన భక్తుడైన బహుళాశ్వుని ఇంటికి విందారగింప బోవుట.......' (14) చిన్న విషయాన్ని తీసుకొన్నా సమర్థవంతంగా కథ నడిపాడు కవి.

తపతీ సంవరణోపాఖ్యానం కథ భారతంలోనిదే. దీన్ని అద్దంకి గంగాధరుడు ప్రబంధంగా రచించాడు. సూర్యుని పుత్రి తపతి. భరత వంశ పురుషుడు సంవరుణుడు. తపతీ సంవరుణుల వివాహమూ, ఆ వివాహానికి పూర్వం జరిగిన ప్రయత్నాలూ ఈ కథాంశానికి ప్రాణప్రతిష్ఠ చేశాయి. 'సంవరుణుడను రాజు సూర్యుని కుమార్తైన తపతిని వలచి వలపించుకొని వివాహమాడిన వృత్తాంతము'. (15) భారతాన్ని ఆధారం చేసుకొని వచ్చిన ప్రబంధాలలో ముఖ్యంగా ఆడిదము సూరకవి రచించిన 'కవిజన రంజనము' కూచిమంచి తిమ్మకవి వ్రాసిన 'రసికజన మనోభిరామము' పరికింపవచ్చు.

2.1.11. భారత యక్షగానం : భారతంలోని కథల్ని గ్రహించి యక్షగాన ప్రక్రియలో చేసిన సాహిత్య సృష్టి పరిశీలనకు భారత యక్షగానం ఉద్దిష్టం. తెలుగు సాహిత్యంలో నాటకావిర్భావం జరగక పూర్వం నాటక సాహిత్యం లేని లోపాన్ని తీర్చిదిద్దటం కోసం అవతరించిన యక్షగానం గీతిమాధుర్య ప్రాధాన్యంతో ప్రదర్శన కుద్దిష్టమైన దృశ్య సాహిత్యంగా రూపొందింది. ఇందులో నాటకీయత అమితంగా అభివ్యక్తమయ్యే భారత కథాంశాలు గ్రహించిన యక్షగానాలు గోచరమవుతున్నాయి.

మహాభారత కథనంతటిని యక్షగానంగా తీర్చిదిద్దాలనే ప్రయత్నం వేలూరి కన్నయదాసు చేశాడు. ఇతడు 'మహాభారత విలాసం' రచించాడు. ద్రౌపది స్వయంవరం దూత్యం నుంచి ధర్మరాజు పట్టాభిషేకం వరకు ఉన్న కథ ఇందులో ఉంది. విరాట పర్వ కథ ధేనుకొండ వెంకటయ్య యక్షగానంగా రూపొందించాడు. విరాట పర్వ కథ 'పంచపాండవుల నాటకం'గా పుల్లదాసు రచించాడు. శాంతి పర్వంలోని 'కపోత వ్యాఖ్యానాన్ని' బలభద్ర వాసి యక్షగానంగా మలచాడు.

భారతంలో కృష్ణుని తర్వాత ప్రసిద్ధుడు అర్జునుడు. ఇతని జీవితాంశ మాధారంగానే అనేక యక్షగానాలు వచ్చాయి. బొమ్మలాట సాంబయ్య బొమ్మలాట సంప్రదాయానికి చెందిన 'కిరాతార్జునీయం' వ్రాశాడు. 'పంచాక్షరీ ప్రభావం' ప్రబోధించే సందడి నాగదాసు రచించిన యక్షగానంలో 'పాశుపతార్థం తపోదీక్షలోనున్న యర్జుననుకింద్రుడు పంచాక్షరీ మంత్రోపదేశము చేయుటమే యిందలి ముఖ్య విషయము'.(16)

ప్రబంధము అనంతం'విజయ విలాసము' యక్షగానం రాశాడు. ఇందులో అర్జున ఉలూచీల పుత్రుడు నాగార్జునుడు. ఇతని చరిత్రము మహాలింగ పురాణము నుండి గ్రహింపబడిందని తెలిపాడు. ఇదేపేరిట అమనచర్ల కోదండరామయ్య యక్షగానంగా తీర్చిదిద్దాడు.

'అల్లీ అర్జున చరిత్ర'మనే యక్షగానాన్ని చెర్వీరాల భాగయ్య రచించాడు. తీర్థయాత్రలకు వెళ్ళిన అర్జునుడు పురుషద్వేషి అయిన మధురునేలే అల్లీ రాణిని వివాహమాడడం ఇందులోని వృత్తాంతం. 'ఐరావణ చరిత్ర'ను దురుపూరి అప్పలాచార్యులు రచించాడు. గాంధారీ వ్రతం కుంతికి మనస్తాపం కావడం, దానిని అర్జునుడు తీర్చడం ఇందులోని ప్రధాన కథ. 'ద్రౌపదీ కళ్యాణా'న్ని శాహజీ, అదేపేరిట గొట్టిముచ్చు అబ్బయదాసు రచించారు. 'ద్రౌపదీ వస్త్రాపహరణా'న్ని కందాళ్ళ రామాచార్యులు లిఖించాడు. కీచకధను 'భీమసేన విజయం' పేరిట అక్కయ కవి యక్షగానం రచించాడు.

చిత్రభారతంలోని గయోపాఖ్యాన కథను మూలంగా తీసుకొని 'మూడున్నర వజము' పేరిట బాగేపల్లి అనంతరామాచార్యులు, గయోపాఖ్యానం పేరిట చదలువాడ సూర్యరామ కవి అదే నామంతో శీలుసంగన రచించాడు. 'డాంగేయో పాఖ్యానము' పెరంబుదూరి వెంకట నరసయ్య రచన. 'గయోపాఖ్యాన చిత్రభారత కధలీ కథోపస్థితికి మూలభూతమైనట్లు తోచును'.(17) 'గయోపాఖ్యాన నాటకము' జోగరాజు భార్గవకవి రచించాడు. జైమినీ భారతంలోని అర్జునుని పుత్రుని కథను 'బభ్రువాహనుని చరిత్రం'గా పరవస్తు రంగయ్య వ్రాశాడు. జైమినీ భారతం మూలంనుంచి కథ గ్రహించి గడ్డం రామదాసు యక్షగానం రచించాడు.

ప్రఖ్యాతమయిన నలదమయంతుల చరిత్రను 'నలనాటకం'గా సిరికి హెగడ సుబ్బరాయుడు, కేశవ పట్టణము జిమరయ్య; 'నలచక్రవర్తి చరిత్రం'గా గవురహరాజు లక్ష్మీపతి రాయుడు యక్షగానంగా రూపొందించాడు. 'నలచరిత్ర'తేరుల పురి నారాయణ కవి రచించాడు. అదే పేరిట నాయకవారి పెద్దన, కెళ్ళ కుప్పయకూడా వ్రాశారు. శాకుంతల నాటకమనే పేరుతో కాళిదాసు శాకుంతలాన్ని గ్రహించి దూపాటి శేషాచార్యులు యక్షగానం రచించాడు. ఇదేపేరుతో వేదాల తిరునారాయణాచార్యులూ యక్షగానం వ్రాశారు.

2.1.12. భారత నాటకం : భారతంలోని కథాంశాలు గ్రహించి నాటకాలుగా వ్రాసిన వాటిని భారతనాటకంగా పరిశీలించటం జరుగుతుంది. నాటకీయత గోచరమయ్యే రెండు రాయబారాలు తెలుగులో శ్రీకృష్ణ రాయబారం, సంజయ రాయబారంగా ప్రసిద్ధాలు. భాషా విషయికంగా శ్రీకృష్ణుని రాయబారం, సంజయుని రాయబారం అని ఉండటం సముచితమన్నది సంగతే. శకుంతల కథ విశేష ప్రాధాన్యం సంతరించుకొన్న నాటకాలు, తెలుగులో అనువాదంగానూ, స్వతంత్రంగానూ వెలువడ్డాయి. ద్రౌపది వస్త్రాపహరణ గాథ, మయసభ వృత్తాంతం మంచి తెలుగు నాటకాలకు మూలమయ్యాయి. పాండవుల వనవాసమూ, కర్ణుడి జీవితమూ ప్రముఖ నాటక సాహిత్యానికి చలన చిత్రాలకు కథామూలాలనందించాయి. స్థూలంగా తెలుగు విశేష నాటక సాహిత్యావిర్భావానికి మహాభారత కథాంశాలు మౌలికంగా దోహదకారులయ్యాయి.

1. తెలుగులో పద్యనాటకం ప్రభవించటం, ప్రదర్శనలు పొందటం, దృష్టితో భారత నాటకం ప్రత్యేక స్థానం పొంది ఉంది. తిరుపతి వేంకటకవుల భారత నాటకాల ప్రాధాన్యం గమనార్హం. పాండవ ఉద్యోగ, విజయాలు ప్రదర్శన దృష్టితోనూ సాహిత్య దృష్టితోనూ విశిష్ట నాటకాలు. ప్రదర్శన దృష్టితో ఒక నూత్నమూ, ఉత్తమమూ అయిన

సంప్రదాయం సిద్ధించటానికి తిరుపతి వెంకటకవులు నాటక సాహిత్యం దోహదకారి అయింది. వీటి తర్వాతి స్థానం వీళ్ళ రచనే శ్రీకృష్ణ రాయబారం పొందుతుంది. భారత నాటకం సాహిత్య సృష్టిగానూ, ప్రయోగ దృష్టిగానూ విశిష్ట స్థానమలంకరించి విశేష శోభను పొందిన భారతనాటక నిర్మాణం చేసిన ఖ్యాతి మహాకవులైన తిరుపతి వేంకటకవులకు చెందుతుంది.

2. శాకుంతల నాటకము: సంస్కృతంలో కాళిదాసు వ్రాసిన నాటకం శాకుంతలం తెలుగులో అనేకులు అనువాదం చేశారు. స్వతంత్ర నాటకాలుగా కూడా తెలుగులో శకుంతల ఇతివృత్తం సాహిత్యం అవతరించింది. ప్రదర్శన కంటే పఠనానికి పారనానికి ఈ నాటకం విశేషంగా ఉపయోగపడింది. శాకుంతల నాటకం పొందిన అనువాదం క్రమం దర్శింపవచ్చు.

క్రీ.శ.1872లో అభిజ్ఞాన శాకుంతలము శ్రీమాన్ పరవస్తు వేంకటరంగాచార్యులు ఆంధ్రీకరించాడు. దీనిని రెండు భాగాలుగా ఏడు అంకాలుగా 1857, 1883లలో వీరేశలింగం పంతులు అనువదించాడు. 1883లో వడ్డాది పాపారాయుడు 'వేణీ సంహారం'. 'అభిజ్ఞాన శాకుంతల మందలి దుర్వాస శ్శాప వృత్తాంత కల్పన....' (18)తో రచించాడు. 1902లో వడ్డాది సుబ్బారాయుడు 'శాకుంతలా'న్ని అనువదించాడు. వేదము వెంకటరాయ శాస్త్రి 1896లో చేసిన అనువాదం పాఠ్యగ్రంథంగా ప్రసిద్ధమయింది. దాసు శ్రీరామ కవి, రాజామంత్రి ప్రగడ భుజంగరావులు కూడా శాకుంతలం వ్రాశారు. జి.నరసయ్యశాస్త్రి 1906లో, గూడ కృష్ణయ్య 1912లో నాటక సృష్టి చేశారు. 'శాకుంతలాదుష్యంతము' 1915లో కస్తూరి సుబ్బారావు రచించాడు. 'మేనకావిశ్వామిత్రము' 1929లో అనుముల విశ్వనాథశాస్త్రి వ్రాశాడు. శాకుంతలం ఆంగ్లంలోకి కూడా అనువాదమయింది. ప్రపంచ సాహిత్యంలో శాకుంతల నాటకం ప్రత్యేక ప్రాధాన్యం పొందింది.

3. ద్రౌపది వ్యక్తిత్వం : భారతేతివృత్తంలో ద్రౌపదికి సంబంధించిన ఘట్టం ఎక్కువగా నాటకీకరించబడింది. ద్రౌపది విశిష్ట స్త్రీ పాత్రగా రూపొందింది. రసోచితమైన నాటక రచనకు ఉత్తేజాన్ని కలిగించే ఘట్టం ద్రౌపది వస్త్రాపహరణం. కరుణ రసాత్మకమైన ఘట్టం కూడానూ. ద్రౌపది వివాహోదంతాన్ని గ్రహించి చిలకమర్తి లక్ష్మీనరసింహం నాటక సృష్టి చేశాడు.

వస్త్రాపహార ఘట్టాన్ని 'వస్త్రాపహరణం' (1896) పేరిట కొన్ని కల్పనలను జోడించి కొండుభొట్ల సుబ్రహ్మణ్య శాస్త్రి రచించాడు. ఇదే కథను నాదెళ్ళ పురుషోత్తమ కవి 'వస్త్రాపహరణ' పేరుతో మల్లాది అచ్యుత రామశాస్త్రి 'ద్రౌపది వస్త్రాపహరణం' పేరుతో నాటకాలు వ్రాశారు.

ద్రౌపది ముఖ్యపాత్రగా 1913లో తణికెళ్ల పూర్ణయ్య 'ప్రసన్నపాంచాలీయము' వ్రాశాడు. 1921లో మక్కపాటి వేంకటరత్న కవి కూడా ద్రౌపది ప్రాముఖ్యం తెలిపే నాటకం వ్రాశాడు.

4. అర్జునుడు : అర్జునుడు ప్రధానంగా అనేక నాటకాలు వెలువడ్డాయి. 'గయోపాఖ్యానం' కొడుభొట్ల సుబ్రహ్మణ్య శాస్త్రి రచన. ఇందులో 'గయుడు శ్రీకృష్ణుని

చేతిలో కాక గాలవ ఋషి యర్ఘ్యమిచ్చు చుండగ నతని చేతిలో నుమిసి నట్టును, అతడు తన పరాభవమును శ్రీకృష్ణుణకెరిగింపగా మహర్షిని పరాభవించినందులకు శ్రీకృష్ణుడు గయుని దండిపనెంచినట్లును,, అందువలన శ్రీకృష్ణార్జునుల యుద్ధము జరిగినట్లు ఇందున్నది'.(19) ఇదే కథను ఇదే పేరిట 1889లో చిలమకర్తి లక్ష్మీనరసింహం రచించాడు. 'సంగీత సైంధవార్జునము'ను గాడేపల్లి సూర్యనారాయణ శర్మ, అదే కథను 'సైంధవ వధ'గా వనప్పాకం శ్రీనివాసాచార్యులు తర్వాతి కాలంలో రచించారు. 'అర్జున పరాభవము' శేషాద్రి రమణకవులు రచించారు. ప్రమీలార్జునీయం వంటి నాటకాలు కూడా ఈ స్థితినే తెలుపుతాయి.

5. పాండవ జీవితం : పాండవుల వనవాసం భారతంలో ప్రముఖాంశం. ఉద్యోగ ప్రయత్నాలు, పాండవులు రాజ్యాన్ని వదలి రాజ్యానికి వచ్చే మధ్య కాలంలో జరిగిన వివిధ ఘట్టాలు అనేక నాటకాలుగా రూపొందాయి. 'పాండవ వనవాసం' రాజా మంత్రి ప్రగడ భుజంగరావు రచించాడు. అజ్ఞాతవాసారంభం అయిన పిమ్మట వారి స్థితులను 1887లో సుసర్ల అనంతరావు 'పాండవాజ్ఞాతవాసం' వ్రాశాడు. నర్తనశాల నాటకం కూడా పాండవుల అజ్ఞాతవాసంలోని ఘట్టమే కలిగి ఉంది.

వీరి అజ్ఞాతవాస సమయంలో జరిగిన వివిధ ఘట్టాలలో ప్రసిద్ధమయింది నాటకంగా రూపొందింది కీచకవధ. చిలమర్తి లక్ష్మీనరసింహం ఈ ఘట్టాన్ని రసవత్తరంగా మలిచాడు. తర్వాత పేర్కొనదగిన సన్నివేశం గోగ్రహణం. ఉత్తర గోగ్రహణం కథను కొక్కొండ వేంకటరత్నం 'ధనుంజయ విజయ వ్యాయోగం' పేరిట రచిస్తే కందుకూరి వీరేశలింగం పంతులు 'దక్షిణగోగ్రహణం' అయిదు అంకాల స్వతంత్ర రచనగా వెలువర్చాడు. 1913లో ఆర్.మదనగోపాల నాయుడు 'గోగ్రహణము' నాటకాన్ని రచించాడు.

6. ఇతర నాటకాలు : దుర్యోధనునిపై 'దుర్యోధన పరాభవము' 1915లో భమిడిపాటి చినయజ్ఞనారాయణ శర్మ నాటకంగా వ్రాశాడు. 'దుర్యోధనాంతం' అనే విషాదాంతాన్ని రాజావెంకటాద్యప్పారావు రచించాడు. కర్ణుడిని నాయకునిగా మానవల్లి రామకృష్ణ కవి 'కర్ణభారతము' సోమరాజు రామానుజరావు 'దాన వీర కర్ణ' నాటకాలుగా రూపొందించారు.

తర్వాతి ప్రధాన అంశం మహాభారత యుద్ధం. అభిమన్యుని వధ కథగా కాళ్లకూరి నారాయణరావు 'పద్మవ్యూహం' రచించాడు. 1911లో త్రిపురనేని రామస్వామి చౌదరి 'కురుక్షేత్ర సంగ్రామం' నాటకీకరించాడు. ఇందులో, పాండవులకు శాస్త్రబద్ధంగా ఆలోచిస్తే రాజ్యంరాదని దుర్యోధనుడే తగిన వాడని సూచించాడు. 1924లో కట్టా అచ్చయ్య 'మహాభారత యుద్ధము' రచించాడు.

భారతంలోని కథా సూత్రాలతో పరిణయాలు కొంతవరకు కనిపిస్తాయి. చందాల కేశవదాసు రచించిన శశిరేఖా పరిణయము, దేవగుప్తాపు భారద్వాజము రచించిన శర్మిష్ఠా విజయము (1910), సుభద్రార్జునుల వివాహమహోత్సవాన్ని బేతపూడి లక్ష్మీకాంతం రచించిన సుభద్రా పరిణయము, ముదిగొండ నాగవీరయ్య శాస్త్రి రచించిన సుభద్రా

కళ్యాణము (1916) బసవరాజు సీతాపతి రచించిన 'సాత్రాజితీ పరిణయము' (1915) ఈ కోవకు చెందినవే.

ధర్మవరం కృష్ణమాచార్యులు రచించిన 'యుధిష్ఠరయౌవరాజ్యము' మల్లాది సూర్యనారాయణశాస్త్రి నాటకీకరించిన 'భీష్మ ప్రతిజ్ఞ', భువనగిరి బుచ్చి పరదేశి సోమయాజి వ్రాసిన 'సౌగంధికాపుష్పాపహరణము' (1914), చిలమకర్తి లక్ష్మీనరసింహం, రచించిన నల నాటకం, రాజామంత్రి ప్రగడ భుజంగరావు వ్రాసిన నల నాటకం కొన్ని పేర్కొనదగిన రచనలు.

భారత కథను గ్రహించి తెలుగులో అనేక నాటకాలు వెలువడ్డాయి. ఎక్కువ నాటకాలు ప్రదర్శనలు పొందాయి. పద్యనాటకం తెలుగు నాటక ప్రత్యేకతను పొందటానికి పౌరాణిక నాటకం ప్రధానమయితే భారత నాటకం ప్రముఖంగా గోచరమవుతుంది.

2.2. రామాయణ చరిత్ర

సంస్కృత రామాయణానికి తెలుగులో అనేకమైన అనువాదాలు లభిస్తున్నాయి. ఇందులో కొన్ని పూర్వ భాగమున్న, రామాయణాలుకాగా, కొన్ని ఉత్తరభాగం మాత్రమే కలిగి ఉన్నాయి. పూర్వోత్తర భాగాలు సంపూర్ణ స్వరూపం వల్ల రామాయణం సంపూర్ణంగా విశదం కాగలదు. ఒక్కొక్క రామాయణానువాదం ఒక్కొక్క దృక్పథం విశాలం కావించేదిగా ఉంది. సందేశ దృష్టితో రసదృష్టితో ఈ అనువాదాలు మార్పుచేర్పులకు లోనవుతూ వచ్చాయి.

రామాయణంలోని భాగాలకు కాండాలని పేర్లున్నాయి. అవి బాల అయోధ్య అరణ్య కిష్కింధ సుందర యుద్ధ ఉత్తర కాండలు. ఉత్తరకాండ రామాయణాన్ని ఉత్తర రామాయణమని, మిగతా కాండల రామాయణానికి పూర్వ రామాయణమని పిలవటం సామాన్యమే కాని బాలకాండ నుంచి యుద్ధకాండ దాకా ఉన్న దీనిని రామాయణమని, ఉత్తరకాండ దానిని ఉత్తర రామాయణమని పిలవటం సంప్రదాయంగా గోచరమవుతుంది.

రామాయణానువాదాలలో, తెలుగులో మొదటిగా పేర్కొన్నదగినవి రంగనాథ రామాయణం, నిర్వచనోత్తర రామాయణం, భాస్కర రామాయణం. నిర్వచనోత్తర రామాయణం తప్ప మిగతా వాటి రచనా కాలం, రచించిన కవుల నిర్ణయంలో విభిన్నాభిప్రాయాలు ఉన్నాయి. రంగనాథ రామాయణం పూర్వోత్తర భాగాలు క్రీ.శ.1240, 1270 ప్రాంతంలో రచించినట్లుగా రచన చేసింది రంగనాథుడు కాదని గోనబుద్ధారెడ్డి రచనమారంభించాడనీ, ఉత్తరకాండ కాచవిభుడు విఠ్ఠల విభుడు వ్రాశారనీ, పాండురంగ విఠ్ఠల నాథుడి పేరట రంగనాథ రామాయణంగా వీళ్ళందరూ కలసి సమష్టిగా వ్రాశారనీ పింగళి లక్ష్మీకాంతం దృష్టి. మల్లంపల్లి సోమశేఖర శర్మ ఇది 1380 ప్రాంతంలో అనువాద రూపం పొందిందని అభిప్రాయాం వెలిబుచ్చాడు.

భాస్కర రామాయణం క్రీ.శ.1320 ప్రాంతంలో అనువాదమయిందని ఒక విమర్శక భావన ఉంది. నిర్వచనోత్తర రామాయణం క్రీ.శ.1260 ప్రాంతంలో అనువాదమయింది. నిర్వచనోత్తర రామాయణంలో ఉత్తరకాండ అనువాదమయింది.

భాస్కర రామాయణం పూర్వభాగమంతా అనువాదమయింది. రంగనాథ రామాయణంలో పూర్తి అనువాదం ఉంది.

రంగనాథ రామాయణం, భాస్కర రామాయణం రచనా కాలం, కవుల నిర్ణయం ఇంకా విభిన్నాంశాలు వెలుగు చూస్తూ విమర్శక దృష్టి సారింపబడుతూనే ఉంది. పరిశోధకుల పరిశోధన జరుగుతూనే ఉంది. ప్రస్తుతావసరం సమగ్రమయిన రామాయణ కథా సూత్రం విశదం కావాలి. దాని వల్ల చారిత్రక నేపథ్యం అవగతం కావాలి. ఇందుకోసం సంపూర్ణ రామాయణ గాథకి అవలోకించటానికి భాస్కర రామాయణం పూర్వభాగం కోసం, నిర్వచనోత్తర రామాయణం ఉత్తర భాగం కోసం గ్రహింపవచ్చు. రెండింటిలోని కథాసూత్రం గ్రహిస్తే సంపూర్ణ రామాయణం కథ విశదమవుతుంది. మిగతా ఏ రామాయణానువాదంలోనైనా పూర్తిగానో పాక్షికంగానో ఈ కథాంశాలే కనిపించటం గుర్తించినందువల్ల రామకథ పూర్వభాగం భాస్కర రామాయణం, ఉత్తర భాగం కోసం నిర్వచనోత్తర రామాయణం స్వీకరించిన కథాంశ పరిచయం కలిగించుకోవటం సముచితంగా ఉంటుంది.

సంస్కృతంలో రామాయణం జరిగిన కాలం క్రీ.పూ.1000 కంటే ముందని భావించినా రచనా కాలం క్రీ.పూ.500 తర్వాతేనని చారిత్రక పరిశోధనలు ఋజువుచేసిన విషయం పూర్వం ప్రసక్తమయింది. రామాయణం వాల్మీకి రచన అని ప్రసిద్ధమయినా, అది ఒక కాలంలోనిది కాదని, ఒక కవి సృష్టి మాత్రమే కాదని విశదమయింది. క్రీ.పూ. 4వ శతాబ్ది నుంచి క్రీ.శ.12వ శతాబ్ది దాకా ఉన్న ఈ సాహిత్య సృష్టి కొనసాగుతూ వచ్చిందని విశదం చేయటమయింది. ఆరంభంలో పరిమితంగా ఉన్న రామాయణం క్రమక్రమంగా పెరిగి, 12వ శతాబ్ది నాటికి విస్తృత రూపం పొంది స్థిరమయిందని చారిత్రక ఆధారాలు గ్రహించి వివరించటమయింది.

రామాయణం సంస్కృతంలో స్థిర రూపం పొందిన వెంటనే ప్రాంతీయ భాషలలో అనువాదాలు భారతదేశమంతటా.వెలువడసాగాయి. తెలుగులో కూడా అనువాదం 13వ శతాబ్దిలో మొదలయింది. స్థూలంగా రంగనాథ భాస్కర నిర్వచనోత్తర రామాయణాల అనువాదం దాదాపు 13వ శతాబ్దిలోనే మొదలయింది.

భారతీయ భాషలలో రామాయణం విశేషంగా అనువాదం పొందింది. ప్రపంచ సాహిత్యంలో ప్రత్యేక గౌరవం పొంది అనువాదం రూపొందింది. తెలుగులో రామాయణం పొందినన్ని అనువాదాలు ఏ ఇతిహాసం కానీ, పురాణం కానీ పొందలేదు రామాయణం కథా భాగాలున్న సాహిత్యరూపాలు విశేషంగా తెలుగు సాహిత్యంలో ఏర్పడ్డాయి.

వైష్ణవ మత విజృంభణతో రామాయణ విఖ్యాతి ప్రారంభమయింది. రామాయణం సాహిత్యంగానే కాక మత దృక్పథంతో కూడా ప్రాధాన్యం సంతరించుకొంది. అవతార పురుషుడు రాముడు మానవపుత్రుడుగా గోచరమై, మానవులకు మరీ సన్నిహిత దేవుడయ్యాడు. రామాయణంలోని దైవభక్తి, పితృభక్తి, గురుభక్తి, సోదర భక్తి, స్వామిభక్తి వీటితో పాటు దుష్ట సంహారం శిష్టసంరక్షణం, విశేష విషయాలై ప్రజాకర్షణ పెరిగి,

అనువాదాలు పెరిగి, దేవాలయాలు పెరిగి, జన జీవితంలో రామాయణం భాగమయిపోయింది.

విస్తృత జీవన సంబంధి అయిన రామాయణం ఏ కాలంలో ఏ ప్రాంతంలో ఎలా సంభవించిందో చారిత్రకంగా తెలియవలసిన అవసరం ఉంది. అలా తెలియటం వల్ల సాహిత్యానికి నేపథ్యంగా ఉన్న చారిత్రక స్ఫూర్తి, తన్మూలంగా సాంఘిక స్థితి అభివ్యక్తమవుతాయి. అందువల్ల రామాయణ కథాసూత్రం, చారిత్రక నేపథ్యం గ్రహణార్థం తెలియవలసి వచ్చింది. ఈ కథాసూత్రం కోసం భాస్కర రామాయణం, నిర్వచనోత్తర రామాయణం పరిగ్రహించటమయింది. భాస్కర రామాయణం కథ పూర్వరామాయణం చెబుతుంది. అయితే తెలుగులో సాహితీ రూపంగా ఇది నిర్వచనోత్తర రామాయణానికి అనంతరం కాలంలో వెలువడింది. నిర్వచనోత్తర రామాయణంలో కథ ఉత్తర భాగానికి చెందిందే కానీ, ఇది సాహితీ సృష్టిగా భాస్కర రామాయణానికి పూర్వం వెలువడింది. భాస్కర రామాయణం, నిర్వచనోత్తర రామాయణాలు పూరోత్తర రామకథా సూత్రం అందించాయి.

2.2.1. రామాయణ గాథ / భాస్కర రామాయణం : భాస్కర రామాయణంలోని కథాంశం పూర్వభాగం తెలుపుతుంది. అది మార్గబద్ధంగా ఉన్న సాహిత్యరూపం. రామాయణ గాథ అరంభం నుంచి రాముడు తిరిగి సింహాసనాన్ని అధిష్ఠించటం దాకా ఉన్న ఘట్టం వర్ణితమవుతుంది. ఇందులో బాల అయోధ్య అరణ్య కిష్కింధ సుందర యుద్ధకాండల కథా భాగముంది. శ్రీ రాముడి కథను కట్టె కొట్టే తెచ్చె అని సూక్ష్మంగా చెప్పే పద్ధతి ఉంది. కాని విపులంగా గ్రహించటం సాహిత్యావసరమే.

సుభిక్షమైన అయోధ్యను దశరథుడు పాలించేవాడు. ఇతని పాలనలో ప్రజలు సుఖ సౌభాగ్యాలతో ఉన్నారు. కాని దశరథుడు మాత్రం పుత్రరాహిత్యం వలన ఎంతో దుఃఖించాడు. ఒకనాడు తన ఎనమండుగురు మంత్రులను మునులను పిలిపించి చర్చించి అశ్వమేథం దానితో పుత్రకామేష్టి చేయ నిర్ణయించాడు. పుత్రకామేష్టి జరపడానికి సూతుడు, ఋశ్యశృంగుని మహిమ తెలిపి అయోధ్యకు రప్పించమని చెప్పాడు. అంగరాజు ఋశ్యశృంగుని మామ అయిన రోమపాదుని కోరి భార్యాసహితంగా ఋశ్యశృంగుని అయోధ్యకు తెచ్చాడు. ఋశ్యశృంగుడు యాగం చేయబూనాడు. అటు రావణ బాధలతో వేసారిన దేవతలు, బ్రహ్మేంద్రాదులు అతన్ని పరిమార్చ నారాయణుని భువిపై జన్మించమని కోరి అభయం పొందారు.

1. దశరథుని సంతానం : నిర్విఘ్నంగా యాగం పూర్తి అయింది. ఒక దివ్యపురుషుడు కాంచన కలశంతో ప్రత్యక్షమై పాయసమిచ్చి దశరథునికి చెప్పి అదృశ్యమయ్యాడు. దానిని రెండు భాగాలుగా చేసి కౌసల్యకు, మిగిలినది సగం చేసి సుమిత్రకు మిగిలిన దానిని రెండు భాగాలు చేసి ఒక భాగం కైకకు మిగిలినది తిరిగి సుమిత్రకు ఇచ్చాడు. దశరథుని పూజలతో సంతృప్తి చెందిన దేవతలు భూలోకాన జనించే నారాయణుడికి తోడుగా వాలి సుగ్రీవ హనుమంతాదులను రూపొందించారు.

నెలలు నిండిన కౌసల్య కైక సుమిత్రలకు రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు జన్మించారు. వారి ఆటపాటలతో విద్యాభ్యాసంతో పదునాలుగు సంవత్సరాలు గడిచాయి. దశరథుడు వారి వివాహ యోచన చేస్తున్న తరుణంలో విశ్వామిత్రుడు వచ్చి తన యాగ రక్షణార్థం రాముని పంపమని కోరాడు. వసిష్ఠుని ఆదేశంపై రామలక్ష్మణులను అతనితో పంపాడు. రాముని రాకతో మునులు నిర్భయులై యాగనిమగ్నులయ్యారు. వారి యాగాన్ని భగ్నం చేయవచ్చిన మారీచ సుబాహులను వధించి రామలక్ష్మణులు ఆశీర్వాదం పొందారు. యాగానంతరం తాము జనకుని యాగానికి వెళ్తున్నామని, అక్కడ ఉన్న శివధనస్సు విశేషాలను చెప్పి విశ్వామిత్రుడు తనతో వారివురిని తీసుకొని వెళ్ళాడు. విశ్వామిత్రుడు మార్గమధ్యంలో కుశనాభుడనే రాజర్షి వివరాన్ని; సగర పుత్రులు అశ్వమేధ యాగానికై వెళ్ళి కపిలుని కోపానికి గురై భస్మం కావడం, గరుత్మంతుడు గంగను భూమిపైకి దింపితే వారు పుణ్యలోకాలకు వెళ్తారని చెప్పడం దానికై సగరుని వంశపు భగీరథుడు యత్నించి నేలకు దింపి పుణ్యగతులు కల్పించడం చెప్పాడు. గంగను దాటిన పిమ్మట విశాల దేశంలో ఆగి కపిలుని పుత్రుని కోరి, శుచిగా ఉండలేక దేవేంద్రుని వలన గర్భం సప్త ఖండాలుగా ఛిద్రమవడం వారికి దితి ప్రార్థనపై ముల్లోకాల్లో చరించే శక్తిని ఇంద్రుడు ప్రసాదించిన విషయం చెప్పాడు. ఆ రాత్రి అక్కడ ఉండి మరునాడు మిథిలకు ప్రయాణమై సమీప వనాన్ని చూచి అక్కడ ఇంద్రునితో అహల్యను చూచి కపిలుడు కోపించి బూడిద రాశిగా మార్చిన అహల్య ఉందని రాముని రాకతో విముక్తి కలుగుతుందని చెప్పాడు. రాముని రాకతో విముక్తి పొందిన అహల్య వారిని సేవించి పవిత్రురాలయింది. పిమ్మట వీరిరువుతో విశ్వామిత్రుడు మిథిలం చేరాడు. రామలక్ష్మణుల వివరాలు తెల్పి అటరావడానికి కారణం చెప్పగా జనకుని కులగురువు అయిన శతానందుడు తన తల్లి అయిన అహల్యకు జరిగిన విముక్తి విని ఆనందించి విశ్వామిత్రుని ప్రశంసించి అతడు మహర్షి బ్రహ్మర్షి అయిన తీరుని తెల్పాడు.

2. శ్రీరామాదుల వివాహం : విశ్వామిత్రుని ఆదేశం మీద ధనస్సును సభకు రప్పించి రాజు దాని చరిత్రను చెప్పాడు. రాముడు అందరికీ మొక్కి అందరూ ఆశ్చర్యపడేటట్లు ఆ ధనస్సు విరిచాడు. వివాహ యత్నానికై జనకుని పిలుపు మీద దశరథుడు ముని సమూహంతో మిథిలకు వచ్చాడు. సీతారాముల వివాహంతో పాటు ఊర్మిళ లక్షణులకు, మాండవి భరతులకు, శృతకీర్తి శత్రుఘ్నులకు వివాహం జరిపించారు. తిరిగి వెడుతున్న రాముడిని పరుశురాముడు అడ్డుకొన్నాడు. అసాధ్యమైన అతని నారీ వింటిని సారించి రాముడు అతని పుణ్యలోకాలను ఛేదించాడు. మాట ప్రకారం పరుశురాముడు తపానికేగాడు. దశరథుడు అయోధ్య చేరి సుఖంగా ఉన్నాడు.

మునులతో చర్చించి దశరథుడు రాముని పట్టాభిషేకం చేయాలని నిశ్చయించాడు. నగరమంతా ఆనందడోలికలలో తేలి ఆడింది. అది విని మంథర -దాది-పూర్వం రాముడి పాదతాడన వైరిని మనస్సులో ఉంచుకొని, పట్టాభిషేకాన్ని నిరోధించడానికి కైకకు దుర్బోధలు చేసింది. దాని ప్రభావంతో పూర్వం మగడు తనకిచ్చిన రెండు వరాలను గుర్తు చేసి భరతుడి పట్టాభిషేకం, రాముడి పదునాల్గేండ్ల వనవాసం కోరింది. అది తెలిసి రాముడు దుఃఖితుడైన తండ్రిని ఓదార్చి వనాలకేగ నిశ్చయించాడు.

కౌసల్య సుమిత్రల అనుజ్ఞ పొంది దుఃఖితులైన పురజనుల మధ్య నుంచి సీతాలక్ష్మణులు వెన్నంటి రాగా రాముడు అరణ్యానికి బయలుదేరాడు. రాముడు అక్కడ నుంచి తమ వెంట తెచ్చిన రథాలను మంత్రి సుమంతుణ్ణి వెనక్కు పంపాడు. మరునాడు వారిని గుహుడు గంగను దాటించాడు. గంగ దక్షిణ తీరంలో దిగి కాలినడక ప్రారంభించారు. మరునాడు భరద్వాజాది మునుల వల్ల చిత్రకూట మార్గం తెలుసుకొని కాళింది దాటి, చిత్రకూటం చేరి, చిన్నఆశ్రమాన్ని నిర్మించుకొన్నారు.

3. శ్రీరామ వనవాసం : అయోధ్యలో ఒంటరిగా వచ్చిన సుమంత్రుణ్ణి చూచి దుః ఖితుడై ఉన్న దశరథుడు రాముడిని గతి విని క్రుంగిపోయాడు. శబ్దభేధి విద్యతో పొరపాటున, నిస్సహాయులైన ముని దంపతుల పుత్రుని చంపి శాపానికి గురైన తీరును కౌలస్యకు చెప్పి దాని ఫలితమే ఇది అని దుఃఖిస్తూ మృతి చెందాడు. మంత్రులందరూ కూడి సమాలోచన చేసి మేనమామ ఇంట ఉన్న భరత శత్రుఘ్నులను పిలిపించారు. వచ్చిన భరత శత్రుఘ్నులు తండ్రి మరణం రాముని వనవాస వార్త విని క్రుంగిపోయారు. భరతుడు తల్లిని నిందించాడు. రాముడికి రాజ్యమివ్వడానికి భరతుడు గుహుని సహాయంతో చిత్రకూటం చేరుకొన్నాడు. తండ్రి పరలోక గతుడయ్యాడని తెలిసి రాముడు తిలోదకాలిచ్చాడు. రాజ్యానికి రావడానికి నిరాకరించడంతో భరతుడు రాముడు పాదుకలను తీసుకొని అయోధ్యకు వెళ్ళాడు. అక్కడ ఉండలేక మంత్రులందరితో నంది గ్రామంలో పాదుకాముఖంగా పాలన సాగించాడు. రావణాసురుని సోదరుడైన ఖరుని వల్ల ప్రమాదంతో మునులందరు ఆప్రాంతాన్ని విడిచిపెడుతున్నారు. కనుక రామాదులను కూడా అక్కడినుంచి వచ్చేయమన్నారు. రాముడు సీతా లక్ష్మణులతో అత్రిమహాముని ఆశ్రమానికి చేరాడు. వారికి ముని తన భార్య అనసూయను గూర్చి చెప్పాడు. వాత్సల్యంతో దగ్గర చేర్చుకొన్న అనసూయకు సీత ముమ్ముందు దారిలో ఎదురయ్యే నరమాంస భక్షకులను వధించండి అని ఆ దంపతులకు చెప్పి వారిని పంపారు.

వేదవిద్యలతో నిండిన ఆశ్రమాలున్న దండకారణ్యం ప్రవేశించారు. మునుల వీరికి స్వాగతం పలికారు. ఆ రాత్రి అక్కడుండి తిరిగి బయలుదేరి మార్గంలో భీకరాకారం గల విరాధునికి ఎదురుపడ్డారు. వాడు సీతను బంధించి సవాలు చేయడంతో వాని భుజాలు నరికారు. మోహపు పొరలు తొలగి తాను గంధర్వుడని చెప్పుకొన్నాడు. అతనికి శాపవిముక్తి కలిగించి శరభంగ మహర్షిని దర్శించారు. అడ్డుపడే రాక్షసులను చంపుతూ ముందుకు సాగారు.

ఒకచోట విద్యఘోష విని అది మందకర్ణి మహాముని విలాసం తెలుసుకొని ముందుకు సాగారు. ఒక చోట రాముడు - ప్రయాణీకులలోని విప్రులను మోసం చేసి భుజించే ఇల్వలుడు, వాతాపి అనే రాక్షసులను గూర్చి, వారిని శిక్షించిన అగస్త్యుని గూర్చి చెప్పి ఆ అడవంతా ప్రశాంతంగా ఉండటానికి కారణమితడేనని చెప్పాడు. అతని ఆశ్రమం చేరి-తత్‌సూచన మీద పరిసర ప్రాంతమైన పంచవటిని చేరడానికి పయనమయ్యారు. మార్గమధ్యంలో దశరథుని మిత్రుడు కశ్యప ప్రజాపతి సంతతి, వృద్ధుడు అయిన జటాయువు ఎదురై, ఆ అడవి క్రూర మృగాలకు నిలయమని, అక్కడున్నంత

వరకు జానకి రక్షణ వహిస్తానని చెప్పాడు. ఆ పంచవటిలో వారు నివాసమేర్పరచుకొన్నారు. ఒకనాడు జానకికి ఫలాలు తెమ్మనగా అడవికి వెళ్ళిన లక్షణుడు జంబుకుమారుడనే రాక్షసుని వధించాడు.

4. సీతాపహరణం : శూర్పణఖ తన పుత్రుడు మరణించి ఉండడం చూచి చింతించి వారిని చంపిన వారి జాడ తెలిసి రామలక్ష్మణుల వద్దకు వచ్చింది. చూచి మోహించింది. రామలక్ష్మణులు ఇద్దరు పరిహాసంగా గ్రహించారు. పరిస్థితి హద్దు మీరడంతో రాముని ఆదేశంతో లక్ష్మణుడు ముక్కు చెవులు కోసి వదిలాడు. ఆమెను చూచి సోదరులయిన ఖరదూషణులు సేనలతో రామునిపైకి యుద్ధానికి వచ్చారు. సేనలు, దూషణుడు, త్రిశిరుడు, ఖరుడు రాముడి చేతిలో మృతి చెందారు. అకంపనుడనే వాడు రాముని వృత్తాంతం, సీత సౌందర్యం రావణునికి విన్నవించి, సీతను అపహరించిన సోదరులను రప్పించడం సులువవని తెలిపాడు. ఒక దుష్కపటాన్ని ఆలోచించి తన పూర్వమంత్రి అయిన మారీచుని చేరి సీతను అపహరించాలని చెప్పగా, మారీచుడు పరసతి అపహరణ పాపమని బోధించి పంపాడు. తిరిగి వెళ్ళిన రావణుడి వద్దకు శూర్పణఖ వెళ్ళి తనకు జరిగిన అవమానాన్ని సీతా రామలక్ష్మణుల వృత్తాంతాన్ని చెప్పింది. ఆమె చేత ప్రేరితుడై రావణుడు సీతను అపహరించడానికి ప్రయాణమయ్యాడు. అతన్ని ఆపటానికి అశక్తుడై మారీచుడు సహాయపడడానికి నిశ్చయించుకొని పథకాన్ని అనుసరించి మాయలేడి రూపంలో ఆశ్రమానికి వచ్చాడు. బంగారు వర్ణం వెండి మచ్చలతో ఆశ్రమపరిసరాలలో తిరుగుతున్న లేడిని చూచి సీత మోహించింది. దానిని పట్టడానికి రాముడు వెంట వెళ్ళి, అది మాయ అని తెలుసుకొని వధించాడు. మారీచుడు మృతి చెందుతూ రాముడి గొంతుతో లక్ష్మణా! అని అరవడం విని లక్ష్మణుడిని నిందించి త్వరపరచి పంపింది. అతడటు వెళ్ళగానే రావణుడు సన్యాసి వేషంలో సీత వద్దకు వచ్చి అపహరించుకొని ఆకాశమార్గాన పోసాగాడు. మార్గమధ్యంలో జటాయువు రావణునితో పోరాడి గాయపడ్డాడు. తోవలో పర్వత శిఖరంపై వానరులను చూచి సీత తన ఆభరణాలను జారవిడిచింది. రావణుడు ఆమెను తెచ్చి లంకలో దింపాడు. తన ఐశ్వర్యాలను చూపగా సీత రావణుణ్ణి తూలనాడింది. ఇట రాముడు, సీతను వదలి లక్ష్మణుడు వచ్చినందుకు చింతించి, ఆశ్రమానికి వచ్చి అది శూన్యంగా ఉండడంతో దుఃఖించి, ఆమె ఎడబాటు తాళలేక విలపిస్తూ అడవులలో వెదుకుతూ ముందుకు పోసాగాడు. మార్గంలో గాయాలతో పడి ఉన్న జటాయువు సీతను రావణుడు అపహరించాడని తెలిపి మరణించింది. అతనికి అగ్ని సంస్కారం రామాదులు చేశారు. మార్గంలో తనకెదురయిన అయోముఖిని లక్ష్మణుడు ముక్కు చెవులూ కోసి వదిలాడు. తమకెదురయిన కబందుడు అనే రాక్షసుడికి శాపవిముక్తి కలిగించారు. అతడు వాలి సుగ్రీవుల ఉదంతం చెప్పి సుగ్రీవునితో మైత్రి ఏర్పర్చుకొమ్మన్నాడు. మార్గంలో తన రాకకెదురు చూచే శబరిని కరుణించి ముందుకు సాగారు. రాముడు పంపానది తీరంలోని మనోహర దృశ్యాలు సీతను తలపింప చేసి రాముడిని విచారగ్రస్తుని చేశాయి.

5. శ్రీరామ సుగ్రీవ వృత్తాంతం : రామలక్ష్మణుద్దరూ ఋష్యమూక పరిసరాలకు

వచ్చారు. అటనున్న సుగ్రీవాదులు వారిని వాలి దూతలుగా భావించి సన్యాసరూపంలో ఉన్న వారిని నమ్మక కొంత దూరం వెళ్ళిపోయారు. ఆగి హనుమంతుడిని విషయం కనుక్కుని రమ్మని సుగ్రీవుడు పంపాడు. భిక్షుని రూపంలో వారిని సమీపించి, వారిని గూర్చి తెలుసుకొని తాను సుగ్రీవుడి మంత్రి హనుమంతుణ్ణి తెల్పారు. వారు సుగ్రీవుని స్నేహం కాంక్షించటంతో హనుమంతుడు వారిరువురికి సఖ్యాన్ని కూర్చాడు. సుగ్రీవుడు రాముణ్ణి చూచి సీత ఉత్తరీయంలో కట్టిపడేసిన ఆభరణాలుచూపాడు. అవి చూచి రాముడు ఎంతో చింతించాడు. మంచి మిత్రుడు లభించడంతో తేరుకొన్న రాముడు సుగ్రీవుని వృత్తాంతం అడిగాడు. కిష్కింధాధిపతి ఋక్షరజసుని పుత్రులు వాలి సుగ్రీవులు. ఒక స్త్రీ విషయంలో వాలి దుందుభి అగ్రపుత్రుడు మాయావిలకు జరిగిన ఘర్షణలో వాలి మరణించాడని ఎంతకీ తిరిగి రాకపోవడంతో భావించి సుగ్రీవుడు రాజ్యానికి వచ్చాడు. మాయావిని చంపి వచ్చిన వాలి సుగ్రీవుణ్ణి నిందించి రాజ్య బహిష్కృతుడిని చేసి తద్భార్యను చెరపట్టాడని , ఆ కారణాన తానిలా తిరుగుతున్నాడని చెప్పాడు. వాలిని వధిస్తానని మాటిచ్చిన రామునికి సుగ్రీవుడు తన సోదరుడి బలం గూర్చి చెప్పాడు. రాముడే విధంగా బలాన్ని నిరూపించుకోవాలన్న లక్ష్మణుడి ప్రశ్నకి సుగ్రీవుడు వాలి వధించిన దుందుభి శరీరాన్ని కదపాలని, సప్తసాల వృక్షాలలో ఒక బాణంలో కూల్చాలన్నాడు. రాముడు దుందుభి మేనును కాలివేలితో మీటి సప్తసాల వృక్షాలను ఒక దానిని ఒక బాణంతో కూల్చ్రేశాడు. రాముని శక్తిపై నమ్మకంతో కిష్కింధ చేరి వాలిని పోరుకు పిల్చాడు. వారిరువురిలో ఎవరెవరో తెలియక రాముడు స్తబ్ధంగా నిలిచిపోయాడు. వాలి ధాటికి తాళలేక పారిపోయిన సుగ్రీవుడు రాముని సూచనపై గజపుష్పమాల ధరించి యుద్ధానికి వెళ్ళాడు. రాత్రిపూట పోరుకు వచ్చి ఘర్జిస్తున్న సుగ్రీవుని స్వరం విని పోరుకు బయలుదేరుతున్న వాలిని తార అడ్డుకోయత్నించి విఫలమయింది. పోరులో రాముడు వేసిన బాణానికి నేలవాలిన వాలి రాముని అధర్మవర్తనకు నిందించాడు. వాలిని ఆ స్థితిలో చూచి తార చింతిల్లి, సీతతో కలసిన జీవితం ఎక్కువ ఉండదని రాముడిని శపించింది. తారా పుత్రులను గూర్చి అప్పగింతలు చెప్పి, అంగదుడిని రామునికి అప్పగించి వాలి మరణించాడు. సుగ్రీవుడు వాలికి అంత్యక్రియలు చేశాడు. పిమ్మట సుగ్రీవునికి పట్టాభిషేకం అంగదునికి యువరాజు పట్టం కట్టారు. వర్షాకాలం కనుక నాలుగు నెలలు అక్కడున్న గుహలో ఉండటానికి రాముడు నిశ్చయించుకొన్నాడు. వానలు తగ్గాయి. శరదృతువు ఆరంభంలో హనుమంతుడు సుగ్రీవునికి గుర్తు చేశాడు. అట రాముడు సుగ్రీవుడు రాకపోవడంతో చింతాక్రాంతుడై కిష్కింధకు లక్ష్మణుని పంపాడు. సుగ్రీవుణ్ణి చూచి పరుష వాక్యాలు పలుకుతున్న లక్ష్మణుణ్ణి తార ఉపశమింప చేసింది. పిమ్మట, సుగ్రీవునితో కూడి తూర్పుకు, హనుమంత సేనను దక్షిణానికి, సుషేణుడిని పశ్చిమానికి, శతబలిని ఉత్తరానికి, సీతారావణాన్వేషణకు పంపాడు. కార్యశూరుడయిన హనుమంతునికి రాముడు, సీత గుర్తు పట్టడానికి అంగుళీయకం ఇచ్చి పంపాడు. నెలలోపు తూర్పు పడమర ఉత్తర దిశల నుండి రిక్త హస్తాలతో సేన తిరిగి వచ్చింది.

దక్షిణానికి వెళ్ళి అంగదాదులు తమ అన్వేషణ తీవ్రతరం చేశారు. స్వయంప్రభ అనే తపస్విని తపం చేసుకొంటున్న గుహ చేరి ఆమెకు తమ కార్యం తెలిపారు. ఆమె

తన శక్తితో సముద్రం ఒడ్డున నిలపింది. సీత జాడ తెలియక అందరూ నిరుత్సాహపడ్డారు. వెనుదిరగడానికి సుగ్రీవుడి భయం వల్ల వెరచి ప్రాయోపవేశం చేయడానికి నిశ్చయించుకొన్నారు. వారి మాటలు విన్న గృధ్రరాజు సంపాతి తాను జటాయువు సోదరుడి, రావణుడు సీతను అపహరించి పోయిన విషయం, తన వృత్తాంతం చెప్పి సీత ఉన్నచోటు చెప్పి సముద్రాన్ని దాటమని చెప్పాడు. సముద్రాన్ని దాటడం అంగాదాదులందరికీ అసాధ్యం. అంతదూరం దాటగలవాడు హనుమంతుడని జాంబవతుడు తెలిపి, హనుమంతుని ప్రశంసించి, హనుమంతుని నిజ జనన వృత్తాంతమ్ము వానరులకు చెప్పాడు. హనుమంతుడు సముద్రాన్ని లంఘించడానికి సిద్ధం అయ్యాడు.

అందరూ మహేంద్రగిరి చేరారు. ఒక్క పాదఘట్టనతో ఆకాశానికి హనుమంతుడు ఎగిరాడు. అతనికి సాయం చేయదలచి సగరుడు తనలో దాగి ఉన్న మైనాక పర్వతాన్ని హనుమంతుడికి విశ్రాంతినివ్వడానికి పెరగమన్నాడు. పెరిగిన పర్వతాన్ని హనుమంతుడు కృతజ్ఞతగా చేతితో స్పృశించి ముందుకేగాడు. హనుమంతుడి శక్తి పరీక్షింపడానికి గంధర్వుడు పంపగా నాగమాత సురసి అనే రాక్షసి విశాలదేహంతో మార్గం నిరోధించింది. తన చతురతో ఆమెను సంతోషపరచి ముందకు సాగాడు. అడ్డగించిన ఛాయాగ్రహిణిని ఛేదించి ముందుకుసాగి లంక ప్రవేశించాడు.

లంకానగర శోభలు చూస్తున్న హనుమంతుడు అడ్డుకొన్న లంకాధిదేవతను జయించి ముందుకు సాగాడు. లంక అంతటా తిరుగుతూ సీతను అన్వేషించ సాగాడు. ఎంత వెతికినా ఆమె కనిపించక చింతిస్తూ అశోకవనం ప్రవేశించాడు. అక్కడ రాక్షసీగణ పరివేష్టిత అయినా స్త్రీని చూచి సీతగా గుర్తించి, రామునికి దూరం కావడాన్ని తలచుకొని దుఃఖించాడు. మరునాటి ఉదయం రావణుడు అశోకానికి వచ్చి సీతతో దుర్భాషలాడి ఆమె నిరాకరణకు గుర్రై, రాక్షస స్త్రీలను ఉంచి వెళ్ళాడు. సీతకు ఆ స్త్రీలు దర్భోధలు చేస్తున్నంతలో త్రిజట తను కన్నకలను, రాక్షసనాశం రామ విజయాన్ని చెప్పింది. అంతా విన్న మారుతి సీతకు ఉత్సాహం కల్పించడం అవసరమని తలచి, సీతకు కనిపించి, తనను నమ్మని సీతకు రామాదుల వృత్తాంతం, తన వివరాలు చెప్పాడు.

6. రాముని ఉంగరం : పిమ్మట రాముడిచ్చిన ఉంగరం అందించి సీతను తనతో రమ్మన్నాడు. పరులను స్పృశించనని సీత రాముడి అగమనాన్నే కాంక్షించింది. పిమ్మట రామునికి గుర్తుగా కాకాసుర వృత్తాంతం చెప్పి, చూడామణి ఇచ్చి పంపింది. వెనుదిరిగిన హనుమంతుడు అశోకవనాన్ని ధ్వంసం చేశాడు. ఇది రాక్షసుల ద్వారా తెలిసి చంపమని పంపిన వీరులను, జంబుమాలిని, మంత్రి సుత సప్తాకాన్ని చంపాడు - హనుమంతుడు. సేనా నాయకులు అయిదుగురు అక్షకుమారుడు మృతి చెందారు. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి హనుమంతుణ్ణి బందీగా చేసి రావణుడి వద్దకు తెచ్చారు. అతనికి హనుమంతుడు తనను గూర్చి రాముడి ప్రభావం గూర్చి చెప్పాడు. అతని ప్రలాపాలు విని కోపంతో చంపమని అజ్ఞాపించి, విభీషణుడి హితవుపై ప్రాణభిక్ష పెట్టి తోకకు నిప్పంటించే శిక్ష విధించాడు. హనుమంతుడు ఆ నిప్పుతో లంకను దహించి వెనుదిరిగి సముద్రం దాటి సీతను చూచిన వైనం చెప్పి, కిష్కింధ చేరి సీత ఇచ్చిన చూడామణిని చూపిస్తూ చెప్పిన మాటలను రామునికి విన్నవించాడు.

రాముడు ఆనంద దుఃఖాలతో హనుమంతుణ్ణి కౌగలించుకొన్నాడు. లంకను గూర్చి వివరాలు తెలుసుకొన్నాడు. వానర బలాలతో రామాదులు లంకు బయలుదేరారు. సముద్రపు ఒడ్డు చేరి ఎలా దాటడమా అన్న ఆలోచనలో పడ్డాడు రాముడు. అట, రామాదులు రాక విని రావణుడు మంత్రులతో కలసి మంత్రాలోచనలో మునిగి తేలుతున్నాడు. విభీషణుడు చేసిన హితబోధను లెక్కించక అనుమానించాడు. అందరిని పిలిపించి వారినెలా ఎదుర్కోవాలనే ఆలోచనలో పడ్డాడు. తన హితవును లెక్కించని రావణుడిని వీడి విభీషణుడు రాముడి శరణు వేడాడు. రావణుడు శకుడనే దూతను వారి వివరాలు తెలుసుకోవడానికి పంపాడు. అతడు సుగ్రీవుని పరాక్రమపూరితమైన మాటలను తిరిగి రావణునికి చేర్చాడు. ఇట రాముడు దర్భాశయనం చేసి బ్రహ్మాస్త్రంతో నీరు క్రుంగిపోయేట్లు చేయబోగా సముద్రుడు ప్రత్యక్షమై సేతు నిర్మాణ మార్గానికి కలుని సూచించాడు. కలుని ఆధ్వర్యంలో వానరులు సేతువును అయిదురోజుల్లో నిర్మించారు. లంకకు సమీపాన వచ్చి నిల్చారు. వారి వివరాలు తెలుసుకోవడానికి రావణుడు శుకసారణులనే వేగులను పంపాడు. రామాది వర్గబలాన్ని శక్తిని చెప్పి, వారితో యుద్ధం వద్దని రావణునికి తెల్పారు. వారిని నిందించి, శార్దూలాదులను వానరసేనను చూచి రమ్మని పంపాడు, రామాందుల బలాన్ని వారు సేనను గరుడు వ్యూహంతో తెస్తున్నారని తెలిపాడు. వారిని పంపి, సేనలను యుద్ధసన్నద్ధులను చేసి విద్యుజ్జిహ్వుడి ద్వారా ఓ మాయాశిఖరాన్ని తెప్పించి రాముని వధించినట్లు సీతకు చూపించి రావణుడు ఆమెను మార్చడానికి యత్నిస్తుండగా ప్రహస్తుడనే రాక్షసుడు వచ్చాడు. రావణుడు వానితో వెళ్ళగానే శిరస్సు మాయం అయింది. వాని ద్వారా రాముని గూర్చి విని మంత్రులతో ఆలోచన చేశాడు. వృద్ధుడయిన మాల్యవంతుడు చెప్పిన నీతిబోధను త్రోసిపుచ్చాడు. రాముడు విభీషణుడి ద్వారా లంకాధినేత వివరాలు, పట్టణ రక్షణ కార్యకలాపాలు తెలుసుకొన్నాడు.

7. సీతాపరిరక్షణం : ఒకనాడు ప్రాసాదాన నిల్చిన రావణుణ్ణి చూని సుగ్రీవుడు కోపం ఆపుకోలేక దాడి చేశాడు. పోరాటంలో రావణుడు మాయతో బంధించబోగా తిరిగి స్థావరానికి వచ్చాడు. సుగ్రీవుని హెచ్చరించి రాముడు; అంగదుణ్ణి దౌత్యానికి పంపాడు. రావణుడు నిరసించి బంధించబోయాడు. వానర రాక్షసేనలకు యుద్ధం ఆరంభమయింది. అది తీవ్రతరమయింది. రామాదులు బాణాలను ప్రయోగించడం తిప్పగొట్టడంలో నిమగ్నమై ఉన్నారు. రావణుడి పుత్రుడు ఇంద్రజిత్తు మాయ యుద్ధం చేసి నాగాస్త్రంతో రామలక్ష్మణులను బంధించాడు. ఇంద్రజిత్తు విజయంతో సంతసించి చనిపోయిన రామలక్ష్మణులను చూడడానికి సీతను పంపాడు రావణుడు. దుఃఖిస్తున్న సీతను త్రిజట వారు మూర్ఛలో ఉన్నారని చెప్పి ఓదార్చింది. కొంతసేపటికి తేరుకొన్న రాముడు తమ్ముణ్ణి ఆ స్థితిలో చూచి దఃఖించాడు. అట వచ్చిన నారదుని సలహాపై రాముడు గరుత్మంతుని తలచుకొన్నాడు. గరుత్మంతుని వల్ల నాగాస్త్రబంధ విముక్తుడయ్యాడు. రామలక్ష్మణుల పునరుత్థానంతో చెలరేగిన హర్షధ్వానాలు విని, వివరాలు తెలసుకొని రావణుడు వారిని వధించడానికి ధూమ్రాక్షుణ్ణి పంపాడు. అతడు హనుమంతుని చేతిలో మృతి చెందాడు. వజ్రదంష్ట్రుడు అంగదుడి చేతిలో, అకంపనుడు హనుమంతుని చేతిలో మహాకాయుడు అంగదుడి వల్ల, పుహస్తుడు నీలుని కారణాన యుద్ధంలో

మరణించారు. సేనాని మృతితో యుద్ధానికి తానే పూనుకొన్న రావణుణ్ణి మండోదరి ఎన్నో విధాల ఆపడానికి ప్రయత్నించి ఫలితం పొందలేకపోయింది. రావణుడు యద్ధానికి వెళ్ళి పరాభవం పొంది వెనుదిరిగి వచ్చి కుంభకర్ణుని నిద్రలేపించాడు. వానిని చూచి తల్లడిల్లే వానర సేనకు విభీషణుడు ధైర్యం చెప్పాడు. రావణుని ఆజ్ఞతో యుద్ధానికి వచ్చి భీకరాకారంతో పోరు సల్పుతూ ముందుకు సాగుతున్న కుంభకర్ణుని రాముడు ఎదుర్కొని వధించాడు. కుంభకర్ణుడి మరణవార్త విని రావణుడు క్రుంగిపోయాడు. పినతండ్రి మృతివిని యుద్ధానికి వెళ్ళిన రావణ పుత్రులు మరణించారు. రావణధ్యానం వల్ల జనించిన అతికాయుడు లక్ష్మణుని చేతిలో విగతజీవుడయ్యాడు. ఇంద్రజిత్తు యుద్ధానికి వచ్చి బ్రహ్మాస్త్రంతో అందరిని మూర్ఛిల్ల జేసి తండ్రికి తన విజయం చెప్పాడు. విభీషణాదులు సేనను తేరుకొనేటట్లు చేసి పథకం ప్రకారం ఆ రాత్రి లంకకు నిప్పంటించారు. పోరులో రావణుడు అనేకులను పోగొట్టుకొన్నాడు. ఇంద్రజిత్తు యుద్ధానికి వచ్చి మాయాసీతను వధించినట్లు చూపటంతో రామాదులు నిర్వేదానికి గురయ్యారు. రామునికి ధైర్యం చెప్పి లక్ష్మణుడు వానరసేనతో నికుంభిలకు వెళ్ళాడు. హోమకార్యం నిర్వహిస్తున్న ఇంద్రజిత్తుని విభీషణుడి సలహాలపై పోరుకు పిల్చి వధించాడు. ఇంద్రజిత్తు మరణవార్త విని క్రోధుడయిన రావణడు సీతను చంపబోయి మంత్రి సలహాపై ఆగాడు. ఇరుసేనల మూలబలాల మధ్య పోరు తీవ్రమయింది. రామరావణులు తలపడ్డారు. రావణుని శక్తికి లక్ష్మణుడు మూర్ఛితుడయ్యాడు. రాముడు వేసిన శరంతో రావణుడు వెనుదిరిగాడు. రావణుడు పంపగా కాలనేమి మాయాతపస్విగా వచ్చి లక్ష్మణుడు తేరుకోవడానికి తగిన ఔషధం ఉన్న చోటు చెప్పడంతో హనుమంతుడు ధాన్యమాలిని అనే కొలను వద్దకు వచ్చి కాలనేమిని వధించాడు. అటు భరతుడు దుస్వప్నం చూచి చింతాక్రాంతుడయ్యాడు. తిరిగి వస్తు హనుమంతుణ్ణి మోసమెరిగి వచ్చి అడ్డుకొన్న మాల్యవంతుడి రాక్షస బలాలు నిలువలేకపోయాయి. తమ్ముణ్ణి చూచి దుఃఖిస్తున్న రాముణ్ణి సుషేణుడు ఓదార్చి హనుమంతునితో విశల్యకరణి తెప్పించి పునరుజ్జీవితుణ్ణి చేశాడు.

అటు దశముఖుడు శుక్రాచార్యులతో యోచించి పాతాళ హోమం చేయబూనాడు. దీనిని ధ్వంసం చేయడం అవసరమని విభీషణుడు చెప్పడంతో అంగదాదులు హోమాన్ని చెరిచారు. అంగదుడు మండోదరిని రావణుడి వద్దకు ఈడ్చుకురాగా ఆమె రాముడి మహత్త్వం చెప్పి నిరోధించ యత్నించింది. రావణుడు సంసిద్ధుడయి యుద్ధానికి వెళ్ళాడు. ఖడ్గరోముడు హనుమంతునితో, అగ్ని వర్ణుడు రామునితో యుద్ధం చేసి మరణించారు. రావణుడు రాముడితో చేసే యుద్ధంలో ఇంద్రుడు పంపగా మాతలుడు రామునికి రథం తెచ్చాడు. శ్రీరాముని వద్దకు అగస్త్యముని వచ్చి ఆదిత్య హృదయం ఉపదేశించి ఆశీర్వదించాడు. రావణుడి పోరులో బ్రహ్మాస్త్రాన్ని సంధించి వధించాడు. రావణుడి మరణానికి విభీషణుడు అంతఃపుర స్త్రీలు మండోదరి ఎంతో దుఃఖించారు. విభీషణుణ్ణి ఓదార్చి సింహాసనాన్ని అధిష్ఠింపచేశారు. హనుమంతుడు సీతకు ఈ కబురు తెల్పి, ఆమెను చూడాలనుకొంటున్నట్లు రామునికి తెల్పాడు. రాముని ఆదేశం పై అలంకృత సీతను తీసుకొని వచ్చాడు. సీతను గ్రహించడానికి రాముడు శంకించడంతో అగ్నిప్రవేశం చేసి పతివ్రతగా చాటుకొంది సీత. ఇంద్రాదులు స్తుతించారు. పుష్పకంపై, అయోధ్య దర్శనకాంక్ష

కలవారితో రాముడు పొలిమేరల్లో దిగాడు. భరతుడి ఆహ్వానంపై రాజ్యప్రవేశం చేసి పట్టాభిషిక్తుడయి రాజ్యాన్ని సతీసమేతుడై రాముడు ధర్మవర్తనుడై పాలించాడు.

2.2.2. ఉత్తర రామాయణ గాధ - నిర్వచనోత్తర రామాయణం: రామాయణంలోని ఉత్తరార్థం ఉత్తర రామాయణం. ఈ కథాంశం తిక్కన సోమయాజి విరచితమయిన నిర్వచనోత్తర రామాయణం మాధారంగా గ్రహించటమయింది. తిక్కన ఈ రామాయణాన్ని నిర్వచనంగా వ్రాయటం గమనార్హం. ఈ నిర్వచన రచనా రీతి రామయణానికి ఉన్న మాధుర్య దశను చూపుతూ ఉంది.

మహారాజ పదస్థుడయిన రాముణ్ణి అభినందించడానికి అతని కొలువుకు జనకాదులు వచ్చారు. అక్కడికి వచ్చి తనను స్తుతించిన అగస్త్యాది మునులను రాముడు ప్రసంగ వశాన రావణుడు, అతని పుత్రుడు, వాని తమ్ముడు చేసిన తపాలను గూర్చి అడగగా విశ్రవసుని జన్మ విధానం అగస్త్యుడు చెప్పసాగాడు. పులస్త్యుడు తన ఆశ్రమం వద్ద అప్సరల రాకను నిరోధించడానికి, తనను చూచినంతనే గర్భం కలుగుతుందని పేర్కొన్నాడు. ఆ మాట ఫలితంగా, ఇది తెలియక అటువచ్చిన ఓ అప్సరస గర్భం ధరించింది. అది తెలిసి ఆమె తండ్రి అతని వద్దే వదిలాడు. ఆమె సేవల ఫలితంగా పులస్త్యుడు వరంగా విశ్రవసుడు జన్మించాడు. ఇతనికి భార్య అయిన దేవవర్ణి అనే స్త్రీ వల్ల వైశ్రవణుడు అనే పుత్రుడు కలిగాడు. ఇతడు విద్యావంతుడయి ఘోరతపం చేశాడు. ప్రత్యక్షమయిన శంభుని చూచి సర్వసంపదలను వరంగా కోరాడు. దానితో శంభుడు పుష్పకమనే మణిమయ 'విమానాన్నిచ్చాడు. తండ్రికి చూపగా అతడు వాటితో లంకలో ఉండమన్నాడు. ఆ ప్రకారం వెళ్ళి, పెద్దలను పూజిస్తూ విహరిస్తూ ఉండేవాడని ముని చెప్పడంతో రాముడు, తానెరిగిన లంకాధిపతికి తపోధనుడయిన ఇతనికి తారతమ్యం చెప్పమన్నాడు.

1. అగస్త్యుడు - రావణ వృత్తాంతం : అందుకు ముని సుకేశుని వృత్తాంతం చెప్పసాగాడు. రాక్షసాన్వయాన హేతి ప్రహేతులు జన్మించారు. గృహస్థుడయిన హేతికి విద్యుత్కేశుడు జన్మించాడు. వాడు సంధ్య అనే స్త్రీని వివాహం చేసుకొన్నాడు. ఆమె గర్భవతి అయి ఏకాంతాన పుత్రుని కని వదిలేయడంతో అటుగా వచ్చిన శివపార్వతులా బిడ్డకు తండ్రితోడి ప్రాయం అసురత్వం రాజ్యం పురాదులను ఇచ్చారు. సుకేశుడనే పేరుతో ప్రసిద్ధి చెందినవానికి గంధర్వ వల్లభుడు దేవమణిని ఇచ్చి వివాహం చేశాడు. మాల్యవంత, సుమాలి, మాలిలను పుత్రులుగా పొందాడు. వీరు తపానికేగి బ్రహ్మను ప్రత్యక్షం చేసుకొని రణంలో గెలుపు, నెయ్యము, చిరాయుఃప్రాప్తిని వరంగా పొందారు. తమ్ములతో కూడి దేవతలను మాల్యవంతుడు గడగడలాడించసాగాడు. విశ్వకర్మను రప్పించి లంకలో భవనం నిర్మింపచేసుకొన్నాడు. సుందరి, కేతుమతి వరదలను ముగ్గురూ వివాహం చేసుకొని పుత్రులను పొందారు. మాల్యవంతుడి బాధలకు తాళలేక ఇంద్రాదులు హరుని అనుజ్ఞతో విష్ణువుని వేడుకొన్నారు. ఇదంతా విన్న మాల్యవంతుడు అమరావతిపై దాడి చేశాడు.

విష్ణువు దేవతలను కూడి మాల్యవంతునితో యుద్ధం చేశాడు. అందులో ఓడి మాల్యవంతుడు పాతాళంలో దాగాడని తెల్పాడు. పిమ్మట అగస్త్యుడు రావణాదుల కథ

చెప్పసాగాడు. సుమాలి ఒకనాడు తన తనయకు, విశ్రవసుడే తగిన వరుడని చెప్పాడు. వారిని కూడి ఆమె దశవదన కుంభకర్ణ శూర్పణ విభీషణులను కనింది. సంపదలు లేని దుఃఖాన్ని తల్లికి కలగకుండా చేయడానికి రావణాదులు తపం చేసి మానవులు తప్ప వేరొకరితో చావు కలగకుండేటట్లు బ్రహ్మద్వారా రావణుడు, ధర్మపరునిగా విభీషణుడు, నిద్రను కుంభకర్ణుడు వరంగా పొందారు. తాతయిన సుమాలి చేసిన బోధతో రావణుడు లంకను వశపరచుకొన్నాడు. పిమ్మట ఒకనాడు వివాహయోగ్యగా శూర్పణఖను భావించి కాలకేయ వంశస్థునికి ఇచ్చి వివాహం చేశారు.

ఒకనాడు వేటకేగిన దశకంఠుడు, తన పుత్రిక మండోదరికై వరాన్వేషణలో ఉన్న మయుని ద్వారా కన్యాదానం పొందాడు. కుంభకర్ణుడు వజ్రజ్వాలను, విభీషణుడు సరమను వివాహాన పొందారు. రావణునికి మేఘనాధుడు జన్మించాడు. కుంభకర్ణుడు నిద్రాసక్తుడై నిల్చాడు. రావణుడు దేవతాదులను బాధించడం ఆరంభించాడు. దూతను పంపి హితవు చెప్పించిన కుబేరునిపైకి కోపంతో దండెత్తాడు. యక్షరాక్షసుల మధ్య యుద్ధం తీవ్రం అయింది. కుబేరుడు రావణుని తూలనాడి, యుద్ధంలో ఓడి, పుష్పకవిమానాన్ని రావణుడికి కోల్పోయాడు. దానిపై తిరుగుతూ కైలాసం సమీపించాడు. అటునుంచి పొమ్మన్నా వినక దుర్భాషలాడిన రావణుడికి వానరుల వల్లే ముప్పు కలుగుతుందని శపించాడు. రావణుడు కోపంతో కైలాసాన్ని పెల్లగించి ఎత్తాడు. ఇదంతా ఎరిగిన శంకరుడు వాని చేతులు కైలాసం కింద పడేటట్లు తొక్కి వాడు ప్రార్థించడంతో వదిలివేశాడు.

కైలాసం దిగి పరిపరివిధాల విహరిస్తున్నాడు రావణుడు; హిమవంతం వద్ద గతించిన తండ్రి కోరికను తీర్చడానికి విష్ణువును మనస్సులో నిలుపుకొని తపస్సు చేస్తున వేదవతి రావణుడి చేత అవమానింపబడి అతనికి మృత్యువై తిరిగి జన్మిస్తానని పలికి అగ్ని ప్రవేశం చేసింది. ఆమె మరుజన్మలో సీతగా జన్మించిందని ముని చెప్పాడు. రావణుడు లోకాలన్నీ తిరుగుతూ దిగ్విజయం చేశాడు. రావణ యముల పోరు తీవ్రం కాగా బ్రహ్మ పూనుకొనిమాన్పాడు. అణగని అహంకారంతో భోగవతి పురానికేగి నివాత కవచలను ఓడించి, పద్మనగరాన కాలకేయులతో యుద్ధం చేసి మరిది అయిన విద్యుజ్జిహుని వధించి విజయం చేకొని వరుణ పట్టణంపై దాడి చేసి, వరుణుడు లేని రాజ్యాన్ని ఆక్రమించాడు. స్త్రీలందరిని చెరపట్టడంతో వారంతా పుణ్యవతి చెర కారణంగా తత్పతితో మృత్యువు కలగాలని శపించారు. దిగ్విజయం చేసి రావణుడు లంక ప్రవేశించాడు. భర్తను చంపాడని తెలిసి దుఃఖించి తూలనాడే శూర్పణఖను దండకారణ్యానికి పంపాడు. పుత్రుడు కుంభిలవనంలో యజ్ఞం చేయబోయాడని తెల్సుకొని చూడడానికి వెళ్ళాడు. తిరిగి పుత్రునితో కలసి లంక చేరాడు.

ఇంద్రజిత్తు శివుని ప్రార్థించి వరాలను పొందాడు. పుత్రునితో తిరిగి వచ్చిన రావణుడికి విభీషణుడు అతడు లేని సమయంలో మాల్యవంతుని పుత్రుడయిన కంభీనసుని మధుడనే రాక్షసుడు అపహరించుకొనిపోయిన విషయం తెల్పాడు. తండ్రీ పుత్రులిద్దరూ మధుడిపై దాడి చేశారు. ఈ కుంభీనవ ప్రార్థనతో వానితో రావణుడు మైత్రి చేసుకొన్నాడు. పిమ్మట మధురావణలిరువురూ ఇంద్రునిపై దండెత్తారు. కైలాసంలో బస

చేశారు. చీకటి అయింది. చంద్రోదయమయింది. వెన్నెలనాస్వాదిస్తూ ఏగిన రావణుడు ఒక చోట రంభను చూచి మోహితుడయ్యాడు. తానతని కోడలి వరుసని నలకూబరుని పత్నినని చెప్పినా వినక మోహం తీర్చుకొన్నాడు. రంభ ద్వారా తెలుసుకొన్న నలకూబరుడు ఇంకొకరితో ఇలా ప్రవర్తిస్తే మృతి చెందుతాడని శపించాడు. రావణుడి దాడి విని ఇంద్రుడు విష్ణువు వద్దకేగి ధైర్యం పొంది యుద్ధానికేగాడు. దేవ దానవ సేనలు తలపడ్డాయి. మేఘనాథుడు ఇంద్రుని మాయాతిమిరంలో ముంచి పట్టుకొన్నాడు. రావణుడు ఇంద్రుని పట్టుకొని లంకకు తీసుకుపోయాడు.

ఇంద్రుడు పట్టుబడడం విని బ్రహ్మ లంకకు వెళ్ళి ఇంద్రజిత్తు కోరిన వరమిచ్చి విడిపించుకుపోయాడు అని చెప్పి, తిరిగి, రావణుడు కార్యవీరునితో పోరాడి బందీ కావటం చెప్పసాగాడు. ఈ రకంగా బందీ అవ్వడం తెలిసి పులస్త్యుడు కార్యవీరుని వద్దకేగి రావణుడిని విడిపించాడు. తిరిగి లంక చేరిన రావణుడు పరాజయ పరాభవాన్ని మరచి యథారీతిగా ఉంటూ ఒనాడు వాలితో యుద్ధం చేయదలచి కిష్కింధపైకి దాడి చేశాడు. వంచనతో చంపాలనుకొన్న రావణుణ్ణి వాలి చతస్సముద్రాలలో ముంచాడు. వాలి చేతిలో భంగపడి అతనితో మైత్రి చేసుకొన్నాడు అని ముని చెప్పి రాముని కోరికపై హనుమంతుడి జన్మ విశేషాదులు తెలిపాడు. పిమ్మట అగస్త్యాది ఋషులు రాముణ్ణి వీడ్కొని వెళ్ళారు. పట్టాభిషేక మహోత్సవం చూడడానికి వచ్చిన జనకాదులు వెనుదిరిగారు.

2. రామరాజ్యం : ఒకనాడు కొలువుతీరి ఉండగా కుబేరుని పుష్పకం వచ్చింది. దానిని పూజించి పంపిన రాముణ్ణి గూర్చి భరతుడు ఇతర రాజులతో పొగిడాడు. రాముడు ఎంతో సంతోషించాడు. నిందారహితుడై రాముడు రాజ్యాన్ని పాలించసాగాడు. సీతారాములిరువురూ వన జల విహారాలతో ఆనందంగా ఉన్నారు. సీత గర్భం ధరించిందని విన్న రాముడు సీత కోరిక తెల్పమన్నాడు. గంగా తీరవనాలకు పోవాలని కోరింది. రాముని వద్దకు మంత్రులు వచ్చి రావణుడి ఆశ్రయంలో ఎంతో కాలమున్నా నిస్సందేహంగా సీతను రాముడేలుకొంటున్నాడని లోకాపవాదు చెప్పాడు. దుఃఖితుడై లోకాపవాదభీతుడై రాముడు తమ్ముడితో ఆలోచించి, గంగా తీరాన వదలివేయ నిశ్చయించాడు. మరునాడు లక్ష్మణునితో సీతను అడవులకు పంపాడు.

3. సీతా నివాసం : లక్ష్మణుడు గంగా తీర వనాలకు సీతను పిలుచుకొని వెళ్ళాడు. అక్కడ లోకాపవాద భీతితో రాముడు సీతను వదలిన వృత్తాంతం తెల్పాడు. తనను భర్త విడిచినందుకు చింతించి లక్ష్మణుడితో నిష్ఠూరాలాడింది సీత. లక్ష్మణుడు సీతకు మొక్కి ఆమెను విడిచి వెనుదిరిగాడు. ఒంటరిగా దుఃఖిస్తున్న సీత వృత్తాంతాన్ని మునిపుత్రులు వలన విని వాల్మీకి వచ్చి తన ఆశ్రమానికి కొనిపోయాడు. పట్టణానికి పోతూ సుమంత్రుడు లక్ష్మణుడికి దుఃఖోపశమనం కలిగించాడు. లక్ష్మణుడు పట్టణానికి వెళ్ళి సీతను విడచిన విషయం అన్నతో చెప్పాడు. దుఃఖితుడైన రాముణ్ణి ఓదార్చాడు. రాముడు తన దుఃఖాన్ని అణచుకొని పాలనలో నిమగ్నుడయ్యాడు. ఏకాంతాన సీతను తలచుకొని రాముడు ఎంతో దుఃఖించాడు. లవణుడనే రాక్షసుని వలన కలిగే కష్టాలను

మునులు వాడిని వధించే ఉపాయం తెలిపారు. లవణుణ్ణి ఎదుర్కొని ద్వంద్వయుద్ధాన వధించాడు. వధించిన పిమ్మట మధుర నేలి పన్నెండేళ్ళ అనంతరం శత్రుఘ్నుడు రాముణ్ణి చూడడానికి వచ్చి సోదరుడితో మాట్లాడి తిరిగి మధురకు ఏగాడు. ఒకనాడు ఒక బ్రాహ్మణుడు చనిపోయి కొడుకును తెచ్చి నగరపు వాకిట పెట్టి దుఃఖించటం విని రాముడు వ్యాకులత పొందాడు. వసిష్ఠాది ఋషుల ద్వారా శూద్ర తాపసి కారణాన విప్రపుత్రుడు మరణించాడని ఎరిగి, పుష్పకారుఢుడై శూద్ర తపస్విని వెదికి ఖండించాడు. దేవతలెంతో గౌరవించారు. దేవతల చెప్పిన విధంగా అగస్త్యుని యజ్ఞం చూడడానికి వెళ్ళి సమ్మానితుడై తిరిగి అయోధ్యకు చేరాడు. రాముడు తమ్ములందరిని సంప్రదించి, అశ్వమేధ యాగం చేయబూనినాడు. సీతా ప్రతిమను యాగకృత్యాలలో తన ప్రక్కనుంచుకొన్నాడు. యాగానికి రామ పుత్రులతో వచ్చిన వాల్మీకి రామునిలోని భార్యచింత గుర్తించి కుశలవులకు ఆదేశమిచ్చాడు. కుశలవులు యాగశాలలో వాల్మీకి రచించిన రామాయణాన్ని గానం చేశారు. విన్న రాముడు వారివురిని సమ్మానించాడు. వాల్మీకి సీతా వృత్తాంతాన్ని చెప్పి కుశలవులను అప్పగించాడు. సీతాదేవి తన ప్రాతివత్య మహిమతో భూమిలో క్రుంగిపోయింది. రాముడు పుత్రులను కూడి రాజ్యానికి ఏగి పుత్రులకు రాజ విద్యలను నేర్పించి, రాజ్యాన్ని అప్పగించి, యముని సూచనపై తమ్ములతో కూడి సరయూనది ప్రవేశించి, అవతారాలను చాలించాడు.

2.2.3. రామాయణ ప్రాముఖ్యం : రామాయణం కథ అందించే సందేశం పరిశీలింపవలసిన అంశం. దానితో పాటు ఇందులోని కథా విధానం విస్తరిల్లిన క్రమం గమనింపవలసిన అగత్యం ఉంది. రామాయణానికి భారతానికి ఉన్న సంబంధం గమనించి వాటి సామ్యాలతో పాటు వైషమ్యాలు కూడా పరికింపవచ్చు.

2.2.3.1. భక్తితత్త్వం : అవతారపురుషుడైన రాముడు సామాన్య మానవుడిలా జీవించటం రామాయణంలో ప్రధానాంశంలా కనిపిస్తుంది. తండ్రి మాట జవదాటని పుత్రుడిలా కనిపిస్తాడు. గురువు వెంట వెళుతూ గురువు చేయమన్న పనులు చేస్తాడు. సీతాసమేతుడై అడువులలో తిరుగుతాడు. భార్య కనిపించకపోతే అతి సామాన్యుడిలా దుఃఖిస్తాడు. మిత్రుడి కోసం ఎంతటి పనైనా చేసే మామూలు మనిషిలాగా వాలిని వధిస్తాడు. తల్లి మాట పాటిస్తాడు. మంచివాడయిన మనిషిలాగా రామాయణం అంతటా కనిపిస్తాడు రాముడు. లక్ష్మణుడితో గానీ, సీతతో గానీ, హనుమంతిడితో గానీ అతి సామాన్య మానవుడిలా వ్యవహరిస్తాడు. రాముడి పితృభక్తి, మాతృభక్తి, గురుభక్తి విశేష గుణాలుగా గోచరమవుతాయి.

రాముడి వెంట మారు మాట లేకుండా ఉండే లక్ష్మణుడు శ్రీరామపాదుకలు కొనిపోయి రాజ్య పాలనం చేసే.తమ్ముడు భరతుడు, విశేష సోదర భక్తి చూపే సందర్భాలు తనువు పులకరింపచేస్తాయి. శబరి ఎంగిలి పళ్ళు రాముడితో వాల్మీకి తినిపించటం గమనార్హం. రామాయణంలో కనిపించే ప్రతి పాత్ర స్వామిభక్తి ప్రదర్శించటం సహర్షంగా తిలకింపదగ్గ స్థితి కలిగిఉన్నాయి.

దశరథుడు బహు భార్యాజీవనుడు. రావణుడు బహు స్త్రీ వ్యామోహపరుడు. సుగ్రీవుడు పరభార్యా ప్రమేయం పెట్టుకొన్నవాడు. సుగ్రీవుడు వాలి స్త్రీ విషయిక ప్రమాద మార్గగాములు. రాముడు ఏకపత్నీవ్రతుడు. లక్ష్మణాదులు ఏకపత్నీవ్రతులు. లక్ష్మణుడు బహుకాలం భార్యా సంగమ త్యాగి. హనుమంతుడు బ్రహ్మచారి. రామాయణం ఏక పత్నీవ్రత ప్రాధాన్యం ఉద్ఘోషించింది. బహు భార్యాత్వ దోషం నిర్ద్వంద్వంగా ప్రకటించింది. స్త్రీ వ్యామోహం రావణుణ్ణి, అంతటి సమర్థుణ్ణి అభిజాత్య సంపన్నుణ్ణి అభిమానధనుణ్ణి, అరివీర భయంకర యోధుణ్ణి నాశనం చేసింది. బహుభార్యా పరిస్థితి వల్ల రాముణ్ణి సింహాసనస్థుణ్ణి చేయలేక కుమిలి చింతాకుల చిత్తుడై దశరథుడు మరణించాడు. వాలి సుగ్రీవులకు తార సమస్య అయింది. వ్యామోహపురుషుడు ఎలా ఇబ్బంది పడతాడో ఇంద్రుణ్ణి, పురుషుడి వ్యామోహం పొరపాటున గురి అయినా స్త్రీ ఎలాస్థాణువు అవుతుందో అహల్యను చూడవచ్చు. పరస్త్రీని మోహించటం మరణించడంతో సమానంగా రామాయణంలో గోచరమవటమే కాదు, ఏకపత్నీవ్రతం ఎంత సుఖసంతోషాలు కలిగిస్తుందో అది స్పష్టం చేసింది.

సవతుల మధ్య సహజంగా ఉండే కయ్యం పురుషుడికి ఎంత చిక్కు తెచ్చిపెడుతుందో, ధర్మనిర్వహణలో ఎంత పొరపాటు జరుగుతుందో కైక తన పుత్రుడికి సింహాసనం అడగటంతో స్పష్టమవుతుంది. మంధర కైకను రెచ్చగొట్టటం వంటి సందర్భం అంగ వికలురైన వాళ్ళు మనస్తత్వంలో ప్రవేశించే దుష్టతకు హేతువు దర్శించవచ్చు. చివరకు అసమర్థ మానవుడు రాముని మీద నింద మోపితే సీతాసాధ్విని గంగాతీరంలో వదిలి వేయవలసి రావటం గమనార్హం. తన కుమారుడు చనిపోవటానికి శూద్రుడు తపస్సు చేయటం కారణంగా నాటి బ్రాహ్మణుడు భావిస్తే రాజు రాముడు తన బాధ్యతను గుర్తుకు తెచ్చుకోవలసిన స్థితి రామాయణంలో చిత్రితమయింది. రామాయణంలో రాముడు, సామాన్యుడిలా ప్రవర్తించటమే కాదు ప్రతి సామాన్యపాత్ర ప్రవర్తనకు వ్యక్తిత్వానికి పూర్తి న్యాయం చేసే దృష్టితో రామాయణం వికసించింది.

రాముడి వెంట సీత మారుమాట లేకుండా ఉంటుంది. వనవాస క్లేశం వద్దని వారించినా భర్త వెంట భార్య బయలుదేరి రావటం వెంటే ఉండటం గమనార్హం. రావణుడి భార్య మండోదరి భర్తపట్ల అచంచల విశ్వాసం కలిగి జీవిస్తుంది. ఇంద్రజిత్తు మరణిస్తే సులోచన విపరీతంగా దుఃఖిస్తుంది. రామాయణంలోని స్త్రీ పాత్రలు భర్త భక్తి విశేష ప్రాధాన్యం సంతరించుకొంది.

క్షత్రియుల సర్వరాజకీయ సాంఘిక పరిస్థితుల్లో బ్రాహ్మణ సహాయంతో జీవించటం రామాయణంలో విశేష ప్రాధాన్యం సంతరించుకొంది. దశరథుని పుత్రకామేష్టి బ్రాహ్మణ సహాయంతో జరిగింది. యాగాది కర్మకాండ బ్రాహ్మణ దయగా గోచరమవుతుంది. సింహాసనం అధిరోహిస్తే ముని జనం ఉంటారు. ఉత్తర రామాయణంలో సింహాసనారూఢుడైన రాముడికి సుదీర్ఘంగా అగస్త్యుడు ఉపదేశించాడు. వశిష్ఠ మహర్షి ఆదేశం మేరకే అన్ని పుణ్యకార్యములు జరిగాయి. విశ్వామిత్రుడు ఏం కోరినా దశరథుడు వ్యతిరేకంగా ఏమీ చెప్పలేదు. శూద్ర తపస్వి జీవితం పెద్ద సమస్య అయింది. బ్రాహ్మణ

సహాయుడై రాజు జీవించటం సర్వధర్మకార్య నిర్వహణ చేయటం మూలంగా రామాయణం బ్రాహ్మణ భక్తిని, ప్రస్ఫుటం కావించింది.

2.2.3.2. కథా వైశిష్ట్యం : రామాయణంలో పూర్వ పూర్వ భాగాలు ఉత్తరోత్తర భాగాలకు సముచిత నేపథ్యం సంతరించటం కథా నిర్మాణంలో గమనింపవలసిన అంశం. దశరథుడికి పుత్రవియోగం కలుగుతున్నప్పుడు దానికి కారణంగా ముని దంపతులు సంరక్షకుడైన పుత్రుడు గతిస్తే ఇచ్చిన శాపం తెలిసి వస్తుంది.

కొడుకు వధకు కారణం కనుక్కోదలచిన శూర్పణఖ రావటం, వచ్చినందువల్ల రామలక్ష్మణులను చూడటం, చూడటం వల్ల మోహం కలగటం, మోహం వల్ల కోర్కె చెప్పటం, కోర్కె వల్ల అవమానం జరగటం, సోదరి అవమానం వల్ల రావణుడికి కోపంరావటం, కోపం వల్ల ప్రతీకార వాంఛ పుట్టటం- సీతాపహరణం - యుద్ధం అంతా పూర్వాపూర్వ సంఘటనలో ఉత్తరోత్తర కార్యాలకు పటిష్ఠమయిన సంబంధం సంస్థాపించటం రామాయణంలో స్పష్టంగా ఉంది.

వాలి మాయావితో యుద్ధం చేస్తున్నప్పుడు, వాలి ఓడుతాడని, చనిపోతాడని తప్పుగా అంచనా వేసుకొన్న సుగ్రీవుడు రాజ్యం చేపట్టాడు. తారను చెరపట్టాడు. మాయావిని చంపి వచ్చిన వాలి జరిగినదంతా గమనించినప్పుడే వాలి సుగ్రీవుల పోరు తప్పలేదు. సుగ్రీవుడితో పనిపడ్డ రాముడు వాగ్దానం చేయటం వాలిని పరిమార్చటం అంతా పూర్వోత్తర సంబంధం పటిష్ఠంగా సమన్వయం చేయటమే ఇది రామాయణంలో చూడదగ్గ విశేషం.

రామాయణంలోని కథ అంతా సంక్షిప్తంగా పరిమిత వాక్యాలలో పలకవచ్చు. కథ రావణ వధకోసం మొదలయింది. రావణుడు మునుల్ని బాధించటం, మునులు ప్రార్థించి వరం పొందటం, దశరథుడు పుత్రకామేష్టి యాగం చేయటం, రాముడు పుట్టటం, అంతా రావణ వధ నిమిత్తం ఏర్పడ్డ పూర్వరంగమే. సీతాపహరణం, రాముడు హనుమత్ సహాయుడై లంకా ప్రవేశం రావణ వధ ఫలితార్థం. రావణుణ్ణి చంపటానికి రాముడు పుట్టడం నేపథ్యం. రాముడు పుట్టడానికి మునుల వరం నేపథ్యం. మునులు వరం పొందటానికి రావణ బాధ నేపథ్యం. ఒక పూర్వరంగం మరో ఉత్తర రంగానికి నేపథ్యం అనుసంధించటం రామాయణ వైశిష్ట్యం.

రామాయణం ఒకే లక్ష్యంతో సాగినప్పటికిని విభిన్న ధర్మాలకు ప్రబోధనం కావించింది. మునుల అభీష్టం దశరథాభీష్టం, రాముడు జన్మించడంతో తీరాయి. కైక కోరిక, మునుల అభీప్సితం రాముడు వనవాసంతో తీరాయి. ప్రతి కార్యం వెనుక కథాగమనంతో పాటు మునుల అభీష్ట పరిస్ఫూర్తి కూడా ఉంటుంది. రావణ సంహారంలో దుష్ట సంహారం జరిగి, మునుల అవసరం తీరి రెండు శుభ పరిణామాలున్నాయి. రామాయణమంతటా కథ జరుగుతూనే ఉంటుంది. పాఠకులకు, ప్రేక్షకులకు, శ్రోతలకు, రామాయణ సందేశం తమ జీవిత గమనం సరిదిద్దుకోవటానికి దోహదపడుతుంది. రామాయణ లక్ష్యం ప్రతిక్షణం సామాజికులమీద తన సందేశం పరోక్షంగా అందించే ప్రబలమైన పూనికతో ఉంటుంది.

రావణ వధకోసం రాముడు పుట్టడంతో మొదలయ్యే రామాయణం నిజానికి రావణ వధానంతరం పరిసమాప్తం కావాలి. అలా కాలేదు. పైపెచ్చు ఉత్తర రామాయణం ఉంటుంది. ఈ ఉత్తరభాగం రామాయణంతో అనంతర కాలంలో చేరిన భాగంగా అనిపిస్తుంది. ఎందుకంటే కథా నిర్మాణంలో పూర్వాపర సంబంధం రావణ వధతో ముగిసిపోయింది. ఉత్తరభాగం విశేష పరిశేషంగానే గుర్తించాలి. అలా కాకపోతే, చనిపోయిన రావణుణ్ణి గూర్చి మళ్ళీ అగస్త్యుడు గుణకీర్తనం చేసే కథాభాగ పరిచయం అవసరం ఉండదు. రావణుడు దుర్మార్గుడు కాబట్టి అంతరించిపోయాడని సామాన్యులు భావిస్తూ ఉండగా రావణుడి అభిజ్యాతం వైశిష్ట్యం వంటి అనేక విషయాలు ఉత్తర రామాయణం అరంభంలో చెప్పటం అవి కొత్తగా చేరిన నూత్న విషయాలు కావటమే కాదు, దుర్మార్గుడు ఎప్పుడు పూర్తి దుర్మార్గుడు కాడని ప్రవచించటం కనిపిస్తుంది. సీతనే కాదు, రంభను, వేదవతిని కూడా మోహించిన స్త్రీలోలుడని చెప్పి, అటువంటి వాడు అంతరించటం మంచిదేనని మళ్ళీ ప్రస్థావించటం అయింది. అంతేకాదు పగబట్టిన వేదవతి సీతగా పుట్టి ప్రతీకారం తీర్చుకోగలిగిందని తెలియచేయటం కూడా ఉంది.

అగ్ని పునీత సీత. భూమాత పుత్రి సీత. ఏ తల్లి గర్భం చీల్చుకొని ఈ లోకంలో అడుగుపెట్టిందో, ఆ తల్లి కడుపు మళ్ళీ చీల్చుకొని ఆ గర్భంలోనికి ప్రవేశించింది. ఇది హృదయ విదారకమయిన సన్నివేశం. స్త్రీ పవిత్రత మీద రామాయణం గురిపెట్టుకొన్న లక్ష్యం సిద్ధించటానికి అద్భుతంగా సీతాసాధ్వి భూగమన రూపంలో అవసరమయింది.

2.2.3.3. భారత రామాయణ సంబంధం : భారత రామాయణాలు ఏక కాలంలో ద్రవరూపంలో ఉండి ఎంతోకాలం పరిణామం పొందుతూ వచ్చి, కొంత సామ్యం కూడా కలిగి ఉన్నాయి. రెండు ఇతిహాసాలు కావటం ఒక సామ్యం అది సరే. భారతంలో బహుపత్నిత్వం గుణంగా గోచరమవుతూ ఉండగా రామాయణంలో అది దోషంగా ప్రకటించటం అసంబంధం కాదు సంబంధమే. భారత కథ విశాల నేపథ్యం కలిగి రామాయణ కథ పరిమిత ప్రాంగణంలో ప్రవర్తిల్లింది.

వనవాసం భారతంలోనూ రామాయణంలోనూ ఉంది. అది పన్నెండేళ్ళు కావటం రెండింటిలోనూ దర్శనీయం. వనవాసం ఏకంగా చేయటం, అనేకంగా చేయటమూ ఉంది. పాండవులు అనేకంగానే వనవాసం చేశారు. వనవాసంలో ఉన్న స్త్రీలకు భారతంలోనూ కష్టం వచ్చింది. రామాయణంలోనూ ఇబ్బంది వచ్చింది. భారతంలో ఏకంగా అర్జునుడు పన్నెండేళ్ళు వనవాసం చేశాడు. రామాయణంలో సీత వనవాసానికి పోయింది. పన్నెండేళ్ళు కాక పూర్వమే తల్లి గర్భంలో చేరిపోయింది.

యజ్ఞయాగాది కర్మకాండ భారతంలోనూ ఉంది, రామాయణంలోనూ ఉంది. రాజులు రాజసూయం అశ్వమేధం చేయటం దర్శించవచ్చు. భారతంలో రెండూ ఉండగా రామాయణంలో అశ్వమేధం ఉంది. అదనంగా పుత్రకామేష్టియాగం రామాయణంలో మాత్రమే ఉంది. బహుపత్నీ ధర్మం ఉన్న భారతంలో పుత్రకామేష్టి కూడా అవసరంగా కనిపిస్తుంది.

భారతం కురుక్షేత్రంతో ముగిసిపోయి శాంత రసోన్ముఖంగా మిగతాభాగం సాగుతుంది. రామాయణం రావణ వధతో పరిసమాప్తమయి, ధర్మ పాలనోన్ముఖంగా సాగుతుంది. భారత కథ అందరూ అంతరించటంతో ఒక విషాద నేపథ్యం కలిగి ముందుకు పోతుంది. రామాయణ కథ విషాద సీత భూ ప్రవేశం తరువాత ఒక మోదముద్రతో ముందుకు సాగుతుంది. ధర్మరాజు శరీరంతో స్వర్గానికి పోవటం భారతంలో ఉంటే, సీత సశరీరంగా భూమిని చేరటం రామాయణంలో ఉంది.

భారతంలో బ్రాహ్మణులు సైన్యాధ్యక్షులుగా వీరులుగా యుద్ధప్రవీణులుగా యుద్ధ విద్యాచార్యులుగా, అస్త్ర శస్త్ర విద్యాబోధకులుగా కనిపిస్తారు. కాని రాజ్యకాంక్షపరులుగా గోచరం కారు. రామాయణంలో బ్రాహ్మణులు యజ్ఞయాగాది క్రతునిర్వాహకులుగా విద్యాబోధకులుగా పురోహితులుగా కనిపిస్తారు. రామాయాణంలో శూద్రుడు తపస్సు చేసే చర్య ఒకటి ప్రస్తుతమయింది.

భారతం రామాయణం దుష్టసంహారం చేశాయి. శిష్టసంరక్షణ చేశాయి. భారత మృతులు సోదరులు రామాయణ మృతులు శత్రువులు. భారతం ఆర్యుల మధ్య యుద్ధం, రామాయణం ఆర్యఅనార్యుల మధ్య యుద్ధం కలిగి ఉన్నాయి. భారతంలో అవతారపురుషుడు శ్రీకృష్ణుడు. భారత ఫలితానికి ప్రత్యక్ష యజమాని. రామాయణంలో అవతారపురుషుడు రాముడు. రామాయణ ఫలితానికి ప్రత్యక్ష ప్రభువు.

భారతంతో విశాల కథా ప్రణాళిక ఉంది. రామాయణంలో పరిమిత ప్రాంగణ విలసితంగా కథ విస్తరించింది. కథను అనుసరించే భారతంలో పాత్రలు సంఘటనలు, సన్నివేశాలతో కూడిన భావశాబల్యం ఉంది. రామాయణంలో కథా పరిమితి వల్ల పాత్రాదులు పరిమితమయి భావైక్యం ప్రవర్తిల్లింది.

2.2.4. చారిత్రక నేపథ్యం : రామాయణ గాథ క్రీ.పూ.1000 ప్రాంతంలో జరిగినప్పటికి క్రీ.పూ.500 ప్రాంతంలో రచనారూపం ఏర్పడిందని, అది ద్రవరూపంలో ఉండి క్రీ.పూ.12వ శతాబ్ది దాకా మార్పులు చేర్పులతో పరిణామం చెందుతూ వచ్చిందని స్పష్టంగా గుర్తించటమయింది. రామాయణం జరగలేదని, అది చారిత్రక సత్యం కాదని చారిత్రక రచయితలు భావించటం వల్ల అది చరిత్ర అనీ, ఒక భారతీయ జన జీవితంలోని వాస్తవమని స్పష్టం చేయవలసి ఉంది. రామాయణం కథ అంతా యథారూపంలో ఏ కల్పనా లేని వాస్తవమని ఎవరూ అనకపోవచ్చు. కానీ, రామాయణం పూర్తి కల్పన అంటే అంగీకరించటం కష్టం. వి.యస్.స్మిత్ రామాయణం కల్పనాత్మకమని భావించాడు. 'The poem (The Ramayana) seems to me to be essentially a work of imagination probably founded on vague traditions of the kingdom of kosala and its capital Ayodya'.(2) రామాయణాన్ని కల్పన అని తిరస్కరిస్తే భారతదేశ విశేష సృష్టి అయిన దాన్ని తృణీకరించినట్లు అవుతుంది.

రామ రావణ యుద్ధాన్ని గూర్చి రెండు అభిప్రాయాలున్నాయి. రాముడంటే ఇంద్రుడని, రావణుడంటే వృత్రాసురుడని రామరావణ యుద్ధం ఇంద్ర వృత్రాసుర

యుద్ధమని ఒక భావన పౌరాణిక దృష్టితో ఉంది. ఈ దృష్టి వర్ణప్రాముఖ్యం అవసరం తెలిపి, దానికి కష్టం కలిగించే శక్తి సంహారంగా భావించినట్లు అవుతుంది. పశువుల మందలు కాపాడుకొనే ఆర్యులు వ్యవసాయ రంగం వైపు మరలుతున్న దశను ఇది తెలుపుతుంది. అయితే చారిత్రక దృష్టితో పరికిస్తే ఆర్యులు దక్షిణా పథం వైపు ప్రయాణం చేసిన ప్రయాణం తెలుపుతూ, ఆర్య ఆనార్య సంఘర్షణలను రామాయణం చిత్రించిందని విశ్వసిస్తే, రాముడు ఆర్య ప్రతినిధి, రావణుడు అనార్య ప్రతినిధి, కాగా రామాయణంలోని యుద్ధం ఆర్య ఆనార్య యుద్ధం అవుతుంది.

కోసల దేశం చారిత్రక సత్యం. అయోధ్య భౌగోళిక వాస్తవం. సరయూనది అయోధ్యనంటి ప్రవహిస్తూ ఉన్నది. దేశమూ రాజధానీ నిజమే కానీ, భారతదేశ చరిత్రలో మగధరాజ్యంలాగా, మౌర్యవంశంలాగా ఇక్ష్వాకులు అయోధ్యను పరిపాలించిన చారిత్రక సాక్ష్యాలు లేవు. అందుకే దీన్ని అవాస్తవంగా భావించే స్థితి ఏర్పడింది. రామాయణంలో అక్కడక్కడా గోచరమయ్యే కల్పనలు గానీ, అధి భౌతిక విషయాలు కానీ, రామాయణ చారిత్రక వాస్తవాన్ని తిరస్కరించలేవు.

రాముడు లంక మీదికి దండెత్తి దండకారణ్యంలో సంచరించాడనీ, ఇవి చారిత్రక ప్రదేశాలని, కాబట్టి చారిత్రకమేను అంటున్నప్పుడు రామాయణంలోని లంక నేటి శ్రీలంక కాదని, వింధ్య పర్వత ప్రాంతాల చుట్టూ జలయమంగా ఉన్న నగరమని చారిత్రక సాక్ష్యంతో వి.ఆర్.నార్ల సత్యకామజాబాలి నాటకంలో ఋజువు చేశాడు. రావణుడు రాక్షసుడు కాడని అనార్య ప్రజానాయకుడని, అసలు భారతీయతా వారసుడని చెప్పటమూ ఉంది. అయినా లంక, దండకారణ్యం, రావణుడు, యుద్ధం వాస్తవం కాబట్టి సాహిత్య కల్పనలు దూరంగా ఉంచి దాని చారిత్రక కోణం గుర్తింపవచ్చు. వానర రాజులుగా పేర్కొనబడ్డ సుగ్రీవుడు వాలి హనుమంతుడు కోతులు కారని దక్షిణ భారతదేశ రాజ వంశాలని తెలిసినప్పుడు కూడా కల్పనలు తొలగిస్తే అది చారిత్రక వాస్తవమనే తెలుస్తుంది. పౌరాణిక కల్పనలు తొలగిస్తే అది చారిత్రక వాస్తవమనే తెలుస్తుంది. పౌరాణిక సంప్రదాయంలో రామాయణం త్రేతాయుగానికి, భారతం ద్వాపరయుగానికి చెందినట్లు భావించే స్థితి చారిత్రక దృష్టి స్పష్టంగా లేని దశను చూపుతుంది కాని చారిత్రక రాహిత్యం కాదు.

చారిత్రకంగా వాస్తవమయిన రామాయణ రచన చాలా కాలం జరుగుతూ వచ్చిందని అనేకమైన మార్పులు చేర్పులు పెంపుకుదింపులు గురయిందని గమనింపవచ్చు. 'Similarly, the Ramayana of Valmiki originally consistged of 6000 verses which were raised to 12000 verses, and finally to 24,000. Although this epic appears to be more unified than the Mabharatha, it has also its didactic portions which were added later. The Ramayana compositions stage seems to be as late as the twelth century A.D. As a whole the text seems to have been composed later than the Mahabhatha'.(21)

రామాయణం గాధ చారిత్రక సత్యమనీ, అది భారతీయ జీవనం ప్రభావితం చేసిందని గుర్తించి, భారత దేశ సాహిత్యం ఆరంభంలో చారిత్రక వాస్తవ జీవితం మీద ఆధారపడి రూపొందిందని స్పష్టం చేసుకోవచ్చు.

2.2.5. రంగనాథ రామాయణం : తెలుగు సాహిత్యంలో శివకవి యుగ వైశిష్ట్యం గమనార్హం. శైవ సాహిత్యంలో దేశీయమైన వస్తువు ప్రధానంగా ఉంటుంది. ద్విపద ఛందస్సులో, జాన తెలుగు భాషలో శైవ సాహిత్యం ఉంది. శైవ సాహిత్యంలో స్థానిక మహాపురుషుల జీవితాలు కావ్యగతంగా గోచరమయి, అక్లిష్టమయిన ఛందస్సు ఉండి, ప్రజలు వాడుకొనే భాషకు సమీపంగా ఉన్న భాష ప్రయుక్తమవుతూ ఉండటం వల్ల శైవసాహిత్యం ప్రజలకు ఇష్టం కాసాగింది. ప్రజాభిమానం సంపాదించుకొన్న శైవ సాహిత్యంలోని ఛందస్సు భాషలను గ్రహించి వైష్ణవ ధర్మప్రబోధం చేసే రంగనాథ రామాయణం గోనబుద్ధారెడ్డి ఇతరుల సహాయంతో రూపొందించినాడు. ప్రజాభీష్టం దృష్టితో వెలువడం వల్ల ప్రజలకిష్టమైన మూలంలో లేని అనేకాంశాలు గోనబుద్ధారెడ్డి రంగనాథ రామాయణంలో చేర్చాడు. వాల్మీకి వ్రాసిన రామాయణ కథకు మార్పులు చేర్పులు గోచరమయ్యే తత్త్వం ఇందులో ఉంది.

'తెనుగున గల రామాయణములన్నింటిలో రంగనాథ రామాయణము మొదటిది. రెండవది భాస్కర రామాయణము'.(22) రంగనాథ రామాయణం సంపూర్ణ రామాయణ కథా రచనం. సప్తకాండలతో ఉన్న విస్తృతేతిహాసం. పూర్వ ఉత్తర ప్రణాళికతో నిండిన విశిష్ట రచన. ఇది 13వ శాతాబ్ది పూర్వ భాగంలోనే రచితమయిందని పరిశీలకుల భావన. గోనబుద్ధారెడ్డి పూర్వ భాగమంతా రచించగా తండ్రి కోరికపై కాచవిభుడు, విఠల విభుడు ఉత్తరభాగం రచించారు.

వీరు దేశికవితా మార్గంలో ఇతిహాస రచన చేశారు. ద్విపదలో వెలువడ్డ ప్రథమ రామాయణం రంగనాథ రామాయణం. ప్రచారంలో ఉన్న ఎన్నో కథలను, రామాయణ సంబంధ కథలను తమ కావ్యంలో చొప్పించారు. వీరు ప్రవేశపెట్టిన అవాల్మీకాంశాలు ఎన్నింటినో తర్వాతి కవులు తమ కావ్యాలలో గ్రహించారు. యథామూలకంగా రంగనాథ రామాయణం లేదు. అవసరమయిన చోట స్వతంత్రించి రచన చేయడం ఇందులో స్పష్టంగా చూడవచ్చు. ఈ రామాయణానికి విశిష్టత నాపాదించిన అంశమే మూల భిన్నగాథా కల్పన. ఆ గాథలు రామకథా ప్రస్తావన ఉన్న పద్మపురాణాదుల్లో గాని, నవ విధ రామాయణాదులలో కాని ఉండినా ఉండవచ్చు పింగళి అభిప్రాయం కాని కవి మాత్రం జనులలో నాని నలిగిన కథలనే రామాయణంలో నిల్పాడు.

వాల్మీకి చెప్పినట్టు రామాయణం వ్రాస్తానని గోనబుద్ధారెడ్డి అన్నప్పటికీ ఎన్నో అమూలక కథలను చేర్చాడు. అవాల్మీకాంశాలు ప్రధానంగా పేర్కొంటున్న ఘట్టాలు, అరణ్యకాండంలోని జంబుక వృత్తాంతం, శూర్పణఖ లక్ష్మణుని పైకి వెళ్ళడానికి నేపథ్యంగా కలిపిన కథ శూర్పణఖపై జాలి చూపేటట్లు తీర్చిదిద్దాడు. ఇందులో మరో విశేషం రావణుడి కుటుంబం తీరుతెన్నులు వివరాలు, రావణుణ్ణి గుర్చిన విశదీకరణం, రాముడు మహావిష్ణువు రూపమని తెలిసిన శూరుడు శత్రువుగా నిల్చి రాముడి చేతిలో మృతిపొంది సాయుజ్యం పొందాలనుకొన్న భక్తుడి సంగతి స్పష్టంగా తెలిసి వచ్చాయి.

ఈ రామాయణ కర్త గోనబుద్ధారెడ్డి, పాల్కురికి సోమనాథుడూ సమకాలికులు. ద్విపద వైష్ణవ మత ధర్మాలకు చెందిన వాళ్ళు. తెలుగు ఛందస్సు మార్గ ఇతివృత్త గాథకు వాడి శూద్రకవి విరచించడం ఆనాటికి గొప్ప సాహసం. '.....మార్గవృత్తమైన రామాయణమున ద్విపద వ్రాసి, మార్గదేశి భేదములు తగ్గించుటే కాక శైవ వైష్ణవ భేదములు రూపుమాపుటే కాక, శివుడు విష్ణువుల మధ్య అభేదములను పాటించుటకు కృషి చేసెను. అందువలన రంగనాథ రామాయణము మత విషయిక సామరస్యమునే కాక భాషా విషయిక సామరస్యమును సాధించుటకు కృషి చేసినట్లు స్పష్టము కాగలదు', అని తన పరిశోధన గ్రంథంలో డా.సుంకర వెంకుమాంబ పేర్కొన్నారు.

శైవ వైష్ణవ మతాల సమన్వయాన్ని మార్గదేశి కవితా ధోరణుల సమన్వయాన్ని సాధించటానికి కృషి చేసిన ప్రథమ సాహత్యస్వరూపంగా రంగనాథ రామాయణం నిలుస్తుంది.

2.26. రామాయణ ప్రాచుర్యం : తెలుగు సాహిత్యంలో రామాయణం ఒక్కటే అనేకమైన అనువాదాలకు అందటం అబ్బురమైన విషయం. అనేక కవిపండితులు అనేక విధాలుగా రామాయణానువాదం చేసి తరించిన ఆనందం అనుభవించారు.

**1.** ద్విపద రామాయణం : రంగనాథ రామాయణం గోనబుద్ధారెడ్డి, విఠల భూపతి వ్రాయగా పలువురు ఆ మార్గం హర్షించి గ్రహించి అనుసరించారు. తాళ్ళపాక అన్నమాచార్యుడు 1440 ప్రాంతంలో రామాయణాన్ని ద్విపదగా వ్రాశాడు. అది పూర్తిగా లభించలేదు. యుద్ధకాండ మాత్రం లభిస్తూ ఉంది. ద్విపద కావ్యంగా లభిస్తున్న ద్వితీయ రామాయణం 1660లో రచితమైన కట్టావరదరాజూ దరచ. ఇది వాల్మీకి రచనను అనుసరించిన అనువాదం. రామయణాన్ని ఏకోజి 1735లో అనువదించాడు. తెలంగాణా వాసి అయిన రాఘవరెడ్డి రామాయణం ద్విపదగా వెలువరించాడు. ఆధునిక కాలంలో ప్రసిద్ధి గాంచిన ద్విపద రచన శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులు రచించిన జనప్రియ రామాయణం. భవభూపతి ఉత్తర రామాయణ చరితను సీరము సుభద్రాంబ అనువదించింది.

2. ఉత్తర రామాయణం : తిక్కన నిర్వచనోత్తర రామాయణం ప్రసిద్ధి గ్రహించిన పలువురు దీనిని మార్గపద్ధతిలో అనువదించారు. అందులో కంకంటి పాపరాజు ఉత్తర రామాయణం సుప్రసిద్ధం. కరుణరస ప్రధానమైన ఉత్తర రామచరిత్రను విశేష రసరమ్యంగా పాపరాజు చిత్రించాడు. ఉత్తర రామాయణ అనువాదంలో తిక్కన స్వీకరించని భాగాలు పాపరాజు అనువదించాడు. తిక్కన తరువాత అదే భాగాన్ని పాపరాజు అనువదించడం సాహసంగాఉన్నా, తిక్కన కంటే ఆ మాటకొస్తే వాల్మీకి కంటే పాపరాజు రచన ఉత్తమంగా ఉందని కొందరి భావన. రచన కొంత శృంగారభరితంగా ఉండటం నాటి రాజకీయ సాంఘిక పరిస్థితికి నిదర్శనం. ఉత్తర రామాయణ కథా ఘట్టాన్నే పట్టాభి రామాయణం పేరిట వెంకట రామకృష్ణ కవి వ్రాశాడు.

3. వేదాంత దృష్టి : రామాయణం : వేదాంత దృష్టితో రామాయణ రచన సాగింది. రామాయణాన్ని ఆధ్యాత్మిక దృష్టితో దర్శించడమే ప్రధాన కారణం. వాల్మీకి

ామాయణం కంటే సంస్కృతం అధ్యాత్మిక రామాయణం ఈ అనువాదాలకు ఎక్కువగా మూలమయింది. మామిడమ్మ సుభద్రమ్మ ఆధ్యాత్మ రామాయణాన్ని ద్విపదగా రూపొందించింది. సంస్కృత ఆధ్యాత్మ రామాయణాన్ని కంచర శరభకవి ఆంధ్రీకరించాడు. అదే కోవలో కాణారము సోమయాజి, బులుసు వెంకటేశ్వర్లు వంటి అనేకులు అనువదించారు. అయితే కీర్తనల రూపంలో మునిపల్లె సుబ్రహ్మణ్యం చేసిన అనువాదం మాత్రం ప్రఖ్యాతి గాంచింది. రాపాక శ్రీరాములు అధ్యాత్మిక రామాయణం రచించాడు. ారుశురామ లింగమూర్తి, 'సీతారామాంజనేయ సంవాదం' రచించాడు. రాముని హృదయం ూర్చి శివుడు పార్వతికి చెప్పడం అధ్యాత్మిక రామాయణం బాలకాండలో ఉంది. దీనిని ూడు ఆశ్వాసాల యోగ శాస్త్రంగా పరశురామలింగమూర్తి రూపొందించాడు. టి. ారుమూర్తి ఆత్మరామాయణాన్ని లిఖించాడు.

4. మార్గ సంప్రదాయణం : రామాయణం : భాస్కర రామాయణ మార్గంలో ూధామాతృకంగా మొల్ల రామాయణం వ్రాసింది. అత్కూరి మొల్ల కుమ్మరి వంశ స్త్రీ, ార్గ పద్ధతిలో రామాయణానువాదం చేసింది. శ్రీరామచంద్రుడి వర్ణనంలో కవయిత్రి క్తి పరవశురాలయి రచన చేసింది. ఆమె ప్రథమాంధ్ర కవయిత్రి. ఆమె కాలం విషయంలో ందేహం లేని నిర్ణయం లేదు కాని, ప్రాచీన కాలంలోని కవయిత్రి అని స్పష్టంగా ావింపవచ్చు. కేసన వరపుత్రిక మొల్ల. తండ్రి శైవుడు. శైవదీక్ష తండ్రి నుంచి పొంది ండవచ్చు అని పరిశోధకుల నిర్ణయం. శైవం స్వీకరించినా, వైష్ణవ ప్రాధాన్యం ఉన్న చన చేయటం విశేషమైన విషయం. పరమత ఉన్నతికి కృషి చేయడంలో ఉన్న ారిత్రక స్థితి పరిశీలించాల్సిన అంశం. మొల్ల తన రామాయణానువాదానికి వాల్మీకి, ధ్యాత్మిక రామాయణాలు మూలం అయ్యాయి. ఈమె రామాయణం తెలుగుదనంతో ాడిన రచన.

రాముడి కథా వైశిష్ట్యాన్ని తెలుపుతూ తాడేపల్లి వెంకటయ్య శాస్త్రి శ్రీరామ ామృతము రచించాడు. యథాశ్లోక తాత్పర్య రామాయణంగా 1793లో గద్వాల జ్యస్థాపకుడైన సోమభూపాలుడు ఆస్థాన కవులలో ఆరుకాండాలుగా అనువాదం యించాడు. పద్యంగా ఈ రామాయణ గాథను తుమురాడ పాపకవి అనువదించాడు. నే కథను శతముఖ రామాయణంగా లింగన కవి గంగకవి రచించాడు. దీనిని ానుసారంగా ఏనుగు చిన్న లచ్చన కవి తెనిగించాడు. దీనిలో భాగం దాశరథీ విలాపం. త కొరకు రాముడు దుఃఖించే కరుణారస ప్రధాన ఘట్టం. దీన్ని దాశరథీ విలాపం రిట 'కొత్తపల్లి అచ్చయ్య' కావ్యం రచించాడు. మార్గ పద్ధతిలో చంపూ ధోరణిలో మాయణ కథను ఋగ్వేద కవి వెంకటాచలపతి రచించాడు. ఈ పద్ధతి అల్లమరాజు ంగశాయి, బులుసు సీతారామకవి వంటి వారు అనువదించడానికి మార్గదర్శమయింది. ంపూ విధానంలో రామాయణ రచనావిర్భావం ఆధునిక కాలంలోనూ గోచరమవుతుంది. మంతి రామయ్య పంతులు చంపూ కావ్యంగానే రామాయణం రచించాడు. ఇదే ధోరణి ద్ధరపు మహాదేవుడి అనువాదంలో కనిపిస్తుంది. మార్గపద్ధతిలో ఆధునిక కాలంలో ్సిన వావిలికొలను సుబ్బారావు రచించిన శ్రీవాంధ్ర వాల్మీకి రామాయణం ప్రసిద్ధి ందింది. జనమంచి శేషాద్రి శర్మ రచించిన ఆంధ్ర శ్రీమదాంధ్రాయాణం రామాయణ

గాథా బోధకంగా ఉంటే, అతడు వ్రాసిన 'ధరసార రామాయణం' ఇతిహాసంలోని ధర్మాన్ని ప్రబోధించేదిగా ఉంది. గడియారం వేంకటశాస్త్రి రచించిన శ్రీమద్రామాయణము అముద్రితమే అయినా ఎంతో ప్రాచుర్యం సంపాదించిన ఆధునిక రచన.

5. అనువాదక ప్రాధాన్యం : రామాయణం అనువాదం చేసిన వాళ్ళు తమ పేరిట రామాయణం వెలవరించారు. తంజాపూరు పాలకుడు సాహితీ పోషకుడు సాహితీ వేత్త రఘునాథ నాయకుడు రామాయణం రచించాడు. తమపేరు రామాయణంలో చేర్చి ఎందరో రచనలు చేశారు. ఆత్మకూరి గోవిందాచార్యులు గోవింద రామాయణం రచించాడు. చిల్లిరిగె యోగానందయ్య పంతులు యోగానందారాధ్రమాయణం వ్రాశాడు. రామయ్య కవి రామోదయం అనువదించాడు. మోతుకూరి పండరినాథ కవి శ్రీమత్పండరినాథ రామాయణంగా వెలువర్చాడు. గోపీనాథ రామాయణం గోపీనాథము వెంకటకవి ఆంధ్రీకరించాడు. సంస్కృతంలోని ఆనందరామాయణం యథామృతకంగా పద్యకావ్యంగా గుండు లక్ష్మణకవి ఆంధ్రీకరిస్తే నూతలపాటి పేరరాజు గద్యంగా అనువదించాడు. తమ పేరు మీద అనువాద రామాయణం వెలువర్చిన వారిలో కవయిత్రులు ఉన్నారు. శ్రీమతి సీరము సుభద్రాంబ సుభద్రారామాయణం అనువదించింది. కవికలహంసి బిరుదు ధరించిన చేబ్రోలు సరస్వతీ దేవి సరస్వతీ రామాయణం నామంతో ఆంధ్రీకరించింది. ఆధునిక కాలంలో రామాయణేతిహాస రచన చేసిన వారిలో ముఖ్యుడు శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రి. తన పేరు కలసి వచ్చేట్లుగా ఆంధ్రీకరించిన రామాయణానికి శ్రీకృష్ణరామాయణం స్థిరపరిచాడు. దీనిలో శ్రీకృష్ణుడి ప్రాధాన్యం ప్రమేయం ఉందని ఆలోచించే అవకాశం ఉన్నా ఇది రచయిత్ర ప్రాముఖ్యం తెలిపే నామమే కాని ఇతరం కాదు.

6. విభిన్న ప్రక్రియా రామాయణం : నిర్వచనంగా, పద్యంగా చంపువుగా రచన చేయడం, తత్కర్త సామర్థ్యానికి నిదర్శనం. క్రమంగా రామాయణం ఈ పరిధిని అతిక్రమించి ఇతరమైన రచనా ప్రక్రియల నాశ్రయించింది. అన్ని ప్రక్రియల కంటే పద్యం అంత ఎక్కువగా వచన రామాయణాలు వెలువడ్డాయి. ఆధునిక కాలంలో మరింత ఎక్కువగా. అచ్చతెనుగు కావ్యంగా యక్షగానంగా దండకంగా రామాయణ కథ ప్రజలకు దగ్గరయింది. రామాయణాన్ని వచనంగా మొట్టమొదటి రూపమిచ్చిన కవి శ్యామరాయుడు. ఇతను చేసిన అరంభం తరువాతి కవులకు ప్రోత్సాహం మార్గదర్శకమయింది. శ్యామరాయుని అనుసరించి తుపాకుల అనంతయ్య దేవకి వేంకటసుబ్బయ్య వచనంగా రచించారు. దొంకా గోపినాథుడు వచన విచిత్రరామాయణం వ్రాశాడు. 'వచన రామాయణములు రచించిన వారు శ్రీ వావిలాల రామస్వామి దేవరాజుసుధి, నోరిగురిలింగ శాస్త్రి, దొడ్డి వెంకటరామిరెడ్డి, సరస్వతుల సుబ్బరామశాస్త్రి, మోడేపర్తి గున్నయ్య వీరెల్లరును సులభ గ్రాంధికములో రచన చేసినారు. శ్రీనివాస శిరోమణి, శ్రీపాద సుబ్రహ్మణ శాస్త్రి, పురిపండా అప్పలస్వామి, ఉషశ్రీ శిష్ట వ్యావహారిక రచన చేసిరి. శ్రీ కల్లూరి చంద్రమౌళి రామాయణ సుధాలహరి, ధర్మవరము సీతారామంజనేయుల అంజనేయ రామాయణము రామాయణంపై పరిశీలనాత్మక రచనలు'.(23) అచ్చ తెనుగులో రామాయణావిష్కరణ చేసిన ఆడిదం బాలభాస్కరుడిది ప్రశంసనీయమైన రచన. ఇదే క్రమంలో కూచిమంచి తిమ్మకవి కూడాను అచ్చతెనుగు కావ్యంగా రచించాడు. రామాయణ గాథను ఆడిదం

సూరకవి స్తుతిపూర్వకమైన దండక ప్రక్రియలో రచించాడు. రామాయణమంతా దండక రూపంలో కలుగోడు అశ్వత్థారావు వ్రాశాడు. రామాయణ గాథను యక్షగానంగా హోసూరి సాకమ్మ ప్రదర్శనా ప్రాధాన్యం గల కావ్యంగా రూపొందించింది. గేయరూపంలో సుందరకాండను రూపొందించిన ఎం.యస్.రామారావు విశిష్ట ప్రఖ్యాతి గాయకుడిగా కూడా సాధించాడు. సుందరకాండను గేయరూపంలోనే దివాకర్ల వేంకటావధాని సుందరకాండసర్వంతం వేంకట పార్వతీశ్వర కవులు రచించారు.

7. భిన్న భాషా రామాయణం : సంస్కృతేతరమైన భాషలలోని రామాయణాలను కూడా తెలుగులోకి అనువదించారు. సంస్కృతం తర్వాత హిందీలో వెలువడ్డ తులసీదాసు రచన ప్రఖ్యాతి గాంచింది. శ్రీరామచరిత్ర మానస్‌ను తెలుగులోకి అనువదిస్తూ శ్రీభాగవతుల నరసింహశర్మ పద్యకావ్యంగా రూపొందించాడు. దీన్ని పద్యకావ్యం రూపంలోనే మైలవరపు సూర్యనారాయణ మూర్తి ఆంధ్రీకరించాడు. ఈ కావ్యాన్ని ద్విపద కావ్యంగా శ్రీకేశవ తీర్థస్వామి రచించాడు. అతని శ్రీపాటీలు తిమ్మారెడ్డి అనుసరించి ద్విపదగా అందించాడు. అయితే తులసీరామాయణం గద్యంగా అందించిన ఘనత స్త్రీలది. రామాయణంలో కనిపించే భక్తితత్త్వాన్ని ద్విపద రామాయణంలో కనిపించే భక్తితత్త్వాన్ని సుందరంగా శ్రీమతి ఏలూరిపాటి లక్ష్మీసరస్వతి గద్యంగా అనువదించింది. శ్రీమతి నేలనూతల పార్వతీ కృష్ణమూర్తి గద్యంగా అందించిన రామాయణం మూలం తులసీదాసు రచనే.

హిందీ రామాయణం తర్వాత తెలుగులోకి వచ్చిన అనువాదాలు, ఆంధ్రరాష్ట్ర పరిసర భాషలయిన తమిళ ఒరియా భాషా రామాయణాను మూలాలను గ్రహించి రచించనవి ఉన్నాయి. కంబడు ప్రసిద్ధ తమిళ కవి. ఇతడు తమిళంలో రచించిన రామాయణం కంబరామాయణంగా తమిళ సాహిత్యంలో ప్రాముఖ్యం సంతరించుకొంది. దీన్ని పద్యకావ్యంగా తెచ్చి తెలుగు సాహిత్యంలో నిల్పినవాడు శ్రీపూతలపట్టు శ్రీరాములురెడ్డి. దీన్ని వచన రూపంగా మలచి మరుపూరి కోదండరామిరెడ్డి ప్రజలకు మరింత చేరువ చేశాడు. శ్రీ సిద్ధేంద్రయోగి ఒరియా భాషలో రచించిన రామాయణాన్ని, ఆంధ్రీకరించిన వాడు ఢాంకా గోపీనాథ కవి. ప్రథమ సంప్రదాయంగా సాహిత్య ప్రపంచంలో ఉన్న అనవాయితీ దీనికి భిన్నంగా గోపీనాథకవి 1670 ప్రాంతంలో గద్యంగా అనువదించాడు. ఈ గద్యకావ్యం ఆధారంగా తమురాడ పావకవి పద్యకావ్యం రూపొందించాడు. ఇతణ్ణి అనుసరించి నరసింహ దేవర వేంకటశాస్త్రి, కొమ్మాజి, సోమనాథ కల్పాచార్యుడు, వేల్పూరి వెంకటకవి పద్యకావ్యంగా రామాయణాన్ని వెలువర్చారు.

8. నవ్యసంప్రదాయ రామాయణం - రామాయణ కల్పవృక్షం : విశ్వనాథ సత్యనారాయణ ఆధునిక సాహితీ సామ్రాజ్య కవిసామ్రాట్. జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత. కావుకుడు. సంప్రదాయవాది అయినా నవ్యసంప్రదాయవాదిగా గోచరమవుతున్నాడు. భారతదేశ సాహిత్యంలో విశ్వనాథ రచించిన రామాయణ కల్పవృక్షం విఖ్యాతం. స్వాతంత్ర్యానంతర కాలంలో ఆధునిక భావాల ఒరవడిలో సాహిత్యం మార్పులకు గురవుతూ అభ్యుదయాన్ని కాంక్షిస్తున్న రోజుల్లో ప్రాచీన ప్రఖ్యాత ఇతివృత్తభరిత ఇతిహాసాన్ని

గ్రహించి మహాకావ్యంగా రచించాడు. 'విశ్వనాథ సమకాలీన సమాజాన్ని చైతన్యవంతం చేయటం కోసం రామకథను ఆధారంగా పెట్టుకొని తనదైన వస్తు సంవిధాన శిల్పంతో సనాతన ధర్మాన్ని ప్రతీకాత్మకం చేసి కావ్యేతిహాస లక్షణాలతో కల్పవృక్షాన్ని రసమయం చేశాడు'(24) ఆధ్మాత్మ రామాయణ ప్రభావం ఈ రచనపై ఉంది. అధ్యాత్మ రామాయణం బ్రహ్మాండ పురాణాంతర్గతం. ఇది వాల్మీకి, వ్యాస, విశ్వామిత్ర ప్రోక్తమని వివిధ వాదాలున్నప్పటికిని, వ్యాస ప్రోక్తమనడానికి ఉనికి ఎక్కువ. వాల్మీకి రామాయణం, వ్యాసప్రోక్త ఆధ్యాత్మ రామాయణాలు ప్రసిద్ధాలుగా కనిపిస్తాయి.

రామాయణం భక్తులకు తీరని దాహం. 'ఈ దేశంలో రామాయణం ఒక ఆత్మకథ; ఆత్మీయుల కథ; ఒక మంత్రం; ఒక జీవనసూక్తం; ఒక జీవిత సూత్రం; ఒక ఆదర్శపారం; ఒక అనుభవ గీతం; ఒక ఆధ్యాత్మిక ప్రస్థానం; ఒక సమగ్ర సందేశం; ఇట్టి సంపూర్ణ రామకథను కల్పవృక్షంగా భావించారు, దర్శించారు'.(25) అందుకే దానిని తాను భావించిన కోణంలో సాక్షాత్కరించాడు. ఇది విజయవంతం అయింది. ఈ కల్పవృక్షం తరగని ఫలాలు ఇస్తూ ఉంది. 'ఈ వృక్షానికి మూలం నారాయణుడు. రణరంగంలో రామతరవుగా రావణునకి దర్శనమిచ్చింది. అసురుడు సీతాపహరణమనే మందుతో ఆ వృక్షాన్ని హతమారుద్దామని యత్నించాడు కాని, చావులేని ఆచెట్టు కొమ్మలు సాచి దిశలు వ్యాపించింది. విషవృక్షంగా రామతరువును మార్చదలచుకొన్న దానవయత్నం విఫలమైంది. కల్పవృక్షంగా నిలిచి కన్నుల పండువుగా దర్శనమిస్తోంది'.(26) విశ్వనాథ సత్యనారాయణ అదే రాముని కథను సమర్థవంతంగా మరోసారి సాహిత్యానికి అందించాడు. రామకథతో పాటు ప్రాచీన సంప్రదాయాన్ని కూడా ఆయన సమగ్రంగా సంపూర్ణంగా అందించాలని ఆరాటపడ్డాడు.

రామాయణ కల్పవృక్షం ఆధునిక కాలానికి చెందిన విస్తృత గ్రంథం. ఆధునిక రామాయణాలలో ఉత్కృష్ట గ్రంథం. తెలుగు సాహిత్యానికి ప్రథమంగా విశేషమైన గుర్తింపు, జ్ఞానపీఠ్ అవార్డు ద్వారా సంపాదించి పెట్టింది. అశేషంగా జరిగిన రామాయణ రచనలో ఇది ఒక భాగం. తెలుగులో ఆరంభం నుంచి రామాయణానువాదం జరుగుతూ వచ్చింది. ఇది వైదిక జీవన విధానాన్ని సంప్రదాయాన్ని బలపరిచే సాహిత్యం.

రామాయణాన్ని విశ్వనాథ సత్యనారాయణ కల్పవృక్షంలా భావించి తన నవ్యసంప్రదాయవాదం ప్రతిపాదించి అనువాదం చేశాడు. అత్యుత్తమ బహుమతికి జ్ఞానపీఠ్‌కు అది అర్హం అయింది. ఈ సందర్భంగా విషవృక్షంగా రామతరువును మార్చదలచుకొన్న దానవయ్నం విఫలమయిందన్న సూచన ఒకటి కనిపిస్తుంది. రావణుడు రాముణ్ణి - రామగాథను కల్పవృక్షంగా కాక విషవృక్షంగా మార్చే ప్రయత్నం విఫలమయిందన్న అర్థంతో పాటు మరొక స్ఫురణం కూడా ఉంది. అది రంగనాయకమ్మ రాసిన గ్రంథం. రామాయణాన్ని విషంతో సమానంగా భావించి ముప్పాళ (దద్దనాల) రంగనాయకమ్మ రామాయణం విషవృక్షం అని, అది కల్పవృక్షం కాదని విమర్శ చేసింది. ఈ విమర్శ వెనుక మార్క్సిస్టు దృక్పథం ఉంది. ఈమె ప్రధానంగా భారతీయ సంప్రదాయం విషతుల్యం కావటానికి ఇటువంటి గ్రంథాలు దోహదం చేశాయని, స్త్రీకి స్వేచ్ఛా స్వాతంత్ర్యం లేకుండా చేసిన ప్రాచీన సంప్రదాయానికి రామాయణం వంటి గ్రంథాలు పట్టుకొమ్మలని

వాటిని కల్పవృక్షాలుగా భావించరాదని విషవృక్షాలుగా భావించాలని తన విమర్శ గ్రంథంలో తెలిపింది. ఆ గ్రంథం వ్రాసిన రంగనాయకమ్మ కృషిని ఈ విమర్శకుడు దానవ ప్రయత్నంగా తిరస్కరించే ప్రయత్నం చేశాడు. అది అభిప్రాయం బేధం ఉండటాన్ని స్పష్టం చేసే సందర్భం.

ఈ రంగనాయకమ్మ అభిప్రాయాలను ఖండిస్తూ సంప్రదాయ విలువను, స్త్రీ స్వేచ్ఛను రామాయణం బాగా ప్రతిపాదించిందని రామాయణం ధర్మవ్యవస్థ విశిష్టమని తెలుపుతూ విషవృక్షం ఖండనం పేరిట తెన్నేటి హేమలత (లత) పునర్విమర్శ వ్రాసింది. విశ్వనాథ కల్పవృక్షాన్ని విషవృక్షం రంగనాయకమ్మ భావిస్తే, దాన్ని ఖండించింది లత. ఈ ఖండనంలో కల్పవృక్షం ఖండితమవుతుందనే భయం వాస్తవమే. కల్పవృక్షం ఖండితం కాదు. దాని వ్యవస్థను ప్రతిష్ఠితమని గుర్తించాలి.

2.2.7. రామాయణ కావ్యం : రామాయణంలోని ఏదైనా ఒక కథను గాని కథాసూత్రం గాని గ్రహించి కావ్యసృష్టి చేస్తే వాటిని రామాయణ కావ్యాలుగా గ్రహించి పరిశీలించటం జరుగుతుంది. రామాయణ కథాంశం ఆధారంగా కావ్యం సంస్కృతంలో సృష్టి అయి, తెలుగులోకి అనువాదమయినా ఈ సందర్భంలో పరికించటానికి వీలు ఉంది.

1. ఇందుమతీ కళ్యాణం : రఘువంశంలోని అజమహారాజు ఇందుమతిని వివాహమాడడం కథను గ్రహించి 'ఇందుమతీ కళ్యాణం' పెనుమత్స వెంకటాద్రి రచించాడు. ఇది నేడు అలభ్యంగా ఉంది. తర్వాతి కాలంలో దీన్ని అంగద బసవయ్య వ్రాశాడు. దీనిలో నుంచి కొన్ని పద్యాలే ఉదాహరింపబడ్డాయి. ఆరు ఆశ్వాసాల కావ్యంగా చింతలపల్లి ఛాయాపతి రాఘవాభ్యుదయము రచించాడు. ఇది సంస్కృత రఘువంశానికి పాక్షికంగా అనువాదం.

2. కుశలవ కథ : చిరుమూరి రంగరాజు కుశలవోపాఖ్యానం రచించాడు. అందులో ఒక్క పద్యం మాత్రమే లభిస్తూ ఉంది. రాముడి పుత్రుడయిన కుశుడు కుముద్వతిని వివాహమాడడం కథగా మట్లకుమార అనంతరాజు 'కుముద్వతీ కళ్యాణం' రచించాడు. ఇది అసమగ్రంగా ఉంది.

3. రామకథాంశం : 16వ శతాబ్ది చివరి ప్రాంతాలకు చెందిన బొడ్డుచర్ల తిమ్మన ఏడంకాల కావ్యంగా ప్రసన్న రాఘవం రచించాడు. గోపాలరావు రామచంద్రోదయం అనే శ్లేషకావ్యం విరచించాడు. బిజ్జల తిమ్మరాజు అనర్ఘరాఘవం వ్రాశాడు. భోజ చంపువును నడిమింటి వెంకటపతి అభిషిక్త రాఘవం రచించాడు. 'జానకి పరిణయం' రఘునాథ నాయకుడు కావ్యం రచించాడు. దీనినే టేకుమళ్ళ రంగశాయి కూడా రచించాడు. సముఖం వేంకట కృష్ణప్ప 'అహల్యా సంక్రదనం' రామాయణం నుంచే గ్రహించి కావ్యంగా రూపొందించాడు.

4. మహర్షుల కథ : రఘునాథ నాయకుడు వాల్మీకి చరిత్ర వ్రాశాడు. ఇది మూడు ఆశ్వాసాల కావ్యం. రామాయణం వ్రాసిన వాల్మీకి మహర్షి జీవితం పట్ల గౌరవంతో

భక్తితో అద్భుతంగా చేసిన సృష్టి ఈ కావ్యం. యజ్ఞవల్క్యుడు మహర్షి జనకుని ఆస్థానంలో దార్శనికుడు ఇతడు ఆధ్యాత్మిక ఉపదేశికుడు. ఇతని భార్యలు మైత్రేయి కాత్యాయని. మైత్రేయితో చేసిన సంవాదం ప్రధానంగా తీసుకొని ద్విపద కావ్యం ఆరుకాండలుగా 'యాజ్ఞవల్క్య మహర్షి చరిత్ర' రచించాడు. ఇది సంపూర్ణంగా లభించలేదు. 1730-50 ప్రాంతాలకు చెందిన ఘట్ట ప్రభువు (శేషయ్య) కూడా 'యాజ్ఞవల్క్య చరిత్ర' వ్రాశాడు.

గాథేయోపాఖ్యానం అనే అయిదాశ్వాసాల ప్రబంధాన్ని రేవూరి అనంతయ్య రచించాడు. ఇది విశ్వామిత్రుడి చరిత్ర. ఇందులో విశ్వామిత్రుడు రాజ్యానికి రావడం నుంచి వనానికి వెళ్ళి కామధేనువును చూచి తగాదా పడి తపస్సు చేసి బ్రహ్మర్షి కావడందాకా కథ ఉందని ఆరుద్ర పేర్కొన్నాడు. ఇదే కథను ఏనుగు చినలచ్చన్న కావ్యంగా రూపొందించాడు.

5. సమీర కుమార విజయం : హనుమంతుని కథను పుష్పగిరి తిమ్మన రచించాడు. రావణుని చంపిన పిమ్మట శతకంఠ రావణుణ్ణి చంపమని ఆంజనేయుని ఆదేశించి, శ్రీరాముడు భార్యకోరికపై హనుమంతుడి కథ చెప్పసాగాడు. శివ పార్వతులకు కలిగిన బాలుణ్ణి వాయుదేవుడు అంజనాదేవికి ఇవ్వడం, శంసాధనుడనే రాక్షసుణ్ణి కేసరి అనే వానరం చంపిన వృత్తాంతం, బ్రహ్మ పుత్రిక అయిన అహల్యా గౌతముని భార్యకావడం, ఇంద్ర గౌతమ సూర్య ఇంద్రుల వల్ల వాలి అంజన సుగ్రీవ శతానందులు క్రమంగా కలగడం, గౌతముని శాపాన అహల్య రాయి కావటం వాలి సుగ్రీవులు ఒకే భార్యకోసం కొట్టుకొని చనిపోవడం, వాలి సుగ్రీవుల శాపాన అంజన వానరకాంత కావడం తెల్పాడు. పిమ్మట గౌతముడు శతానందుడి జనకుడి పురోహితుడిగా చేశాడు. అంజనకున్న శాపాల కారణంగా కుంజరుడే వానరుడికి పుత్రికగా ఇవ్వడం, యౌవనవతి అయిన అంజన కేసరి భార్య కావడం, వాయుదేవుని ద్వారా ఈమె శివుడి వీర్యాన్ని ధరించి ఆంజనేయుణ్ణి పొందటం, హనుమంతుడనే పేరు రావటం, పెరిగి సుగ్రీవు వద్ద చేరడం, సీతాన్వేషణలో రాముణ్ణి కలవటం తెల్పాడు. ఇందులో ధాన్యమాలి వృత్తాంతం, మైరావణ కథ, రావణ వధ, హనుమత్తీర్థ మహాత్మ్యం, కపిల కాలకేయాది యుద్ధాలు, పంచముఖావతారం, శతకంఠ రావణవధ, రాముడి దినచర్య అశ్వమేధ యాగం, ఆంజనేయుని మహాత్మ్యం, గరుడ గర్వభంగం, సౌగంధికా పుష్పార్థి భీముడి గర్వభంగం, వంటి అంశాలతో కథ సుదీర్ఘంగా ఉంది. 'ఆంజనేయ కథలన్నిటిని ఒకచోట చేర్చాలనే ఉద్దేశంతో వ్రాయడం వల్ల సమీరకుమార విజయం సుదీర్ఘం అయిందని' ఆరుద్ర పేర్కొన్నాడు.

6. ద్వ్యర్థి కావ్యాలు : ద్వ్యర్థి కావ్యాలలో ఏ కథాంశం ప్రధమాంశంగా కవులు భావించి చిత్రించారో ఆ కథాంశ ప్రాధాన్యంతో పరికించటమయింది.

1. రాఘవ పాండవీయం : కళాపూర్ణోదయం ప్రభావతీ ప్రద్యుమ్నకర్త పింగళి సూరన రాఘవ పాండవీయం ద్వ్యర్థి కావ్యంగా వ్రాశాడు. మొదటి అర్థం రామాయణం పరంగానూ, రెండో అర్థం భారతం పరంగానూ కావ్యమంతా విస్తరించి ఉంది. రెండర్థాలు సాధించే సందర్భంలో కథలో మార్పులు అనేకం. కథా సూత్రంగాసాగుతూ అనేక సూక్ష్మాంశాలు తప్పిపోయాయి. రసదృష్టి తగ్గి చమత్కార దృష్టి పెరిగింది. రచన పాండిత్య ప్రకర్షకంగా రూపం దిద్దుకొంది. 'సంస్కృతంలో ద్వ్యర్థి కావ్యాలు కోకొల్లలు. కవి రాజసూరి

రచించిన సంస్కృత రాఘవ పాండవీయం ఒకటి ఉంది. కాని దానికి సూరన కృతికి ఎక్కడా పోలిక లేదు. సూరన తనకు తానే మార్గదర్శకుడు. ఇతనిది స్వతంత్ర ద్వ్యర్థి కావ్యం. తర్వాత వచ్చిన అనేకార్థక కావ్యాలేవీ దాని ఛాయలక్కూడా రాలేవు. ఈ జాతి కావ్యాల్లో సర్వోత్తమమైనది' అనే డా.జోస్యుల సూర్య ప్రకాశరావు అభిప్రాయం ప్రకటితమయింది. ద్వ్యర్థి కావ్యరచన కష్టతరం. అయితే సూరన రెంటిలోని సమాన ఘట్టాలు, కుమార జనన వివాహం వనగమనం రాయబారం యుద్ధం పట్టాభిషేకంలాంటి సమాన అంశాలను స్వీకరించి రసవత్తర కావ్యాన్ని రూపొందించాడు.

2. హరిశ్చంద్రలోపాఖ్యానము : రామరాజభూషణుడు (1510-80) రచించిన కావ్యం. రామాయణ భారత కథలను గ్రహించి ద్వ్యర్థి కావ్యాన్ని రూపొందించాడు. సమానాంశాలు తక్కువగా ఉన్న కథాంశాలను గ్రహించినప్పటికి సమర్థవంతంగా నిర్వహించాడు. తన రచనను శ్రీరామునికి అంకితమిచ్చాడు. రాఘవపాండవీయం తర్వాత ఆ స్థాయి ద్వ్యర్థి కావ్యమిది. రాఘవ యాదవ పాండవీయం - ఎలకూచి బాల సరస్వతి సృజించిన కావ్యం. రామకథ, కృష్ణ వృత్తాంతం, పాండవుల ఇతివృత్తం స్ఫురించేటట్లు త్ర్యర్థి కావ్యాన్ని రచించాడు. కిరీటి వేంకటాచార్యులు సీతాపార్వతుల జీవన స్వరూపాన్ని ప్రతిబింబిస్తూ 'అచలాత్మజాపరిణయం' లిఖించాడు.

7. హరిశ్చంద్ర కథ : గౌరన 1348-1445 ప్రాంతాలలో రచించిన 'హరిశ్చంద్ర కథ' సూర్యవంశ రాజయిన హరిశ్చంద్రుని చరిత్ర. హరిశ్చంద్ర కథ దేవీ భాగవతంలో భాగవత మార్కండేయ పురాణాల్లో ఉంది. స్కాంధ పురాణంలోని కథను గౌరన స్వేచ్ఛానువాదం చేశాడు. గౌరన హరిశ్చంద్ర కథను ద్విపద కావ్యంగా వ్రాశాడు. ఇదే కథను 1550లో చంద్రమౌళి అనే కవి పద్యకావ్యంగా వ్రాశాడు. కాని అది నేడు అలభ్యంగా ఉంది. దేవరాజు భట్టు రచించిన హరిశ్చంద్ర నేడు లభించటం లేదు. శంకర కవి 1500-50 ప్రాంతాలలో హరిశ్చంద్ర కథను ఐదాశ్వాసాల కావ్యంగా రూపొందించాడు. కంచి వీరభద్రయ్య హరిశ్చంద్రోపాఖ్యానం వెలువర్చారు. నిర్యోష్ఠ ప్రబంధంగా హరిశ్చంద్రుని చరిత్రను వెణుకుదురుపల్లి విశ్వనాథం రచించాడు. యక్షగాన రూపంలోనూ హరిశ్చంద్ర వృత్తాంతాలు వెలువడ్డాయి. తిరునగర పాపకవి 'హరిశ్చంద్ర మహారాజు చరిత్ర'గా ఈ వృత్తాంతమే రచించాడు. స్కాంధపురాణోక్తమైన కథను అడెపు గోపాల్‌దాసు హరిశ్చంద్ర కథకు దృశ్యరూపానికి అవకాశమేర్పర్చాడు. గౌరన కృతిని అనుసరించి 'హరిశ్చంద్ర మహారాజు చరిత్రం'గా గవండ్ల రాజలింగ కవి వ్రాశాడు.

2.2.8. రామాయణ ప్రబంధం : రామాయణ గాథలను తీసుకొని ప్రబంధాలుగా చిత్రించిన సందర్భంలో ఆ సాహిత్యాన్ని రామాయణ ప్రబంధం గుర్తించటమవుతుంది. కథైక్యంతో ఏకనాయకంగా శృంగారం ప్రధానంగా అవతరించిన రామకథను ప్రబంధంగా భావించటం సముచితం.

1. రామాభ్యుదయం : అయ్యలరాజు రామభద్రకవి (1510-80) రచించిన ప్రబంధం రామాభ్యుదయం. దీన్ని సంక్షిప్త రామాయణం అనడంలో ఎలాంటి అవాంతరమూ లేదు. 'పూర్వము మహేతిహాసముగనున్న రామాయణమీతని చేత

ప్రబంధమైనది'అని కాకర్ల వెంకట రామసింహం పేర్కొన్నాడు. ఇది ఎనిమిది అశ్వాసాల ప్రబంధం. దానిలో పూర్వ రామాయణ కథ మాత్రమే గ్రహించి రచించడం జరుగుతుంది. ఉత్తర రామాయణానికిందులో చోటు లేదు.

సుప్రసిద్ధుడయిన రామభద్రుడు అష్టదిగ్గజ కవులలో ఒకడని ప్రతీతి. ఈ ప్రబంధం 1550 ప్రాంతంలో రచితమై ఉంటుందని పండితుల అభిప్రాయం. ఈ ప్రబంధాన్ని కవి నరసరాజునకు అంకితమిచ్చాడు. కృష్ణదేవరాయలి అల్లుడు అళియరామరాయలు. ఇతనికి మేనల్లుడు గొబ్బూరి నరసరాజు. కృతిభర్త. మొదటి రెండు ఆశ్వాసాలలో దశరథుని కథ ఉంది. దశరథుడి విహారం, వేట, శాపం, సంతానం, ఋశ్యశృంగుని కథ వరకు. మిగిలిన అశ్వాసాలలో రాముడి కథ వ్యాప్తమై ఉంది. 'పుత్రకామేష్టి అనంతరం పాయస విభాగం కూడా వాల్మీకిని అనుసరించి కాక అధ్యాత్మ రామాయణానుసారంగా జరిగింది. ఋశ్యశృంగుని తెచ్చుటకు రోమపాదుడు వేశ్యలను పంపుట వాల్మీకము. దశరథుడే వేశ్యలను పంపుట రామభద్రీయయు. ఈ మార్పు వలన ప్రయోజనము లేకపోగా కథకు అనవసరమయిన డొంక తిరుగుడు కలిగినది'.(27)

2. మైరావణ చరిత్ర : మాడయ్యకవి (1485-1508) రామాయణ కథను గ్రహించి మూడాశ్వాసాల ప్రబంధంగా 'మైరావణ చరిత్ర' రచించాడు. రాముడు దేవుడని రావణునితో చెప్పడానికి మైరావణుడు యత్నించడం కథ.

2.2.9. రామాయణ యక్షగానం : రామాయణంలోని కథాంశాలను గ్రహించి వాటిని పెంచి, రసవత్తరమైన యక్షగానాలుగా కవులు తీర్చిదిద్దారు. రామాయణము యక్షగానంలో యక్షగానాలు మిక్కిలి ప్రసిద్ధి పొందిన రచనలు. రామాయణంలో రసవత్తర ఘట్టాలు అనేకం. వాటిలో కొన్ని యక్షగాన రూపాన్ని ధరించాయి. తెలుగులో లభ్యమవుతున్న ప్రథమ యక్షగానం కందుకూరి రుద్రకవి 'సుగ్రీవ విజయం'. ఇందులో 'శ్రీరాముని సీతా విరహక్లేశము, రామునితో నేలకొరిగిన వాలి వాదము, తారా విలాప ఘట్టము అంగదు అప్పగింత'.(28) మొదలైన ఘట్టాలు ఉన్నాయి. సుగ్రీవుడి కథనే అదే పేరుతో అడిదపు నారాయణదాసు వ్రాశాడు.

రామాయణం ఆరుకాండలను యక్షగానంగా తీర్చిదిద్దారు. 'రామలీల' పేరిట వేల్పూరి వేంకటకవి 'రామాయణం'గా ధర్మపురి శేషాచలకవి రచించారు. యాముజాల శేషాచలపతి 'రామకథ'నే యక్షగానంగా తీర్చిదిద్దాడు. శిర్నాడు వెంకటరాయ కవి కూడా 'రామాయణా'న్ని వ్రాశాడు. భాస్కర రామాయణాన్ని మూలం చేసుకొని ఓగిరాల పాపయ్య 'రామనాటకం' రచించాడు. 'గీతరఘునందనం' పేరిట ముమ్మడి దేవుల తిరుమల కవి లిఖించాడు. మిట్టేపురి పురధాముడైన రాముని గూర్చి బోడిచర్ల సుబ్బకవి 'మిట్టేమర్రి రామాయణా'న్ని రచించాడు. 'శతకంఠ రామయణాన్ని' మద్దాల కాశీపతి వాసిష్ఠ రామాయణం నుంచి గ్రహించి రచించాడు. 'రామపట్టాభిషేకం' 'శాహాజీ' 'సీతాస్వయంవరం' గోపాల రామదాసకవి చిత్రించారు.

కుశలవుల చరిత్రను 'రామనాటకం'గా తిరునగరి అనంతదాసు రచించాడు.

క్షైమిని భారత కథలోని అంశాన్ని గ్రహించి, 'కుశలవ నాటకాన్ని' వీణెసుబ్బరాజు గాజుల పెండ్యాల శేషగిరిరాజు రచించాడు.

రామాయణాన్ని ఏదో ఒక కాండాన్ని మాత్రమే గ్రహించి కొందరు అనువదించారు. బాలకాండను అన్నదానము వేంకటాంబ ఆంధ్రీకరించాడు. ఇదే ఘట్టాన్ని శహాజీ కూడా అనువదించాడు. కిష్కింధ కాండను పెరుంబూదూరి వెంకట నరసయ్య యక్షగానంగా రూపొందించాడు. సుందరకాండను పెమ్మరాజు వెంకటరాజు జూలకంటి నారాయణ కవి 'కొమ్మాలపాటి రామాయణం'గా అనువదించారు. శ్రీరామ నాటకం పేరిట మరింగంటి భట్టరు రామానుజాచార్యులు యుద్ధకాండను రచించాడు. దీనికి కొంతవరకు భాస్కర రామాయణం మూలం.

'అవనిజా చరిత్ర' నల్లపాటి శేషాచల రామదాసు రచించాడు. వనవాసాన్ని గూర్చి సీత రామునికి చెప్పడం, యయాతి నిమిత్తం రామాంజనేయుల యుద్ధాన్ని, మహమ్మదు అబ్దుల్లా 'హనుమద్రామసంగ్రామం' వ్రాశాడు. ఇవి రామాయణాశ్రితంగా వెలువడ్డ యక్షగానాలు.

2.2.10. రామాయణ నాటకం : రామాయణం ఆధారంగా వివధ ఘట్టాలను నవరస చరితంగా చేసుకొని నాటక రచన జరిగింది. రామాయణంలో సంభాషణా చాతుర్యానికి, నాటకీయతకు అవకాశం కల్పించే ఘట్టాలు సన్నివేశాలు అశేషంగా ఉన్నాయి. అవి నాటకాలుగా రూపొందాయి. రామకథాశ్రిత నాటకాలు దాదాపు అన్ని ఇక్కడ పరిశీలించటం జరిగింది.

1. భారతం తర్వాత నాటకాలు అధికంగా వెలువడిన ఇతిహాసం రామాయణం. సంస్కృతంలో భవభూతి రచించిన ఉత్తర రామచరిత్ర అనువాదంగా వెలసిన రామాయణ నాటకాలు ఎక్కువ. 1880లో శ్రీవావిలాల వాసుదేవశాస్త్రి అనువదించాడు. నాటకంగా కాక ఈ నాటకాన్ని వచన రూపంగా ఆచంట వెంకటరామ సాంఖ్యాయన శర్మ రచించాడు. దీన్నే దాసు శ్రీరామకవి, బలిజేపల్లి లక్ష్మీకాంతం, మత్తరాజు సుబ్బారావు, ద్వివేది బ్రహ్మానంద శాస్త్రి, మల్లాది సూర్యనారాయణ శాస్త్రి అనుదించారు. 'పృథ్వీపుత్రి' పేరిట గుండిమెడ వెంకట సుబ్బారావు నాటకం రూపొందించాడు. ఉత్తర రామ చరిత్ర అద్భుత కరుణ రసాత్మక సృష్టి జయదేవుని ప్రసన్న రాఘవానికి అనువాదంగా కొక్కొండ వెంకట రత్నం 'ప్రసన్న రాఘవం'గా రచించాడు. సంస్కృతంలోని నాటకం కుందమాల. దీన్ని కూడా తెలుగులో పలువురు అనువాదం చేశారు. సీత వియోగ బాధను 1931లో 'ఆంధ్ర కుందమాల'గా వడ్డాది సుబ్బరాయుడు రచించాడు. తుమ్మపూడి కోటేశ్వరరావు 'కుందమాల' చక్కని అనువాదం.

2. రామాయణంలో వివిధ ఘట్టాలను గ్రహించి పలువురు రచించారు. వీటిలో రాముని గూర్చి వెలువడిన నాటకాలే ఎక్కువ. కోరాడ రామకృష్ణయ్య శాప వశాన లేడిగా మారిన సీతను గూర్చి రాముడు ఉన్మత్తుడై విలపించే ఇతివృత్తాన్ని 'ఉన్మత్తరాఘవం'గా రచించాడు. తాడూరి లక్ష్మి నరసింహారావు కూడా 'ఉన్మత్త రాఘవాన్ని' రచించాడు. 1900లో

ఆకొండి వ్యాసమూర్తి 'అనర్ఘ రాఘవం' రచించాడు. 'రామజననం' చిలమకర్తి లక్ష్మినరసింహం నాటకీకరించాడు. శ్రీరామ జననం, శ్రీరామ ప్రవాసము, శ్రీరామ ఉద్యోగము, శ్రీరామ విజయము, శ్రీరామ అశ్వమేథము అని అయిదు నాటకాలుగా రామాయణాన్ని ద్రోణంరాజు సత్యనారాయణ రచించాడు.

3. రాముడి ఔన్నత్యం, రావణుని పతన కారణాలు, యుద్ధము ఇతివృత్తంగా పానుగంటి లక్ష్మి నరసింహరావు 'విజయరాఘవము' రచించాడు. ఈయన రామాయణాన్ని ఆధారం చేసుకొని ఎక్కువ నాటకాలు రచించాడు. విజయరాఘవంలో అవాల్మీకాంశాలు రంగనాథ రామాయణం నుంచి గ్రహించి నిల్పాడు. 'పట్టభంగ రాఘవము' - దశరథుడు రాముణ్ణి పట్టాభిషిక్తుని చేయదలచినప్పటి నుంచి భరతుడు పాదుకలు అభిషేకించడం వరకు కథ ఉంది. అందుకే దీనికి పాదుకా పట్టాభిషేకం అనే నామాంతరం ఉంది. అరణ్య కిష్కింధ సుందర కాండలలోని కథను వనవాస రాఘవంగా రచించాడు. శూర్పణఖ వృత్తాంతం నుంచి లంకలోని సీత జాడ హనుమంతుడు చెప్పే వరకు ఉన్న ఇతివృత్తం ఇందులో ఉంది. పానుగంటిదే మరో రచన కళ్యాణ రాఘవము. పుత్రకామేష్టి జరిపే దశనుండి రామలక్ష్మణులు విశ్వామిత్రునికి సహకరించే వరకు కథ ఇందులో ఉంది. పానుగంటి రామకథను నాటకాలుగా వ్రాసిన సందర్భంలో కవి రసపరవశుడైనట్లు గమనింపవచ్చు. రాముడు ఆవేశవశుడై రామ కథ నాటకాలుగా వ్రాశాడు. శ్రీరామ విజయం వెంకటరమణరావు రచించాడు. పాదుకా పట్టాభిషేక ఇతివృత్తాన్ని దాసు నారాయణరావు వ్రాశాడు. విచిత్రపాదుకా పట్టాభిషేకం కర్తజనమంచి శేషాద్రిశర్మ.

4. రాముడి తర్వాత సీత ప్రాధాన్యం గల నాటకాలు అధికంగా కనిపిస్తాయి. 1890లో చిలకమర్తి లక్ష్మి నరసింహం 'సీతాకళ్యాణం' రచించాడు. 1916లో జనమంచి శేషాద్రి శర్మ 'సీతాస్వయంవరాన్ని' నాటకీకరించాడు. దుర్భాక రాజశేఖర శతావధాని 'సీతాపహరణం' విరచించాడు.

5. ఇతర రామాయణ కథలు : 'సుగ్రీవ పట్టాభిషేకా'న్ని ధర్మవరం కృష్ణమాచార్యులు రచించాడు. ఇదే పేరిట కస్తూరి సుబ్బారావు వ్రాశాడు. రామాయణంలో ఉదంతం రాముడి వల్ల శాపవిమోచనం పొందిన అహల్య కథ. దానిని 'అహల్య'గా 1933లో సెట్టి లక్ష్మీనరసింహం రచించాడు. 'అహల్యా శాపవిమోచన' నాటకాన్ని గూడూరి రామనారాయణ కవులు విషాదాంతంగా రచించారు.

సీతారాముల పుత్రులు కుశలవులు. వీరిని ప్రధాన పాత్రలుగా తనుకొని కె.సుబ్రహ్మణ్యశాస్త్రి 1915లో 'లవకుశ' కాశీనాథుని వీరమల్లయ్య 'కుశలవ' రచించారు. లంకా దహనఘట్టాన్ని 'లంకాదహనం' పేరిట కాశీనాథుని వీర మల్లయ్య వ్రాశాడు. ఇదే పేరుతో 1907లో పసుమర్తి యజ్ఞనారాయణ శాస్త్రి రచించాడు.

త్రిపురనేని రామస్వామి చౌదరి 'శంబుక వధ' నాటక సాహిత్యంలో వైశిష్ట్యం కల నాటకం. నవీన పంథాలో ఉన్న రచన. సంప్రదాయం రామాయణం రచనకు భిన్నంగా ఉన్న రచన. వర్ణాశ్రమ ధర్మాలను నిల్పడానికి రక్షణ కోసం వశిష్ఠాదుల ప్రేరణతో శూద్రుడైన శంబుక మహర్షిని రాముడు చంపడం ఇందులోని కథ.

2.3. శైవ చరిత్ర : నన్నయ భారతం వైష్ణవ ధర్మవ్యాప్తి కలిగించటానికి మాత్రమే కాక, శైవ జైన బౌద్ధమత వ్యాప్తి తగ్గించటానికి కూడా ఉద్దిష్టమయినప్పుడు, దేశంలోని మతాలలో శైవం పూనుకొని తన ఉనికిని కాపాడటానికి సాహిత్యాన్ని ఆశ్రయించటం గమనింపవచ్చు. శైవం పూనుకొంది అంటే శైవ మతానుయాయులు పూనుకొన్నారని, వాళ్ళలో సాహిత్య సృష్టి చేయగల సమర్థులు పూనుకొన్నారని అర్థం. అలా సృష్టించిన సాహిత్య ప్రారంభం, నన్నయ భారతానువాదం వార్త తెలియగానే మొదలయింది. అటువంటి సాహిత్యం సృష్టించిన వాళ్ళలో పాల్కురికి సోమనాథుడు ముఖ్యుడు. ఆయన వ్రాసిన సాహిత్యంలో పండితారాధ్య చరిత్ర బసవ పురాణం ముఖ్యం. బసవ పురాణం పరిశీలన సంబర్భంలో ప్రసక్తమవుతుంది. కాబట్టి ఇక్కడ తదితర శైవ సాహిత్యం గ్రహింపవచ్చు.

శివుడికి ప్రాధాన్యమున్న సాహిత్యం దైవ సంబంధమయిందిగా, శివభక్తులకు ప్రాముఖ్యమున్న సాహిత్యం చారిత్రకమయిందిగా భావించి, శివభక్తుల గాథలను చారిత్రక దృష్టితోనూ, శివతత్త్వాన్ని దైవ దృష్టితోనూ వేరువేరుగా పరిశీలించటమవుతుంది. అంతేకాదు భక్తుల గాథలతో కూడి ఉన్న బసవ పురాణం శబ్ద కారణంగా దైవ సాహిత్య సందర్భంలో పరిశీలనం పొందుతుంది.

కుమార సంభవం నన్నెచోడ మహాకవి అనువదించాడు. కుమార సంభవం తెలుగులో నన్నెచోడుడు చక్కని ప్రబంధమనదగినట్లు అనువదించాడు. శివపురాణం మూలం. ఇదే వృత్తాంతాన్ని స్కంధవాయు బ్రహ్మాండ పురాణాలలోనూ కనిపిస్తుంది. అయితే సంస్కృతంలో ప్రసిద్ధమయిన కాళిదాసు కుమార సంభవంతో దీనికెలాంటి సంబంధం లేదు. ఇందులోని కథా సూత్రం ఇది. కుమార సంభవం ఏడాశ్వాసాల కావ్యం. మొదటి భాగంలో సతిజననం నుంచి దహనం వరకు ఉంటే, తరువాతి భాగమంతా కుమారుని జననానికి నేపథ్యం, జననం, ఫలాపేక్ష సాధించడం విస్తరించి ఉంది. తారకాసుర సంహారార్థం కుమార సంభవం తప్పని సరి అవ్వడం వల్ల కుమార జననానికి దోహదకారిగా ఉన్న నేపథ్యంతో పాటు జననం తారకాసుర వధ ప్రధానాంశాలుగా కుమార సంభవం అవతరించింది.

శైవ సాహిత్యంలో పండిత త్రయంగా ప్రసిద్ధులైన శ్రీపతి, శివలెంక మంచన మల్లికార్జున పండితుడు శివతత్త్వం వివరించే సాహిత్యం సృష్టించారు. శ్రీకాళహస్తి మాహాత్మ్యం స్థానిక చరిత్రే. అయితే మానవ చరిత్రగా కంటే దైవ విషయికంగా దానికి ప్రసిద్ధి. అందువల్ల అది దైవసాహిత్యంలో దైవీయవస్తు సందర్భంలో పరిశీలనం పొందుతుంది. శివదేవయ్య కాకతీయుల మంత్రి. ఈయన పురుషార్థసారం, శివదేవధీమణి శతకం వ్రాశాడు. ఈతని సాహిత్యం శివభక్తి తత్త్వం ప్రచారం కనిపించేదిగా ఉంది.

పాల్కురికి సోమనాథుడు వ్రాసిన బసవోదాహరణం, రగడలు, గద్యలు, శివస్తుత్యాత్మకంగా ఉన్నాయి. ఆయన వ్రాసిన పండితారాధ్య చరిత్ర బసవ పురాణం విస్తృత ప్రణాళికా విలసితాలు. వాటి పరిశీలనం ముఖ్యం. యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకం, చక్రపాణి రంగన వీరభద్ర విజయం, శరభలీలలు, శ్రీ గిరినాథ విక్రమం వంటి అనేక రచనలు, శివుడి దైవత్వం వర్ణిస్తూ రచించారు.

2.3.1. పండితారాధ్య చరిత్ర : ఇది 1160-1240 ప్రాంతాలకు చెందిన పాల్కురికి సోమనాథుడు రచించిన ద్విపద కావ్యం, స్వతంత్ర రచన. పండితారాధ్యుడు జీవిత చరిత్ర ఇది. '.... తనకు ముఖ్యారాధ్య దుర్మత వాత ఖండన, వీర శైవ దీక్షాబోధ, మహిమా ప్రదర్శన, లింగైక్యముల వరకు విపులంగా వర్ణించాడు'. (29) పండితారాధ్యుడు చారిత్రక పురుషుడు. ఈ కావ్యంలో ఎన్నో శివభక్తుల చరిత్రలను జోడించాడు. ప్రధానంగా ఇది చరిత్ర. అయినా చారిత్రక వ్యక్తులకు కొంత మహాత్మ్యం ఆపాదించడం కనిపిస్తుంది. ఇది వీరశైవమత వ్యాప్తికి ఎంతో దోహదమయింది. శ్రీనాథుడు ఇదే కథను పద్యరూపాన రచించాడని ప్రసిద్ధి ఉంది కాని అది ప్రస్తుతం లభించటం లేదు. 'ఇందలి పర్వతప్రకరణమును గ్రహించి నాగులూరి శేషారాధ్యుడు పర్వత పురాణమును వ్రాసినాడు.'(30)

2.3.2. ఉద్భటారాధ్య చరిత్ర : ఇది తెనాలి రామలింగకవి సృష్టి. ఉద్భటుడు ముదిగొండ వంశానికి మూల పురుషుడు. ఈయన శైవుడు. శివభక్తుడు. ఇతని కథే ఈ ఉద్భటారాధ్య చరిత్ర. ఇది మూడాశ్వాసాల కావ్యం. పార్వతీపరమేశ్వరుల విహారాన్ని ఏకాంతాన్ని భంగపరచి పిశాచులు కమ్మని గంధర్వపతి అతని గణం శివుని శాపానికి గురయ్యారు. శాప విమోచనాన్ని ప్రసాదంచమని ప్రార్థించిన వారికి శివుడు పల్లకీపురంలో జన్మించే రాజు మంజుభోజుడు అతనికి గురువుగా వచ్చే ముదిగొండ ఉద్భటారాధ్యుడు కాలగతి పొందినప్పుడు అతని చితాగ్ని ధూమాలవల్ల పిశాచ రూపం పోతుందన్నాడు. గంధర్వ రాజైన చిత్రరథునితో కూడి అందరూ పల్లకీపురం వెళ్ళారు. కొంతకాలం పిమ్మట ఒకనాడు ఆహారం కోసం చిత్రరథుడు వెళ్ళి వచ్చేసరికి పిశాచులంతా శాపవిముక్తులయ్యారు. దుఃఖిస్తున్న అతణ్ణి చూచి మంజునాథుడు శివుడిని ప్రార్థించి విమోచనం కలిగించాడు. శివుడితో వచ్చిన ఉద్భటారాధ్యుణ్ణి మత ప్రచారం చేయమని శివుడు ఆదేశించాడు. అతడు విశ్వనాథుని ఘర్మజలాన అవతరించి ముదిగొండ వంశానికి మూలపురుషుడయ్యాడు. ఉద్భటారాధ్యుడు చారిత్రక వ్యక్తి. ఆయన కథాసాహిత్యంగా అవతరించే సందర్భాలలో కొంత కల్పన కొంత అద్భుతం చోటుచేసుకొన్నాయి.

2.3.3. ప్రభులింగ లీలలు : పిడుపర్తి సోమనాథుడు 'ప్రభులింగ లీలలు' అనే ద్విపద కావ్యం రచించాడు. అల్లమరాజు చారిత్రక పురుషుడు. శివభక్తుడు. అతనికి మహిమలు ఆరోపించి చేసిన రచన ఇది. శివునితో పంతం పట్టి అల్లమరాజును మాయతో వంచించి విఫలమై, ఓటమిని అంగీకరించింది పార్వతి. శివుడు చెప్పిన కారణం గ్రహించిన పార్వతి సాత్త్విక నిర్మల కళను అక్కమహాదేవిగా జన్మింపచేసింది. అక్కమహాదేవి శివుణ్ణికోరి ఆ అన్వేషణలో అల్లమరాజు లీలలు తెలుసుకొని అతనిని వివాహమాడింది. కన్నడంలో అక్కమహాదేవి వచనాలు పేరిట ప్రసిద్ధి పొందిన స్తుతి సాహిత్యం సృష్టించిన కవయిత్రి ఈమె. అందువల్ల అక్కమహాదేవి చారిత్రక స్త్రీగా తెలుసుకోవలసి వచ్చింది. అల్లమరాజు అక్కమహాదేవి చారిత్రక వ్యక్తులే అయినా ఈ కావ్యంలో పాత్రలుగా గోచరమయినప్పుడు కొంత కల్పన కలిసివచ్చింది. ఇదే ఇతివృత్తాన్ని పిడుపర్తి రెండవ బసవన పద్యకావ్యంగా వ్రాశాడు.

2.3.4. అక్కమహాదేవి చరిత్ర: 16వ శతాబ్దానికి చెందిన బాలపాపాంబ ప్రథమాంధ్ర యక్షగాన రచయిత్రిగా పరిశోధకులు నిర్ణయం. యక్షగాన ప్రక్రియ రచనలో స్త్రీ ప్రవేశంపై శైవమతానికి మరో విజయం. అక్కమహాదేవి బసవేశ్వరునికి అల్లమరాజుకు సమకాలిక చారిత్రక వ్యక్తి, శైవమత నిష్ఠకల స్త్రీ. ఆమె కవయిత్రి కూడా. ఒక స్త్రీ రాయటం గమనార్హమైన పరిణామం. ఇందులోని కథ 'పార్వతీ దేవి యొకపరి శివునితో, పంతము పట్టి యల్లమ ప్రభుని దన మాయకు దాసుని జేయ బ్రయత్నించి యది కుదరక శివున సుమతమున దన సాత్విక తేజమున భూలోకమున అక్కమహాదేవి నవతరింపజేసినది. ఆమె ఉడుతడి పురాధీశుడైన విమలుని పుత్రియైనది. ఒక యానవెట్టి జైన నృపాలు నొకని జేపట్టినది. కాని యతడామె కభీష్టమగు లింగధారణము నిరాకరించెను. అంతట నామె యోగావేశమెత్తి తలవిరియబోసికొని నగ్నముగ నగరు వెడలి చరచర పురవీథులు గడచి యడవుల బడి కొండలు కోనలు నడచి కళ్యాణపురి చేరి యటననుభవ మంటపాభ్యంతరమున గొలువు దీరి యున్న అల్లమ ప్రభువును దర్శించి, యతని కఠిన పరీక్ష కాసి యతని వలన యోగరహస్యము దెలిసి శివుని గూర్చి తపము సేయ శ్రీగిరి కరిగెను. పార్వతి తన పంతము విడిచెను'.(31) ఇది వ్యక్తి చారిత్రకమే కాదు శైవ భక్త్యాత్మకం కూడా.

2.3.5. గురునంబి చరిత్ర : శైవభక్తిలో అత్యధికం భక్తి చూపేవాళ్ళను నిదర్శనంగా నిలచిన భక్తుల గాథలు రచనలుగా వెలువడ్డాయి. ఇలాంటి భక్తులలో ఒకడు ఒడియనంబి. ఇతనికి గురునంబి అనే పేరూ ఉంది. వేశ్యాలోలుడు, పరమభక్తుడు. శైవభక్తుడైన ఒడియనంబి వేశ్యశరీరాన్నే శైవ మందిరంగా కొలవడం కథగా అజ్జరపు పేరయలింగం 'ఒడియనంబి విలాస ప్రబంధం' రచించాడు. చారిత్రక వ్యక్తి అయిన ఒడియనంబి చరిత్రను రెగళిగె సిమ్మనాథుడు 'గురునంబి చరిత్ర' పేరిట యక్షగానంగా రచించాడు. బసవపురాణంలో ఈ కథ ఉన్నా, నిమ్మనాథుడు విలాసంలో ఎక్కువ ఉంది. దీనిలోని కథాంశం 'పార్వతీ పరమేశ్వరులు తమ ముకుర ప్రతిబింబములకు బ్రాణ ప్రతిష్ఠ చేయగా సుందరీ సుందరులు అవతరించారు. వారు శాపవశమున భూలోకమున శాసనముమువాయు దేలు తిరునావళూరిలోబుట్టుదురు. సుందరి పరమనాచియను నట్టువకత్తెయగును. సుందరుడు నంబియై వాల్మీకేశ్వరునిచే బెపంబడి పెద్దవాడగును. అతడు పరమనాచిని జూచి మోహించును. వాల్మీకేశ్వరుడేకుంటెన కాడగును. నంబి మంగళూరిలో ననంగ సంగనుబెండ్లాడును. చనిపోయిన తన పేరింట బ్రాహ్మణ బాలకు నొకని బ్రతికించును.

పరమనాచి చంట లింగమూర్తిని బ్రతికించును. తదుప శివుడు ప్రత్యక్షమై నంబి, అనంగసంగ, పరమనాచి, శాసనము రాజులకు, గైలాస కైవల్య ప్రాప్తుల ననుగ్రహించును'.(32)

**2.4.** వైష్ణవ చరిత్ర : వైష్ణవుల చరిత్ర వైష్ణవ చరిత్ర. వైష్ణవులలోని ప్రసిద్ధగాథలు అనేకం; ఆ గాథలను సాహిత్యంగా రూపొందిస్తే అది వైష్ణవ చరిత్ర తెలిపే సాహిత్యం అవుతుంది. విష్ణువు అవతారంగా వెలిసిన ఏ దేవాలయం గూర్చి సాహిత్యం రూపొందించినా

దాన్ని వైష్ణవ చరిత్ర కల్గిన సాహిత్యంగానే గుర్తించటం అవుతుంది. అందువల్ల వైష్ణవ భక్తుల గాథలు ఒక కోవకు చెందగా వైష్ణవాలయ సాహిత్యం మరో కోవకు చెందుతుంది. విష్ణువును అర్చించే ఎనిమిది విధానాలలో కీర్తనం ప్రముఖంగా ఉంది. ఈ కీర్తనం ప్రధానంగా ఉన్న సాహిత్యం వైష్ణవాలయ ప్రాంగణాల నుంచి ప్రభవించింది. వాని పరిశీలన అవశ్యమే.

2.4.1. వైష్ణవ భక్తుల గాథలు : ఎందరో వైష్ణవ భక్తుల గాథలను సాహిత్యం స్వీకరించింది. ముఖ్యంగా పన్నిద్దరాళ్వారుల గాథలు, వైష్ణవ సాహిత్యంలో ప్రముఖంగా ఉన్నాయి. వాళ్ళే కాక వైష్ణవ మత వ్యాప్తికి దోహదపడిన వాళ్ళను గూర్చి కూడా సాహిత్యం అవతరించింది.

2.4.1.1. అముక్తమాల్యద : ఇందులో పెరియాళ్వారనబడే విష్ణుచిత్తుడి గాథ, ఖాండిక్య కేశిధ్వజుల గాథ, యామునాచార్యుడి కథ, గోదాదేవి గాథ, మాలదాసరి గాథ ఉన్నాయి. దీనికి విష్ణుచిత్తుడి పేరు మీదుగా విష్ణుచిత్తీయమని ప్రఖ్యాతి ఉంది. గోదాదేవి శ్రీమహావిష్ణువుకు అర్పించటానికి కట్టిన పూలమాలను తాను ధరించి అందం చూచుకోవటం వల్ల ఈ ప్రబంధం అముక్తమాల్యద అయింది. ఇందులో విష్ణుచిత్తుడి కథ, గోదాదేవి కథ ప్రధానం. వైష్ణవధర్మ ప్రాధాన్యం కోసం మిగతా కథలు ఉపయుక్తమయ్యాయి. ఈ అయిదు గాథలు వల్ల వస్త్వైక్యం కొరవడిందన్న దృష్టితోనూ శ్రీకృష్ణదేవరాయల వ్రాయలేదన్న నిందతోనూ అమూక్తమాల్యద ఉంది కాని ఆ దృష్టిఈ నింద అవిచారమూకాని అనంతరం అవగతమయింది. దీని కథాంశం గురుపరంపరా ప్రభావమనే వైష్ణవగ్రంథం నుండి గ్రహింపంబడింది.

పాండ్యదేశంలో విష్ణుచిత్తుడనే భక్తుడు ఉండేవాడు. ఆ దేశ మోక్షార్థం ఒక సభ ఏర్పర్చాడు. ఆ సభకు విష్ణువు అజ్ఞపై విష్ణుచిత్తుడు వెళ్ళి ఖాండిక్య కేశిధ్వజుల కథ చెప్పాడు. ఈ రాజులిద్దరూ దాయాదులు. రాజ్యం కోసం జరిగిన పోరులో ఖాండిక్యుడు ఓడి అడవికి వెళ్ళాడు. కేశిధ్వజుడు అడవికి వెళ్ళాడు. కేశిధ్వజుడు జ్ఞానయోగం పొంది యజ్ఞం చేయడానికి పూనుకొన్నాడు. బలి పశువును పులి తినడంతో ప్రాయశ్చిత్తం చేయగల తన సోదరుణ్ణి వేడుకొని ప్రాయశ్చిత్తం చేశాడు. దక్షిణగా జ్ఞానయోగాన్ని కోరిన ఖాండిక్యుడికి ఉపదేశించాడు. దాని సాధనతో ఖాండిక్యుడు మోక్షం పొందాడని చెప్పి విష్ణుచిత్తుడు వెళ్ళాడు. ఇతనిలాగే యామునాచార్యుడు రాజును వైష్ణవ భక్తునిలా మార్చాడు. వీరశైవ మతస్థుడయిన రాజును, పండితులతో వాదించి నెగ్గి వైష్ణవ భక్తునిలా మారేటట్లు చేశాడు. యామునాచార్యుడు రాజభోగాలలో తేలాడుతుంటే, శ్రీరామమిశ్రుడనే భక్తుడు శ్రీరంగనాధుడి పాదాలు చూపించగా పూర్వభక్తి పొందాడు. కావేరీ తీరాన స్వామిని సేవించి, మోక్షం పొందాడు. విష్ణుచిత్తుడికి దొరికిన బాలిక గోద. తండ్రి స్వామికి సమర్పించే పూలమాలను తాను ధరించి అందం చూసుకొనేది. మనస్సు శ్రీరంగనిపై నిలిపి కృశించిపోసాగింది. ఆమె స్థితి భగవంతుడికి విష్ణుచిత్తుడు మొరపెట్టుకొన్నాడు. అతడికి విష్ణువు మాలదాసరి కథ చెప్పాడు. ఇతను రోజూ ఆలయానికి వెళ్ళి కీర్తనలు చేసేవాడు. పొరపాటున అర్ధరాత్రి బయలు దేరిన దాసరిని బ్రహ్మరాక్షసుడు తినబోగా దేవుని కీర్తించి వచ్చాక తినమని

ప్రాథేయపడి వెళ్ళి, తిరిగి వచ్చాడు. దాసరి సత్యవర్తన చూచి, అతణ్ణి అర్థించిన రాక్షసుడికి తనపూజా ఫలంలో కొంత ఇచ్చి రాక్షసత్వాన్ని పోగొట్టాడు. అది విన్న భూదేవి గానఫలంతో శ్రీరంగడిని పొందాలని గోదగా జన్మించిందని ఆమెను శ్రీరంగం తీసుకొని వెళ్ళమని చెప్పాడు. అక్కడ ఇరువురికి వైభవంగా వివాహం జరిగింది.

2.4.1.2. పన్నిద్దరాళ్వారులు :1545లో తాళ్ళపాక చిన్నన్న 'పరమయోగి విలాసము' అనే ద్విపద కావ్యం వ్రాశాడు. వైష్ణవమతంలోని పన్నిద్దరాళ్వారులనే భక్తుల చరిత్ర ఇది. దీన్ని 1564లో సిద్ధరాజు తిమ్మరాజు రచించాడు చంపూ కావ్యరూపంలో ఇది తిరిగి ఎనిమిదాశ్వాసాల ద్విపద కావ్యంగా పెదపాపనాయకుడు రచించాడు.

2.4.1.3. విప్రనారాయణ గాథ : పన్నిద్దరాళ్వారులలో ప్రసిద్ధుడు విప్రనారాయణ. ఈ విప్రనారాయణ చరిత్రను 1580లో చదలువాడ మల్లన రచించాడు. 'చదలువాడ మల్లన విప్రనారాయణ చరిత్రకు మూలం తాళ్ళపాక చిన్నన్న ద్విపద పరమయోగి విలాసము నాల్గవ ఆశ్వాసము నందలి విప్రనారాయణుని కథ'. (33) భక్తి ప్రధానమైన ఈ రచనలో దృఢచిత్తం కలవాడు కూడా ఎప్పుడో ఒకప్పుడు చలించటం సహజం అనే సూచన ఉంది. 'చిన్నన్న చేసిన కథనాన్ని సిద్ధిరాజు తిమ్మరాజు కుదించాడు. మల్లన పెంచి కొన్ని మెరుగులు పెట్టాడు'.(34) ఇదే కథను గ్రహించి సారంగు తమ్మయ్య (1600) 'వైజయంతి విలాసం' అనే నాలుగు ఆశ్వాసాల కావ్యం రచించాడు. కథ అంతా సాధరణమే అయినా, విప్రనారాయణ చరిత్రను మెరుగుపెట్టటానికి ఇందులో స్వప్న వృత్తాంతాన్ని చేర్చాడు.

విప్రనారాయణ కథను యక్షగానంగా కూడా కవులు రూపొందించారు. చక్రపురి రాఘవాచార్యుడు 'విప్రనారాయణ చరిత్ర'ను రచించాడు. ఇందులో కథ ప్రసిద్ధం. దీన్ని 'భక్తాంఘ్రిరేణు చరిత్రం' పేరిట ఉత్తర రంగకవి వ్రాశాడుదిది విప్రనారాయణుడి కథే. 'అతడఉపమున తొండరడిప్పొడియాళ్వారని వ్యవహృతుడు 'తొండరడిప్పొడి'కి సమానార్థమే భక్తాంఘ్రిరేణువనగా'. విప్రనారాయణ చరిత్రను యక్షగానంగా 17వ శతాబ్దంలో విజయరాఘవ నాయకుడు రచించాడు. అయితే తన రాజ్యంలో జీవించినట్లు, మన్నారుగుడిలో కథ జరిగినట్లు సుదీర్ఘ ద్విపదలతో చెప్పాడు. ఈ కథ నాటకంగా ప్రఖ్యాతి పొందింది. దీన్ని నాటకంగా పానుగంటి లక్ష్మీనరసింహారావు రచించాడు. ఆనందోదయం పేరిట 1909లో ద్వివేది బ్రహ్మానందశాస్త్రి నాటకీకరించాడు. 'వాసంతి పరిణయం'గా పట్టాభిరామశాస్త్రి నాటక రూపమిచ్చాడు.

2.4.1.4. కుముదవల్లీ విలాసం : పన్నిద్దరాళ్వారులలో ఒక దివ్యసూరి పరకాలుడు కుముదవల్లి అనే స్త్రీని మోహించి వివాహమాడాడు. అతడు రాజుకు వ్యతిరేకంగా యుద్ధం చేసి రాజ్యబహిష్కృతుడయ్యాడు. వైష్ణవులకు సంతర్పణ చేయడానికి దొంగతనాలు చేసేవాడు. విష్ణుకార్య నిమిత్తం కనుక అవి అధర్మం కాదని కుముదువల్లి నమ్మకం. ఇతడు విష్ణువు అంశ. 'అతణ్ణి తమిళ భాషలో తిరుమంగైయాళ్వార్ అంటారు. అతని భార్య లక్ష్మీదేవి అవతారమే. ఆమె పేరు కుముదవల్లి'.(36) 'కుముదవల్లీ విలాసము' పేరిట ఈ అళ్వారు చరిత్రను పోనుగోటి జగన్నాథ రాయలు యక్షగానంగా రచించాడు.

2.4.1.5. తిరుమంగయాళ్వారు : వైష్ణవ భక్తులైన పన్నిద్దరాళ్వారులలో తిరుమంగళార్వారు ప్రసిద్ధుడే. ఈ తిరుమంగళార్వారు చరిత్రలో అతని పూర్వ చరిత్రను కోవెల తిరువేంగడ దాసు, అదే పేరిట పరాశరం శేషాచార్యులు యక్షగానం రచించారు

కొత్తూరు రంగనాయకమ్మ 'ఆండాళు చరిత్ర'ను రచించింది. 'ఆండాళనగా పెరియాళ్వారగు విష్ణుచిత్తుని పుత్రిగా, చూడికుడుత్త నాంచారు లేక అముక్తమాల్యదగా బ్రసిద్ధి వడిసిన గోదాదేవి. ఆమె చరిత్ర మిందు వర్ణితము. ఇందళ్వరుల చరిత్రము గూడ గొంత చెప్పబడినది'.(37)

2.4.1.6. యక్షగాన సాహిత్యం : విశిష్టాద్వైత మతస్థాపకుడు రామానుజాచార్యుడు. ఇతని జననం నుంచి సన్యాసాశ్రమమం దాకా కాట్రంబాక కేశవాచార్యులు 'రామానుజ విజయం'గా రచించాడు. కాంచీపురాధిని పట్టమహిషి వద్ద విశిష్టాద్వైతం పై ఉపన్యసించడం, పెరుమాళ్ళు మారు రూపున రావడం కథగా పణిహారం ఎంబారయ్య 'కొరవంజి' రచించాడు. భద్రాచల వాస్తవ్యుడు, రామభక్తుడు, భద్రాచల రామదాసుగా ప్రసిద్ధి గాంచిన కంచెర్ల గోపన్న చరిత్రను 'రామదాసునాటకం'గా మాడ అప్పలస్వామి రచించాడు. అదే పేరిట కేశిరాజు వెంకటసుబ్బరాయకవి రచించాడు. అనుముల కొండలో సమాధి అయిన శివరామబ్రహ్మేంద్రస్వామి చరిత్రను గోనుగుంట వీరబ్రహ్మం 'శివరామ నాటకం'గా వ్రాశాడు.

2.4.1.7. మునివాహనుడు : వైష్ణవ మతంలోని ప్రసిద్ధులైన ఆళ్వారులను గూర్చి కావ్య యక్షగాన నాటక సాహిత్యం అవతరించింది. అధునిక కాలంలో ఆళ్వారులలోని 'తిరుప్పాణ్'ను గూర్చి కొలకలూరి ఇనాక్ 'మునివాహనుడు' నాటకం వ్రాశాడు. అస్పృశ్యుడైన తిరుప్పాణ్ శ్రీరంగంలోని రంగనాథుణ్ణి సేవించటానికి ఆరాటపడుతుండేవాడు. పూజారి లోకసారంగముని తిరుప్పాణ్‌కు ఆలయ ప్రవేశం నిరాకరించటం వల్ల, శ్రీమహావిష్ణువు ఆలయ ప్రవేశం అంగీకరించటం వల్ల దానికి తోడు ఆలయం మైలపడకుండా ఉండటానికి పూజారి అయిన లోకసారంగమునితో శ్రీరంగనాథుడు తిరుప్పాణ్‌ని మోసి తీసుకొని రమ్మనటం వల్ల దేవుడి ఆదేశాన్ని పూజారి నిర్వహించాడు. తిరుప్పాణ్‌ని లోకసారంగముని దేవలయంలోకి మోసి తీసుకొనిపోవడం వల్ల అతడు మునివాహనుడు అయ్యాడు. హరిజనులకు దేవాలయ ప్రవేశం అనే ఆధునిక దృక్పథం, ప్రాచీన సంప్రదాయబద్ధంగా ఉందని గుర్తించే విధంగా ఈ నాటకం అవతరించింది.

విష్ణుభక్తులను వైష్ణవమత ప్రచారకులను గూర్చి తిరుమల తిరుపతి దేవస్థానం అనేక గ్రంధాలను ప్రచురించింది. ప్రచురణకు ప్రోత్సహించింది. మహాత్మాగాంధీ వైష్ణవ దృక్పథం విశేష సాహిత్య సృష్టికి కారణమయింది. తెలుగులో విష్ణుభక్తి సాహిత్యం విస్తృతంగా ఉంది.

2.4.2. కీర్తనం : విష్ణుభక్తిలో కీర్తనం ముఖ్యం. కీర్తనం వచనంగా సంకీర్తనంగా కీర్తనగా పాటగా, విష్ణుభక్తిమయంగా పొందింది. విష్ణుదేవాలయ నేపథ్యం నుంచి ఈ సాహిత్యం అవతరించింది. విష్ణుభక్తి ప్రకటనలకు కీర్తనం గ్రహించే ముందు వచనం

స్వీకరించటం, వచన రచనలో కన్నడ వచనాల ప్రాధాన్యం అంతకు ముందే ఉండటం, అక్కమహాదేవి వచనాలు ప్రసిద్ధి పొంది ప్రచారం కావటం శైవ సాహిత్య సంప్రదాయ లక్షణంగా వచన రీతి ఉండటం గ్రహించిన వైష్ణవధర్మనులు వచన సాహిత్యం గ్రహించారు. వచనం గీతి మాధుర్యం పొంది, గానయోగ్యత కలిగి, దేవాలయంలో పాడటానికి ఉద్దేశింపబడి ప్రతిదినం పాడబడిన సాహిత్య రూపంగా ఇది విశేష పరిణామం చెందింది.

2.4.2.1. సింహగిరి నరహరి వచనములు : 'విష్ణునామ సంకీర్తన ఫలము' అని నామాంతరం ఉన్న సింహగిరి నరహరి వచనముల కర్త కృష్ణమాచార్యులు. దీనికి కృష్ణమాచార్య సంకీర్తనలని, కృష్ణమాచార్య పదాలని కూడా పేర్లున్నాయి. వీటిని తాళగంధి చూర్ణకలనీ అంటారు. కృష్ణమాచార్యుడు (క్రీ.శ.13వ శతాబ్దం) వైష్ణవ మతావలంబి. వీటిని వైష్ణవ మతాచార్యుడు రామానుజాచార్యుని ప్రభావంతో వచనములు రచించాడని పండితుల ప్రతీతి. ఇతడు చతుర్లక్ష వచనములు వ్రాశాడని పేర్కొంటున్నా లభిస్తున్నవి మాత్రం అత్యల్పం. పదకవితా పితామహుడు, వచనా సంకీర్తనా పితామహుడిగా ప్రఖ్యాతి గాంచిన కృష్ణమాచార్యుడు వచన సంకీర్తనలు కాక తులసీ మాహాత్మ్యం, నృసింహ నామాలు రామనామ సంకీర్తనం, రామనామాలు గానయోగ్యంగా రచించాడు.

ఇతడు స్తోత్రవచన కావ్యరచనకు తెలుగు మూలపురుషుడు. ఇతని తర్వాతే స్తోత్రరచన అధికమయింది. అన్నమాచార్యుల వంటి వారికి మార్గదర్శకుడయ్యాడు. విష్ణునామాన్ని, మత సిద్ధాంతాన్ని, భక్తుల ఆర్తివి, చరిత్రను రామాయణ భాగవతాది కథలను ప్రతిపాదించే పదాలు కృష్ణమాచార్యుల సాహిత్యంలో అధికంగా ఉన్నాయి. సింహగిరి నృసింహస్వామి తలచి చేసినట్టి ఇతని రచన ఎక్కువగా వైరాగ్య పూరిత భక్తిని ప్రతిపాదించింది. ఈ వచనాలు వేదాంత ధోరణిలో నడిచాయి. కృష్ణమాచార్యులు కులాలను నిరసించాడు. మానవ తరతమ బేధాలకు ప్రాముఖ్యం ఇవ్వలేదు. 'విష్ణుభక్తి లేని విద్వాంసుని కంటెను 'హరికీర్తనము సేయు నతడె కులజుండు' అని హరిభక్తి కలిగినవాడే ఉన్నతుడని చెప్పాడు. ఇదే ధోరణి తర్వాతి సంకీర్తన కర్తల్లో గోచరమవుతుంది.

2.4.2.2. వేంకటేశ్వర వచనములు : తాళ్ళపాక పెదతిరుమలయ్య కృష్ణమాచార్యుని వచన రచనా రీతికి వారసుడు. కృష్ణమాచార్యుడి తర్వాత పేర్కొనదగ్గవాడు తిరుమలాచార్యుడు (1468-1553).సింహగిరి వచనముల తర్వాత చెప్పుకోదగ్గవి శ్రీ వేంకటేశ్వర వచనాలు. వీటిని వేంకటేశ్వర విన్నపాలు, వైరాగ్య వచన మాలికా విన్నపాలు అనికూడా అంటారు. ఇతవి రచనలో మకుటం అన్ని వచనాలలో సమానంగా ఉంటుంది. సింహగిరి వచనాలలో ఇది కనిపించదు. ఇందులో సంబోధన కొన్ని సార్లు ముక్తపదగ్రస్తంగా దేవా, చక్రపాణి, స్వామి అని మరికొన్ని సార్లు కనిపిస్తుంది.

ఇవన్నీ దేవుడికి మానవుడు, భగవంతుడికి భక్తుడు చేసుకొనే విన్నపాలు. ఇవి దాదాపు 166 లభించాయి. ఇందులో ముద్రితమైనవి తక్కువ. ముద్రితం కావలసినవి అనేకం. '.... మరికొన్ని వెలుతురు చూడవలసివున్న శ్రీ వేంకటేశ్వర వచనములున్నాయి. అవి భక్తులకానందం కలిగించేవిగా, వచనమార్గం తెలిపేవిగా ఉన్నాయి.' (38)

కృష్ణమాచార్యుల, తిరుమలాచార్యుల రచనలకు ప్రాతిపదిక వైష్ణవ మతమే. సింహాచల నృసింహస్వామి కృష్ణమాచార్యుల సింహగిరి వచనములలో స్తుతి పొందితే తిరుపతి వేంకటేశ్వర స్వామి వేంకటేశ్వర వచనాలలో స్తుతి పొందాడు. రెండూ దేశంలో పూజలందే దేవుళ్ళ స్తుతి గీతాలే.

2.4.2.3. ఇతర వచనాలు : విష్ణుభక్తి ప్రధానమైనవి వచనాలే. ఇవి విష్ణుపారమ్యం చాటేవిగా దేవుడి పట్ల మానవుడి భక్తి చాటేవిగా ఉన్నాయి. 13వ శతాబ్ది నుంచి 18వ శతాబ్ది దాకా విస్తరించిన కావ్యప్రక్రియ'విస్తృత రచనలకు దోహదం కాకుండానే ఆగిపోయింది. గద్యరీతిలో ఉన్నా గీతి మాధుర్యం ఉండటం వీటి ప్రత్యేకత. భగవద్భక్తి సంబంధాలు చెప్పే వచనాలు కేవలం విష్ణు పరిమితం కాకుండా కొంత శైవాన్ని కూడా తనలో నింపుకొంది. భవానీ మనోహర వచనములు, కాశికా వచనములు, గాంగాధరయ్య వచనములు ఈ కోవకు చెందినవి. వచనాలుగా పేరుగాంచినప్పటికి ఇంకా లభ్యం కావలసిన రచనలు కొన్ని ఉన్నాయి. అవి '1.గంగాధరయ్య వచనములు, 2.లక్ష్మీవల్లభ వచనములు, 3.కాలజ్ఞాన వచనములు, 4.శఠగోప విన్నపములు, 5. శేషగిరినాథ విన్నపములు (శేషగిరినాథ వచనములు అని నామాంతరం),6.ఉత్తర గోపుర వచనము, 7. ఏగంటి వారి వచనములు, 8. తోటవారి వచనము, 9. గొడుగుల వచనము, 10.బ్రహ్మాండ వచనము, 11.రావణ వచనము, 12.లక్ష్మయ్య గారి వచనము, 13. వనవిహార వచనము, 14. 34 విన్నపాలు, 15.లింగైక్య వచనము, 16. చిలకపాటి వారివచనము, 17. యతి రాజశేఖర వచనములు ఉన్నట్లుగా గ్రంథాలయ పుస్తక వివరణ గ్రంథాల వల్ల తెలుస్తున్నది.'(39) ఇవి లభిస్తే వచనముల పట్ల సాహిత్య దృక్పథం కొంత విశాలమయ్యే అవకాశముంటుంది.

2.4.2.4. సంకీర్తనలు : వేంకటేశ్వరుని స్తుతించిన తాళ్ళపాక అన్నమాచార్యుడు (1425-1513) 32వేల సంకీర్తనలు రచించినా, 14వేలు మాత్రమే తిరుమల దేవస్థానం వారి వల్ల లభిస్తున్నాయి. కేవలం సంకీర్తనలే కాక పన్నెండు శతకాలు, సంస్కృతంలో వెంకటాచలమాహాత్మ్యం, సంకీర్తన లక్షణం, శృంగార మంజరి, ద్విపద రామాయణం వ్రాశాడు.

పదకవితా పితామహుడయిన అన్నమయ్య విష్ణుభక్తుడు. విశిష్టాద్వైత సిద్ధాంతవాది. ఇతని దృష్టిలో విష్ణువే గొప్పవాడు. 'విష్ణువొక్కడే విశ్వాత్మకుడు వైష్ణవమే సర్వంబును' తక్కిన ఏదైవమైనా విష్ణువు తరువాతి వాడే. అనేక క్షేత్రాలు దర్శించి సంకీర్తనలు రచించాడు. అన్నమయ్య, స్వామినీ,సాహిత్యాన్నీ, పదరూపంలో ప్రజల దగ్గర చేశాడు. వైష్ణవ మత సిద్ధాంత వ్యాప్తికి పదాన్ని వాడుకొన్నాడు. దాన్ని ప్రచారం చేయడానికి వివిధ వృత్తులను ఉపయోగించుకొన్నాడు.

'.... వారి వృత్తి విశేషాల్నే ఆధారంగా తీసుకొని భగవదాంశాల్ని ప్రబోధిస్తూ సంకీర్తన రచన గావించాడు. ఈ వృత్తి పాటల్లో వర్తక వ్యాపారానికి సంబంధించిన నేత బేహారి, వడ్డీ వ్యాపారి వైద్యుడు, పూత వృత్తుల వాళ్ళు, చల్ల అమ్మకపు గొల్లెత, సోదె చెప్పే ఎరుకత, కుమ్మరి మొదలైన వృత్తుల విశేషాలు కనిపిస్తాయి'.(40) ఈ వృత్తుల వారి సంచార జీవనం ఇందుకు సహకరించింది.

ఇతని సంకీర్తనలలో కుల నిరసన కనిపిస్తుంది. వర్ణవ్యవస్థ ఆధారంగా నిర్మితమైన సమాజానికి దేవుడికి ఏ కులం పట్టింపులు లేవని ఉద్బోధ చేశాడు. 'కులమెంత గలిగెనది కూడించు గర్వంబు చలమంత గలిగెనది జగడమే రేచు' అని తన అనిష్టతను వ్యక్తం చేశాడు. కులం ప్రాముఖ్యం లేదని 'ఎక్కువ కులజుడైన హీనకులజుడైన నిక్కమెరిగిన మహానిత్యుడే ఘనుడు'. జ్ఞాని అయినవాడే ఉత్తముడని 'ఏ కులజుడేమి యెవ్వడైననేమి ఆడనాడకతనే హరి నెఱింగినవాడు' హరి తెలుసుకొన్నవాడే ఉన్నతుడని పేర్కొన్నాడు.

వైష్ణవ కవుల తాదాత్మ్యగుణం, మధుర భక్తికి మరో తార్కాణం అన్నమయ్య మధురభక్తి కవే అయినా భక్తిని పదకొండు విధాలుగా తెల్పాడు. 'హరియే పర దైవమని హరి కంటే ఇతరులు లేరని వాదించి ఒప్పించుట ఉన్మాద భక్తి. హరినే కొలుచుట కోరికతో ఇతర దైవమును ప్రార్థించకుండుట పతివ్రతా భక్తి. ఆత్మతత్త్వము తెలుసుకొనుట విజ్ఞాన భక్తి. దేవుని లీలలను పాడి, విని కోరికతో నెఱవు స్మరించి ఆనందపడుట ఆనందభక్తి. వీర శైవుల వలె శరీరాంగములను శిరస్సును సమర్పించుట రాక్షసభక్తి. హరిదాసులను సేవించుట ఉత్తమమైన తురీయ భక్తి. భక్తి తామస భక్తి నారాయణుడు తప్ప యితరులు లేరని అతడే గతియని నమ్ముట వైరాగ్యభక్తి తన పూజ తప్ప హరియితరము మెచ్చుడని స్వతంత్రించుట రాజస భక్తి. శరణాగతి నిర్మల భక్తి. కైంకర్యము నిజభక్తి అనగా భగవంతునికై సర్వము కైంకర్యము చేయుటయే నిజమైన భక్తి'. (41) అని భక్తి విధాలను అన్నమయ్య వ్యక్తం చేశాడు.

అన్నమయ్య పుట్టుకతో బ్రాహ్మణుడు. జన్మస్థలం తాళ్ళపాక అయినా, జీవితమంతా తిరుమలేశుని పాదాల వద్దే గడచింది. అయితే తాళ్ళపాకలో ఉన్న కాలంలో కుటుంబ వృత్తి వ్యవసాయం. ఇతర బ్రాహ్మణులలా కాక జనంతో కలసి, జనంతో ఒకడుగా జీవించే స్థితి అన్నమయ్య జానపదుణ్ణి చేసింది. కనుకనే ఇతని సంకీర్తనలలో జానపద లక్షణం అధికం. పదమే దేశీ సంప్రదాయం. పదానికి జానపదాన్ని జోడించి మరింత సజీవత్వాన్ని ఇచ్చాడు.

అదివో అల్లదివో అంటూ, చందమామ రావే అంటూ ఆంధ్రులలో నిలిచి పోయేటట్లు వేల సంఖ్యలో పదాలను రాసిన అన్నమయ్య సంకీర్తనల రంగంలో ఎదురులేని కర్తగా నిలిచాడు. తర్వాత వచ్చిన కవులందరూ ఆ సంకీర్తనలకు కొనసాగింపు చేశారు తప్ప అన్నమయ్యకు ధీటుగా నిలువలేకపోయారు. అయితే వేంకటేశ్వరుణ్ణి స్తుతించిన కవులు కేవలం తాళ్ళపాక వారే. అందులో ముఖ్యుడు అన్నమాచార్యుడే. అతడి స్తుతి సంకీర్తనాక్షర స్వరూపమే.

2.4.2.5. ఇతర సంకీర్తనలు : అన్నమాచార్యుని పిమ్మట సంకీర్తనకారులుగా అతని కుటుంబ సభ్యులే నిలుస్తారు. అందులో ముఖ్యంగా పెద తిరుమలయ్య (1460-1564) చిన తిరుమలయ్యలు. కొడుకు మనుమలు ఇద్దరూ సంకీర్తనా స్రష్టలే. పెద తిరుమలయ్య శృంగార, అధ్యాత్మిక సంకీర్తనలు వ్రాస్తే చిన తిరుమలయ్య అధ్యాత్మిక శృంగార కీర్తనలు రచించాడు. తాళ్ళపాక వంశస్థులు అనేకులు పదకవులు. సాహిత్య స్రష్టలు.

తిరువాయూరు ప్రసిద్ధులలో ఒకడు ముత్తుస్వామి దీక్షితుడు, సంస్కృతంలో ప్రఖ్యాతి గాంచితే, శ్యామాశాస్త్రి (1762-1827) సంస్కృతాంధ్ర ప్రావీణ్యుడు. కామాక్షి అర్చకుడు. కామాక్షీ దేవిని స్తుతించాడు. సంగీత సరస్వతి సమర్థంగా కృతులు రచించాడు. మధుర తప్ప ఏ క్షేత్రాలనూ దర్శించలేదు. ఏ ప్రాంతాలు దర్శించకపోవటం, దేవీ పూజ చేయటం, ఇతనికి తక్కిన వారిలా తగినంత ప్రాముఖ్యం రాకపోవడానికి ప్రచారం లేకపోవడానికి కారణం.

2.4.2.6. క్షేత్రయ్య : క్షేత్రయ్య అసలు పేరు మువ్వ వరదయ్య అని, కృష్ణా జిల్లా దివి తాలూకు వాడని పండిత లోకం అంగీకరించిన సత్యం. ఇతని కాలం 1600 సంవత్సరాల నుంచి 1680 వరకు అన్నది కూడా అంగీకరింపబడిన విషయమే. 'తేనె కన్నా మధురంగా, వానకన్నా చల్లగా, గాలి కన్నా స్వేచ్ఛగా పాటపాడిన దంతా పచ్చి బంగారం చేసే పాటవిక శిఖామణులను ఎన్నిసార్లు లెక్కపెట్టినా క్షేత్రయ్య ఒక్కడే గణనకు వస్తాడు. అతడు భక్తులలో పెద్ద భక్తుడు; రసికులలో మొదటి రసికుడు'.(42) భక్తి శృంగారాలను రెండింటిని కలిపి ముడిపెట్టి పదాలు చెప్పిన వైష్ణవ కవి. ఇతడి మువ్వ గోపాల పదాలు శృంగార ప్రధానాలు. ఇతని పదాలు 4000 అయినా 400 మాత్రమే లభించాయని తెలుస్తూ ఉంది.

ఇతడు విజయరాఘవ నాయకుడికి సమకాలికుడు. విజయరాఘవ నాయకుడు క్షేత్రయ్యతో ఎన్నో పదాలు చెప్పించుకొన్నాడు. ఇతడు సంచరించిన ప్రాంతాలలో తంజావూరు కూడా ఉంది.

తానను భవించిన ఆనందాలను తనకు గోపాలునకు అనువర్తింపచేసి శృంగార పూరితంగా పదాలను రచించిన మధురభక్తి క్షేత్రయ్యది. ఇతడు వేణుగోపాలస్వామి భక్తుడు కనుకనే తన సృజనాత్మకతను పద సాహిత్యం ద్వారా వ్యక్తం చేశాడు. ఇతడు ఎన్నో ప్రదేశాలు సందర్శించాడు. దాదాపు 18 క్షేత్రాలు పర్యటించాడని ప్రతీతి. పర్యటించిన ప్రాంతాలన్నిటిని పదాలలో ప్రతిబింబించాడు. అనేక క్షేత్రాలను దర్శించాడు. కనుకనే క్షేత్రయ్య అనే పేరు ఏర్పడింది.

అతని రచనలో వైశిష్ట్యం, ఇతర పదకర్తల నుంచి వేరుచేసే లక్షణం, పదానికి ఉన్న అభినయ ప్రాముఖ్యం. సంగీత సాహిత్య సముచితంగా పదకీర్తనలు ఉంటాయి కానీ 'అతని పదములలో సంగీతము, సాహిత్యము, అభినయము, మూడింటికి ప్రాముఖ్యముంటుంది'.(43) 'రారా నా స్వామి రారా' ఓ మంచి ఉదాహరణ. పదానికి శృంగార స్పర్శ ఉంటుంది. అది పరిపాటి. కాని శృంగారపూరితంగానే పదం రాయడం క్షేత్రయ్య ప్రత్యేకత. క్షేత్రయ్య పదాలు గొప్పతనాన్ని విస్సా అప్పారావు విశేషంగా కృషి చేసి చాటాడు.

అన్నమయ్య ప్రభావం క్షేత్రయ్యపై ఉంది.. ఈ సామ్యం శృంగార కీర్తనలలో స్పష్టం. అన్నమయ్యది అశేష కృషి అయితే క్షేత్రయ్యది విశేష కృషి. 'అన్నమయ్య శృంగార సంకీర్తన రచనాంశం క్షేత్రయ్య అనడం సబబు'.(44) క్షేత్రయ్య పదాలలో

శృంగారం అధికం. అయితే '...ఆ పదాలలో ఉదాత్త ప్రేమ, ఉత్కృష్ట కవితా మాధుర్యం, లలితమైన దేశీ పదజాలం, సుందర శబ్దరచనం మిక్కుటంగా కనిపిస్తుంది'.(45)

ఎక్కడ ఉన్నా, ఏ ప్రాంతానికి చెందినా, ఏ కాలపు వాడయినా క్షేత్రయ్య పదాలకు అనన్య వ్యాప్తి లభించింది. దీనికి కారణం పెదాలపై ఆడే శక్తి పదానికి ఉండడం, భక్తి శృంగారాత్మకంగా వ్యక్తం కావటం, సాహిత్య ప్రతిభ ఆ రచనలో ప్రస్ఫుటం కావడం మాత్రమే కాదు, క్షేత్ర సందర్శనాభిలాషతో తనకు తాను తెలిసో తెలియకో సాధించిన వ్యాప్తి, వెళ్ళిన ప్రతిచోట పదాలు పదిలపరచి రావడం. అనేక క్షేత్రాలు తిరగడం వల్ల ఎన్నో ప్రాంతాలు క్షేత్రయ్య పదాలు నిలిచిపోయి ప్రచారం లభించింది. తన పదాల వ్యాప్తికి ప్రత్యేక పరోక్ష కారకుడు తానే.

2.4.2.7. రామదాసు : భద్రాచల రామదాసుగా పేరుగాంచిన కంచెర్ల గోపన్న (1620-80) తెలంగాణా వాస్తవ్యుడు. అక్కన్న మాదన్నల బంధువు. బాల్యం నుంచి రామభక్తి అలవడింది. రఘునాథ భట్టాచార్యుల వద్ద వైష్ణవం స్వీకరించాడు. కబీరుదాసు వద్ద తారక మంత్రోపదేశం పొందాడు.

రామభక్తి పరాయణుడు రామాశ్రిత భక్తి. ఇతరత్రా ఏ దేవుడిని స్తుతించని కేంద్రీకృత భక్తి రామదాసుది. కృతులను దైవాంకితం చేయడానికి ఇష్టపడ్డాడే కాని రాజులను అంకితానికి తగిన వారుగా భావించలేదు. అవసరార్థం తానీషా పాలకుడి ఆశ్రయంలో ఉన్నప్పటికి రాజాశ్రయం పట్ల అనిష్టిత వ్యక్తం చేశాడు.

వైష్ణవత్వం భాగవతులను సేవించడం ప్రోత్సహిస్తుంది. ఇది విష్ణువుని సేవించిన దానితో సమానం. ఈ సేవా తత్పరుతను వైష్ణవ భక్తిని రామదాసు వ్యక్తం చేశాడు. హరిభక్తులను పేదలను ఆదరించాడు. దానాలు చేశాడు. ఉన్నదంతా వారికి దానం చేయడం వల్ల రాజాస్థానంలో కొలువుకు వెళ్ళవలసి వచ్చింది.

రామదాసు భక్తి ఖరీదయినది. అతడి దేవుళ్ళు ధనవంతులు. రాజు సొమ్మును దైవకార్యాలకు ఉపయోగించాడు. వైభవరహితంగా తన దేవుణ్ణి ఊహించుకోలేకపోయాడు. పర్యవసానంగా రామదాసును రాజు ఖైదులో వేసినా అతనికి భక్తే ప్రధానం అయింది.

రామదాసు సంకీర్తనల్లో కొట్టొచ్చినట్లు కనిపించే లక్షణాలు - ఆర్ద్రత. భక్తి భావం పొంగిపొరలే సన్నివేశాలలో ఇది గోచరమవుతుంది. కొన్నిసార్లు ప్రత్యక్షంగా 'ఏ తీరుగ నను దయజూచెదవో....' అని మరికొన్ని సార్లు వేరొకరితో పరోక్షంగా 'నను బ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లీ...' అని మొరపెట్టుకొన్న సందర్భాలు ఎన్నో.

నీతి గరిపే రచన, వైరాగ్యం వ్యక్తం చేసే భావాలు రామదాసు సంకీర్తనల్లో గోచరమవుతూ ఉంటాయి.

తత్పూర్వం అన్నమయ్య క్షేత్రయ్యలు వైష్ణవ భక్తులే. అయినా వారు శ్రీహరి, మువ్వగోపాలురని సేవించారే తప్ప రామస్తుతి చేయలేదు. వైష్ణవులే అయినా వీరు వివిధ అవతారాలను ప్రజలకు దగ్గర చేశారు. శ్రీరాముణ్ణి రామదాసు ప్రజల వద్దకు తెచ్చాడు. ఆ రాముణ్ణే త్యాగరాజు కూడా సేవించాడు.

2.4.2.8. త్యాగయ్య : 1767లో తిరువారూరు త్యాగరాజు స్వామి అనుగ్రహంతో పుట్టాడు. ఇతని తండ్రి తంజావూరు పాలకుల ఆస్థానంలో ఉండేవాడు. త్యాగయ్యగా ప్రసిద్ధుడయిన త్యాగరాజు (1767-1847) చిన్నతనంలోనే రాముడి పట్ల భక్తిని అలవర్చుకొన్నాడు. ఇతడు భక్తితో రచించిన కృతులు త్యాగరాజు కృతులుగా సాహిత్య సంగీత ప్రపంచాలలో స్థిరమై నిలచాయి.

వైష్ణవ భక్తి కవులలో ఒకడిగా పేరు ప్రఖ్యాతులు గడించిన త్యాగయ్య రామభక్తి పరుడు. ఇతడి రచనల్లో అధికభాగం రామకథాత్మకాలే. ఇతని రచనలో ఎన్నో అవాల్మీకాంశాలు లభిస్తాయి. ఇతడు 24 వేల కీర్తనలు వ్రాసినట్లు ప్రచారముంది. కాని లభ్యమవుతున్నవి కేవలం 600 మాత్రమే.

రాముడి అవతారాన్ని కీర్తించే వైష్ణవ భక్తుడు త్యాగయ్య, భక్తిగీతాల ప్రసిద్ధుడు. అయితే కేవలం వైష్ణవ పదాలనే కాక దైవ సంబంధ సంకీర్తనలనూ వ్రాశాడు. త్యాగయ్య చేసిన దేశ సంచారమే ఇతనిలోని మనోవైశ్యాలానికి కారణం. ఇతర దేవుళ్ళను రాముడి బంధువులుగా చిత్రించడానికి దోహదమయింది. అందరిలోనూ రాముడినే దర్శించసాగాడు. రామభక్తికి పేరు గాంచిన కంచెర్ల గోపన్న ప్రభావం త్యాగరాజుపై ఉంది. రామదాసులాగానే రాజాశ్రయం పట్ల వైముఖ్యం ప్రదర్శించాడు త్యాగయ్య.

ఏ ఇతర సౌఖ్యము రామనామ జప సౌఖ్యంతో సమానం కాదని త్యాగయ్య భావన. జీవతం ఎన్నో విధాల వ్యర్థమవుతుందనీ అజ్ఞానం నుండి బయటపడి రామనామం జపించటం వల్ల కలిగే సౌఖ్యాన్ని అనుభవించమని త్యాగయ్య తెలిపాడు. రాముణ్ణి సేవించడమే అత్యున్నత భాగ్యంగా భావించి 'దొరకునా ఇటువంటి సేవ' అనుకొన్నాడు అన్నాడు.

త్యాగరాజు భక్తి మధుర భక్తి. దేవుడే నాయకుడు తక్కిన సమస్త ప్రపంచం నాయిక. వారిరువురు నడుమ ఉన్న అనురాగాభి వ్యక్తీకరణ మధుర భక్తి. సమాజంలో చెడును ఎత్తిచూపడం, నిరసించటం,' విమర్శించటం, ప్రజల హితం కోరటం కూడా ఇతని రచనలో కనిపించే అంశాలు. త్యాగయ్య కీర్తనలనే కాక ప్రహ్లాద భక్తి విజయం, నౌకా చరితం కూడా రచించాడు.

2.4.2.9. సారంగపాణి : సారంగపాణి ప్రసిద్ధుడు. 1830 ప్రాంతాల వాడు. చిన్నయసూరి సమకాలికుడని పరిశోధకులు నిర్ణయించారు. భక్తి కవి. వైష్ణవ భక్తుడు. ఇతడు కార్వేటినగర పూజితుడు. వేణుగోపాల స్వామిపై దాదాపు రెండు వందల పదాలు రచించాడు. 'ఇతడు తన పదాలను శృంగారం, దేశీయం, జాతీయం, భక్తి వైరాగ్యం అని నాలుగు విధాలుగా విభజించాడు'.(46) ఈ పదాలలో శృంగారం, జాతయ భావన, నీతి బోధలు ప్రధానంగా కనిపిస్తాయి. ఎన్నో నీతులు సత్ప్రవర్తనను నిర్ధేశించే పదాలు చెప్పాడు.

సాధారణంగా వైష్ణవ భక్త కవులందరూ నిరసిస్తూ పేర్కొనే అంశం ఒకటి ఉంది. అది భక్తి లేకున్నా బ్రతుకు తెరువు కోసం సన్యాసి వేషాలు ధరించే వారిని

నిరసించడం. ఈ లక్షణం సారంగపాణిలోనూ కనిపిస్తుంది. సారంగపాణి సంకీర్తనలు సంగీత రహస్యాలకు నిధులుగా గాయకులు భావించారు.

2.5. పల్నాటి వీరచరిత్ర

భారతగాథతో సమాన స్థితిలో ఉన్నందువల్ల ఈ చరిత్రను పల్నాటి వీరభారతం అని పిలవటం కూడా కద్దు. రెండింటా అన్నదమ్ముల మధ్య యుద్ధం ప్రసక్తమయిన సందర్భం తత్పూర్వ రంగం గమనార్హంగా ఉన్నాయి.

2.5.1. పల్నాటి వీరగాథ : శ్రీనాథుడు, మల్లయ్య, కొండయ్య కవులు జానపద సాహిత్య నేపథ్యం ఉన్న ఈ గాథను వీరగాథాపదాఖ్యాయికగా (Ballad) వ్రాశారు. దీని కథ గమనార్హం.

కార్తవీర్యార్జున వంశస్థుడు అనుగు రాజు ఉత్తర హిందూ దేశంలోని పాలమాచాపురి పాలించేవాడు. పురాకృత పాప ప్రక్షాళనకు ఒకనాడు విప్రులకు భూరి దానాలు చేస్తుండగా, కనకాద్రి చెన్నకేశవుడు ఒక వృద్ధ బ్రాహ్మణరూపంలో వచ్చి, పూర్వం కార్తవీర్యార్జునుడు జమదగ్నిని సంహరించినందువల్ల వచ్చిన దోషం పోవాలంటే రాజు నీలి దుస్తులు ధరించి పుణ్యతీర్థాలలో స్నానమాడాలనీ, ఏ తీర్థంలో ఆ దుస్తులు తెల్లబడతాయో అక్కడ అప్పుడు హత్యాదోషం తొలగినట్లని చెప్పాడు. అనుగురాజు కుటుంబ పరివారాలతో బయలుదేరి ఆంధ్రదేశం వచ్చాడు. మోటుపల్లి వద్ద చేసిన సముద్ర స్నానంతో అతని వస్త్రాలు తెల్లబడ్డాయి. రాజు అక్కడ ఉండగా, పంట విషయంలో ఊరకోట రాజయిన పేరమరాజుతో యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో అనుగురాజు జయించాడు. ఈ విషయంలో, రాజనామార్జుడు అనుగురాజు ఒక్కడే అని శాసనం వేయించడంతో చందవోలు రాజు అనుగురాజుపై దాడి చేశాడు. కాని ఓడి, తన పుత్రిక మైలమాదేవిని అనుగురాజుకిచ్చి వివాహం చేసి, పల్నాటి సీమను అరణంగా ఇచ్చాడు. ఈ రకంగా పల్నాటి సీమకు అనుగురాజు రాజయ్యాడు. అప్పటి నుంచి అయన గురజాలను రాజధానిగా చేసుకొని పల్నాటిని పాలింపసాగాడు. మైలమాదేవికి పుట్టిన నలగాముడు అందరికంటే పెద్దవాడు. మిగిలిన ఇద్దరి భార్యల ద్వారా ఏడుమంది పుత్రులను పొందాడు.

ఒకనాడు అనుగురాజు వేటకు వెళ్ళి వస్తూ రెడ్డి కులస్థురాలయిన నాగమ్మ అనే వనిత ఏర్పర్చిన విందు స్వీకరించాడు. మెప్పుపొందిన నాగమ్మ ప్రతిగా తనకు కావలసినప్పుడే ఏడు గడియలు మంత్రిత్వం నెరిపేటట్లు వరం పొందింది. నాగమ్మ నాటినుంచి గురజాలకు రాకపోకలు సాగిస్తూ తన పరపతి పెంచుకొంది. అనుగురాజు మంత్రిపుత్రుడు బ్రహ్మనాయుడు మాత్రం ఆమె పట్ల శ్రద్ధ చూపలేదు. ఇది ఇరువురి మధ్య వ్యతిరేకతకు కారణమయింది. వీరువురి మధ్య కక్ష పెరుగుతున్న కాలంలో, అనుగురాజు తన పుత్రులను బ్రహ్మన్నకు అప్పజెప్పి నలగాముడిని రాజు చేసి మంత్రిగా ఉండమని చెప్పి మరణించాడు. నలగాముడు పట్టాభిషిక్తుడయి బ్రహ్మన ప్రధానిగా పాలన చేయసాగాడు. ఒకనాడు నాగమ్మ వచ్చి తనకు రాజు ఇచ్చిన వరం సంగతి చెప్పింది.

మంత్రి పదవి స్వీకరించి నాగమ్మ నాయకురాలు అయి, తంత్రం పన్ని బ్రహ్మన్న ధర్మాగారం సొమ్మును స్నేహితుల ఇళ్ళలో ఉంచాడని పితూరీలు చెప్పింది. నలగాముడు బ్రహ్మన్నను దూరం చేయసాగాడు. వారిద్దరి స్పర్థను పెంచడానికి నాగమ్మ పట్టమహిషి పుత్రుడు, నలగాముడి తమ్ముడు అయిన మలిదేవుణ్ణి రాజుగా చేయటానికి బ్రహ్మన్న ప్రయతిస్తున్నాడని చెప్పి తమ్ముళ్ళను ఖైదు చేయించింది. బ్రహ్మన వారిని విడిపించి పల్నాటి రాజ్యాన్ని నలగాము మలిదేవులకు పంచాడు. మలిదేవాదులతో బ్రహ్మన వెళ్ళి మాచర్ల నగరం కట్టించి బాలుడైన మలిదేవుడి తరపున రాజ్యం చేయసాగాడు.

కొంత కాలానికి మలిదేవుడికి వివాహం చేయదలచి కళ్యాణపురాధీశుడైన వీరసోముడి పుత్రిక సిరాదేవిని అర్థించి భంగపడ్డాడు. తాను శైవుడు, మలిదేవుడు వైష్ణవుడు కావడంతో నిరాకరించిన వీరసోముడు కొంతకాలం తర్వాత తనకు యుద్ధంలో సహకరించి గెలిపించిన బ్రహ్మన కారణాన అంగీకరించి వివాహం జరిపించాడు. మలిదేవుడు రాజ్యానికి వచ్చాడు. మలిదేవుడి వివాహానికి నలగాముడు రాకపోవడంతో వారి మధ్య నెయ్యం నెరపాలని బ్రహ్మన గురజాలకు బయలుదేరాడు. వివాహ బంధంతో బలవత్తరమైన మాచెర్ల, గురజాల ప్రక్కనుంటే ప్రమాదమనీ, బ్రహ్మనకు కోడి పందేల పట్ల ఉన్న మోజును అవకాశంగా గ్రహించి మాచర్లను చేపట్టవచ్చుననీ, నలగామునికి నాగమ్మ చెప్పింది. దానికి నలగాముడు అంగీకరించక పోయినా సాహసించి బ్రహ్మన విడిది ముందు ఓడి పారిపోతున్న దాని బ్రహ్మన పుంజా అని గేలిచేసింది. బ్రహ్మన చెన్నకేశవుణ్ణి ప్రార్థించి పారిపోయే పుంజును వెనక్కి తెప్పించాడు. ఇది రెండో కోడిని చంపింది. నాగమ్మ పందెపు ఆటకు బ్రహ్మనను పురికొల్పింది. ఓడిన వారు ఏడేండ్లు రాజ్యం విడిచి అరణ్యవాసం చేసేట్లు పందెం చెప్పింది. బ్రహ్మన మాచెర్లకు పోయి మలిదేవుడి అంగీకారం పొంది, కోడిపుంజుతో గురజాలకు వచ్చాడు. తొలిరోజు బ్రహ్మన్న మరునాడు నాగమ్మ గెలిచారు. నాగమ్మ మంత్రాక్షతలు చల్లి, బ్రహ్మనాయుడి కోడిని చంపించింది. మాట ప్రకారం బ్రహ్మన మలిదేవాదులు రాజ్యం వదలి వెళ్ళారు. ఎన్నో కష్టాలతో కాలం గడిపారు. పిమ్మట తన రాజ్యభాగం ఇమ్మని నలగాముడి అల్లుడు వీరసోముడి మనుమడు అయిన అలరాజును పంపారు. రాయబారం విఫలం చేయడమే కాక అతనిని నాగమ్మ చంపించింది. యుద్ధం తప్పదని నిశ్చయించుకొని కారంపూడిని కదన రంగం చేసుకొన్నారు. ఇరుపైపులా సహాయార్థం ఎన్నో సేనలు నిల్చాయి. అప్పుడు నాగమ్మ సంధి చేసుకోవాలని పూనుకొంది. కాని బ్రహ్మన పుత్రుడు బాలచంద్రుడు దానిని తిప్పిగొట్టాడు. ఘోరయుద్ధం జరిగింది. బ్రహ్మన జయించాడు. అనుగురాజు వంశంలో నలగాముడు మాత్రం మిగిలాడు. బ్రహ్మన అతనికి రాజ్యం ఇచ్చాడు.

2.5.2. పల్నాటి వీరచరిత్ర - చారిత్రక నేపథ్యం : పల్నాటి వీరులు, పలనాడులో పుట్టి పెరిగి, జీవించి, పోరాడి గతించిన చారిత్రక వ్యక్తులు. వాళ్ళ చరిత్ర సంఘం జీవితంగా మొదలై, జానపదంగా ప్రఖ్యాతమై, వీరగాథగా శ్రీనాథాదుల మూలంగా కావ్యరూపం పొందింది. ఇది నిజంగా చరిత్ర అని ఋజువు చేయటానికి నాటి చరిత్రకాంశాలు స్పష్టం కావాలి.

2.5.2.1. చరిత్ర : పల్నాటి వీర చరిత్ర సాహిత్యంలో జానపదులు పాడుకొనే వీరగాథ. ఇది చారిత్రకాంశమే అన్నది బహుచర్చితాంశం. దీనిని చరిత్రగా నిరూపించడానికి తెలుగు సాహితీ పరిశోధకులు విమర్శకులు బహు ప్రయాసలకోర్చారు. అనేక ప్రయత్నాలు చేశారు. వీటి ఫలితంగా పల్నాటి వీరచరిత్ర చరిత్రగా నిల్చింది. ఈ ప్రయత్నాలలో అక్కిరాజు ఉమాకాంతము, చిలుకూరి వీరభద్రరావు, మల్లంపల్లి సోమశేఖర శర్మ, పింగళి లక్ష్మీకాంతం ఎంతో కృషి చేశారు. దొరికిన సాహిత్య ప్రతులాధారంగా, వివిధ రాజవంశాల, ఘట్టాలు వంటి అనేక కోణాల నుంచి చరిత్రను నిర్ణయించారు.

వీరి సుదీర్ఘ చర్చల సారాంశం పల్నాటి యుద్ధకాలం 1181-82. చరిత్రలో తూర్పు పశ్చిమ చాళుక్యుల నడుమ నిరంతరం వేంగీ ప్రాంతం కోసం పోరు సాగింది. ఈ వేంగీ 12వ శతాబ్దం కాలంలో వెలనాడు పలనాడు పాకనాడు కమ్మనాడు మండలాలుగా విభక్తమై ఉండేది. పలనాటిని పాలించిన హైహయ వంశీయులలో రాజ్యభాగం కోసం తలెత్తిన కుటుంబ కలహమే పలనాటి వీరచరిత్ర. దాయాదుల మధ్య జరిగిన ఈ యుద్ధంలో నలగాముడికి ధరణికోట ప్రభువు భీమదేవుడు, వాని పుత్రుడు వీరసేనుడు, కాకతీయ ప్రతాపరుద్రుడు సహకరించారు. వీరందరూ సమకాలికులు. వీరంతా అటునిటుగా పాలించిన కాలం ఒక్కటే. మొదటి ప్రతాపరుద్రుడు 1159లో రాజ్యానికి వచ్చాడు. వీరందరి సహాయాన్ని కోరి యుద్ధం చేసిన నలగాముడు పల్నాటి వీరులు, చారిత్రక వ్యక్తులు.

పల్నాటి వీర చరిత్రకు ఆనవాళ్ళుగా మిగిలిన ప్రదేశాలు ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ అనేకం. ఈ పాలకులు యుద్ధంలో ఏదో ఒక పక్షం వహించినవారే. 'బంధుత్వమును బట్టియో, స్నేహ ధర్మమును పురస్కరించుకొనియో ఈ యుద్ధంలో లోకకళ్యాణ కళచురి రాజులు, వెలనాటి దుర్జయులు, కోటరాజులు, హోయసల బల్లాళులు, గుడిమెట్ట చాగివారు, కాకతీయులు మున్నగు మండలాధిపతులు పాల్గొనిరి'.(47) పల్నాటి యుద్ధ ప్రాంతాలు గుంటూరు పరిసర ప్రాంతాలే. నేటికి ఈ పట్టణాలు చరిత్రకు నిదర్శనాలుగా మిగిలి ఉన్నాయి. చందవోలు, ధరణికోట, మోటుపల్లె, కారంపూడి, గురజాల మాచెర్ల, చంద్రభాగానది పల్నాటి చరిత్రకు సాక్ష్యాలు. చరిత్రను నిరూపించే కాల స్థల నిదర్శనాలు శాసన సాహిత్యాల ద్వారా లభ్యమవుతున్నాయి. ఈ ఆధారాలు చరిత్రను బలపరుస్తున్నాయి.

పల్నాటి వీర చరిత్ర వీరగాథ. పిచ్చుక గుంట్లు పాడుకొంటూ తిరిగే వీరగాథ. ఇది స్థానిక చరిత్ర. స్థానికమే అయినా ఆంధ్రదేశ చరిత్ర. పలనాటి యుద్ధము జరిగిన వెంటనే ఈ సంక్షోభమంతటిని కనులారా చూచియో, లేక చూచిన వారు చెప్పగా వినియో, వీర రసావిష్టుడైన ఏ పుణ్యాత్ముడో ఆనాడే దీనిని పదముగు పాడియుండును'.(48)

పల్నాటి వీరుల శౌర్యపరాక్రమాలను విని ఉర్రూతలూగిన జనం వీరగాథగా దానిని ఆలపించుకొన్నారు. చారిత్రక సత్యంగా ఇది 12వ శతాబ్ది ఘట్టంగా కనిపిస్తుంటే దీనికి 15వ శతాబ్దంలో అక్షరరూపం లభించింది. శ్రీనాథుడు దీనికి ఒక విలువనిచ్చాడు. శ్రీనాథుని దాకా వాగ్వ్యవహారంలో ఉందీ అంటే ఈ చరిత్రకు ఉన్న సజీవత్వాన్ని అంచనా వేయవచ్చు. అయితే ఇది కేవలం శ్రీనాథుడు వ్రాసింది కాదు. మల్లయ్య కొండయ్యలు

కూడా వ్రాశారు. అయితే వీరు మాత్రమే కాక అనేకులు దీన్ని రచించి ఉంటారని ప్రతీతి. ఎవరికి నచ్చిన ఘట్టాలకు వారు అక్షరరూపం ఇచ్చారు. ఈ విషయంలో పునరుక్తి కూడా కనిపిస్తుంది. ఒకరు చెప్పిన ఘట్టాలు ఇంకొకరు చెప్పడమూ ఉంది. అయితే శ్రీనాథుడి పూర్వం ఎవరూ ఎప్పుడు దీనికి ప్రారంభం చేశారో మాత్రం తెలియదు. పేర్లు తెలిసిన శ్రీనాథుడు మల్లయ్య కొండయ్యలతో పాటు పేర్లు తెలియని జానపద కవిగాయకులు చేసిన దోహదం మాత్రం అపూర్వం.

చారిత్రక సంబంధమైన స్థల కాల పాత్ర రాజకీయ నిదర్శనాలు అధునిక కాలంలో స్పష్టం చేస్తున్నారు. ఇది సాహిత్యానికి శాసనాలకూ కూడా సరిపోవడం సమంజసనీయంగా కనిపిస్తుంది. రెండు తరాలకు మధ్య ముప్పై రెండు సంవత్సరాల కాలంలో జరిగిన చరిత్ర ఇది. దీనికి శైవ వైష్ణవ ప్రాధాన్యం ఉంది. చారిత్రక నేపథ్యం అయిన ప్రధానాంశాలు మతపరంగా స్పష్టమవుతున్నాయి. చరిత్రలోనే చారిత్రక ఘటన పాలన క్షత్రియుల నుంచి శూద్రుల చేతికి రావటం ముఖ్య విషయం. ఇంత సునిశిత పరిణామం చూపుతున్న అభ్యుదయాన్ని సంస్కరణని చరిత్ర సంస్మరించుకోవాలి.

ఇది చరిత్ర. గుంటూరు పరిసర ప్రాంతాలకు సంబంధించిన కథ. దాయాదుల పోరు అయినా ఇది పల్నాడు మాచర్ల రాజ్యాల మధ్య యుద్ధం. 'పలనాటి హైహయులు పశ్చిమ చాళిక్యులకు సామంతులు'.(49)

ఇది ఆతల కాలపు సంగతి. అంటే 1076-1126 కాలపు స్థితి. యుద్ధ కాలాన ధరణికోట ప్రభువులు కాకతీయులు వీరి సమకాలికులు. నాడు జరిగిన వైవాహిక సంబంధాలు - చాళుక్య చోళ రాజాలకు సామంతులుగా ఉండటంతో వెలనాడు పాలకులను, వెలనాటి చోళులనేవారు. వెలనాడు చందవోలు రాజు అనుగురాజు మైలమాదేవినివ్వడం, కళ్యాణ పురాధీశుడు తన పుత్రికను మలిదేవునికివ్వటం నాటి సంస్కృతిని, ఇతర రాజ్యాధినేతలను గూర్చి స్పష్టీకరిస్తూ ఉంది. దీన్ని చరిత్రగా పుటల్లోకి ఎక్కించి అపూర్వ చారిత్రక సంఘటనలను ఆంధ్ర ప్రజలకు అందివ్వ వలసిన అవసరం ఉంది. ఇది పల్నాటి చరిత్ర విషయమే. చరిత్రతో పాటు మానవ జీవనంలోని మార్పులను సాక్షాత్కరించే ఘట్టాలు ఎన్నో ఉన్నాయి. వీటిని చరిత్రలో ప్రతిష్ఠింపవలసిన అవసరం ఉంది. ప్రజలకు తమ చారిత్రక స్థితి, దాని పూర్వరంగం దాని పురోభివృద్ధి అర్థం చేసుకొనే అవకాశం కలగాలి. దానికి ఆరంభం పలనాటి చరిత్ర అయితే, మిగిలిన వాటికి చారిత్రక సత్యాన్వేషణ ఉత్సాహం లభిస్తుంది.

2.5.2.2. మత నేపథ్యం : పల్నాటి వీరచరిత్ర మత ఆర్థిక సాంఘిక రాజకీయాది నేపథ్యాలకు ఖచ్చితంగా సాక్షీభూతం. మత ప్రభావంలో రాజకీయమైన మార్పులు సాహిత్యం పై ప్రభావం చూపడం గమనింపవచ్చు. 'తెలుగు శైవ వైష్ణవ మతాలు - వాటి మధ్య వైరం పోటీ చూపిన ప్రభావం చాలా అధికం. పల్నాటి వీర చరిత్ర ఇందుకు భిన్నం కాదు. శైవం స్థానికం. వైష్ణవం వ్యాప్తి చెందుతూ వచ్చింది. శైవం జనజీవన ధోరణి కలిగి ఉంది. వైష్ణవం జనజీవనంలోకి చొచ్చుకొని వచ్చి పాతుకుపోతూ ఉంది. పల్నాటి చరిత్రలో హైహయులు వ్యాప్తి చెందుతూ వచిన రాజులు

భక్తులు. కళ్యాణపురాధీశుడు, తద్వారా మాచెర్ల వారిది శైవం. బసవేశ్వరుడు ప్రచారం చేసిన శైవం వీరి మతం. పల్నాడు ఏలిన నలగాముడు వైష్ణవాన్ని మాచర్ల మలిదేవుడు శైవాన్ని ఆదరించారు.

గురజాలను వదలి వెళ్ళిన పిమ్మట మాచెర్లను రూపొందించిన బ్రహ్మన శైవమతం వైపు మొగ్గు చూపాడు. మలిదేవుడికి కళ్యాణపురాధీశుడి పుత్రికను ఇచ్చి పెళ్ళి చేయించాడు. వివాహ సంబంధంతో శైవాన్ని వివాహ సంబంధం ద్వారా పరోక్షంగా శైవ మతం ద్వారా రాజ్యాన్ని బలపర్చుకొన్నాడు. దానిని అంతటితో ఆపక శైవ సంబంధమున్న ఇష్టాన్ని కొనసాగించాడు. అందరినీ ఆదరించాడు. నిజానికి వైష్ణవుడే అయినా రాజకీయ కారణాల దృష్ట్యా శైవాన్ని సమర్థవంతంగా అవలంబించాడు, ఉపయోగించుకొన్నాడు.

బ్రహ్మన్న బలపర్చిన శైవం, నలగాముని అధికారిక మతం వైష్ణవం, ప్రాథమికంగా మత ప్రేరిత యుద్ధం. ఇది శైవ వైష్ణవాల కలహం. శైవ విజయం వైష్ణవులకు రాజ్యాన్ని ధారాదత్తం చేయటం వల్ల ఇనుమడించింది.

2.5.2.3. కుల నేపథ్యం : వర్ణవ్యవస్థ విశృంఖల విహారానికి ప్రత్యక్ష నిదర్శనం పలనాటి వీర చరిత్ర, ఇందులో బహిర్గతంగా గోచరమయ్యే సత్యం దాయాదుల పోరు. అంతర్గత కలహం రెడ్డి, కమ్మ కులాలకు సంబంధించినది. శూద్రులు సృష్టించిన చరిత్ర పల్నాటి వీరచరిత్ర. ఈ చరిత్రలో ప్రధాన వ్యక్తులు నాయకురాలు నాగమ్మ. బ్రహ్మనాయుడు వీరు ఇరువురూ పలనాటి పాలకుడు నలగాముడికి, మాచర్ల భూపతి మలిదేవుడికి మార్గనిర్దేశకులు. సమర్థులయిన మంత్రులు, వ్యూహరచయితలు, పథక నిర్మాతలు పోరాటం పటిమ కలవాళ్ళు. నాగమ్మ రెడ్డి కులానికి చెందింది. బ్రహ్మనాయకుడు కమ్మ కులజుడు. వీరివురికి పోరు ఇంకా చెప్పాలంటే వీరివురిరి కుల అహంకారాలే పల్నాటి రక్తతర్పణానికి కారణం. పల్నాటి యుద్ధం కోళ్ళ పందేలు కారణంగా జరిగిందనడం చరిత్రలో అ ప్రముఖాంశానికి ప్రాముఖ్యమివ్వడమే. రెడ్డి కమ్మ పోరాటమే పల్నాటి పతనానికి కారణం. నాటి సంఘస్థితి కారణంగా స్త్రీ ఆధిక్యం అంగీకరించలేని పురుషాహంకారం దీనికి తోడు కావడం కూడా స్పష్టమవుతుంది.

2.5.3. పల్నాటి వీర చరిత్ర - భారత గాథ : భారతంలో పల్నాటి వీరచరిత్రకు ఎన్నో పోలికలున్నాయి. భారతం లాగానే ల్నాటి వీర భారతం కూడా. సాంఘికంగా జరిగిన జీవితానికి సారస్వతరూపం సంతరించుకొంది. దానిలాగే పల్నాటి చరిత్ర కూడానూ. విభిన్న తరాల కథను చెప్పే ఇతివృత్తం కలిగి ఉంది. ఇక ఏ ఇతిహాసేతివృత్తమూ ఈ ధోరణిలో కనిపించదు. ఈ రెండు విషయాలలోనూ దాయాదుల వృత్తాంతమే ముఖ్యం. దాయాదుల వృత్తాంతం భారతంలో అన్నదమ్ముల బిడ్డల మధ్య ఘర్షణ అయితే ఇక్కడ ఒకే తండ్రి బిడ్డలయినా వేరు వేరు తల్లుల పుత్రుల మధ్య ఘర్షణ జరిగింది. భారతంలో లాగనే పల్నాటి చరిత్రలోనూ ఆయభాగం కోసం పోరాటమే వర్ణితం. ధర్మబద్ధంగానే దుర్యోధనుడు అక్కడ -అగ్రజుడి పుత్రుడిగా తనదే రాజ్యం అన్నాడు. ఇక్కడ నలగాముడు తన తల్లి రాజ్యం తనది అన్నాడు. అందులోనూ ఇందులోనూ హితవు చెప్పే పెద్దలున్నా కలసి జీవనం సహించని దుర్యోధనుడు నలగాముడు రాజ్యవిభజనకు కారణమయ్యారు.

పాండవులకు రాజ్య భద్రత లేని కాలంలో పాంచాలి వివాహంతో పాంచాల రాజ్య సహకార బలం పొందినట్లే మాచర్ల నివాస కాలంలో మలిదేవుడి వివాహం కళ్యాణరాజు పుత్రికతో జరిగి, తానూ బలపడ్డాడు. భారతంలోనూ పల్నాటి వీరచరిత్రలోనూ శకుని నాగమ్మల బోధలు దుర్యోధన నలగాములను నడిపించాయి. వ్యసనాలే ఇరు వర్గాలను వనవాసయోగ్యం చేశాయి. అయితే భారతంలో జూదంగా, పల్నాటి చరిత్రలో అది కోళ్ళ పందెంగా ఉంది. వనవాసక్లేశం భారతంలో ఘోషయాత్ర అయితే పల్నాటి చరిత్ర అది మందపోటు. వనవాసానంతరం ఇరు భారతాలలో రాయబారం జరిగింది. అయితే దూతలపై జరిగిన విష ప్రయోగంలో భారతదూత కృష్ణుడు తప్పించుకొంటే, పల్నాటి భారత దూత అలరాజు బలయ్యాడు. కురుక్షేత్రంలో కార్యంపూడి యుద్ధ క్షేత్రంలో ఘోరయుద్ధాలు, విపరీత నష్టాలు జరిగాయి. అక్కడ పాండవులు, ఇక్కడ బ్రహ్మన వర్గం గెలిచింది. కాని బ్రహ్మన రాజ్యాన్ని నలగాముడికి ఇవ్వడం ఇందులోని మార్పు ఇన్ని సామ్యాలున్న చరిత్ర కనుకనే దీనిని పల్నాటి వీర భారతమనీ అన్నారు.

2.6. శాతవాహన చరిత్ర : శాతవాహనులు ఆంధ్రను పాలించిన ప్రథమ వంశీయులు వారిని గూర్చిన సాహిత్యం లభ్యమవుతూ ఉంది.

2.6.1. వల్లభాభ్యుదయం : పల్నాటి వీరచరిత్రకు ముందటి ఆంధ్రదేశ చరిత్రను 17వ శతాబ్దిలో కావ్యంగా వల్లభాభ్యుదయం పేరిట భట్లపెనుమర్తి కోదండకవి వ్రాశాడు. అతి ప్రాచీనమైన ఆంధ్ర రాజుల చరిత్రను వివరించే సాహిత్యమిది. శాతవాహనులు క్రీ.పూ.243 నుంచి క్రీ.శ.225 దాకా ఆంధ్రదేశం పాలించిన రాజులు. వల్లభాభ్యుదయం పేరిట వీరి గాథను రచించాడు, కవి ఇది '....బ్రహ్మాండ పురాణములోని ఉత్తరకాండమందలి శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యమునను గురించి 'వల్లభాభ్యుదయ'మను పేర ఆంధ్ర అభ్యుదయమును వివరించు ఐదాశ్వాసాల....' (50) గ్రంథం.

క్షేత్ర ప్రధానమైన గ్రంథమే అయినా, తొలి తెలుగురాజు, ఆంధ్రవిష్ణువును గూర్చి అనేక చారిత్రక వ్యక్తులను గూర్చి చెప్పే గ్రంథం.కనుక ఇది చారిత్రక గ్రంథం అయింది. ఇట చారిత్రక వ్యక్తులను చెప్పడం ప్రధానం. వారి జీవితంలో భాగంగా మాహాత్మ్యం చెప్పబడినప్పటికిని ఇది చారిత్రక రచనమే. 'శాతవాహనుని వంశంలోని సుమిత్ర ముక్కంటి కాడువెట్టి అని పేరు పొందిన త్రిలోచన పల్లవుడు కళింగుల సేనాని అనంతపాలుడూ ప్రముఖులు. ఈ చారిత్రక వ్యక్తుల గాథలను పూర్తిగా కాకపోతే కొద్దిగానైనా పొందుపరిచే ప్రాచీన ఆంధ్ర చరిత్రగా వల్లభాభుద్యయాన్ని వ్రాసిన పెనుమర్తి కోదండరామయ్య ప్రశంసనీయుడు'. (51)

2.7. కాకతీయ చరిత్ర : ప్రతాపరుద్ర చరిత్ర పేరిట ప్రతాపరుద్రుని చరిత్ర ప్రధానంగా, కాకతీయ చక్రవర్తుల చరిత్ర అప్రధానంగా, ఏకామ్రనాథుడు వచనంలో చారిత్రక గ్రంథం వ్రాశాడు. ఇది విలువైన చారిత్రకాంశాలతో కూడి ఉంది. కొన్ని వర్తమాన చరిత్రకందని విషయాలు ఉండవచ్చు. కొన్ని పొరపాట్లుండవచ్చు కాని, చరిత్రను సమకాలంలో గ్రంథస్తం చేసిన ఖ్యాతి ఏకామ్రనాథుడికి చెందుతుంది.

ఈ చారిత్రక గ్రంథమాధారంగా కాసె సర్వప్ప సిద్ధేశ్వర చరిత్ర వ్రాశాడు. ఇది ఒక చారిత్రక గ్రంథం. ఒక సాహిత్య సృష్టికి దోహదపడిన సందర్భం విస్పష్టంగా తెలుస్తున్న దశ. సిద్ధేశ్వర చరిత్రలో శైవ ప్రాశస్త్యంతో పాటు ప్రతాపరుద్రభూపతి పాలనా వైశిష్ట్యం, తదితర వివరాలూ తెలుస్తూ ఉన్నాయి.

2.7.1. ప్రతాపరుద్ర చరిత్ర : దీన్ని రచించిన ఏకామ్రనాథుడు చరిత్రకారుడు. 'తెలుగులో మొట్టమొదటి చారిత్రక గ్రంథమని చెప్పదగిన ఏకామ్రనాథుని (క్రీ.శ.1550) ప్రతాపరుద్ర చరిత్ర'. (52) ఇది కాకతీయుల వైభవాన్ని తెల్పే గ్రంథం.

కాకతీయ పాలకులలో ప్రసిద్ధుల గణపతిదేవుడు, రుద్రమదేవి, ప్రతాపరుద్రుడు. సమర్థుడయిన ప్రతాపరుద్రుడు (క్రీ.శ.1289-1323) ఢిల్లీ సుల్తానుల చేతిలో మృతి చెందటం ప్రధానంగా రచింపబడింది. ఏకామ్రనాథుడు ప్రతాపరుద్రుని పూర్వీకులను కూడా రచనలో పేర్కొన్నాడు. ఇది తొలి తెలుగు వచన రచన. తొలి తెలుగు చారిత్రక రచన. '..ఈ కాకతీయ చక్రవర్తుల మహోజ్జ్వల చరిత్రను, వంశోత్పత్తిని, వారి పూర్వీకుల క్రమాభివృద్ధిని,, వారి వైభవ పరిపాలనాశయాలను, ప్రజారంజకత్వాన్ని....'(53) వ్యక్తం చేసిన రచన ఇది.

ఈ చరిత్రకు కవి శైవ స్పర్శ ఇచ్చాడు. 'అతడు కాకతీయుల చరిత్రను ఒక పుణ్యకథగా, దానిని చెప్పడం ఒక పుణ్యకార్యంగా భావించాడు'. (54) ఇది చారిత్రక రచన. ఎన్నో అచారిత్రకాంశాలు కల్పించినా '......... కొన్ని ముఖ్య చారిత్రక సంఘటనల విషయంలో అతి సూక్ష్మంగా అతి విశ్వసనీయంగా కాలనిర్ణయం చేసింది....' (55) ఈ రచన.

ఏకామ్రనాథుడి కథనాన్ని అనుసరించి లెక్కచూస్తే 15 మంది కాకతీయ చక్రవర్తులు సుమారు 1000 సంవత్సరాలు పరిపాలించినట్లు తెలుస్తుంది. అయితే నేటి చరిత్ర పరిశోధకుల అభిప్రాయాలు ఆధారంగా ద్వితీయార్థంలోని సగం మంది రాజులవాళ్ళ కాలం కొంత కాకతీయ చక్రవర్తుల చరిత్రతో పోలుతుంది. 'ఈ 15 మంది రాజుల పట్టికలో 8వ వ్యక్తి అయిన త్రిభువనైకమల్లుని దగ్గర నుంచి అందరూ చారిత్రక వ్యక్తులే. ఈ త్రిభువనైక మల్లుడే కాకతి బేతరాజు. అతడు పశ్చిమ చాళుక్యులకు సామంతుడైన వాళ్ళ బిరుదులను వహించాడు' (56). ఇతని కుమారుడు 1087లో ఓరుగల్లు నిర్మించాడని ఏకామ్రనాథుడు పేర్కొంటూ ఉండగా చరిత్రకారులు 1158-1145 సంవత్సరాల మధ్య పాలించిన రుద్రమదేవుడే నిర్మించాడని తెలిపారు. నాటి ప్రారంభమే రుద్రమదేవుడి నాటికి బలవత్తర కార్యంగా రూపం దిద్దుకొని ఉండవచ్చు.

ఏకామ్రనాథుడి చరిత్రకూ చారిత్రక సత్యాలను అందిస్తున్న సాహిత్యంగా సాహిత్యంలో ప్రత్యేకంగా ప్రముఖ స్థానం ఉంది. ఆ కాలంలో ప్రచారంలో ఉన్న ఎన్నో విషయాలు సాహిత్య ముఖంగా ఏకామ్రనాథుడు అందించాడు. అనేకాంశాలను చర్చించిన ఖండవల్లి లక్ష్మీరంజనం ప్రతాపరుద్ర చరిత్ర క్రీ.శ.1550 ప్రాంతాలలో రచితమై ఉంటుందని భావించాడు.

2.7.2. సిద్ధేశ్వర చరిత్ర : క్రీ.శ.16వ శతాబ్ది ప్రారంభంలో కాసె సర్వప్ప కాకతీయుల చరిత్రనే ఆధారం చేసుకొని సిద్ధేశ్వర చరిత్రను ద్విపద కావ్యంగా రచించాడు. కొంత శైవానికి దగ్గరగా ఉంది రచన. కొంత భాగం శివుడు సిద్ధేశ్వరుడిగా జన్మించటం ఉంది. ఇది ద్విపదగాను వచనంగాను ఉంది. ప్రతాపరుద్రుడి చరిత్ర, కాకతీయుల పాలనాదులు ఉన్నాయి. 'వంశ చరిత్రను వర్ణించు కావ్యములలో సిద్ధేశ్వర చరిత్ర అగ్రగణ్యమైనది'. (57)

సిద్ధేశ్వర చరిత్ర : '.... వయాలమున కాకతీయుల నాటి రాజుల గుణగణములు, వారి పరిపాలనా విధానము, వారి వీరవిహారము, ఆ కాలపు సాంఘిక విశేషములు, మతములు, ఆచారములు, తటాక, దేవాలయ నిర్మాణములు, నీతి వేషభాషలు, అభిరుచులు, సంప్రదాయములు మున్నగు అంశములను గూర్చి.... ' (58) కాసె సర్వప్ప చక్కగా వ్రాశాడు. ఇది ఏకామ్రనాథుడి ప్రతాపరుద్ర చరిత్రకు ద్విపద రూప రచన. ఖండవల్లి లక్ష్మీరంజనం, రచనకు మంజరీ ద్విపద గ్రహించి ఉంటే మరింత సమర్థవంతంగా ఉండేదని పేర్కొన్నాడు.

'The title given to the book is Sri Siddheshwara Charitramu - Kakatiya Rajula Charita - Pratapacharitra. The author called it Siddha Mahatyam in colophons to the first and second Aswasas'. (59

ప్రతాప చరిత్ర వచన చారిత్రక రచన. సిద్ధేశ్వర చరిత్ర ద్విపద చారిత్రక రచన. రెండూ చారిత్రక దృష్టి కలిగిన రచనలే. ఒకే రాజవంశాన్ని తెల్పిన రచనలు. 'Since both the works have only as historical interest for us, Pratapa Charitra seems to be more precise and clear than Siddheshwara Charitra which has flair for poetic flourish'. (60) ఇందులో రాజు దైనందిన జీవితం వివరింపబడింది.

'The daily round of duties of King Pratapa Rudhra is given in detail in these works which show how Kings employed their time in the mediaeval ages'. (61) సిద్ధేశ్వర చరిత్ర ఈ రకంగా నాటి రాజుల దైనందిన జీవన విధానాన్ని అంచనా వేయడానికి అవకాశం ఇచ్చింది.

2.8. రాయల చరిత్ర : విజయనగర సామ్రాజ్య చరిత్ర తెలుసుకోవటానికి ప్రాథమికంగా రాయవాచకం గోచరమవుతూ ఉంది. ఇందులో ప్రధానంగా రాయల దినచర్య గోచరమవుతూ ఉంది. ఈ చారిత్రక గ్రంథం ఆధారంగా సాహిత్య స్వరూపం అవతరించటం అవలోకింపదగ్గ సందర్భం. చారిత్రక నేపథ్యంలో సాహిత్యం అవతరించటం స్పష్టమయిన విషయమే కాని, ఆ చారిత్రక నేపథ్యం అక్షర సుందరంగా సందర్శన యోగ్యం కావటం ఇక్కడి విశిష్ట విషయం.

2.8.1. రాయవాచకం : పుక్కిటి పురాణాలు లెక్కకు మిక్కిలిగా పెరుగుతున్న దశలో కల్పనా రహిత చరితకు నిదర్శనంగా వెలువడ్డ రాయవాచకం అతి విశిష్ట చారిత్రక

దృక్పథానికి హేతువుగా నిలుస్తూ ఉంది. రాయవాచక కర్త పేరు ఉండవలసిన చోట కాశీ విశ్వనాథనాయనయ్య వారి స్థానాపతి అని ఉంది. ఇది పేరు అయి ఉండడానికి అవకాశాలు తక్కువ. విశ్వనాథ నాయస్థానాపతిగా పేర్కోబడుతున్న ఈ కర్త ఎవరు ఏ కాలం నాటి వాడు అన్నది బహుచర్చిత సమస్య. విజయనగర కాలంలో చక్రవర్తికి సామంతులకు మధ్య సంబంధాలు నెలకొని ఉండడానికి చక్రవర్తి సభలో సామంతులు తమ తరఫున స్థానాధిపతిని ఉంచడం పరిపాటి. అటువంటి స్థానాపతి ఈ రాయవాచక కర్త. అయితే, ప్రభుభక్తి పరాయణుడు, నాగమనాయకుడి పుత్రుడు శ్రీకృష్ణరాయల వల్ల మధుర పాలకుడు అయిన విశ్వనాథ నాయకుడు ఈ విశ్వనాథుడు కాదని చరిత్ర ద్వారా నిరూపితమవుతూ ఉంది. మరో విశ్వనాథుడు ఉన్నాడనీ, 1595-1602 వరకు మధురను పాలించిన రెండవ కృష్ణప్ప తమ్ముడే ఈ విశ్వనాథుడనీ, ఇతడి స్థానాపతి రాయవాచక కర్త అనీ, పండితులు అంగీకరిస్తున్నారు. ఈ కావ్యం 16వ శతాబ్ది ఉత్తరభాగంలోనో, 17వ శతాబ్ది పూర్వ భాగంలోనో రచింపబడి ఉంటుందని తీర్మానించారు. ఇందులో కొన్ని చరిత్రకు అతీతమైన సన్నివేశాలు, వ్యక్తులు, నియమాలు ఉన్నాయి. మచ్చుకు విజయనగర సామ్రాజ్య రాజధాని నిర్మాణం 1205లో ఆరంభమయిందని చరిత్ర పేర్కొంటే, రచయిత 1336లో ప్రారంభమయిందని అన్నాడు. కనుక ఇతడు కృష్ణదేవరాయలను గూర్చి, అతడి సోదరుడిని గూర్చి విని రాసి వుంటాడనీ, అతడు కృష్ణదేవరాయల ఆస్థానంలో ఉండి ఉండడని, విమర్శకుల అభిప్రాయం. అయితే కొంత సందిగ్ధత ఉన్నా కృష్ణదేవరాయల చరిత్ర ముఖ్యంగా అతని దిగ్విజయ యాత్రలు తెలుసుకోవటానికిది ప్రామాణిక గ్రంథం. విజయనగర చరిత్రకై విశేష కృషి చేసినవాడు, వేటూరి వెంకటరమణయ్య ఎన్నో విషయాలపై ఇది ఇచ్చే సమాచారం సత్యమనీ, ఈ విషయాన్ని శాసనాలు, సమకాలీన ప్రబంధాలు పోర్చుగీసు రికార్డులు బలపరుస్తూ ఉన్నాయని నేల చాటాడు.

ఇది వీరనృసింహరాయ, శ్రీకృష్ణదేవరాయ దినచర్యలను, దిగ్విజయ యాత్రలను, ఓఢ్రరాజ పుత్రికతో వివాహాన్ని తెలిపే చారిత్రక వచన రచన: 'రాయవాచకము వ్యావహారికములో రచించినను, చక్కని వచన గ్రంథము. ఇందు కర్ణాటక రాజుల దినచర్య విద్యారణ్య ప్రశంస, విద్యానగర నిర్మాణము, శంకుస్థాపన ముహూర్తము, కృష్ణదేవరాయల పట్టాభిషేకము, కృష్ణదేవరాయనికి మంత్రులు రాజనీతి ఉపదేశించుట, లోకవార్తలను సేకరించుటకు వేగులను నియమించుట, కోశాధి వివరణము, రాయలు పట్టణ శోధనకు వెళ్ళుట, సేన వివరణము, తిమ్మరుసు మంత్రి ప్రశంస, అశ్వపతి, గజపతి నరసపతుల తారతమ్యము, తురుష్కుల యుద్ధములు, విజయములు, మున్నగు విషయములు ఆ కాలపు అధికార వర్గమున ఉండిన వాడుక భాషలో వర్ణింపబడినవి'. (62) ఈ కృతిలో సామంతుల, అమరనాయకుల, దళపతుల పేర్లు కనిపిస్తూ చరిత్రను స్పష్టం చేస్తున్నాయి. ఇది ఎలాంటి కల్పనలూ లేని చారిత్రక రచన. ఇది భాషా పరిణామం గమనింపదగిన వచన కావ్యం. సమకాలీనమైన వ్యావహారిక భాషను ఇందులో దీని కర్త ప్రయోగించాడు.

2.8.2. కృష్ణరాయ విజయం : రాయవాచకం వెలువడిన శతాబ్దానికి ఇది రూపు దాల్చింది. 1650లో కుమార ధూర్జటి రచించాడు. రాయవాచకమే రూపు మార్పుతో

కృష్ణదేవరాయ విజయం అయింది. అది వచనంలో ఉంటే ఇది పద్యంగా వెలువడింది. దీనికి మూలం రాయవాచకమే. రాయలు సింహాసనం అధిష్ఠించిన నాటి నుంచి, గజపతి పుత్రికను వివాహమాడేవరకు ఉన్న కథ ఇందులో ఉంది. ఈ కావ్యాన్ని నాలుగాశ్వాసాల గ్రంథంగా రూపొందించాడు. గజపతితో గోదావరి వద్ద తురుష్కుల ముట్టడి, గజపతికి విరోధుల విషప్రయోగం చేయటం లాంటి రాయవాచకంలోని అంశాలు కృష్ణదేవరాయ విజయంలో కనిపించవు. అయితే 'రాయవాచకంలో అర్థసంశయంతో కూడిన కొన్ని పదాల అర్థనిర్ణయం చేయడానికి కృష్ణదేవరాయ విజయం కొంత తోడ్పడుతుంది'. (63) రాయవాచకాన్ని సాహిత్యానికి అవసరమైన మార్పు చేర్పులతో కుమార ధూర్జటి కావ్యంగా రచించి అందించాడు. 18వ శతాబ్ది పూర్వం కూచిమంచి 'సోమదేవరాజీయము'నే పేరిట రాయవాచక విషయాన్ని పద్యకావ్యంగా వ్రాశాడు.

2.9. స్థానిక చరిత్ర : చారిత్రకంగా విశేష ప్రసిద్ధిలేని పాలకుల జీవితం కానీ, స్థల నైశిష్ట్యం కానీ, దేవాలయ ప్రభావం కానీ, ప్రభువుల వ్యక్తిగత జీవితం కానీ, స్థానికంగా ప్రచారంలో ఉన్న చారిత్రక గాధలుగానీ, గ్రహించి సాహిత్య రూపంలో పలువురు కవులు అందించారు. వాటి చరిత్రను ఒక్కొక్కసారి సమకాలీన చరిత్ర సమకాలీన సాహిత్యంగా కూడా అవతరించింది. రాజయిన తండ్రి ప్రణయ గాథ తనయుడు చిత్రించటం కూడా ఉంది. స్థానికమైన చరిత్ర గ్రహించి సాహిత్యం సృష్టించిన సందర్భం ఇక్కడ ప్రస్తుతం.

2.9.1. కాటమరాజు కథ : తెలుగు సాహిత్య చరిత్రలో శ్రీనాథుడు మిక్కిలి విశేషకవిగా గోచరమవుతున్నాడు. శృంగార నైషధం వంటి పాండిత్య ప్రకర్ష ప్రదర్శించే కవిత్వం అనువదించాడు. ఇది వైష్ణవ ధర్మ ప్రాచుర్యం కలిగించే సాహిత్యం. భీమఖండం, హరవిలాసం వ్రాశాడు. ఇవి శైవ ధర్మ ప్రతిష్ఠకావించే సాహితీ రూపాలు. వైష్ణవ శైవ సమన్వయ కర్తగానే కాదు పండిత పామర ప్రాణమిత్రుడుగా కూడా గోచరమవుతున్నాడు. పండితులకు ఉపయుక్తమయ్యే సాహిత్యం సృష్టించటంతో పాటు పామరుల సాహిత్యం కూడా రూపొందించాడు. జానపదుల జీవన విధానంలో భాగంగా ఉన్న గాథల్ని ప్రజల్లో ప్రచారం ఉన్న సాహిత్యాన్ని అందుకొని కావ్యాలుగా మలచటంతో శ్రీనాథుడు సాహితీ శ్రీనాథుడయ్యాడు. ప్రజలలో ప్రాచుర్యంలో ఉన్న పల్నాటి వీరచరిత్రను వీరగాధగా అందించటం కాదు, కాటమరాజు కథను కూడా వీరగాథగా అందించాడు. ఇవి రెండు ఆంధ్రదేశ చరిత్రలోని ప్రముఖ చారిత్రక ఘట్టాలు. పల్నాటి వీరచరిత్ర పరిశీలనం సముచిత ప్రాతిపదిక మీద జరిగింది. నెల్లూరును కేంద్రంగా చేసుకొని ఆంధ్రదేశ భాగం పరిపాలించిన మనుమసిద్ధి కాలంలో కథగా కాటమరాజు చరిత్ర గోచరమవుతుంది. దీన్ని శ్రీనాథుడు ద్విపదగా రచించాడు. రచనా కాలానికే జానపదులలో పదరూపంలో ఇది ప్రసిద్ధిలో ఉంది. దీనికి పల్నాటి వీరభారతం స్థాయిలోనే యాదవ భారతం అనీ, గొల్లభారతం అనీ, ప్రసిద్ధి ఉంది.

2.9.2. రామరాజీయం : విజయనగర ప్రభువైన రామరాజును గూర్చి వ్రాసిన చారిత్రక కావ్యం రామరాజీయం. అందగుల వెంకయ్య క్రీ.శ.1630లో రచించిన చారిత్రక గ్రంథం. 'ఇందులో చంద్రుని దగర నుండి

వంశరాజుల క్రమం ఉంది. కృతిపతి కోదండ రామరాజుకు రామరాజు అనే నామాంతరం ఉంది' (64) ఈ గ్రంథానికి 'నరపతి విజయము'నే మరో పేరు కూడా ఉంది. 'పురాణాల్లో చెప్పిన చంద్రవంశాన్ని విపులంగా కథనం చేశాడు. కళ్యాణపురాన్ని పాలించిన బిజ్జలుడు ఆ వంశంలో పుట్టిన వైనాన్ని చెప్పాడు. ఈ బిజ్జలుని నుండి అరవీటి బుక్కరాయలదాకా ఉన్న దొరల సంగతి కథనం చేశాడు. అక్కడ నుండి తన కృతిపతి కొడుకుల దాకా ప్రతి రాజుని పేర్కొన్నాడు. వాళ్ళ భార్యల పేర్లు చెప్పాడు. విజయాలను తెలియజేశాడు'. (65)

2.9.3. అన్నమయ్య చరిత్ర : తిరుపతిలో స్థిరనివాసం ఏర్పరుచుకొని శ్రీవేంకటేశ్వర స్వామిని ప్రస్తుతిస్తూ అనేక సంకీర్తనలు వ్రాసినవాడు అన్నమయ్య. ఈ తాళ్ళపాక అన్నమాచార్యుల జీవిత గాథను తెల్పే ద్విపద కావ్యాన్ని 16వ శతాబ్దంలో తాళ్ళపాక చిన్నన్న 'అన్నమాచార్య చరిత్ర' పేరిట వ్రాశాడు.

2.9.4. నాయక రాజుల చరిత్ర : తంజావూరు రాజధానిగా 17వ శతాబ్దిలో చేసుకొని రాజ్యపాలన చేసిన ఆంధ్రనాయక రాజులు అచ్యుత నాయకుడు, రఘునాథ నాయకుడు విజరాఘవ నాయకుడు. అచ్యుత నాయకుణ్ణి గూర్చి రఘునాథ నాయకుడు, రఘునాధ నాయకుణ్ణి గూర్చి విజయ రాఘవనాయకుడు, విజయరాఘవ నాయకుణ్ణి గూర్చి తెలిపే సాహిత్యం కవులూ కవయిత్రులు సృష్టించారు.

2.9.4.1. అచ్యుతాభ్యుదయం : 1614-33లో తన తండ్రి అచ్యుతనాయకుణ్ణి గూర్చి 'అచ్యుతాభ్యుదయం' పేరిట రఘునాథనాయకుడు వ్రాశాడు. ప్రఖ్యాతి ఈ రచనకు ఉంది కాని అది అలభ్యంగానే ఉంది.

2.9.4.2. రఘునాధాభ్యుదయం : నాయక రాజ వంశ ప్రశస్తిని చాటే యక్షగానాన్ని 'రఘునాథాభ్యుదయం' పేరిట విజయరాఘవనాకుడు రచించాడు. వంశప్రశస్తి, రఘునాథ నాయకుడి ప్రశస్తి ఇందులో ముఖ్యాంశాలు. ఇందులో రఘునాథుడి ఒక్క రోజు వృత్తాంతమే కథగా గ్రహించాడు.

2.9.4.3. రఘునాథనాయకాభ్యుదయం:'రఘునాథ నాయకాభ్యుదయం' పేరిటపై వృత్తాంతాన్ని ద్విపద కావ్యంగా విజయరాఘవనాయకుడు రచించాడు. 'తన తండ్రి రఘునాథ నాయకుడు వీధిలో స్వారీ వెడుతున్నప్పుడు చిత్రలేఖ అనే గణిక అతణ్ణి చూసి మోహించింది. తన చిలుక చేత రాయబారం పంపింది. రఘునాథుడది విని ఆమె ఇంటికి వెళ్ళి ఆమెను లాలించాడు'. (66) ఇందులోని కథ ఇది.

2.9.4.4. రాజగోపాల విలాసం : చెంగల్వకాళయ రచించాడు. మన్నారు దాసుడని విజయరాఘవుడికి ఉన్న పేరు. మన్నారు గుడిలోని దైవం రాజగోపాలుడు. ఇతడు విజయరాఘవుడి ఇష్టదైవం. కనుకనే విజయరాఘవుడికి ఆ పేరు వచ్చింది. ఇది వీరిరువురికి అభేదంగా చేసిన సాహితీ సృష్టి. ఇందులో అష్ట విధనాయికలతో కృష్ణుడి లీలను తెల్పాడు.

2.8.3.5. మన్నారుదాస విలాసం : విజయరాఘవుడికి ఉన్న బిరుదు మన్నారుదాసు. విజయరాఘవుణ్ణి (1633-73) ఆశ్రితులు మన్నారు దాసుడిగా అభేదంగా భావించారు. ఈ బిరుదు ఆధారంగా ఈ కావ్యం రచింపబడింది. ఈ యక్షగానం రంగాజమ్మ రచన. 1630 ప్రాంతాలలో ఆమె దీన్ని రచించింది. తంజావూరు పాలకుడయిన విజయరాఘవ నాయకుడిని, రాజగోపాల స్వామి తిరువీధి మహోత్సవంలో కాంతిమతి అనే రాకుమారి చూచి మోహించి కబురు పంపింది. రాజు కూడా అనురక్తుడయ్యాడు. ఈ మోహానికి పూర్వజన్మ వాసన కారణమని తాతాచార్యులు చెప్పాడు. దీన్ని రంగాజీ గ్రంధస్థం చేసింది. ఇది అయిదాశ్వాశాల గ్రంథం. ఇదే కథను సౌందరి 'అల్లాడ విజయసింహ భూపతి సింహవిలాసము' అనే పేరుతో రచించింది.

2.9.4.6. విజయరాఘవ చంద్రికా విహారం : కామరసు వెంకటపతి సోమయాజి విజయరాఘవుడి ఆశ్రితుడు. ఇతడు రచించినదే ఈ నాటక చాటుకావ్యం. యక్షగానం. ఒకనాడు వెన్నెల వేళ పాదచారియై సానివాడకు వెళ్ళే విజయరాఘవుడిని చూచి నాటకశాల మగువ లీలావతి మోహించి కబురు చేసింది. ఆమెనె పెళ్ళాడి ఆమెతో కూడి సింహాసనం అధిష్ఠించటం కధ. ఇతడే 'విజయరాఘవనాయకుడు' అనే రచన వెలువర్చాడు.

2.9.4.7. విజయరాఘవ కళ్యాణం : విజయరాఘవుడు వేటకు వెళ్ళి మదనమంజరి అనే రాజపుత్రికను వివాహమాడటం కధగా 1670 ప్రాంతాలలో కోనేటి దీక్షిత చంద్రుడు రచించాడు.

ఈ కావ్య యక్షగానాలలో చరిత్ర ప్రాముఖ్యం కంటే, స్థానిక జీవిత ప్రాధాన్యం కంటే, వ్యక్తి స్తుతి స్ఫుటంగా కానవచ్చే విషయం.

2.9.5. యక్షగానాలు : ఇదే మార్గంలో మరిన్ని యక్షగానాలు వెలువడ్డాయి. శాహాజీని నాయకుడిగా చేసి ఆంధ్రపాణిని శేషాచలం 'శాహరాజ విలాసం' అనే యక్షగానంగా వ్రాశాడు. 1717 ప్రాంతాలకు చెందిన దర్భాగిరిరాజు శాహాజీని చూచి మోహితులైనట్లు స్త్రీలను చిత్రించాడు. 'శాహేంద్రవిజయం' 'రాజమోహన కొరవంజి' 'సర్వాంగ సుందరీవిలాసం' 'రాజకన్యా పరిణయం' 'లీలావతీ కళ్యాణం' ఈ యక్షగానాలు. 'అన్నింటిలోనూ కథ ఒక్కటే. ఎవరో రాజు కూతురో, సానికూతురో తంజావూరు ప్రభువును చూసి మరులుకొంటుంది. విరహంలో వేగుతుంది. దూతి చేత రాయబారం చేయిస్తుంది. చివరకు రాజును పెళ్ళాడుతుంది'. (67) శాహాజీ కాశ్మీరీ కన్యను వివాహమాడటాన్ని 'లీలావతీ శాహాజీరాయం'గా రూపవతిని వివాహమాడటాన్ని 'శాహమహారాజ కళ్యాణం' గావిబాలకవి సుబ్బన్న యక్షగానాలు రచించాడు.

'చిక్కదేవరాయ విలాసం' పేరిట ఇతని ఆస్థానకవి, చంద్రరేఖ వారకాంత అతణ్ణి చూచి మోహించి సుఖపడటం యక్షగానంగా వ్రాశాడు. చిక్కదేవరాయ పుత్రుడు కంఠీరవ నరసరాజు. ఇతడే నాయకుడిగా 'కొరవంజి కట్టె' రచించాడు. ఇది కంఠీరవ నరసరాజు స్వీయరచన.

2.9.6. మధుర మంగా పుంశ్చలీ లీలా విలాసం : మంగమ్మ చారిత్రక వ్యక్తి. ఈమె మధురను పాలించిన మహారాణి. అమె అరివీరభయంకరంగా 1684-1706

మధ్యకాలంలో మధురను పాలన చేసింది. మనుమడి కోసం రాజ్యం భ్రష్టం కాకుండా కాపాడింది. ఆమె దీక్షతో నేర్పుతో మధుర నాయక రాజ్యం పతనం కాకుండా కాపాడింది.

ఆ చారిత్రక వ్యక్తి మంగమ్మను గూర్చిన కావ్యం ఇది. దీనికర్త గోపాలయ్య. ఇందులో ఆమెను వ్యభిచారిగా చిత్రించటం ప్రధానాంశం. ఆమె శక్తి యుక్తులను గూర్చి కాదు, దీక్షాదక్షతలను గూర్చి కాదు, నైపుణ్య చాతుర్యాలను గూర్చి కాదు, ఆమె వ్యభిచారం గూర్చి ఈ రచన వెలువడింది. ఈ విషయం ఋజువు చేసే చారిత్రక ఆధారాలు లేవు. ఏ కారణం వల్లనో ఆమె అనాదరానికి గురి అయిన గోపాలయ్య ఈ కావ్యం వ్రాసి ఉంటాడని భావించే అవకాశం ఉంది. ఇది అధికంగా బూతులతో కూడి ఉంది. ఇటువంటి రచన నిజానికి పరిశీలనకు నోచుకోలేదు. అయితే మంగమ్మ చారిత్రక వ్యక్తిత్వం, ఈ బూతుగ్రంథం అందించటం వల్ల పరిశీలనార్హం అయింది.

2.9.7. విశేష చరిత్రలు : స్థానిక చరిత్రనో వ్యక్తి చరిత్రనో వంశ చరిత్రనో తెల్పే రచనలు ఇవి.

2.9.7.1. మధురా విజయం: వీరకంపరాయ అనే పేరున మధురా విజయాన్ని గంగాదేవి (1301-1400) సంస్కృతంలో వ్రాసింది. ఇది కంపరాయ యుద్ధాలను తెల్పే రచన, వీరకంపరాయల సతీమణి, రాజుతో పాటు యుద్ధభూమికేగి యుద్ధం చూచి, భర్త ప్రతాపం పరిశీలించి సమకాలంలో స్థానిక చరిత్ర అద్భుత కావ్యంగా అందించింది. సంస్కృతంలో ఉన్నప్పటికిని, తెలుగు కావ్యం కానప్పటికిని, ఆంధ్రదేశ స్థితిని నాటి దక్షిణదేశ భోగభాగ్యాలను, తెలుగు స్త్రీ సమజ్జ్వలతను తెలిసిన కావ్యం కావటం వల్ల గుర్తింపు పొందింది.

2.9.7.2. బేతాళ చరిత్ర : రేచర్ల రెడ్డి వీరులలో ప్రముఖుడు బేతాళ రెడ్డి. ఇతని వీర పరాక్రమాలను తెలిపే రచన బేతాళ చరిత్ర. 1770లో పిల్లలమఱ్ఱి బంగారు రంగప్ప దీనిని రచించాడు.

2.9.7.3. నవ భారతం : భారతం పేరిట ఉన్నా, భారత కథ కాని రచనలు చాలా ఉన్నాయి. ఇందులో ఒకటి 'నవ భారతం'. ఇది ఆధునిక చరిత్ర. పూసపాటి వంశ వృత్తాన్ని వ్యక్తం చేసే కృతి ఇది.

2.9.8. నవచోళ చరిత్ర : చోళులు తమిళాంధ్రదేశ పాలకులు. చారిత్రక వ్యక్తులు. కరికాళచోళుడు సుప్రసిద్ధ చక్రవర్తి. కరికాల చోళవంశ చక్రవర్తులు తొమ్మిది మందిని గూర్చి వెలువడ్డ ద్విపద కావ్యమిది. దీని కర్త పాలిశెట్టి లింగన. దీనిని ఐదాశ్వాల కావ్యంగా పాలిశెట్టి లింగన రచించాడు. ఇందులో తొమ్మిది మంది చోళుల కథ ఉంది. వీరందరూ శైవ భక్తులు. గొప్ప శివభక్తులుగా శైవ కావ్యాలలో చిత్రితమయ్యారు. కరికాల, విక్రమ, ఉత్తుంగ, అహివర, వరధర్మ, సత్యేంద్ర, మనజేంద్ర, వీర, ఉత్తమ చోళులు నవచోళులు. 'పశ్చిమ సముద్ర ప్రాంతాలలో ఉండే సాసలపురాన్ని పాలించే భైరవ రాజుకు పండితారాధ్యుడు ఈ కథలను చెప్పాడట... ప్రాచీనులైన చోడరాజులలో కరికాలచోళుడే సుప్రసిద్ధుడు. చారిత్రక వ్యక్తి'. (68)

2.9.9. రంగరాయచరిత్ర : దీనిని దిట్టకవి నారాయణ రచించాడు. ఇది బొబ్బిలి కథ. చారిత్రక ఘటనను ప్రబంధంగా వ్రాశాడు. ఇది 1790లో రచింపబడ్డ మూడాశ్వాసాల ప్రబంధం. ఇందులో వర్ణితమైన సంఘటన చిన్నది. ఇది స్థానిక చరిత్రకు నిదర్శనం. బొబ్బిలి సంస్థానం శౌర్యానికి ప్రతీక. ఈ పరాక్రమానికి వెరచి విజయనగరాధిపతి విజయరామరాజు వారిని జయించాలని ఆశించాడు. హైదరాబాదు నవాబు నిజామలీఖాను నుండి కళింగ సర్కార్లను పొంది రాజమహేంద్రవరం వచ్చి ఫ్రెంచి సేనాని బుస్సీ విడిది చేశాడు. కళింగ ప్రాంతపు రాజులందరినీ తమ దర్శనానికి ఆహ్వానించాడు. అందరితో విజయరామరాజు వచ్చాడు. కాని కారణాంతరాల వల్ల బొబ్బిలి రంగారావు రాలేదు. ఇది అవకాశంగా తీసుకొన్న విజయరామరాజు హైదర్‌జంగ్‌ను అనుకూలుడిగా చేసుకొని బుస్సీకి రంగారావుపై ఫిర్యాదులు చేశాడు. బుస్సీ శ్రీకాకుళం వద్ద విడిది చేసి మరోసారి బొబ్బిలి వారిని సందర్శనానికి ఆహ్వానించాడు. బొబ్బిలి రంగారావు వివిధ రకాలుగా నెరపిన రాయబారం విఫలమైంది. అది యుద్ధంగా పరిణమించింది. 1757లో జరిగిన ఒక్కరోజు పోరులో సర్వం నష్టమయిపోయింది. అపార జననష్టం వాటిల్లింది.

ఈ బొబ్బిలి వృత్తాంతం నాటక ప్రక్రియకు కావలసిన ఉద్వేగంతో ఉద్రిక్తతతో రసోచితంగా ఉంది. 1916లో వేదము వెంకటరాయశాస్త్రి బొబ్బిలి యుద్ధ నాటకాన్ని రచించాడు. దీన్ని కాళకూరి సాంబశివరావు రంగరాయ కదన సమవాకారముగా రూపొందించాడు. సరళ పద్యరచనలో పాత్రోచిత భాషతో శ్రీపాద కృష్ణమూర్తి వ్రాశారు. దీన్ని అశుభాంతంగా రచించాడు. తిరుపతి వెంకటకవులు 1928లో 'బొబ్బిలి రాజా పట్టాభిషేకాన్ని' వ్రాశాడు. ఇదే ఘట్టాన్ని భాగవతుల నృసింహశర్మ 'ప్రతిజ్ఞావిజయ రామరాజీయము'గా నాటకీకరించాడు. దీనిని యక్షగానంగా 'పెదబొబ్బిలి చరిత్రం'గా చెర్విరాల భాగయ్య రచించాడు.

'బొబ్బిలి యుద్ధము, దేసింగురాజు కథ, కుమార రాముని కథ, సర్వాయపాపని కథ మున్నగు చారిత్రక పద్యకావ్యములు తెలుగులో జనసామాన్యమున మిక్కిలి ప్రచారము పొందినవి'. (69)

2.10. స్వాతంత్రోద్యమ చరిత్ర : 1885లో అఖిల భారత కాంగ్రెసు ఏర్పడిన నాటి నుంచి క్రమంగా భారతీయుల హక్కులను గూర్చి, స్థానిక స్వపరిపాలనం గూర్చి, స్వాతంత్ర్యం గూర్చి, సంపూర్ణ స్వాతంత్ర్యం గూర్చి భారతీయులలో ఆలోచనా వికాసం కలిగింది. ఆ ఆలోచన సాధ్యమయిన కార్యరూపం, చర్యా రూపం పొందుతూరాసాగింది. భారతీయుల ఆందోళనలు దండి సత్యాగ్రహం అనే ఉప్పు సత్యాగ్రహం, సహాయ నిరాకరణోద్యమాలు, క్విట్ ఇండియా ఉద్యమాలు, గాంధీ నిరాహారదీక్షలు, విప్లవకారుల ఉద్యమాలు, ఆస్తులు దగ్ధం చేయటం, తెల్లవాళ్ళను చంపటం మొదలైన చర్యలు కొనసాగించారు. ఒకవైపు అహింసాయుతమైన సత్యాగ్రహాలు, మరోవైపు విప్లవ చర్యలు జరుగుతూ వచ్చాయి. అతివాదులు మితవాదులు స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొంటూ వచ్చారు. ఈ సమయంలోనే జాతీయోద్యమం కూడా మొదలైయింది. మొత్తం మీద

అంతర బాహిర కార్యక్రమాలు, అతివాద మితవాద కార్యకలాపాలు దేశ స్వాతంత్ర్యం వైపు జాతీయతా ప్రభోధంతో, అహింసా నేపథ్యంతో గాంధీ సత్యాగ్రహాయుధంతో భిన్న ప్రాంతాలలో విభిన్న దశల్లో ఒక అర్థశతాబ్ది కాలం ఉద్యమంగా విజృంభించ సాగింది.

ఆ ఉద్యమంలో భాగస్వాములుగా సంస్కర్తలూ ఉన్నారు. రాజకీయ నాయకులూ ఉన్నారు. సంస్కర్తలు సంఘంలో స్త్రీ సమానత్వ విషయికంగా, అస్పృశ్యతా నివారణంగా అంధ విశ్వాసాల మూఢాచారాల పరిత్యాజ్య మార్గంగా, మార్పును తెచ్చే ప్రయత్నం చేయసాగారు. రాజకీయంగా స్వాతంత్ర్యం కోసం ఉద్యమాలు చేపట్టిన వాళ్ళు కళాశాలలు మానటం అరెస్టు కావటం, జైళ్ళకు పోవటం ఆస్తులు వదులుకోవటం, వంటి విభిన్నరంగాలలో ముందుకు వచ్చారు. దేశవ్యాప్తంగా గాంధీనాయకత్వంలో కాంగ్రెసు కార్యక్రమాలు చెలామణీ అవుతూ వచ్చాయి. కాశ్మీరు స్వయంప్రతిపత్తి కాంక్షించసాగింది. సిక్కులు తమ అస్తిత్వం కోసం ఆకాంక్షిస్తూ వచ్చారు. దళితులు తమ రక్షణ కోరుకోసాగారు. భారతదేశం బ్రిటీషు ఇండియాగా, సంస్థానాల ఇండియాగా ఉండి, ఏకం కావటానికి సమస్యలను ఎదుర్కొంటూ వచ్చింది. ఆంగ్లేయులు భారతదేశం వదలి వెళ్ళక తప్పని స్థితిలో దేశానికి స్వాతంత్ర్యం ఇవ్వక తీరని పరిస్థితులలో నెమ్మనెమ్మదిగా సంస్కరణలు సైమన్ కమీషన్ పేరుతో, 1935 చట్టం పేరుతో, చేస్తూ స్వాతంత్ర్యోన్ముఖంగా ఆంగ్లేయులు కదలివస్తున్న దశ.

ఆ భారతదేశ స్వాతంత్ర్యం సముపార్జన కృషి భారత సాహిత్య లక్ష్యం అయింది. భారతదేశం అన్ని మూలల నుంచి స్వాతంత్ర్యో కాంక్షతో సాహిత్యం సృష్టి కాసాగింది. కవిత్వం ముందుగా ప్రభావితమయింది. పాటలు ప్రాణం పోసుకొన్నాయి. నాటకాలు వెలువడ్డాయి. నవలలు వచ్చాయి. జీవిత చరిత్రలు వచ్చాయి. ఆత్మకథలు వెలువడ్డాయి. ఈ సాహిత్యమంతా ప్రత్యక్షంగానో పరోక్షంగానో స్వాతంత్ర్యోదమ చరిత్రను తలదాల్చి నిల్చింది.

2.10.1. వ్యక్తి ప్రబోధం : ఈ ఉద్యమ భాగస్వాములైన పలువురు సంస్కర్తలు రాజకీయనాయకులు సాహిత్యావతరణకు కారణమయ్యారు. ఈ సాహిత్యం ఉద్యమ స్ఫూర్తిని కలిగించింది.

గాంధీ : గాంధీజీని గూర్చి స్వాతంత్రోద్యమంలో అతడు నెరపిన నాయకత్వాన్ని గూర్చి అతడు సాధించిన ఉద్యమ విజయాలను గూర్చి ఎన్నో రచనలు వెలువడ్డాయి. తుమ్మల సీతారామమూర్తి చౌదరి 'ఆత్మకథ' అనే అనువాద గ్రంథాన్ని మహాత్మకథ అనే స్వతంత్ర గ్రంథాన్ని సాహిత్యానికి అందించాడు. గాంధీని శ్రీకృష్ణుడిగా, భారతం, జాతీయోద్యమంగా భావించి మరిగాగంటి శేషాచార్యులు 'గాంధీ భారతం' వ్రాశాడు. 1921లో బెజవాడ అఖిల భారత కాంగ్రెసు సమావేశం జరిగింది. అక్కడికి వచ్చే గాంధీని దర్శించాలని జనుల పడే తాపత్రయాన్ని వర్ణిస్తూ మల్లాది అచ్యుతరామశాస్త్రి రచించిన కావ్యం 'మహాత్మాగాంధీ స్వాగతము'. గాంధీని ప్రస్తుతిస్తూ మునగపాటి విశ్వనాథశాస్త్రి 'గాంధీదేవుడు' వ్రాశాడు. జాతీయోద్యమ తీవ్రతను సమాజ ప్రతిస్పందనను గాంధీ పాత్రను మంగిపూడి వెంకటశర్మ 'శ్రీగాంధీ చరితామృతము'లో చిత్రించాడు. దోమా వేంకటస్వామిగుప్త గాంధీని 'పరంజ్యోతి'గా భావించాడు. గాంధీని భగవంతుడితో సమంగా

భావించడం గంధీపై ౯ొకి నిదర్శనం. 'గాంధీమహాత్ముని దశావతార లీలలు' మధురకవి నాళముకృష్ణారావుకు ఉన్న భక్తికి నిదర్శనం. పుట్టపర్తి కనకమ్మ, నారాయణాచార్యులు దంపతులు వ్రాసిన 'గాంధీజీ మహాప్రస్థానం' స్మృతి కావ్యం, గాంధీ జీవితాన్ని 'ఆత్మసమర్పణం'గా పల్లెపూర్ల ప్రజ్ఞాచార్యులు రచించాడు. గాంధీని 'భారతజ్యోతి'గా రేవూరి సుబ్బారావు చిత్రించాడు. 'బాపూజీ'గా జాషువా రచించాడు.

మోతీలాల్ నెహ్రూ : ఇతడు రాజకీయవేత్త. స్వాతంత్ర్య పోరాటవీరుడు. 1931లో గాంధీజీ ఇర్విన్ ఒప్పందం జరిగింది అతని మరణం సంభవించిన రోజు అది. ఇతని స్మృత్యర్థం కర్ణవీర నాగేశ్వరకవి 'మోతీలాల్‌జీ నిర్యాణం' వ్రాశాడు.

నెహ్రూ : భారత స్వాతంత్రోద్యమ చరిత్రలో గాంధీ తరువాత కనిపించే వ్యక్తి నెహ్రూ. నెహ్రూ ఆత్మకథను కొండవీటి వెంకటకవి 'నెహ్రూ చరిత్ర'గా అనువదించాడు. ఈ అనువాదంలో కొంత స్వతంత్రత తీసుకొని, స్వాతంత్ర్య పోరాటాన్ని ఎక్కువగా అనువదించాడు.

నేతాజి : స్వాతంత్ర్య వీరుడు సుభాష్ చంద్రబోస్. గాంధీవాదుల మితవాదాన్ని వ్యతిరేకించాడు. యువకులను ఉగ్రూతలూగించి విప్లవానికి పూనుకొన్న నాయకుడు. పరిస్థితులు అనుకూలించి ఉంటే చరిత్ర మరో విధంగా రాసే అవకాశం కల్పించేవాడు. ఇలాంటి 'నేతాజీ'ని గుఱ్ఱం జాషువా, అతని అజ్ఞాతాన్ని, ఢిల్లీకోట విచారణని ఉండేల మాలకొండారెడ్డి రచించారు. నూకలసుబ్బారావు గుప్తా 'సుభాష్ చంద్రబోస్ జీవిత చరిత్ర'ను కావ్యంగా రూపొందించాడు. దాదాబాయి నౌరోజి పారశీకుడు. భారతదేశం కొరకు బ్రిటీషు పార్లమెంటుకు ఎన్నికై పోరాడిన వ్యక్తి. ఇతని చరితాన్ని మంత్రి ప్రగడ భుజంగరావు 'దాదాబాయి నౌరోజి చరిత్ర'గా వ్రాశాడు. చివుకులు పెద వెంకటాచలపతి రచించిన 'బంధవిముక్తి'లో నౌరోజి, తిలక్, భగత్‌సింగ్‌లను ప్రస్తుతించారు. లాలాలజపతిరాయి స్వదేశీ ఉద్యమమూర్తులలో లజపతిరాయ్ ముఖ్యుడు. ప్రజాజీవితంలో స్వదేశీ ఉద్యమం ముడిపడాలన్నాడు. ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవం మనిషికి అత్యంతవసరం అన్నాడు.. ఇటువంటి దేశభక్తుణ్ణి గూర్చి చెరుకువాడు వెంకట్రామయ్య 'లాలాలజపతిరాయి' అనే లఘుకావ్యం రచించాడు.

గోపాలకృష్ణ గోఖలే : భారతీయుల హక్కుల కోసం పోరాడిన వ్యక్తి. 'గోఖలే చరిత్రము'ను నిర్వచన ప్రబంధంగా మంత్రి ప్రగడ భుజంగరావు వ్రాశాడు. తిలక్ లోకమాన్య బాలగంగాధర్ తిలక్ లాల్‌పాల్ బాల్‌గా ప్రఖ్యాతి గాంచిన మితవాదులత్రయంలో ఒకడు. ఇతడి జీవితాన్ని 'లోకమాన్య తిలక్' చెళ్ళపిళ్ళ వెంకటేశ్వర కవి కావ్యీకరించాడు. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య : ఆంధ్రంలో పన్నుల నిరాకరణోద్యమంలో చీరాల పేరాల ప్రాంతం అనగానే గోపాలకృష్ణయ్య కళ్ళెదుట నిలుస్తాడు. ఆంధ్రరత్న మరణంతో చలించిన కర్లపాలెం కృష్ణారావు 'ఆంధ్రరత్న స్మృతి'ని రచించాడు. కొండా వెంకటప్పయ్య : దేశభక్త కొండా వెంకటప్పయ్య ఆంధ్రదేశ జాతీయోద్యమ నేతలలో ఒకడు. ఇతడి నాయకత్వాన్ని 'దేశభక్తు'డుగా జంధ్యాల అయ్యశాస్త్రి రచించాడు.

2.10.2. దేశ సంఘటనలు : భారతదేశంలో జరిగిన విభిన్న సంఘటనలు ాహిత్య సృష్టికి మూలమయ్యాయి. వాటి ఆధారంగా సాహిత్యం అవతరించింది. 1905లో ంగదేశ విభజన వందేమాతర ఉద్యమానికి నాంది అయింది. దీనిని ఆశ్రయించుకొని న్నో ఖండకావ్యాలు పాటలు హరికథలు వచ్చాయి. చన్నా ప్రగడభానుమూర్తి ందేమాతరం' వ్రాశాడు. పేరు తెలియని కర్త రచించిన 'మేలుకొలుపు' కూడా ఇదే వకు చెందింది. 1931లో లోబద్దిరెడ్డి కోటేశ్వరరావు 'వందేమాతరం' రచించాడు. 1919లో రిగిన జలియన్ వాలాబాగ్ దురంతం యావద్భారతాన్ని కుదిపివేసింది. ఈ దురంతాన్ని ార్చి ఉమర్ ఆలీషా తన 'గ్రంథాలయములు'లోని పద్యాలలో వ్రాశాడు. జాస్తి వెంకట రసయ్య 'దేశభక్తులు' వ్రాశాడు. 1921లో తలెత్తిన స్వదేశీ ఉద్యమం జాతీయతను ంపొందించటానికి ఎంతో సహకరించింది. పరదేశ వస్తు బహిష్కరణను శాసిస్తూ ్వదేశీయోద్యమాన్ని బలపరుస్తూ పంగనామముల రామచంద్రరావు 'భారతోద్బోధము' ాశాడు. సహాయ నిరాకరణోద్యమాన్ని చాటుతూ పిశుపాటి నారాయణశాస్త్రి 'చీరాల పేరాల ్నవాసం' వ్రాశాడు.

ఉప్పు సత్యాగ్రహోద్యమాన్ని ఉత్తేజపూరితంగా 'వీరధర్మము'లో తుమ్మల ీతారామమూర్తి రచించాడు. బాలచంద్రుడి కథను గ్రహించి చెప్పాడు. ఉప్పు సత్యాగ్రహంపై ఉత్తమ రచనను బసవరాజు అప్పారావు అందించాడు. గాంధీ ఇర్విన్ ఒప్పందం -4-1931లో జరిగింది. దీనిని 'గాంధీ ఇర్వినుల ఒడంబడిక'ను ఆదిపూడి సోమనాథరావు చించాడు. ఈ ఒప్పందాన్ని అనుసరించి రెండవ రౌండు టేబుల్ కాన్ఫరెన్సుకు హాజరు ావడానికి గాంధీ అంగీకరించాడు. 'గాంధీ రాయబారం'గా మున్నంగి శర్మ వ్రాశాడు. కొన్నేటి సూరి 'అరుణ రేఖలు' క్విటిండియా ఉద్యమ నేపథ్యంలో వచ్చిన గేయం. క్విట్ ఇండియా ఉద్యమాన్ని తలపిస్తూ మిక్కిలినేని భగవంతరావు 'విద్యార్థుల వీరగేయాలు' రచించాడు అగస్టు విప్లవం 1942 ఘట్టం. దీన్ని 5వేల పద్యాలలో పిళ్లా వెంకటరత్నకవి అగస్టు విప్లవములో ఆనందరాయలు'అని రచించాడు. కాశీ విశ్వనాథం 'మార్చింగ్ సాంగ్' ఉత్తేజాన్ని రేకెత్తించే ఆగస్టు విప్లవంపై గీతం.

2.10.3. సంస్కరణ దృష్టి : అంధ విశ్వాసాలు, మూఢాచారాలు తొలగించటం స్త్రీల పట్ల హరిజనుల పట్ల, సానుభూతి ప్రకటించటం ఈ సాహిత్య దృష్టి అయింది. అన్నింటి కంటే అస్పృశ్యత నిరసనం ఎక్కువ. జాతీయైక్యతకు అది అటంకంగా ఉండటంతో దానిని నివారించటం తప్పని సరి అని అందరూ భావించారు. అందుకే అస్పృశ్యతా నివారణ అవసరం అనే ప్రాథమిక విషయం నేపథ్యంతో కవిత్వం సాహిత్యం ఆవిర్భవించింది. 1909లో గాంధీ ఇంకా ఉద్యమ ప్రవేశం చేయకమునుపే అస్పృశ్యతను వ్యతిరేకిస్తూ కర్త తెలియని 'మాలవాండ్ర పాట' కనిపిస్తుంది. 1915లో వెలువడిన నిరుద్ధ భారతము అస్పృశ్యతను వ్యతిరేకించే ప్రథమ కావ్యం. దీనిని మంగిపూడి వెంకటశర్మ రచించాడు. గబ్బిలము గుఱ్ఱం జాషువా సృష్టి. ఇందులో అస్పృశ్యుల ఆవేదన చిత్రితం. ఇతని అనాథ కూడా ఈ మార్గంలో సాగింది. 'పంచముడు, భాష్ప సందేశ'మనే ఖండికలు ఈ దృష్టినే కలిగించాయి. హిందూ జాతి ముందడుగు వేయాలంటే అడుగు వర్గాన్ని

ఉద్ధరించాలంటూ 'అస్పృశ్యుల విజ్ఞప్తి'ని కర్లవీర నాగేశ్వరరావు రచించాడు. జి.జోసవు వ్రాసిన 'కన్నీటి కబురు' ఆర్ధమయిన కథాంశం. తన జాతి అనుభవిస్తున్న హింసలను కె.సి.జాను అస్పృశ్యతను ఖండిస్తూ 'బహిష్కారము'లో చిత్రించాడు. వేలూరి శివరామశాస్త్రి వ్రాసిన 'దేవాలయ ప్రవేశ' ఖండిక అస్పృశ్యతను నిరసించేది. కర్లపాలెం రచించిన 'మల్లెపూలు'లో 'హరిజన సమస్య' ఒక ఖండిక; కాటూరి వేంకటేశ్వరావు వ్రాసిన 'గుడిగంటలు' అస్పృశ్యుల ఆవేదనకు అద్దం పట్టే రచన.

2.10.4. ప్రబోధం: దేశ స్వాతంత్ర్యం కోసం జాతీయోద్యమం కోసం నడుం కట్టమని కదన రంగంలోకి ఉరకమని ప్రబోధించిన సాహిత్యం వెలువడింది. ఈ ప్రబోధ సాహిత్యం రెండు విధాలుగా ఉంది. ఒకటి ప్రత్యక్ష పద్ధతి. ఇది స్పష్టమయిన ప్రబోధం కలిగిన సాహిత్యం సృష్టించింది మరొకటి. పరోక్ష పద్ధతి. ఇది ధ్వన్యాత్మకంగా సాహిత్య సృష్టికి కారణమయింది. వ్రాసేది శివాజీ జీవితం చారిత్రకమే అయినా స్వాతంత్ర్యోద్యమాన్ని బలపరచటానికి సాహిత్యం ఉద్దిష్టమయిన సందర్భమిది. స్వాతంత్ర్యం, జాతీయత ప్రబోధం చేసే సాహిత్యం సృష్టి పొందింది.

స్వాతంత్ర్యోద్యమ సాహిత్యంలో దేశ సంబంధి, చరిత్ర సంబంధి, ప్రబోధ సంబంధి, ప్రచారం సంబంధి, సాహిత్య మాత్రమే ఇక్కడ ప్రస్తావన పొందింది. స్వాతంత్ర్యం మానవాభ్యుదయం మార్గం కూడా అవుతుంది. కాబట్టి మానవాభ్యుదయం ప్రకటించే సాహిత్యం ఆ సందర్భంలో పరిశీలించటమవుతుంది. స్థూలంగా స్వాతంత్ర్యోద్యమంలోని చారిత్రాంశాలకు సంబంధించిన సాహిత్యం ప్రస్తుతం పరిశీలనం పొందుతుంది. మానవాభ్యుదయం ప్రకటించే సాహిత్యం ప్రకరణాంతరంలో పరిశీలనం పొందుతుంది.

జాతీయోద్యమానుగుణంగా ప్రజలను ఆయత్తపరచటానికి ఉత్తేజితం చేయటానికి పుంఖాను పుంఖాలుగా రచనలు వెలువడ్డాయి. అయితే అధికంగా ఇవి స్వాతంత్ర్యోద్యమ ఘట్టాలకు అనుగుణంగా రావటం వల్ల వాటిని ఆ కోవలో పేర్కొనటం జరిగింది. మంగిపూడి వేంకటశర్మ 'భారతమాత' పేరిట ప్రాచీన భారతదేశ గొప్పతనాన్ని చాటాడు. మంగిపూడి పురుషోత్తమ శర్మ మొదటి ప్రపంచ యుద్ధానంతరం తమకు స్వేచ్ఛ లభిస్తుందనే ఆశతో ఆంగ్లేయులకు సహకరించటాన్ని 'హంసలు-నెమళ్ళు'లో వ్రాశాడు. జాతీయ దృక్పథంతో జాతీయాభిమానంతో గురజాడ వేంకట అప్పారావు 'దేశభక్తి' గేయాన్ని రచించాడు. సమకాలీన ఆంగ్లపాలన, పాలనా వ్యవస్థ పట్ల నిరసన దానివల్ల వెల్లుబికిన జాతీయతా భావం నేపథ్యంగా ఈ రచన చేశాడు. ఇదే పంథాలో సాగిన రచన రాయప్రోలు 'జాతీయత' 'జన్మభూమి' వంటి ఖండికలు. బలిజేపల్లి లక్ష్మీకాంతం రచించిన 'స్వరాజ్యరథము' 'స్వరాజ్య సమస్య' స్వరాజ్య కాంక్షను వెల్లడి చేసే ఖండకావ్యాలు. స్వాతంత్ర్య కాంక్షను గరిమెళ్ల సత్యనారాయణ 'మాకొద్దీ తెల్లదొరతనము' పేరిట ప్రజలలో వెల్లుబికించారు. కాశీనాధుని మల్లయ్య రచించిన 'స్వరాజ్య ప్రబోధము'లో గాంధీ తిలక్ స్తుతి స్వరాజ్య కాంక్ష వ్యక్తమయ్యాయి. వివిధ ఖండికలతో స్వాతంత్ర్యేచ్ఛ వ్యక్తం చేస్తూ సుబ్రహ్మణ్య భాగవతులు 'భారతమాత'ను వెలువర్చాడు. 'స్వరాజ్యము' కోసం నాయకులు పడిన తాపత్రయాన్ని కృషిని బండారు అంజనేయులు వర్ణించాడు.

'జయభేరి' ఖండకావ్యం జాస్తి వెంకటనరసయ్య రచన. జాతీయోద్యమ ఉదంతాలన్ని ఇందులో నిక్షిప్తమయ్యాంశ. దేశభక్తి మూలబిందువుగా అక్కిరాజు రాఘవరావు 'దేశభక్తి' కృతి రచించాడు. వీరిలాగే జాతీయోద్యమ భావాలతో జాషువా, దువ్వూరి రామిరెడ్డి, చిలమకర్తి లక్ష్మీనరసింహరావు, కవికొండల వెంకటరావు, త్రిపురనేని రామస్వామి చౌదరి వంటి వారెందరో కవిత్వాన్ని వెలువర్చారు. ముఖ్యంగా పేర్కొనదగినవి- విశ్వనాథ రచించిన ఝాన్సీరాణి, ప్రభోద కావ్యాలలో ఉత్తమ శ్రేణిలో నిల్చే పండిత సీతారామశాస్త్రి రచించిన 'ప్రభోద', గురజాడ రాఘవశర్మ మహాత్ముడి గూర్చి వ్రాసిన 'నవకాళి' మహాదాది వెంకటరత్నం రచించిన 'విశ్వభారతి' ముదిగొండ వీరభద్రరావు రచించిన 'భారత స్వాతంత్ర్య సంగ్రామము' వంటివి.

పరోక్షంగా జాతీయ ప్రభోదం చేయడానికి ఆంధ్రజాతి, భారతజాతి రెండు ఎంతో ఉపయోగపడ్డాయి. తమ జాతి పూర్వవైభవాన్ని చరిత్రను, చారిత్రక వ్యక్తులను అభివర్ణించడం ద్వారా జాతీయైక్యతకు ప్రయత్నాలు జరిగాయి. దీనికి ప్రత్యేకాంధ్ర ఉద్యమం ఎంతో సహకరించింది.

మంగిపూడి వేంకటశర్మ రచించిన 'ఆంధ్రమాతృస్తవం' ప్రథమాంధ్రోద్యమ కృతి అనదగ్గ కావ్యం. ఈ పంథాలోనే 'ఆంధ్రమాత' రచించాడు. గడ్డం కొండారెడ్డి 'ఆంధ్రమాతృస్తవము' పేరిట ప్రాచీనాంధ్ర వైభవాన్ని ప్రస్తుతించాడు. 'ఆంధ్రసంవత్సరాది' పేరిట మండపాక పార్వతీశ్వర శాస్త్రి ఆంధ్రుల గొప్పతనాన్ని చాటాడు. ఆంధ్రుల వర్తమానాన్ని వ్యక్తం చేస్తూ, భవిష్యత్కర్తవ్యాన్ని సూచిస్తూ గాదెజగన్నాథ స్వామి 'ఆంధ్రమాతృ విలాపము' వ్రాశాడు. రాయప్రోలు రచనలతో ఆంధ్రోద్యమం ఒక స్ఫూర్తి, సంపూర్ణ రూపం సంతరించుకొంది. 'ఆంధ్రావళి, ప్రభోదము, ఆంధ్రమాత, తెనుగు తల్లి' రాయప్రోలు ఖండికలు. ప్రాచీనాంధ్రుల పౌరుషాన్ని ప్రేరేపించే రచనలే ఏటుకూరి వెంకట నరసయ్య రచించిన 'మగువ మాంచాల' నాయకురాలు. ఆంధ్ర పౌరుష ప్రసక్తితో వెలువడినవే విశ్వనాథుని 'ఆంధ్రప్రశస్తి, ఆంధ్రపౌరుషము', తుమ్మల సీతారామమూర్తి చౌదరి 'రాష్ట్రగానము', సూర్యనారాయణశాస్త్రి రచించిన 'ఖడ్గ తిక్కన', ఆంధ్రపౌరుషాన్ని, ఆంధ్రాభిమానాన్ని వ్యక్తీకరించే రచన. ఆంధ్రైశ్వర్యాన్ని కళలను వ్యక్తం చేసే రచనల్లో హంపీ క్షేత్ర ప్రశస్తిని చాటే 'హంపీ క్షేత్రము' పేర్కొనదగింది. విదేశాలలో ఉన్నా ఆంధ్రాభిమానం వీడని ఆంధ్రుడి అంతరంగాన్ని కొడాలి సుబ్బారావు చక్కగా ఆవిష్కరించాడు. శైవక్షేత్రమైన 'ద్రాక్షారామము'ను గూర్చి ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి కొంత ఆంధ్రాభిమాన్ని జోడించి ప్రస్తుతించాడు. 'ఓరుగల్లు కోట' శ్రీనివాస సోదరులు రచించారు. ప్రతాపరుద్రుడు, రుద్రమదేవి పాత్రలలో పౌరుషాన్ని శౌర్యాన్ని వ్యక్తం చేశాడు. పుట్టపర్తి నారాయణాచార్యులు 'పెనుగొండ లక్ష్మి' క్షేత్ర ప్రాశస్త్య కావ్యాలలో ప్రథమం అనదగ్గది. 'కళాక్షేత్రం' కావ్యంలో బౌద్ధమత నిలయమైన నాగార్జున కొండ వైభవాన్ని బోడేపూడి వెంకటరావు రచించాడు. ఆంధ్ర దేశంలోని నదీ ప్రాశస్త్యాన్ని చాటుతూ ఆంధ్రజాతీయభావాన్ని కల్పించడానికి ప్రయత్నించిన రచనలు కొన్ని. విశ్వనాథ సత్యనారాయణ కృష్ణా గోదావరి పెన్నాలను ప్రస్తుతిస్తే, జాషువా అఖండ గౌతమిని, కందుకూరి రామభద్రరావు 'గోదావరి'ని పెనుమర్తి వెంకటరత్నం కృష్ణవేణిని ప్రస్తుతించారు.

2.10.5. కావ్యాలు : జాతీయాభిమాన్ని ప్రతిపాదించి ప్రేరేపించిన కావ్యాలు కొన్ని. ఇవి ప్రత్యక్షంగా చారిత్రక కావ్యాలు. పరోక్షంగా జాతీయ భావ ప్రబోధాలు. జాతీయోద్యమ భావాశ్రితాలుగా ఉన్న ఈ కావ్యాలు ఆంధ్రచరిత్రను, జాతీయ చరిత్రను ప్రదర్శించాయి. ఈ చారిత్రక రచనల్లో ప్రముఖ ప్రఖ్యాత కావ్యాలు కొన్ని.

2.10.5.1. చండనృపాల చరిత్ర : రాజశేఖర శతావధాని రచించిన చారిత్రక కావ్యమిది. 1934లో వెలువడిన కావ్యానికి మూలం కల్నల్ జేమ్స్‌టాడ్ రచించిన Annals and Antiquitieis of Rajasthan. ఇది మేవాడు రాజ్య చరిత్ర. మూల గ్రంథంలో ఓ భాగం చండుడనే రాజు తన సవతి సోదరుడయిన 'ముకుళు'ని మేవాడు రాజ్యానికి పట్టాభిషిక్తుని చేసి తమ్ముడి ప్రతినిధిగా రాజ్యాన్ని ఏలాడు.

2.10.5.2. రాణాప్రతాపసింహ చరిత్ర : 1934లో రాజశేఖర శతావధాని టాడ్ రచన నుంచే మూలాన్ని గ్రహించి రచించాడు. ప్రతాపసింహుడు (1572-97) చారిత్రక పురుషుడు మొగలుల పాలనను ఎదిరించాడు. అక్బరు సామ్రాజ్య కాంక్షకు అడ్డుగా నిల్చి పోరాడిన వాడు ప్రతాపసింహుడు. జాతీయ నేపథ్యంలో ఈ రాజపుత్రుని చరిత్ర గ్రహించి ఉత్తేజ పరిచేటట్లు ఈ చరిత్రను రచించాడు. ప్రతాపుడు రాజ్యానికి రావడం అక్బరు సేనలను ఎదుర్కోవటం, విజయం సాధించడం, ఐదు అశ్వాసాల కావ్యంగా రచించాడు.

2.10.5.3. అమరసింహ చరిత్ర : 1950లో రాజశేఖర శతావధాని, టాడ్ రాజస్థాన్ చరిత్ర నుంచి గ్రహించి రచించాడు. ప్రతాపసింహుడి పుత్రుడి కథ. 1597లో అధికారంలోకి వచ్చి భోగలాలసుడయి ఉంటే మంత్రి సలుంబ్రా సాహసించి కర్తవ్యాన్ని నిర్వర్తించటం ఇతివృత్తం.

రాజశేఖర శతావధాని మూడు రచనల్లోనూ చారిత్రక వ్యక్తులే ఉన్నా, ప్రసిద్ధి గాంచిన గాథ మాత్రం రాణాప్రతాపసింహుడు. ఇతనిని గూర్చి రచించిన చారిత్రక కావ్యం చారిత్రక కావ్యాలలో ఎన్నదగ్గది. చారిత్రకంగా ప్రసిద్ధుడయిన వ్యక్తి చరిత్ర వీర రస భరితంగా ఉత్సాహ జనకంగా చెప్పినప్పుడు కలిగే ఉత్తేజం అనన్యం. తద్వారా రచనా లక్ష్యమయిన జాతీయతా భావం సులువుగా వ్యాప్తి చెందుతుంది. స్వాతంత్ర్య కాంక్షకు బలాన్నిస్తుంది. కనుకనే రాణాప్రతాపసింహ చరిత్ర అంత విజయవంతమైన చారిత్రక కావ్యంగా నిల్చింది.

2.10.5.4. శివభారతం : గడియారము వేంకట శేషశాస్త్రి రచించిన ఆధునిక కావ్యం. ఆధునిక చరిత్రకు సంబంధించిన రచన. జాతీయ సమైక్యతను ప్రేరేపించే రచన. మహారాష్ట్రీయుడి చరిత్రను ఆంధ్రుడు అక్షరమాలగా రూపొందించిన ఘనతర ఘట్టం.

శివాజి (1627-80) చారిత్రక పురుషుడు. మహారాష్ట్ర నాయకుడు. మొగల్ సల్తనత్ నుంచి భారత దేశానికి ముక్తి సంపాదించడానికి నిరంతరం శ్రమించాడు. మొగల్ పాలకుడు ఔరంగజేబుకు నిత్యం పక్కలో బల్లెమయి నిల్చాడు. శివాజి చేతిలో అఫ్జల్‌ఖాన్

వధ (1659), షయిస్తఖాన్ (1663) చారిత్రక సత్యాలు. మొగలులకు బంధీ అయిన తప్పించుకోవటం జనులకు ఉత్సుకత రేపే ఘట్టం. శివాజి పట్టాభిషేకం (1674) మరో ముఖ్య ఘట్టం. వీరుడు సాహసవంతుడు అయిన శివాజి భారతదేశానికై పాటు పడటం శివభారతంగా రూపొందింది.

శివభారతం 1942లో రచితమైన కావ్యం. ఇది ఎనిమిది ఆశ్వాసాల రచన. రచనా ధోరణి వల్ల దీనిని సంప్రదాయ కావ్యమనీ అంటారు. 'భారత స్వాతంత్ర్య సంగ్రామము పరాకాష్ఠదశలో నున్నప్పుడు, భారతీయత్వమును మొగలుల నుండి రక్షించుటకు బ్రతుకు నేర్పించిన శివాజీ జీవితమును శివభారతముగ....' (70) వ్రాశాడు. దీనిని 'శివాజీ ప్రబంధము'నీ అన్నారు. 'గ్రంధమున నాయక ప్రధానముగ భావించిన, 'ప్రబంధ' మగును. లేదా దృశ్యకావ్యమగును. భారత జాతీయతా ప్రధానముగ పరిగణించిన, 'భారతము' అగును. చరిత్రాంశ ప్రధానమని ఎంచిన చరిత్ర అగును'. (71) మహారాష్ట్ర దాస్య విమోచనం కథగా ఉన్న జాతీయోద్యమ స్ఫూర్తిదాయక కావ్యం ఇది. శివాజీ జనన నేపథ్యం, జననం, వివాహం, షాజీ నిర్బంధం, శివాజీ చర్యలు, అఫ్జల్‌ఖాన్ వధ, షయిస్తఖాన్ పరాజయం, శివాజీ నిర్బంధం, సింహఘడ్ విజయం, పట్టాభిషేకం వంటి చారిత్రకాంశాలు కనిపిస్తాయి ఈ కావ్యంలో. 'సంఘము, వ్యవస్థ, మతము, జాతి, దేశము, వర్గసామరస్యము, సమష్టి ప్రయత్నము వంటి ఇతివృత్తములను నిర్మాణాత్మకముగ బాధ్యతాయుతముగ, ఉదాత్తముగ చిత్రించిన కావ్యములు ప్రాచీన, అధునాతన సాహిత్యములందురు. ఇరువదవ శతాబ్దములో ఒక నాటకము ఒక నవల ఒక కావ్యము మాత్రమే పని చేసినవి. అవి 'కన్యాశుల్కము' 'మాలపల్లి' 'శివభారతము'. (72)

2.10.5.5. ఆంధ్రపురాణం : దీని కర్త మధునాంపతుల సత్యనారాయణశాస్త్రి. ఆంధ్రజాతి చరిత్ర దర్పణం. దీనిలోఉదయ శాతవాహన చాళుక్య కాకతీయ పునఃప్రతిష్ఠ విద్యానగర శ్రీకృష్ణదేవరాయ విజయ నాయకరాజ పర్వాలు తొమ్మిది ఉన్నాయి. ఇందులో ఆంధ్ర జాతి చరిత్ర వర్ణించాడు. 1954లో నాలుగు 1964లో ఐదు పర్వాలుగా వెలిసింది. రఘువంశం ఆధారంగా బహునాయకమైనా ఆంధ్రపాలకుల కథను గ్రహించి రచించాడు. విస్తృత గ్రంథం రసవంతంగా అందించాడు.

బోడేపూడి వెంకటరావు తళ్ళికోట యుద్ధగాథను 'ఆంధ్రతేజం'గా రచించాడు. జాషువ 'శివాజీ ప్రబంధం' రచించాడు. ఔరంగజేబు పాలనలో తిరుగుబాట్లు అధికం. తేజ్‌బహుద్దూర్, ఔరంగజేబును ఎదిరించి, దొరికిపోయి, మృతి చెందే వరకు లోబడకుండా ఉండటాన్ని తుమ్మల సీతారామ చౌదరి 'ఆదర్శవీరుడు' రచించాడు. మంగిపూడి వెంకటశర్మ రచించిన 'దుర్గావతి' గోండు సామ్రాజ్ఞి కథ. పుట్టపర్తి నారాయణాచార్యులు రచించిన 'షాజీ' మరో గొప్ప జాతీయ ప్రబోధాత్మక కావ్యం. జంధ్యాల పాపయ్య శాస్త్రి రచించిన 'విజయశ్రీ' సుశర్మ రచించిన 'బుద్ధదయామాత' పరోక్ష ప్రబోధాలే. పురాణ ఇతిహాస పాత్రాధారంగా ఎన్నో రచనలు వెలువడ్డాయి. పెనుమర్తి వెంకటరత్నం సత్యభామా పౌరుషాన్ని 'దీపావళి నాడు'గా రచించాడు. 'ద్రౌపదీ సందేశము'లో దువ్వూరి రామిరెడ్డి దుర్యోధనాదులను ఎత్తిచూపి జాతీయతను రగిల్చ ప్రయత్నించాడు. ద్రౌపదిని

భారతావనిగా పోల్చి చామర్తి రాజశేఖర రావు 'పాంచాలీ సాంత్వనము' రచించాడు. సీతారాముల 'ధనుర్భంగము'లో కరుణశ్రీ జాతీయ భావాన్ని స్మరింపచేశాడు. వీరగాథలుగా ఉన్న చారిత్రక కావ్యాలలో గుంటూరు మండలానికి సంబంధించిన 'వీరభారతం' పేర్కొనదగిన రచన. పాణ్యం నరసరామయ్య రచించిన 'స్వాతంత్ర్య వీరుడు' ఉయ్యాల వాడ నరసింహారెడ్డి గాధ. కెప్టెన్ వాట్సన్‌తో నరసింహారెడ్డి చేసిన పోరాటం ఇందులో వర్ణింపబడింది.

2.10.6. నాటకం : మొగలు సామ్రాజ్యాధిపత్యం భారతదేశంపై చాలా కాలం ఉంది. అందులో ప్రఖ్యాతి గాంచిన చివరి రాజు ఔరంగజేబు. ఇతని కాలంలో ఆరంభమైన తిరుగుబాట్లు అనేకం. ఆందులో మహారాష్ట్ర నాయకుడు శివాజీ చేసిన తిరుగుబాట్లు చెప్పుకోదగ్గవి. ఈ శివాజీ పట్ల ఔరంగజేబు సోదరి రోషనారా అనురక్త కావటం, నిరాకృత అయి దుఃఖించటం అనే అంశాలతో వీరిరువరి పాత్రలతో పలువురు రచనలు చేశారు. అందులో ప్రథముడు ధర్మవరం కృష్ణమాచార్యులు. ఇతడు రచించిన 'రోషనారా శివాజీ' ఈకోవకు చెందిందే. 'శివాజీ' అనే నాటకాన్ని అయిదంకాలుగా 1897లో వి.శ్రీనివాసాచార్యులు రచించాడు. 'శివాజి విజయము' పేరిట కేతవరపు రామకృష్ణ శాస్త్రి శివాజీ కథను నాటకీకరించాడు. శివాజీని వలచి నిరాకృత అయిపగ బూని విఫలయై రోషనార మరణించటం కథగా కొప్పరపు సుబ్బారావు 'రోషనార'ను విషాదాంతంగా చిత్రించాడు.

ప్రతాపరుద్రుడు చారిత్రక వ్యక్తి. ప్రతాపరుద్రుణ్ని మహ్మదీయులోడించి బందీని చేసిన చరిత్రను వేదము వెంకటరాయశాస్త్రి 'ప్రతాపరుద్రీయము' స్వతంత్ర నాటకంగా రచించాడు. తరుష్కులలో గొప్ప రాజ్ఞి అహ్మదు నగరును పాలించిన 'సుల్తాన్ చాంద్‌బీ'. ఈమెను గూర్చి కోలాచలం శ్రీనివాసరావు విషాదాంత నాటకం వ్రాశాడు. 'పీష్వా నారాయణరావు' నాటకాన్ని 1912లో ద్రోణంరాజు సత్యనారాయణ రచించాడు. మహారాష్ట్రీయుడయిన 'పీష్వా నారాయణరావు వధ'ను 1929లో యలమర్తి శ్రీనివాసరావు రచించాడు.

చాణక్యుడికి నందడుకి శత్రుత్వం ఉందని చరిత్ర చెప్తుంది. దీనినాధారంగా చేసుకొని పానుగంటి లక్ష్మీ నరసింహారావు 'ప్రచండ చాణక్యము' రచించాడు. ఇందులో చాణక్యుడు నందుని చంపి, నవనందులను వారి తల్లిముందే చంపినట్లు చిత్రితమైంది. వీరివురిపై అనేక రచనలు వెలువడ్డాయి. 'చాణక్య'ను కడప వేణుగోపాలరెడ్డి రచించాడు. వేదంవెంకటాచలయ్య 'నందుని చరిత్ర'ను నాటకీకరించాడు. వీరకథను 'నందవధము' పేరిట 1913లో భమిడిపాటి చినయజ్ఞనారాయణ శర్మ రచించాడు.

2.10.7. నవల : నవలా సాహిత్యంలో చారిత్రక నవలలు తక్కువే అయినా అవి ఆణిముత్యాలు. ఎంతో ప్రఖ్యాతి గాంచాయి. తమ చరిత్ర అంటే ఏ సమాజానికి అయినా ఇష్టం. దాని గురించి తెలుసుకొనే మార్గం అందుబాటులో ఉంటే ఎవరికైనా దాని పట్ల మమకారం పోదు. 'ఏనాడో తెరమరుగున పడిపోయిన మహత్తర చారిత్రక సత్యములను పెక్కు యదార్థ సంఘటలను మనకు జ్ఞప్తిచేయుచు గత కాలపు వైభవ

ప్రాభవములను ఒక్కసారి సాక్షాత్కరింపజేయగలవు'. (73) ఈ రచనలు, చరిత్ర సాధారణంగా కల్పనా రహిత సత్యం. దీనికి కల్పనలు జోడించినప్పుడే అది పఠన యోగ్యం అవుతుంది. ఈ రెంటి కలనేత తెలిసిన రచయితే విజయవంతం కాగలిగే నవలలు అందించగలడు. తెలుగు సాహిత్యానికి అద్భుత చారిత్రక నవలలు అందించిన వాళ్ళు విశ్వనాథ సత్యనారాయణ, అడవి బాపిరాజు, నోరి నరసింహశాస్త్రి. సాహిత్యంలో ఉన్న చారిత్రక నవలలు ప్రాంతీయ రాజవంశాల పాలకులకు సంబంధించినవి అధికం. అల్పంగా జాతీయాంతర్జాతీయ ప్రఖ్యాతి గాంచిన పురుషులవి అరుదుగా కవులవి. ఈ మూడింటికి భిన్నంగా మాత్రం చారిత్రక నవలలు తక్కువ.

1. ఈ నవలలో రాజరికపు చరిత్ర ప్రధానం. ఈ చరిత్ర వంశానిది కావచ్చు. రాజుదో రాణిదో కూడా అయిఉండవచ్చు. చారిత్రక నవలా రచయితల్లో పేరెన్నికగన్న విశ్వనాథ సత్యనారాయణ రచన 'కడిమి చెట్టు'. దీనిలో మయూరుడు తన కుటుంబానికి జరిగన అన్యాయాన్ని ఎదిరించటం, భల్లాతవర్మను వధించపూనటం, విజయం పొందటం కథ. ఈ నవల 'పల్లవ కాదంబులకు చెందిన ఇతివృత్తముతో నడచిన చారిత్రక నవల'. (74) 'ధర్మచక్రం' బౌద్ధ కథాశ్రితంగా రచింపబడింది. ఇది ఇక్ష్వాకుల చరిత్రను చెప్పే నవల; అడవి బాపిరాజు వ్రాసిన 'శాంతి శ్రీ' మరో చారిత్రక నవల. 'మహావిద్వాంసుడు, బహుముఖ ప్రజ్ఞాశాలి బహుగ్రంథ కర్త, ప్రముఖ బౌద్ధ మతాచార్యుడునైన ఆచార్య నాగార్జునుల ఆశీఃప్రభావముతో విజయపురి యందు ఇక్ష్వాకు రాజ్యస్థాపన జరిగిన విధమును ఇందు చూపబడినది'. (75) విశ్వనాథుని 'ఏకవీర' మధురనేలిన నాయకరాజుల కాలానికి సంబంధించిన నవల. వీరి చరిత్రను చెప్పేదే పిలకాగణపతి శాస్త్రి వ్రాసిన 'మీనాంబిక' ఇందులో మధుర తంజావూరుల వైభవం చిత్రింపబడింది; తెలుగు నేలపై పశ్చిమ చాళుక్యుల పాలనకు వ్యతిరేకంగా జరిగిన తిరుగుబాటుల కథగా 'బద్ధన్న సేనాని' నవలా రూపంలో విశ్వనాథ కలం నుంచి జాలు వారింది. అడవి బాపిరాజు రచించిన హిమబిందు '.... ప్రథమాంధ్ర రాజులైన శాతవాహనులకు సంబంధించిన చారిత్రక నవల. శ్రీముఖ శాతవాహనుడు ధాన్యకటకమును రాజధానీ నగరము జేసుకొని, ఆంధ్ర సామ్రాజ్యమును వైభవోపేతముగా పాలించి, పాటలీపుత్రమును జయించి, జంబూద్వీప చక్రవర్తియైన విధమును ఈ నవల తెలుపును' (76) ఇందులో ప్రేమకు ఉదాత్త స్థానం ఇచ్చాడు రచయిత. రాజపుత్రి హిమబిందు సామాన్య రాజశిల్పిని ప్రేమించి వివాహమాడటం కథ; బాపిరాజు రచన 'గోనగన్నారెడ్డి' కాకతీయ సామ్రాజ్య చరిత్రను చెప్పే నవల. రుద్రమదేవి పాలనకు వ్యతిరేకంగా తలెత్తే తిరుగుబాటులను అణచటంలో ఆమెకు గోనగన్నారెడ్డి సహాయంగా నిల్చాడు. కాకతీయ సామ్రాజ్యానికి సంబంధించిన చరిత్రే 'రుద్రమదేవి' నోరినరసింహ శాస్త్రి రచించాడు. కాకతీయ కాలాన్ని వ్యక్తం చేసేవే 'సప్తపర్ణి', 'రామప్పగుడి' నవల పాటిబండ మాధవశర్మ కొండవీటి రాజకీయ సంబంధిత కథనను 'రాజశిల్పి'గా తీర్చిదిద్దాడు; రఘునాథరాయల కాలం కథ 'తంజావూరు పతనం'. ఇది మల్లాది వసుంధర రచన; విజయనగర సామ్రాజ్యం అష్టదిగ్గజాలకు ప్రసిద్ధం. వారి స్పర్శతో ధూళిపాళ శ్రీరామమూర్తి రచించిన నవల 'భువన విజయము' 'తెలుగురాణి'

నవలలు. 'మల్లారెడ్డి' ఎఱ్ఱాప్రగడకు సంబంధించిన నవలే అయిన దీనిలో నోరి నరసింహశాస్త్రి రెడ్డిరాజుల సాహితీ సేవను చరిత్రను తెల్పాడు.

2. జాతీయ దృక్పథం ఉన్న చారిత్రక పురుషులు జాతికి గర్వకారణం. కొందరు అంతర్జాతీయ ప్రముఖులు. వీరిపైన కూడా రచనలు వెలువడ్డాయి. అద్భుతమైన మేధకు చరిత్ర సాక్ష్యమిచ్చే వ్యక్తి చాణక్యుడు. అతనిని గూర్చి వేదుల సూర్యనారాయణ 'ఆర్యచాణక్యుడు' రచించాడు; ఆసియా చరిత్రలోనే నిల్చిపోయిన వాడు, మొగల్ సామ్రాజ్యధినేత పాలనకు పక్కలో బల్లెమైనవాడు మంగోలియన్ జాతికి చెందిన చెంఘిజ్ ఖాన్. తెన్నేటి సూరి వీరరసభరితంగా 'చెంఘిజ్‌ఖాన్' నవలను వ్రాశాడు; రాజసానికి, పౌరుషానికి, శౌర్యానికి రాజపుత్రులు ప్రతీకలు. పురుషులే కాదు, స్త్రీలు కూడాను. 'విమలాదేవి' 'భోగరాజు నారాయణమూర్తి రచన. ఔరంగజేబుకు వ్యతిరేకంగా రాజపుత్ర రాజైన రాజసింహుడు, అతని భార్య విమలాదేవి కనబరచిన సాహస కార్యాలు, ధైర్యశౌర్యాలు, ఆమెకున్న మతభక్తి ఇందులో వర్ణితమయ్యాయి. శ్రీవేలాల సుబ్బారావు రచించిన 'రాణి సంయుక్త' మరో ప్రసిద్ధ చారిత్రక నవల. చారిత్రక వ్యక్తి సంయుక్త. 'పృథ్వీరాజు, రాణి సంయుక్తల యొక్క దేశాభిమానము, ప్రేమోదంతము, పరాక్రమములు అద్భుతముగను, రసవంతముగాను ఇందు మలచబడినవి'. (77)

3. నోరి నరసింహశాస్త్రి చరిత్రతో అంతగా సంబంధంలేని చరిత్ర వ్రాశాడు. ఈ చరిత్ర సాహిత్య చరిత్రకు ఉపయోగిస్తుంది. పరోక్షంగా చరిత్రకూ ఉపకరిస్తుంది. వీరంతా పాలకుల పట్టికలోకి రానివారే. వీరందరూ తెలుగు సాహిత్యంలో ప్రఖ్యాతి గడించిన వారే. వీరి జీవితాలను నవలలుగా చిత్రించారు. వీరు 'నారాయణభట్టు, తిక్కన ఎర్రన, ధూర్జటి, శ్రీనాథుడు'; వీరేశలింగం రచించిన 'చంద్రమతీ చరిత్రం' ఆంధ్రసాహిత్య చరిత్రను తెల్పే వంగూరి సుబ్బారావు 'ప్రభాతం' ఇతర చారిత్రక రచనలు. ఇటీవలి కాలంలో చారిత్రక రచనలు తగ్గిపోతున్నాయి. డా.మదిగొండ శివప్రసాద్ వ్రాసినల కుమాదేవి, శ్రావణి వంటి రచనలు చెప్పుకోదగ్గ రచనలు.

తెలుగు సాహిత్యంలో భారతం, రామాయణం విశిష్టమైన ఇతిహాసాలు. ఇవే మళ్ళీ మళ్ళీ రూపం మారుతూ పుడుతూ వచ్చాయి. అనేకమైన అనువాదాలు మాత్రమె కాదు, భారత రామాయణ కథాసూత్రాలు గ్రహించి అనేక కావ్యనాటక సాహిత్యం తెలుగులో అవతరించింది. తెలుగు జాతి జీవితం ప్రభావితం చేసే మార్గంలో దేశంలో ఏర్పడ్డ శైవ వైష్ణవ మత దృక్పథాలు సాహిత్య సంపదను అందించాయి. ఆంధ్ర దేశంలో రాజ్య పాలనం చేసిన రాజుల చరిత్ర చాలా వరకు సాహిత్యరూపం పొందింది. పలనాటి చరిత్ర విశేష సాహిత్య స్వరూపంగా నిలిచింది. శాతవాహనుల రాజరికం సాహిత్యంగా అవతరించింది. ఆంధ్రదేశంలోని స్థానిక చరిత్రలు, ఆంధ్రుల పాలనంలోని స్థానిక చరిత్రలు కావ్యనాటక యక్షగానాలుగా అవతరించాయి. స్వాతంత్ర్యోద్యమ కాలంలోని సంఘర్షణాత్మకమయిన చరిత్ర, ఆధునిక సాహిత్యంలో కవిత్వం, నాటకం, నవలలు అనేకం ఆవిర్భవించటానికి మూలమయింది. సమకాలీనమయిన సమాజ జీవితమో, అంతకు పూర్వమున్న సంఘ జీవితమో సాహిత్యంగా రూపొందటం భారతం నుంచి

ఉందని స్పష్టంగా గుర్తింపవచ్చు. సంఘజీవితం సాహిత్యంగా మారటంలో ప్రజాజీవితం ప్రసక్తమవుతుంది. ప్రయుక్తమవుతుంది. ప్రతిష్ఠితమవుతుంది. ఈ స్థితిని తెలుగు సాహిత్యం విశేషంగా గ్రహించి, అభివ్యక్తీకరించింది. సంఘం జీవితం సాహిత్యేతివృత్తం కావటం స్పష్టంగా ప్రతిపాదించి, విస్పష్టంగా ప్రకటించటం చారిత్రక వస్తు పరిణామంగా విశదమయింది.

## అథ స్సూచికలు


1 సమగ్రాంధ్ర సాహిత్యం- I ఆరుద్ర పుట 148

2. ఆంధ్రమహాభారతము - I ఆది అశ్వాసము పుట 5

3. Ancient India Ram-Sharan Sharma పుట 47, 48

4. History of India Vidyadhar Mahajan పుట 80, 81

5. Ancient India Ram Sharan Sharma పుట 63, 64

6. Ancient India Ram Sharan Sharma పుట 64

7. Ancient India Ram Sharan Sharma పుట 11, 12

8. Ancient India Ram Sharan Sharma పుట 72

9. జైమిని భారతము ఉపోద్ఘాతము డా.ఎం.కులశేఖరరావు పుట 5

10. జైమిని భారతము ఉపోద్ఘాతము డా.ఎం.కులశేఖరరావు పుట 14

11. కావ్య సమీక్షలు శ్రీరాంభట్ల లక్ష్మీనారాయణ పుట 17

12. తెలుగు సాహిత్య సమీక్ష డా.జి.నాగయ్య పుట 313

13. తెలుగు సాహిత్య సమీక్ష II డా.జి.నాగయ్య పుట 315

14 తెలుగు సాహిత్య సమీక్ష II డా.జి.నాగయ్య పుట 456

15. తెలుగు సాహిత్య సమీక్ష II డా.జి.నాగయ్య పుట 246

16. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర డా యస్వీ..జోగారావు పుట 196

17. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర డా యస్వీ..జోగారావు పుట 395

18. తెలుగు నాటక వికాసం పోణంగి శ్రీరామ అప్పారావు పుట 214

9. తెలుగు నాటక వికాసం పోణంగి శ్రీరామ అప్పారావు పుట 213

!0. History of India Vidyadhar Majajan పుట 79

!1. Ancient India Ram. Sharan Sharma పుట 11

!2. ఆంధ్ర సాహిత్య చరిత్ర పింగళి లక్ష్మీకాంతం పుట 153

'3. రంగనాథ రామాయణము-విమర్శనాత్మక పరిశీలనము
డా.సుంకార వెంకమాంబ పుట 26

4. రామాయణ కల్పవృక్షము అధ్యాత్మిక రామాయణము
డా.వారణాసి భిక్షుమయ్య పుట 35

25. రామాయణ కల్పవృక్షము ఆధ్యాత్మిక రామాయణము
డా.వారణాసి భిక్షుమయ్య
26. రామాయణ కల్పవృక్షము ఆధ్యాత్మిక రామాయణము
డా.వారణాసి భిక్షుమయ్య పుట
27. కావ్య సమీక్షలు శ్రీవావిలాల సుబ్బారావు పుట 147
28. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర డా.యస్వీ.జోగారావు పుట 10
29. తెలుగు సాహిత్య సమీక్ష I డా.జి.నాగయ్య పుట 126
30. తెలుగు సాహిత్య సమీక్ష I డా.జి.నాగయ్య పుట 127
31. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర డా.యస్వీ.జోగారావు పుటలు 19, 20
32. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర డా.యస్వీ.జోగారావు పుట 38
33. తెలుగు సాహిత్య సమీక్ష డా.జి.నాగయ్య పుట 260
34. సమగ్రాంధ్ర సాహిత్యం VII ఆరుద్ర పుట 155
35. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర డా.యస్వీ.జోగారావు పుట 54
36. సమగ్రాంధ్ర సాహిత్యం XIఆరుద్ర పుట 261
37. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర డా.యస్వీ.జోగారావు పుట 227
38. తెలుగు వ్యాస పరిణామం డా.కొలకలూరి ఇనాక్ పుట 97
39. తెలుగు వ్యాస పరిణామం డా.కొలకలూరి ఇనాక్ పుట 38
40. పదకవితా వైజయంతి డా.పొన్నా లీలావతమ్మ పుట 21
41. శ్రీనాథ యుగ సాహిత్యము - భక్తి డా.సి.వీర పద్మజ పుట 183
42. సమగ్రాంధ్ర సాహిత్యం VII ఆరుద్ర పుట 223
43. తెలుగు సాహిత్య సమీక్ష డా.జి.నాగయ్య పుట 429
44. వ్యాస కదంబం డా.కె.సర్వోత్తమరావు పుట 126
45. పదకవితా వైజయంతి డా.పొన్నా లీలావతమ్మ పుట 339
46. పదకవితా వైజయంతి డా.పొన్నా లీలావతమ్మ పుట 344
47. పల్నాటి వీరచరిత్ర పింగళి లక్ష్మీకాంతం పుట
48. పల్నాటి వీరచరిత్ర పింగళి లక్ష్మీకాంతం పుట
49. పల్నాటి వీరచరిత్ర పింగళి లక్ష్మీకాంతం పుట
50. తెలుగు సాహిత్య సమీక్ష జి.నాగయ్య పుట 337
51. సమగ్రాంధ్ర సాహిత్యం X ఆరుద్ర పుట 47
52. తెలుగు సాహిత్య సమీక్ష డా.జి.నాగయ్య పుట 380
53. కాసమనాథుని ప్రతాపరుద్ర చరిత్రము పీఠిక
డా.సి.వి.రామచంద్రరావు పుటలు 1,2

54. కామ్రనాథుని ప్రతాపరుద్ర చరిత్రము పీఠిక
డా.సి.వి.రామచంద్రరావు పుటలు 13
55. కామ్రనాథుని ప్రతాపరుద్ర చరిత్రము పీఠిక
డా.సి.వి.రామచంద్రరావు పుటలు 15
56. సమగ్రాంధ్ర సాహిత్యం XI 1967 ఆరుద్ర పుట 75
57. తెలుగు సాహిత్యం సమీక్ష II డా.జి.నాగయ్యా పుట 381
58. సిద్ధేశ్వర చరిత్ర కాసె సర్వప్ప పుట
59. సిద్ధేశ్వర చరిత్ర కాసె సర్వప్ప పుట
60. సిద్ధేశ్వర చరిత్ర కాసె సర్వప్ప పుట
61. సిద్ధేశ్వర చరిత్ర కాసె సర్వప్ప పుట
62. తెలుగు సాహిత్య సమీక్ష డా.జి.నాగయ్యా పుట 281
63. రయవాచకం పీఠిక డా.సి.రామచంద్రరావు పుట
64. సమగ్రాంధ్ర సాహిత్యం X 1967 ఆరుద్ర పుట 195
65. సమగ్రాంధ్ర సాహిత్యం X 1967 ఆరుద్ర పుట 197
66. సమగ్రాంధ్ర సాహిత్యం XI 1967 ఆరుద్ర పుట 38, 39
67. సమగ్రాంధ్ర సాహిత్యం XII 1967 ఆరుద్ర పుట 153
68. సమగ్రాంధ్ర సాహిత్యం V 1967 ఆరుద్ర పుట 223
69. తెలుగు సాహిత్య సమీక్ష II డా.జి.నాగయ్యా పుట 393
70. సాహిత్యతత్త్వం శివభారత దర్శనం సర్దేశాయి తిరుమలరావు పుట 5
71. సాహిత్యతత్త్వం శివభారత దర్శనం సర్దేశాయి తిరుమలరావు పుట 45
72. సాహిత్యతత్త్వం శివభారత దర్శనం సర్దేశాయి తిరుమలరావు పుట 36
73. తెలుగు నవలా సాహిత్య వికాసం పుల్లాభొట్ల వేంకటేశ్వర్లు పుట 90
74. తెలుగు నవలా సాహిత్య వికాసం పుల్లాభొట్ల వేంకటేశ్వర్లు పుట 171
75. తెలుగు నవలా సాహిత్య వికాసం పుల్లాభొట్ల వేంకటేశ్వర్లు పుట 207
76. తెలుగు నవలా సాహిత్య వికాసం పుల్లాభొట్ల వేంకటేశ్వర్లు పుటలు 202, 203
77. తెలుగు నవలా సాహిత్య వికాసం పుల్లాభొట్ల వేంకటేశ్వర్లు పుట 132

# 3. దైవీయ వస్తువు

దైవ సంబంధంగా వస్తువు వుంటే అది దైవీయ వస్తువుగా పరిగణించటం కుదురుతుంది. దేవభావం దైవం, దైవ సంబంధం దైవీయం కాగా, దేవుడు కానీ, దేవుడు అవతారాలు కానీ, దేవుడి వంశం కానీ, దైవ వ్యవస్థ కానీ, దైవాంశ సంభూతులు కానీ, దేవుడి మహిమలు, విలాసాలు, మహాత్మ్యాలు కానీ, దేవుడి క్షేత్ర పుణ్యస్థలాలు కానీ, వస్తువులుగా రూపొందితే దాన్ని దైవీయ వస్తువుగా భావించటం సాధ్యం అవుతుంది.

దేవుడు అనే వ్యవస్థ మతం పునాది మీద విశ్వాసం మీద నిలుస్తుంది. భారతదేశంలో మత విషయికమైన ప్రయోగం విశాల నేపథ్యం కలిగి ఉంది. అనేక మతాల కూడలిగా భారతదేశం చారిత్రక కాలం నుంచి ఉన్నందు వల్ల ఒక మత సంబంధం కాక, అనేక మత సంబంధంగా దైవీయ వస్తుదర్శనం జరుగుతుంది.

నేడు భారతదేశంలో ఉన్న మతాలలో హిందు మహ్మదీయ సిక్కు క్రైస్తవాలు ప్రధాన మతాలు. ఇవి కాక, జైన బౌద్ధ పార్శీ మతాలు లేకపోలేదు. ప్రతి మతంలోనూ అనేక శాఖలున్నాయి. శాఖా వైవిధ్యం కూడా విశాల నేపథ్యమే కలిగి ఉంది. శాఖా వైవిధ్యం అంతర అనైక్యానికి కూడా దోహదకారిగా ఉంది. మత విషయికమయిన ఘర్షణలకు కూడా ఈ దేశ చరిత్రలో ప్రాధాన్యం ఉంది. అయితే మతసహనం అలవర్చుకొన్న భారతీయత విచ్ఛిన్నంగా కాకుండా నిలచిఉండే సుగుణ సంపత్తిని పొదువుకొని ఉంది.

ఆర్యులు ఆగమనానికి  పూర్వం ఉన్న భారతీయ మత వ్యవస్థలో వైవిధ్యం కానీ, అనైక్యం కానీ గోచరం కావు. మతం విశ్వాసంగా కాక, జీవన మార్గంగా ఉన్న కాలంలో మనిషి అస్తిత్వానికి మతప్రమేయం అత్యల్పంగా ఉండగా మతం విశ్వాస పరంపరకు కారణమయినప్పుడు సంఘంలో మనిషి ప్రాధాన్యానికి మతం ప్రధాన భూమిక నిర్వహించే స్థితి ఏర్పడింది.

భారతీయులు నీగ్రిటోలుగా, ఆస్ట్రలాయిడ్‌లుగా, మెడిటేరియన్లుగా ఉన్న కాలంలో మత ప్రాధాన్యం లేదు. భరతీయులు ద్రావిడులుగా ఉన్నప్పుడు, మంగోలియన్లుగా రూపొందినప్పుడు, దైవ ప్రాధాన్యం మత విశ్వాసాల ప్రాముఖ్యం పెరిగింది. వీళ్ళు ప్రకృతి శక్తులను పూజించారు. చెట్టు పుట్ట లింగం పూజ పొందాయి. వీళ్ళ కాలంలో విస్తరించిన సింధునదీ ప్రాంతంలోని నాగరికత ఉత్తర హిందుస్థానమంతా వ్యాపించిన కాలంలో మాతృశక్తి ఆరాధన గోచరమవుతుంది. పురుష దేవత త్రినేత్రధారి, పశుపతి.

ఆర్యుల ఆగమనంతో వేదకాలం ప్రారంభమయింది. వర్ణవ్యవస్థ రూపొందింది. వర్ణాలుగా విడిపోయిన జనంలో ఆధిక్యం నైచ్యం చోటు చేసుకొన్నాయి. యజ్ఞ యాగాది క్రతు కార్యక్రమం పెరిగింది. విష్ణువు ప్రాధాన్యం పెరిగింది. రుద్రుణ్ణి కూడా దేవుడుగా గుర్తించారు. బ్రహ్మ  త్రిమూర్తులలో ప్రథముడే అయినా దైవత్వం సంక్రమించలేదు.

ఆర్యుల మతమే వైదికమతంగా బ్రహ్మ మతంగా బ్రాహ్మణ మతంగా క్రమంగా హిందూ మతంగా హిందూ దేశమంతటా వ్యాపించింది.

ఈ మత స్థితిని అంగీకరించని అసలు భారతీయులు జైన బౌద్ధ మతాల అవతరణకు, వ్యాప్తికి, వికాసానికి కారకులయ్యారు. జైన బౌద్ధమతాలు దాదాపు సమకాలంలోనే ఆవిర్భవించాయి. బ్రాహ్మణులు హిందూమతం వ్యాప్తి కావించుకొంటుంటే క్షత్రియులు జైన బౌద్ధ మతాలను స్థాపించారు. ఈ జైన బౌద్ధ రెండు వేద ప్రామాణ్యం తిరస్కరించాయి. యజ్ఞ యాగాదులను బహిష్కరించాయి. వర్ణ ఆధిక్యం, అనాధిక్యం నిరసించాయి. కర్మకాండను అంగీకరింపలేదు. పునర్జన్మ కర్మ సిద్ధాంతాలను మనిషి అస్తిత్వానికి అవరోధం కాకుండా చూశాయి. రెండింటిలోనూ మానవ సమానత్వం ప్రధాన లక్షణం. హింస ఏ రూపంలోనూ అంగీకరింపలేకపోవటం అహింస మూలసూత్రంగా నిలవటం గోచరమవుతుంది.

అయితే హిందూ మతం భారతదేశంలో ఈ మతాలకు నిలువ నీడలేకుండా చేయగలిగింది. హిందూమతం రాజాశ్రయం వల్ల బాగా వ్యాప్తి పొందింది. అందులోని సుఖలోలుపత్వం ప్రజలను బాగా ఆకర్షించింది. జైన బౌద్ధ మతాలలోని నైష్ఠిక జీవనం కంటే హిందూమతంలోని సంయమన ధోరణి కొంత ఆకర్షకంగా నిల్చింది జైనమతం మరో కఠోరం కావటం వల్ల ఎక్కడో కొందరున్న మతంగా భారతదేశంలో మిగిలి ఉంది. బౌద్ధ మతం హీనయానంగా మహాయానంగా మారటంతో దాని ప్రాధాన్యం సన్నగిల్లసాగింది. కోరికను జయించటం ప్రధానమన్న బౌద్ధమతంలో కోరిక ప్రాధాన్యం కనిపించినట్లయి మతం పునాది ప్రశ్నార్థకమయింది. జైనం భారతదేశంలో నామమాత్రంగా అవశేషం కాగా, బౌద్ధం మరి కొంతమేలే కానీ, విదేశీయంగా దానికి ఉనికి బలపడింది. ఈ భారతీయ మతం టిబెట్, బర్మా, శ్రీలంక, మలేషియా, సింగపూరు, ఇండోనేషియా, సుమిత్ర, జావాలలో విశిష్టమతంగా వ్యాప్తి పొందింది.

హిందూమతం దాడికి తట్టుకోలేక మతాలు అయితే అంతరించటం, కాకపోతే దేశాంతరం చేరటం జరగ్గా, హిందూమతం పునర్యౌవనం పొందింది. హిందూమతం ఉనికి ప్రశ్నించిన భారతీయాత్మ కారణంగా శైవం దేశంలో విశిష్టంగా రూపొందే స్థితి ఏర్పడింది. అప్పుడు దాన్ని తిరస్కరించటానికి వైష్ణవం ప్రముఖంగా రూపొందింది. రెండూ హిందూమతాలే అయినా రెండూ వైరిమతాలుగా సంఘర్షించి దేశాన్ని రణరంగం చేశాయి. శైవం వీరశైవంగా వైష్ణవం వీరవైష్ణవంగా మారి దేశ జీవితంలో మతఘర్షణలను స్థాపించి హింసను ప్రోత్సహించి శాంతిని ప్రశాంతిని దేశంలో వెదుక్కోవలసిన స్థితి కల్పించాయి.

మహమ్మదీయులు దండయాత్రలలో అనైక్య దేశం అనతి కాలంలో పారతంత్ర్యం పొందింది. ఆంగ్లేయుల రాకతో, భారతదేశం ఛిన్నాభిన్నమయింది. ఈ రెండు పాలనలు రెండు మతాలను తెచ్చాయి. మహమ్మదీయ మతం, క్రైస్తవ మతం వ్యాప్తి పొందుతున్న కాలంలో ఈ రెండింటినీ, హిందూ మతాన్నీ, తిరస్కరించే సిక్కుమతం ఒకటి అవతరించింది. సిక్కు మతంలోని స్వజాతి రక్షణ దృష్టి, మహమ్మదీయ మతం

నిర్మూలించే దృష్టి కారణంగా చరిత్ర పొడుగునా హిందూ మతంతో స్వజాతి మతమయిన సిక్కు మతం, విజాతిమతమయిన మహమ్మదీయ మతం నిరంతరం సంఘర్షణలకు గురి అవుతూనే వచ్చాయి.

ప్రేమ పునాది మీద, అహింస అస్తిత్వం మీద, అధారపడ్డ క్రైస్తవ మతం, సహజీవనం మీద నిలచిన పార్శీ మతం ఈ దేశంలో ఉన్నప్పటికిని మత విషయికమయిన ఘర్షణలకు మూలం కాలేదు. పార్శీమతం సంపన్నులకు, క్రైస్తవ మతం పేదలకు సంబంధించి ఉండటంతో ఈ రెండు ప్రమాదం లేని మతాలు అయ్యాయి.

స్థూలంగా వైదిక మతం హిందూ మతం, జైన బౌద్ధ మతాలు మహమ్మదీయ క్రైస్తవ మతాలు, సిక్కు పార్శీ మతాలు ఈ దేశ జీవితంలో భాగంగా ఉన్నాయి. ఈ మతనేపథ్యంలో దేవుడు స్థానం పొందే స్థితి చాలా మందికి ఉంది. ఒక్క హిందూమతంలోనే ముప్పది మూడుకోట్ల దేవతలున్నారు. వీళ్ళందరికి సంబంధించిన వస్తువునే దైవీయ వస్తువుగా గుర్తించటమయింది.

3.1. దైవీయ సాహిత్య వస్తువు : హిందూ, జైన, బౌద్ధ, మహమ్మదీయ, క్రైస్తవ, సిక్కు, పార్శీ మతాలు ప్రతిష్ఠించిన దేవుళ్ళ ఆధారంగా దైవ వ్యవస్థనూ ఆ దైవవ్యవస్థను సుప్రతిష్ఠితం కావించే సాహిత్య స్థితినీ, దర్శించటం వల్ల దైవీయ సాహిత్య వస్తువు స్పష్టం కాగలదు. ఈ మతాలకు ఆయా మతాలు పుట్టిన దేశం కారణంగా, ఆ దేశ భాషలో వెలువడ్డ సాహిత్యం ఉంది. హిందూ మతం సంస్కృతంలో, జైన బౌద్ధాలు ప్రాకృతంలో, మహమ్మదీయ మతం అరబ్బులో, క్రైస్తవం హిబ్రూలో, పార్శీ పారశీకంలో, సిక్కు గురుముఖి భాషలో ఆయా మతగ్రంథాలను సృష్టించుకొన్నాయి. మతం తన పరిధి అవధి, ప్రాంగణం, దేశం దాటి విదేశాలకు వ్యాపించినప్పుడు ఆ మతంతో పాటు, మత భాష కూడా ప్రయాణమయి వస్తుంది.

తెలుగు భాషలోకి ఈ మతాలకు సంబంధించిన విషయం అనువాదం కావటం సహజ పరిణామమే. ఆంధ్రులు ఆదరించిన మతాలకు సంబంధించిన విషయమే ఆయా భాషలను తెలుగు భాషలోకి వచ్చి చేర్చాయి. సిక్కు పార్శీ మత ప్రభావం ఆంధ్రుల మీద అంతగా లేదు. అందుకే ఆ మత గ్రంథాలకు తెలుగులో అంత ప్రాముఖ్యం లేదు. ఇతర మతాలకు చెందిన గ్రంథాలు తెలుగులోకి ఆయా భాషలనుంచి వచ్చి చేరటం సామాన్య విషయమే.

హిందూమతంలోని వైష్ణవం రాజాశ్రయం నుంచి పెరిగి సాహిత్యస్వరూపంగా విస్తరించి, అనువాదంగా భారతీయ భాషలన్నింటిని ఆక్రమించుకొంది. వైష్ణవ దృక్పథంతో వెలువడ్డ భారత భాగవత రామాయణాది గ్రంథాలు భారతీయ భాషలన్నింటిలోకి అనువాదం చెందాయి. అనువాద కార్యం రాచకార్యంగా జరిగింది. నేడు తెలుగు సాహిత్యంలో మూడవంతులు వైష్ణవ సాహిత్యమే ఉంది.

శైవ సాహిత్యం అనువాద సాహిత్యమే కానీ, అంతగా అనువాద సాహిత్యం కాదు. రాజాశ్రయం వల్ల ఆ సాహిత్యం తెలుగులో అవతరించలేదు. ప్రజాదరణ వల్ల

స్థానిక అవసరాల దృష్టి వల్ల దేశి దృక్పథం వల్ల శైవ సాహిత్యం తెలుగులో అవతరించింది. విస్తరించింది. ప్రాచీన సాహిత్యమంతటిలోనూ వచ్చిన శైవ సాహిత్యం నాల్గింటి ఒక్క వంతు ఉంటే ఎక్కువే.

జైన బౌద్ధ మత గ్రంథాలు సంస్కృత ప్రాకృతాల నుంచి అనువాదం పొందాయి. సంస్కృత ప్రాకృతాలలో ఆంధ్రదేశంలో సృష్టి పొందటం వాస్తవమే. అయితే ఈ మత సాహిత్యం ఆలోచనా ప్రాంగణానికే కాని అనుభూతి మార్గానికి అంతగా సంబంధించి లేదు. మతం ప్రతిపాదించే సాహిత్యం వేరు. మతాన్ని ప్రచారం చేసే సాహిత్యం వేరు. జైన మతం ప్రచారం చేసే సాహిత్యం తెలుగులో లేదంటే దోషం కాదు.

బౌద్ధ మతం ప్రచారం చేసే కాల్పనిక సాహిత్యం కొంత ఆధునిక కాలంలో ఉంది కాని పూర్వం లేదు. ఆ కాలంలో బౌద్ధ మతం ఆచరించటం తప్పు నేరం. బౌద్ధ సాహిత్యం సృష్టించటం అసలు సాధ్యం కాదు. బౌద్ధమతం రాజదండనకు గురిఅవుతున్న కాలంలో, బౌద్ధ మతం దేశాంతరవాసం వెళుతున్న కాలంలో, బౌద్ధ మతవ్యాప్తి చేసే కాల్పనిక సాహిత్యం అవతరించకపోవటం అన్యాయం కాదు. ఆధునిక కాలంలో బౌద్ధం మీద అంతగా వ్యతిరేకత లేకపోవటం వల్ల సాహిత్యం అవతరించింది. తిరుపతి వేంకటకవులు బుద్ధచరిత్రము గమనార్హమయిన సాహితీ సృష్టి. పింగళి కాటూరి సృష్టి సౌందరనందం అద్భుత భావకవిత్వం. కరుణశ్రీ రచించిన కరుణశ్రీ కావ్యం విశేష సాహితీ సృష్టి. అమ్రపాలి అనేక కావ్య నాటికలకు వస్తువు అయింది. సుజాత, సుందరి ఆనందుడు గౌతముడు బుద్ధుడు చుట్టూ ఆధునికాంధ్ర సాహిత్యంలో విశేషంగా కావ్యనాటక సృష్టి జరిగింది.

మహమ్మదీయ క్రైస్తవ మతాలను సృష్టించిన అరబ్బిక్ హిబ్రూ భాషలు ఉరుదు ఇంగ్లీషు భాషల మూలంగా ఆ మత సాహిత్యాన్ని అందించాయి. మహమ్మదీయ చరిత్ర, మక్కా మదీనా చరిత్ర, ఖురాన్ ఇంకా ఇతర మత గ్రంథాలు తెలుగులోకి అనువాదం అయ్యాయి. అయితే మహమ్మదీయ మతం తెలుగు సాహిత్యంలో ప్రవేశించి అనువాదంగా కానీ, అసలు సృష్టిగా కానీ ప్రత్యేక సాహిత్యానికి ప్రాణప్రతిష్ఠ చేసిందని చెప్పటం సాధ్యం కాదు. అయితే ఉమర్ ఆలీషా కవి వంటి ప్రసిద్ధుల రచనలు తెలుగు సాహిత్య దృష్టిని పెంచినంతగా మహమ్మదీయ మత దృష్టిని సారించలేదు.

క్రైస్తవ మతంలోని బైబిలు పాత నిబంధన కొత్త నిబంధన అనువాదంగా అందాయి. బైబిల్‌ను అంగ్లేయులు, ఆంధ్రులు అనేకులు అనేక పర్యాయాలు అనువాదం చేశారు. బైబిలు ఆంగ్లంలో సాహిత్య గ్రంథంగా పొందిన గుర్తింపు తెలుగులో బైబిలు పొందలేకపోయినా మంగళగిరి ఆనందకవి వేదాంత రసాయనం, పింగళి ఎల్లనార్యుడి తోభ్యచరిత్ర బైబిలు ఆధారంగా వెలువడ్డ ప్రాచీన సాహిత్యంలోనివే. 'యేసునాథ కథామృతము' పేరిట గైనేడి వెంకటస్వామి నాయుడు 1900 సంవత్సర ప్రాంతంలో యేసుక్రీస్తు చరిత్రను వ్రాశాడు. ఆరంభంలో ముద్రితమయిన తెలుగు సాహిత్యం బైబిలుకు సంబంధించిందే. బైబిలు కథలు విశేష ప్రచారం పొందాయి. క్రైస్తవ మత ప్రాధాన్యం తెలిపే గుర్రం జాషువా, 'క్రీస్తు చరిత్ర' కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి పొందింది.

కొలకలూరి ఇనాక్ 'జ్యోతి ' నాటికల సంకలనం క్రీస్తు జననాన్ని, శిలువ మరణాన్ని శ్రవ్యరూపకాలుగా అందించింది. క్రైస్తవ సాహిత్యం సృష్టించిన పలువురు ప్రసిద్ధాంధ్ర కవుల మీద పరిశోధనం జరిగింది. క్రైస్తవుల పాటలు తెలుగు సాహిత్యంలో విశేష స్థానం పొందాయి. జానపద సాహిత్యం సంకీర్తన వాఙ్మయం రెండింటి మేలు కలయికగా తెలుగు క్రైస్తవ భక్తి కీర్తనలు నిలిచి ఉన్నాయి.

తెలుగు సాహిత్యంలోని దైవీయ వస్తు దర్శనార్థం ప్రధానంగా శైవ వైష్ణవ సాహిత్యమే శరణ్యం.

దైవం హిందూ సంప్రదాయంలో ఏకరూపం కాదు. మనుష్యులలో జీవితం పట్ల ఇష్టాన్ని, దాన్ని నిల్పుకోడానికి అన్ని దశల్లోనూ దైవంపై నమ్మకం కల్పించడానికై సృష్టి స్థితి లయ కారులుగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులను వ్యవస్థ రూపొందించింది. జీవించినంత కాలం భూత దయను కలిగి ఉండడానికి ఇతర జీవాల పట్ల కారుణ్యాన్ని ప్రదర్శించడానికి వారిలో భక్తి పెంపొందించారు. దశావతారాలలో దైవాంశాన్ని అవతరింపచేశారు. ఈ దశావతార విధానం మనిషి పరిణామ క్రమం తెల్పుతుందనే శాస్త్రీయ జ్ఞానాన్ని అందించిన దృష్టితో చూచినా, తమ పూర్వరూపమైన జీవాల పట్ల మానవ ప్రవర్తనను ఒక విధంగా నియంత్రణ చేయడం కనిపిస్తుంది. ఈ దశావతారాలు కేవలం విష్ణు అవతారాలు మాత్రమే.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో విష్ణు శివులు అధికం ప్రాధాన్యం పొందారు. వీరే కాక అనేకులు ఇతర దేవుళ్ళు తెలుగు సాహిత్యంలో కనిపిస్తారు. దైవ సాహిత్యం అధికంగా విష్ణుమయం. తర్వాత చెప్పుకోదగ్గది శివుడు. శైవ వైష్ణవ సంప్రదాయాలలో ఉన్నంత మతాభిమానం ఇతర దైవారాధకులలో లేదు. కనుక వీళ్ళు పోటీపడి రచనలు వెలువరించిందీ లేదు. ఆరంభంలోని దైవ సాహిత్యమంతా దైవసంపూర్ణ చరిత్రను అందించేదిగా ఉంది. తర్వాతి కాలంలో వారి జీవితంలో పూర్వోత్తర భాగాలలో ఏదో ఒకటి లేదా వివిధ జీవన ఘట్టాలు వంటివి వచ్చాయి. తర్వాతి.కాలాలలో వీరిని గూర్చిన ప్రసక్తి పరోక్షంగా గోచరమయింది.

దైవసాహిత్యం అంటే పురాణ సాహిత్యమే. పురాణ పురుషులు దేవుళ్ళే. దేవుడి సంపూర్ణ చిత్రణం ఇందులో ఉంటుంది. భాగవతం శివపురాణం బ్రహ్మపురాణం ఇలాంటివే. వీటిలోని భాగాలను గ్రహించి హరివంశం ఉత్తర హరివంశం లాంటి రచనలు వెలువడ్డాయి. వారి జీవితాలలోని ఘట్టాలను గ్రహించి విలాసాల పేరిట రచనలు వెలువడ్డాయి. దైవానికి సంబంధించిన పురాణం నుంచి ప్రబంధాలు అనేకం వెలువడ్డాయి. యక్షగానాలు లిఖితమయ్యాయి.

దేవుడిని గూర్చిన రచనలు కొన్ని దైవ ప్రతినిధి, దైవభక్తుడు, దైవ పరీక్షలు, దైవ మహిమలు, క్షేత్ర మహాత్మ్యాలు వంటివి ఈ రచనల్లో గోచరమవుతున్నాయి. దేవుడు ప్రత్యక్షంగా ఇందులో పాత్రగా నిలిచి అద్యంతం గోచరంగా ఉండకపోవచ్చు. భక్తుని ఉద్ధరించడమో, పరీక్షించి ప్రత్యక్షమై వరాలివ్వడమో, మహిమను ప్రత్యక్షంగానో పరోక్షంగానో

చూపడమో, నిర్దిష్ట క్షేత్రాలకు నిర్దిష్ట దేవుళ్ళ ఏక ఘటనలతో మహాత్మ్యం సిద్ధించటమో చూపే సాహిత్యం విశేషంగా ఉంది.

హిందూ మత నేపథ్యంలో శివ కేశవ మూర్తులలో ప్రధానంగా ఉన్న సాహిత్యం పరికిస్తే దైవీయ వస్తువు గ్రహించిన తెలుగు సాహిత్యం గోచరమవుతుంది. దైవీయ వస్తువు పొందిన పరిణామం గుర్తించటం ప్రస్తుత కార్యం.

3.2. దైవీయ సాహిత్య వస్తువు - పురాణం: సాహిత్యంలో దైవీయ వస్తువు గోచరం కావటం ఒక్క సంస్కృత సాహిత్యానికి పరిమితం కాదు. ఇది ప్రాచ్య సాహిత్య లక్షణం మాత్రమే కాదు. పాశ్చాత్య సాహిత్యంలోనూ, ప్రపంచంలోని ప్రారంభ సాహిత్యమంతా దైవీయ వస్తు విస్తృతితోనే దర్శనమిచ్చింది. మానవ మానసిక వికాసానికి నాగరికతా అరంభంలోని ఆలంబనం దైవీయ భావనే. దైవీయ వస్తు వ్యాప్తిలో విశ్వాసానికి ప్రథమ తాంబూలం. ఈ విశ్వాసం ఏ హేతువుకు ఏ తర్కానికి, ఏ మీమాంసకు, ఏ చర్చకు చోటు ఇచ్చే అవకాశం లేదు. వేద వాఙ్మయ వికాసం తర్వాత సంస్కృతంలో ఇతిహాసపురాణ వాఙ్మయ క్రమ పరిణామమే గోచరమవుతుంది.

తెలుగులో కూడా ఇతిహాసమే ఆరంభ సాహిత్యం ఈ ఇతిహాసం కూడా సంస్కృత సాహిత్య వారసత్వంగా లభించిందే. చరిత్ర ప్రజా జీవిత సంబంధిగా పృథ్వీపతి విష్ణువే అన్న దృష్టి కారణంగా చరిత్ర ప్రాముఖ్యం పొందింది. దైవవ్యవస్థకే ప్రాధాన్యం ఇవ్వటం వల్ల తెలుగు పురాణం విషయమే ప్రధానంగా పరిశీలనం పొందుతూ ఉంది.

తెలుగు పురాణం పేరుతో వెలువడ్డ బసవ పురాణం నిజానికి పురాణంకాదు. పురాణాంశ అని సంభావించవచ్చు. కాని అది సమకాలీన సమాజ జీవన వ్యాఖ్యానంగా గోచరమయ్యే సాహిత్య చర్య. ప్రథమాంధ్ర పురాణం కంటే ముందుగా తెలుగులో పురాణం పేరిట వెలువడ్డ సాహిత్య సృష్టి బసవ పురాణం. దీని ప్రత్యేకతను గుర్తించటానికి సంస్కృత పురాణం విశదం చేసుకోవలసిన అవసరం ఉంది.

సంస్కృత సాహిత్య వికాస చరిత్రలో వేదాలు ప్రథమ గ్రంథాలు. ఇవి అపౌరుషేయాలు. వీటి అనంతర సృష్టి ఇతిహాస పురాణాలు. వైదిక కాలంలో అగ్ని ఇంద్ర వరుణ సూర్యాది దేవతలు పూజలందుకొనే వాళ్ళు. తర్వాతి కాలానికి శివ విష్ణువులకు ప్రాధాన్యం లభించింది. వేదాలకు తర్వాతి కాలంలోని దైవవ్యవస్థకు అక్షరరూపాలు, పురాణాలు. వేద ప్రమాణం దృష్టితో శివ కేశవుల ప్రాముఖ్యాన్ని చాటే సాహితీ స్వరూపాలు, పురాణాలు.

వేదాలెంత ప్రాచీనాలైనవో కొంచెమించుమించుగా అంతే ప్రాచీనమైనవి ఇతిహాస పురాణాలు. వేదాలలో నిగూఢాంతర్యాన్ని తత్వాన్ని అభివ్యక్తీకరించేవి, విశదీకరించేవి ఇతిహాస పురాణాలు.

పురాణాలు నిజానికి అతి ప్రాచీనాలు కావాలి కానీ వీటిని అర్వాచీనం అనీ అంటారు. అయితే పురాణాలు ఏ ఒక్క కాలంలోనో రచితమైనవి కావు. ప్రాచీన కాలం అంటే క్రీస్తు పూర్వం ఐదువందల సంవత్సరాల నుంచి క్రీస్తుశకంలో చాలాకాలం దాకా

పురాణ రచనా కాల విస్తృతి కనిపిస్తుంది. దాదాపు రెండువేల సంవత్సరాలుగా ఈ పురాణ రచన జరుగుతూ వచ్చింది. కాబట్టి ఏదో ఒక్క కాలానికి చెందినవిగా భావించవలసిన అవసరం లేదు. 'పురాణాల రచనా కాలం బ్రాహ్మణ కాలం నుంచి గుప్తరాజుల పరిపాలనా కాలం వరకు విస్తరించిందని చెప్పవచ్చును'. (1) పురాణాలు మౌఖికంగా చాలా కాలం వ్యవహారంలో ఉండి తర్వాత లిఖితమై ఉంటాయని భావించటం కద్దు. పూర్వం ఒక్క పురాణమే ఉండేదని మత్స్య శివ పురాణాలు వల్ల తెలుస్తుంది. దీని నుంచి తర్వాతి పురాణాలు ఆవిర్భవించిఉంటాయని ఒక ఆలోచనా దృక్పథం. పురాణలన్నీ వ్యాసుడే రచించాడంటారు. మరి కొందరు ఈ ఒక్క పురాణాన్నే వ్యాసుడు పద్దెనిమిది భాగాలు చేశాడని అంటారు.

పురాణాల్లో కేవలం వేదధర్మాల ప్రశంస మాత్రమే కనిపించదు. వేదకాలానంతరం మతంలో చేరిన అనేక మతాల ధర్మాలను కూడా పురాణాలు ప్రశంసిస్తున్నాయి. వేదం చెప్పే యజ్ఞయాగాదులనూ; కాలాంతరంలో వచ్చిన వైష్ణవ మత ధర్మాలను పురాణలలో చూడవచ్చు. పురాణ సాహిత్యం అపురూపమైన ప్రకృతి ధర్మాల నుంచి రూపవంతమై మూర్తుల ఆరాధన వరకు పరివర్తన చెందింది. 'పౌరాణిక మత వికాసంతోనే దేవతల విగ్రహాలు దేవాలయాలు, దేవాలయ నిర్మాణ శిల్పం మొదలైనవి ఆరంభమై వికసించినవి'.(2) ఒక్కొక్క పురాణం ఒక్కొక్క రాజవంశ చరిత్రను కొంత వరకు సూచించింది. విష్ణుపురాణంలో మౌర్య రాజుల ప్రసక్తి ఉంది. దీని వల్ల క్రీస్తు పూర్వమే పురాణ రచన ఉన్నట్టు వ్యక్తం అవుతుంది. నాటి నుంచి క్రీ.శ.7వ శతాబ్దం వరకు కూడా పురాణాల రచన జరుగుతూ వచ్చిందని దీనివల్ల గుర్తింపవచ్చు. ఈ 7వ శతాబ్దంలోనే పురాణ రచన ఆగిపోలేదు. ముందుకు కూడా ఇది కొనసాగుతూ వచ్చింది. 11వ శతాబ్దానికి ఉధృతం తగ్గినా ఈ రచనా పరంపర 16వ శతాబ్దం దాకా కొనసాగింది. ఈ కొనసాగింపు కాలంలో పురాణాలకు ఉపపురాణాలు చేరుతూ వచ్చాయి. పురాణాలు కొంత వరకు చరిత్రను తెల్పుతాయి. అయితే కొందరు వీటిని చరిత్ర కాదని అభూత కల్పనమని చారిత్రకాంశాలు లేవని తిరస్కరించారు. 'పురాణాలలోని చారిత్రక విషయాలు సత్యాలు కావని పూర్తిగా నిరాకరించటం సమజసంకాదు' (3) అనే దృష్టి కూడా ఉంది. అయితే స్పష్టమయిన చారిత్రక నేపథ్యం స్పష్టంగా ప్రకటింపబడకపోవటం వల్ల ఏది చరిత్రో ఏది కల్పనో, విశదం కాకుండా పోయింది.

ఇదంతా పరిశీలించినట్లయితే 'మూల పురాణ విద్య వేదకాలంలోనే ఆరంభమైందని, కాని ఆ విద్య మౌఖిక రూపంలోనే వుండేదని లిఖిత రూపంలో అవి క్రీ.శ.400 ప్రాంతం నుంచి రూపొందుతూ వచ్చి క్రీ.శ.16వ శతాబ్దం వరకు కొనసాగినవని చెప్పవచ్చును'. (4)

పురాణానికి ప్రధానంగా అయిదు లక్షణాలన్నది స్పష్టమయిన విషయమే. కాని సమాజ జీవితంలో క్రమంగా పెరిగే విశ్వాసాలు ఆచారాలు సంప్రదాయాలతో పాటు మారటం పెరగటంతో పురాణ లక్షణాలు కూడా మార్పుకు పెరుగుదలకు గురికాక తప్పలేదు. ఒక్కొక్క పురాణాన్ని వ్యాసుడు రోమహర్షణునికి, రోమహర్షణుడు తన ముప్వురు శిష్యులకు, వారు తమ శిష్యులకు చెప్పడంతో అష్టాదశ మహాపురాణాలు ఉప పురాణాలు

రూపొందాయని ఒక వాదం. బ్రహ్మ చెప్పిన పురాణాన్ని వ్యాసుడు పద్దెనిమిది భాగాలుగా రచించాడని మరో వాదన. పురాణమనే పేరు త్రిమూర్తుల పేర్లతో కలిసి వ్యవహరించారు. విష్ణుపురాణమని శివపురాణమని బ్రహ్మపురాణమని వేరు వేరు పురాణాలు రూపొందాయి.

3.2.1. బసవ పురాణం : 12వ శతాబ్దంలో తెలుగులో అవతరించిన సాహిత్య సృష్టి బసవపురాణం. అప్పటికి ఇతిహాసమైన భారతం అనువాదం ఆరంభమయింది. సాంఘికంగా శైవ వైష్ణవ మత సంప్రదాయ సంఘర్షణం నుంచి బసవ పురాణం పుట్టింది. రాజాశ్రయం నుంచి వైష్ణవ మత దృక్పథం ప్రకటించే భారతం అనువాదం అవుతూఉండగా ప్రజాభిమానం పొందిన శైవ మత వ్యాప్తి కాంక్షించిన సాహితీమూర్తి సారస్వత పరిశ్రమగా బసవ పురాణం రూపొందింది.

పురాణాలను సాత్త్వీక రాజస తామస పురాణాలని త్రిగుణాత్మకంగా పేర్కొన్నారు. సాత్త్వీక గుణ ప్రధానమైన పురాణాలు విష్ణు వస్తు ప్రధానాలు. రాజస గుణ ప్రధానమైన పురాణాలు బ్రహ్మ వస్తు ప్రధానాలు. తామస గుణ ప్రతిపాదక పురాణాలు శివ వస్తు ప్రాధాన్యం గలిగి ఉన్నాయి. శివ ప్రాధాన్యం ఉన్న పురాణాలకు అంతగా పఠన యోగ్యతను సంప్రదాయం భావించలేదు. శైవ సాహిత్యానికి వేద పురాణం కాలం నుంచి ఉన్న చిన్న చూపుకు ఇది నిదర్శనం. తెలుగు సాహిత్యంలో అంతవరకు లేని శైవ సాహిత్యం పాల్కురికి సోమనాథుని సృష్టిగా అవతరించింది. శైవ సంప్రదాయ ప్రచురంగా బసవ పురాణం ఆవిర్భవించింది.

ప్రత్యేకత : ప్రక్రియ తెలుగు సాహిత్యంలో బసవ పురాణం ప్రథమ పురాణం. అప్పటి వరకు ఇతిహాసాల అనువాదం జరుగుతూ వచ్చింది. పురాణ అనువాదం ఇంకా జరగలేదు. తెలుగు సాహిత్యంలో స్వతంత్ర సాహిత్య సృష్టి ప్రప్రథమ పురాణం, బసవ పురాణం.

బసవ పురాణం మిగతా పురాణాల కంటే భిన్నంగా ఉంటుంది. పురాణం అంటే ప్రాచీనమైన ఇతివృత్తంతో ఉండాలి. ప్రాచీనమంటే చారిత్రకంగా జరిగిపోయిన పూర్వ కాలానికి సంబంధించింది. పురాణాలన్ని గత కాలానికి ప్రాతినిధ్యం వహిస్తాయి. కాని బసవ పురాణం మాత్రం సమకాలీన సహజ చరిత్ర కలిగి ఉంది. బసవణ్ణ సమకాలంలోని సమాజాన్ని ఉర్రూతలూపిన సాంఘిక సంస్కర్త. బసవణ్ణ బసవ పురాణంతో దాదాపు సమకాలికుడనే చెప్పవచ్చు.

పురాణం వైశంపాయనుడు జనయేజయునకు చెప్పగా దానిని వైవస్వతుడు శౌనకాది మునులకు చెప్పినట్లు ఉండటం పద్ధతి. అంటే ఒకరు వక్తగా మరొకరు శ్రోతగా ఉంటారు. కాని కథాగమనంలో బసవ పురాణంలో పద్ధతి వేరుగా ఉంది. కొన్ని భక్తుల కథలు బసవుడు చెన్న బసవాది భక్తులకు చెప్పాడు. మరి కొన్ని కథలు మాదిరాజు తెల్పినట్లు బసవడు చెన్నబసవాదులకు చెప్పాడు.

2. లక్షణ సమన్వయం : బసవ పురాణంలో సృష్టి, దాని పునస్సృష్టి వంశం దాని చరిత్ర, మనువు మన్వంతరాల ప్రసక్తి లేదు. విస్తృత కథాంశాలు సదీర్ఘ కాలానికి కుదింపు. సూర్యచంద్రాది వంశ వంశానుచరితలు మనువుల వృత్తాంతం కనిపించవు.

బసవణ్ణ, బసవణ్ణ జీవితం మాత్రమే. అతనికి పూర్వం ఉన్నవాళ్ళు. సమకాలంలో ఉన్న వాళ్ళ చరిత్ర మాత్రమే బసవ పురాణంలో ఉంది.

బసవ పురాణం సంస్కృత పురాణ అనువాదం కాదు. దీనిలో సృష్టి ప్రారంభం వంటి రచనా విధానం లేదు. సర్గాది పురాణ లక్షణాలు కనిపించవు. ఉన్న ఏడు ఆశ్వాసాలతో ప్రథమాశ్వాసం బసవని జన్మకు నేపథ్యం తెల్పింది. బసవణ్ణ మానవుడుగా జన్మించటం నుంచి వివాహ మాడటం దాకా ఉంది. ఇంకా సంగమ దేవుని సాక్షాత్కారం ఉంది. రెండవ ఆశ్వాసంలో బసవని మహిమలున్నా మిగతా ఆశ్వాసాలలో బసవని లింగైక్యం చిత్రితమయింది.

3. రచనా ధోరణి : కావ్యేతిహాస రచనా విధానం అంతా సంస్కృత సాహితీ ఛందో విధానానుగుణంగా ఉన్న కాలంలో పాల్కురికి సోమన ప్రయోగం చేశాడు. తాను తీసుకొన్న కథేతివృత్తంలాగా రచన ధోరణిని కూడా నూత్నంగా గ్రహించాడు. కథలాగానే ప్రజలకు దగ్గరగా ఉండేలాగా ద్విపద ఛందస్సును గ్రహించాడు. తాను ప్రవేశపెట్టిన నూతనత ద్వారా దేశీ విధానాన్ని కవిత్వానికి ఆపాదించి, రచనా ధోరణి మార్గ కవితా మార్గం నుంచి మళ్ళించాడు. బసవ పురాణం '..... పంచ లక్షణ విశిష్టమైన పురాణం కాదు. జైన పురాణంలాగా పంచ కళ్యాణ లక్షణాలను ప్రచ్ఛన్నంగా తనలో ఇమిడ్చుకొన్న వీరశైవ పురాణం, బసవని చరిత్రాన్ని వర్ణించిన ఈ గ్రంథం జైన తీర్థంకరుల చరిత్రను వర్ణించే కన్నడ జైన పురాణ సంప్రదాయాన్ని అనుసరించింది. కావున బసవ పురాణం దేశీ సంప్రదాయానికి సంబంధించినదని పేర్కొనవచ్చు'. (5)

4. మతం : తెలుగు సాహిత్యంలో ఆరంభమైన వైదిక మత ప్రోత్సాహం కొనసాగుతూ ఉంది. అటువంటి రచనా విధానానికి వ్యతిరేకంగా వెలువడిన రచన బసవ పురాణం. శైవ సంప్రదాయానికి సాహిత్యంలో జీవం పోసింది. శైవ మతాచారాలు, శైవధర్మాలు తత్ ప్రచారం స్పష్టంగా ఇందులో కనిపిస్తాయి.

దీనిలో శివ భక్తుల కథలు సంక్షిప్తంగా ఉన్నాయి. మానవ జన్మలో భక్తి పారవశ్యంతో సాధించిన మహిమలే ఇందులో చెప్పబడ్డాయి. ఈ భక్తులలో పూర్వజన్మ వాసనలు కానీ, దేవదానవ స్పర్థ కానీ, పూర్వ జన్మలో ఉన్న భక్తి మైత్రి వైరాదులు కానీ, బసవ పురాణంలో వర్ణించలేదు.

ఇందులో భక్తులందరూ శివుని ప్రత్యక్షం చేసుకొన్నవారే. తమ భక్తితో శివుని ముగ్ధుడిని చేసిన వారే. సాధారణంగా శివుడు ప్రత్యక్షం కాబోయే ముందు భక్తులను పరీక్షించడం పరిపాటి. భక్తుల నిర్మల భక్తి నిదర్శనంగా స్వార్థ రహితంగా వాళ్ళు కోరిన వరాలే అనుగ్రహిస్తాడు. శివుడు ఇతర పురాణాలలో అధికులు, తపస్సు చేసి దేవ సాక్షాత్కారం పొంది ఎవ్వరి చేతిలో చావు లేకుండానో, ఎవరినైనా చంపడానికి తగిన ఆయుధాలు పొందడమో వంటి వరాలు పొందుతారు. కాని బసవ పురాణంలో అది కనిపించదు. భక్తుల భక్తి పారవశ్యంలో కొంత హింసాయుత చర్యలు కనిపిస్తాయి. నరసింగ మొన్నయనారుని కథలో ఇది కనిపిస్తుంది.

నాయకునికి ఆధిక్యం ఇచ్చి మిగిలిన అందరూ తదనుగుణంగా నడచినట్లు, ఇందులో కనిపించదు. భక్తులందరిలో బసవడు ఒకనిగా చెప్పబడ్డాడు. పోడ్డలదేవు బాచయ్య కథలో రాజు గోవిందుని ఆలయం నిర్మించి రాని శివభక్తులను నిందించడంలో ఇది కనిపిస్తుంది.

విప్రునికి దళితునికి మధ్య సఖ్యత ఇందులో కనిపిస్తుంది. భక్తుడైన కారణాన మాల అయిన శివనాగయ్యను బసవడు తన వెంట పెట్టుకోవడం, శివనాగయ్యతో సహిమను చూపడం విశిష్టంగా ఉంది. శివభక్తే కాని వర్ణం ముఖ్యం కాదనడంలో ఈ సఖ్యత కనిపిస్తుంది.

5. విషయం : స్థానికంగా పేరు ప్రఖ్యాతులు గాంచిన భక్తుల వివరాలు బసవ పురాణంలో కనిపిస్తాయి. కథా నిర్మాణం పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది.

రజతాచలాన నందీశ్వరాది ప్రమథులు కొలుస్తుండగా ఉమాదేవిని కూడి మహేశుడు వినోదంగా ఉన్నాడు. ఆ సమయాన విచ్చేసిన నారదుడిని, పార్వతి, వెళ్ళి వచ్చిన కార్యాలు శివునికి విన్నవింపమనగా, నారదుడు భూలోక వృత్తాంతం తెల్పి భూలోకాన అవతరించమన్నాడు. శివుడు తనకు నందికేశ్వరునికి భేదం లేదని నందీశ్వరుని భువిపైకి పంప నిర్ణయించాడు. శివ నందికేశ్వరుల అభేదకాన్ని పార్వతి ప్రశ్నించగా శివుడు చెప్పసాగాడు. నారదుడు శ్రోతగా నిల్చాడు. యుగాల క్రితం శిలాదుడు అనే దానవుడు ఘోర తపస్సు చేసి శివుని ప్రత్యక్షీకరించుకొని తన సుతునిగా జన్మించమని కోరగా, తన అంశం, ద్వితీయ శంభుడైన వృషభాన్ని, తద్పుత్రునిగా నందీశునిగా జన్మించ పంపాడు. శిలాదునికి జన్మించిన నందికేశునికి పూర్వరూప జ్ఞానం సర్వజ్ఞత్వం కలిగించాడు శివుడు. కనుక శివ నందికేశ్వరులు భిన్నం కాదన్నాడు. పిమ్మట నందికేశ్వరుని పిలిచి మర్త్యలోకాన జన్మించి పావనం చేయమనగా అంగీకరించి నమస్కరించి భూలోకానికి వచ్చాడు.

ఇంత వరకున్న కథా భాగంలో సమకాలీన సమాజ వ్యక్తుల చరిత్ర లేదు. ఈ భాగం బసవ పురాణానికి పురాణ నామధేయం సమర్థించడానికి తగిందిగా ఉంది. ఇక ఇక్కడట వచ్చే కథాభాగంలో సమకాలంలోని వ్యక్తుల జీవితం తెలుస్తుంది.

కర్ణాట దేశమేగి, సన్నహింగుళేశ్వర భాగవాటి అనే అగ్రహారాన పుత్రరహితయై, నందికేశుని పేరిట వ్రతం పూనిన మాదాంబ అనే పతివ్రత మనోకాంక్షను ఆలోకించి, తన గర్భంగా ఎంచి తద్గర్భం ప్రవేశించాడు. అటనే శివతత్వాన్ని తెలుసుకొంటూ ఉండిపోయాడు. మూడేండ్లు గడచినా జనించని బిడ్డనికై వగచి మాదాంబ ఆలయాన నందికేశుని నిందించి వచ్చి నిద్రించగా, కలలో శివుడు బాలుని వృత్తాంతం తెల్పి బసవడని పిలవమన్నాడు. ఆ బాలుడు కర్తవ్యాన్ని పరంజ్యోతి హెచ్చరించడంతో అందరిని ఆశ్చర్యపరిచేటట్లు జన్మించాడు. ఆ క్షణాన కప్పడి సంగమేశ్వరుడు తాపసి రూపాన వచ్చి తన పుత్రునిగా తెలిపి, చూచి వెళ్ళాడు. పెరిగిన, సహజ విద్యా గరిమ గలిగిన బాలుడైన బసవనికి వడుగు చేయడానికి తండ్రి [illegible]

సోదరితో శివాలయానికి వెళ్ళాడు. మాదాంబభాత్రుడు బిజ్జలుని బండారి బలదేవనాయకుడు, బసవడిని తన పుత్రికకు తగిన వరునిగా ఎంచి, అంగీకారం పొంది వైభవంగా వివాహం చేశాడు. కప్పుడి సంగమేశ్వరాన తన గురుదేవుడున్నాడని చెల్లి అలితో కూడి అప్పురం చేరి గుడికేగి ప్రస్తుతించాడు. తద్భక్తికి జనులు అచ్చెరువు పడేట్లు సంగమదేవుడు ప్రత్యక్షమై భక్తుడు చేయదగ్గ కార్యాలను బోధించాడు.

పురాణంలో ప్రధానంగా ఉండే దైవతత్వం ఈ సందర్భంలో దర్శింపవచ్చు. హేతు దృష్టికి లొంగని విషయాలు పురాణ సాహిత్యంలో ఉండటం సహజ లక్షణం.

బిజ్జలుడు బసవని ఉదంతమెరిగి తన దండనాయకునిగా చేశాడు. కళ్యాణకటకాన దండనాయకునిగా ఐశ్వర్యాలను పొందుతూ, శివ భక్తుడై జీవిస్తూ, ఇతరులను నొప్పించని బసవడు బాసచేశాడు. బసవని ఖ్యాతి విని భక్తులనేకులు చూడటానికి వచ్చారు. బసవని శివాచార నిరతిని చూసి ఆశ్చర్యపోయేవారు. బసవని మేనల్లుడైన చెన్నబసవనిలో కనిపిస్తున్న భక్తి మాహాత్మ్యాలకు భక్తానీకం ముగ్ధులైపోయేవారు. చెన్నబసవడు బసవని కీర్తించాడు. ఆ సమయాన అల్లమరాజు వచ్చాడు. బసవేశ్వరుడు ప్రభువుకు అశేష జనవాహినికి విందు వైభవంగా ఇచ్చి అల్లమ ప్రభువు నుంచి ప్రశంసలు వరాలు పొందాడు. ఒకనాడు బసవడు జంగమార్చన చేస్తుంటే దొంగలు ప్రవేశించడం ఎరిగి వంకాయలు కట్టిపెట్టగా వాటిని లింగాలని దొంగలు మొక్కారు. బసవణ్ణ వాటిని లింగాలుగా చేశాడు. ఒకనాడు జంగముడు అభ్యంజనానికి పదిముట్లు ముత్యాలు కోరగా తన ఎదుటున్న జొన్నల రాశిని దృష్టి సంస్పర్శతో ముత్యాలుగా మార్చాడు. బసవని మహిమలు చూచి వేడుక పొందిన సంగమేశ్వరుడు జంగమరూపం ధరించి బసవడిని మూడవ కన్నడగగా, ఫాలాక్షుని త్రినేత్రాన్ని గుర్తించి బసవడు స్తుతించాడు. సభలో ఆసీనుడై ఒకనాడు పడకంటూ కడవెత్తినట్టు చేతులెత్తడం చూచి రాజు పరిహసించాడు. అందుకు బసవడు కపిలేశ్వరాన క్షీరంతో తపసి చేసే మజ్జన కారణాన తడసిన నేలపై జారబోతూ చల్ల వనిత బసవని తలచిన రక్షించానని తెల్పాడు. రాజు ఆ వనితను రప్పించి విషయం సత్యమని బసవని మహిమ తెల్సుకొన్నాడు. చిట్టంబలుడనే భక్తుడు పూజాపుష్పాలు గ్రహించిపోతూ కాలుజారి పడుతూ బసవని తలచుకొనగా వానిని పట్టి బసవడు నిల్పాడు. శివపుత్రుడైన బసవని చూడటానికి సిద్ధరామయ్య ప్రమథలోకానికేగగా శివుడు తన హృదయాన బసవని చూపి పార్వతికి బసవడిని మహిమ తెల్పాడు. సిద్ధరామయ్య భువికి వచ్చి భక్త కోటికి బసవ మహిమ తెల్పాడు.

ప్రధానిగా బసవడుండగా, మంత్రులు బండాగారంలో ధనం బసవడు వ్యర్థం చేస్తున్నాడని రాజుకు తెల్పగా, రాజు బసవడిని రప్పించి నిందాపూర్వకంగా ప్రశ్నించగా హరభక్తి ధనమైన తనకు ఇతర ధనం వ్యర్థమని పెట్టెలు తెప్పించి ముందట పెట్టాడు. లెక్కకు మించి మిక్కిలిగ ఉన్న ధనం చూచి ఆశ్చర్యపోయారందరు. రాజు గుర్రాల కొనుగోలుకు ధనమిచ్చి పంపగా మార్గాన జంగమార్చనకే అర్థమంతా అయిపోవడంతో పొలాలలోని నక్కలను గుఱ్ఱాలుగా మార్చాడు. ఒకనాడు, వేశ్య కొరకు తన పత్ని వస్త్రాన్ని జంగముడు కోరగా ఇచ్చి తన జంగమ సేవ చాటుకొన్నాడు. సూర్యాస్తమయ సమయాన

మిండ జంగాలు వేశ్యాలయానికి వెళ్ళారు. బసవని ఇంట నున్న ముగ్ధ సంగయ్య అనే శరణాగతుడు వారు లింగార్చన చేయపోతున్నారని తలచి, తాను వెళ్లానని కోరి, బసవని అంగీకారంపై వెళ్ళాడు. వేశ్యా వాటికలోని యువతి తన శయ్యాగారానికి తీసుకొని వెళ్ళగా అది లింగార్చన చేసే చోటని, తనకు భిన్నంగా ఉన్న యువతిని అపూర్వ లాంఛనదారిగా తలచాడు. ఆమె విధమడిగి తెలుసుకొని ఆశ్చర్యపోయాడు. అంగన సహకరిస్తుండగా లింగార్చన చేసి, ఆ సేవలో సంతుష్టుడై ఉదయాన్నే గృహమేగి బసవనికి తద్సౌఖ్యాన్ని తెల్పాడు. బసవడు వాని ముగ్ధభక్తిని ప్రశంసించాడు. అది విన్న చెన్నబసవని కోరికపై బసవడు చెప్పసాగాడు. రుద్ర పశుపతి అనే భక్తుడు ఒక కథకుడు ఆదిపురాణంలోని సముద్రమథనం, అందు వెలువడిన కాలకూటాన్ని శివుడు మింగాడని చెప్పగా విషం మింగి ఎవరు బ్రతుకుతారని దుఃఖించి చావబోగా శివుడు ప్రత్యక్షమై వరం కోరమనగా శివుడా విషాన్ని ఉమ్మేయాలని మొండిపట్టు పట్టడంతో ఆ విషం తన గళం దిగకుండా చూడమని ఆ భక్తుడిని తన అంకాన నిల్పుకొన్నాడు.

శివభక్తి కలిగిన బెజ్జమహాదేవి తల్లి లేకపోవడమే శివుని స్థితి కారణమని తలచి తానే తల్లై లింగమూర్తిని బుజ్జగించసాగింది. ఆమె భక్తి తెలిసి పరీక్షింపదలచాడు శివుడు. తల్లి ఉపచారాలు గ్రహించక పోవడంతో బెజ్జమహాదేవి తల్లడిల్లి ప్రాణత్యాగానికి సిద్ధం కావడంతో శివుడు ప్రత్యక్షమై వరం కోరమనగా బిడ్డ శ్రేయస్సు కోరింది. ఆమె ప్రేమకు ముగ్ధుడై తల్లికి నిత్యత్వమిచ్చాడు. కన్నప్ప వేటకని అడవికేగి అలసి నిద్రించాడు. కలలో శివుడు, ముందు కన్పించబోయే లింగమూర్తిని తెల్పాడు. లేచిన కన్నప్ప ముందుకేగి లింగమూర్తిని చూచాడు. ఒంటిగా ఉండ కారణాలు పరిపరి విధాల ప్రశ్నించి, ఆకలిపై ఉండి సమాధానమివ్వడం లేదేమోనని తలచి కందమూలాలు మాంసాన్ని దొప్పలో, పుక్కిళ్ళలో నీరు తెచ్చి కాలితో పూజాద్రవ్యాలు తోసి పుక్కిట నీటితో శుభ్రం చేసి మాంసం పెట్టాడు. తత్పూర్వం లింగమూర్తిని కొలిచే తపసి, కన్నప్ప పూజ చూచి ఏవంగించి దుష్టమైన తలపున మరుగున నిల్చాడు. కన్నప్ప భక్తి తెల్పుకోడానికి శివుడు తనకంట నీరు కార్చసాగాడు. అది చూచి కారణం తెలియక తోచిన వైద్యం చేసి ఫలరహితుడై ఆలోచించి తన కన్ను పెకిలించి పెట్టగా ప్రక్క కన్ను నీరు కార్చసాగింది. మందు తెల్పిన కన్నప్ప కన్ను పెకలింపబోగా శివుడు ప్రత్యక్షమై వరం కోరమనగా శివుని దయాదృష్టి చాలన్నాడు. తపసి శివునికి మొక్కి కన్నప్పని ప్రస్తుతించాడు.

పిమ్మట బసవడు కళియంబనయనారు భక్తిని తెల్పాడు. అనంతరం సకలేశ్వర మాదిరాజయ్య భక్తి మహిమ చెప్పసాగాడు. శివ భక్తుడు, రాజు అయిన మాదిరాజయ్య ఒక మండలేశుడు. రాజ్యాన్ని వదలి శ్రీనగరిపై ధ్యానమగ్నుడై ఉన్నాడని తెలిసి చూడబోయాడు. మాదిరాజును పరీక్షింపదలచిన మల్లికార్జునుడు నేలనింగి సాగి నిలవగా, మాదిరాజు ఆశ్చర్యపడి ఇది శంభుని మహిమని ఎంచి ప్రస్తుతించాడు. శంభుడు తన పూర్వ రూపం దాల్చి మాదిరాజును తన తత్త్వామృతాన తేల్చి భువికేగమనగా నిరాకరించాడు. మాదిరాజును ఒక తుమ్మచెట్టు నీడన సమాధిన ఉండమని తాను గొల్లరూపాన వచ్చి మాదిరాజుకు జ్ఞానోదయం కలిగించాడు. దుఃఖిస్తున్న మాదిరాజును ఓదార్చి భర్గపదం

వరంగా ప్రసాదించి బసవని గూర్చి చెప్పి కొంతకాలం బసవని వద్ద ఉండమని చెప్పి నిల్చాడు.

బసవని ఖ్యాతి విని వచ్చి, అతని వద్ద సంగమ కార్యాలు చేస్తూ భక్త సంఘ వస్త్రాలను ఉతికిస్తూ లింగ సేవ చేయసాగాడు. సంతకెళ్ళే వాడిని ఒకడిని మాచయ్య చంపాడని, శవం కన్పించటం లేదని ప్రజలు రాజుకు తెల్పారు. బసవని పిలిపించి రాజు నిందించగా మాచయ్య గొప్ప మహిమలను తెల్పాడు. రాజు మాచయ్యను చంప ఏనుగు పంపగా మాచయ్య దానిని చంపాడు. మాచయ్యను బసవడు కీర్తించగా బిజ్జలుని ఏనుగు తిరిగి బ్రతికించాడు. ఈ మాచయ్య ఒకనాడు బసవని భక్తకోటి పాడిన అటిమటి పాటకు కుపితుడవ్వగా, బసవడు మన్నించమని కోరాడు.

మాచయ్య, భక్తునికి అహంకారం తగదని నిమ్మవ్వ కథ చెప్పసాగాడు. నిమ్మవ్వనే భక్తురాలు భక్తుల ఇళ్ళకు అర్ఘ్యపణ్యాలు ఇస్తే, ఆమె పుత్రుడు భక్తుల గోవులు కాచేవాడు. వీరిలా ఉండగా కంచిలో సిరియాలుడనే భక్తుడు, భక్తులేవురికి నిత్యాన్నదానాలిస్తూ ఉండేవాడు. వాని భక్తి తెలియగోరి శివుడు జంగమ రూపాన వెళ్ళి తద్పుత్రుడిని ఆహారంగా పొంది, భక్తికి మెచ్చి పుత్రునిచ్చి, సిరియాలుని కైలాసానికి గొనిపోయినా తన సంసార వ్యామోహం వీడలేకపోయాడు. అంత చిఱుతొండ రమ్మని, వానిని గొని నిమ్మవ్వ కడకేగగా పూజించి పంచభక్ష్యాలతో ఆతిథ్యమిచ్చింది. నిమ్మవ్వ అర్ఘ్యపణ్యాలకేగగా ఆమె పుత్రుడింటికి వచ్చి తల్లిని కానక అటనున్న బూరె తిన్నాడు. వచ్చిన నిమ్మవ్వ కుక్క అంటూ వాని· తలను బ్రద్దలు చేసి పుత్రవ్యామోహం కించిత్తు లేక గాడిలో వేసి పాక యత్నంలో నిమగ్నమైంది. భోజన సమయాన పుత్రుని గూర్చి ప్రశ్నించగా ఈ మాయలన్నీ తనకు తెల్పిన తానేమి సిరియాలుడు కానని, తనకే కైలాసమూ వద్దనగా శివుడు తన నిజరూపం దాల్చి, నిమ్మవ్వ పట్టుపై ఆరగించి, సిరియాలునికి సంసార వ్యామోహం లేని భక్తి తెల్పాడు. మరొక భక్తుడు నరసింగనయనారుడను రాజు. తదగ్రమహిషి పరమేశుని పూజింపబోయి, అట ఒక పూజాపుష్పాన్ని మూర్కొనగా పూజారి బిడ్డ ఆమె ముక్కు కోశాడు. విషయం తెల్పి రాజు పూవును పట్టిన చేతిని ముందు నరకనందుకు ఆ బాలుని ౹ిందించి అతనే భార్య వ్రేళ్ళు మణికట్టు మోచేయి నరికి మొదలంటబోగా శివుడు ప్రత్యక్షమై ఆ వనితను కరుణించి రాజుకు ముక్తి ప్రసాదించాడు. పిమ్మట కొట్టరువుచోడని శక్తిని మాచయ్య తెల్పి బుద్ధులు నీతులు చెప్పి గర్వం వలదన్నాడు అని బసవుడు చెప్పగా నిరంతర భక్తితో ముక్తి పొందిన జంగమ కథలను విని భక్తకోటి చెన్నబసవడు ౹సవనికి నమస్కరించి వెళ్ళారు.

ఈశ్వర భక్తుడు కిన్నర బ్రహ్మయ బసవని కీర్తి విని కళ్యాణకటకం రాగా ౹సవుడు ఎదురేగి ఆహ్వానించాడు. బ్రహ్మయ ఒకనాడు త్రిపురాంతకాలయాన ఉండగా ౹రాంగనార్థమై చంపదెచ్చిన గొర్రె ఆలయం ప్రవేశించింది. దానిని చంపవలదని తగిన ౹నం బ్రహ్మయ ఇచ్చాడు. కాని వారాంగన·పరిహాసానికి గుర్రై కుపితుడై విటుడు గొర్రెను ౹ంపవచ్చి, బ్రహ్మయ మాట వినక, బ్రహ్మయ చేత మృతుడయ్యాడు. ఇది తెల్సిన ౹జు బసవడిని నిందించి రమ్మని పిలవ పంపగా త్రిపురనేనికే సత్యం తెల్పి, తాను

రానన్నాడు. విన్న రాజు బసవనితో వచ్చాడు. రాజుతో త్రిపురరితో సాక్షి పలికించగలగని, బసవ ప్రార్థనపై దేవుని పిలవగా శివడు ఓయని ప్రత్యుత్తరమిచ్చి నిర్ఘోషిత్వాన్ని తెల్పాడు. కట్టెలమ్ముకొని బ్రతికే మోళిగ మారయ్య భక్తి తెలుసుకోగా బసవడు శరణార్థిలా వెళ్ళి వాని జంగమ భక్తిని తెలుసుకొన్నాడు. భక్తుడైన కన్నద బ్రహ్మయ్య భక్తులు కాని వాళ్ళింట దొంగలించి జంగమకోటికి పెట్టేవాడు. ఒకసారి రాజు బండాగారం దొంగలించి పోయాడు. కాని రాజు బసవనితో చూడబోగ కన్నంపెట్టిన చోట కనకం కన్పించి విస్మయం చెందాడు. బసవడు భక్తుని మహిమను రాజుకు తెల్పాడు. మరో శైవభక్తుడు ముసిడి చౌడయ్య. బసవని చూడటానికి బయలుదేరాడు. అడవిలో ముసిడి పండ్లను శివునికి అర్పించడం వల్ల అయనే ముసిడి చౌడయ్య అయ్యాడు. బసవడు ఎదురేగి ఆహ్వానించగా కళ్యాణకటకం ప్రవేశించాడు. ఒక వివాహానికి పోతూ ఆకాశంలో వెళ్ళే తపసిని ఆపి తెచ్చాడు. పొలిమేరలలోని బసవమ్మట్టి ఉదంతం విని అట మరణించిన అబోతును బ్రతికించాడు. తోవలో ఎదురైన నీటిలో మార్గం చేశాడు. వివాహానంతరం నగరం విహరిస్తూ కాల్మొక్కిన వనితను దీవించాడు. మరునాడు ఆ యువతి మృతిచెందటం తెలిసి వెళ్ళి బ్రతికించాడు. మతిహీనులు పరిహసించటానికి గోనెను మృతి చెందిన తపసి అని దుఃఖిస్తుండగా గోనె నుంచి తపసిని లెమ్మన్నాడు. తపసి జన్మించి తన జన్మ చెప్పగా కోపోద్రిక్తుడయ్యాడు. భయమంది వేడిన మతిహీనులకు అభయమిచ్చి వారిని శివభక్తులను చేశాడు.

ఏకాంత రామయ్య ప్రమథలోకానికేగి శివసేవా సౌఖ్యాన్ని అనుభవించి వచ్చిన భక్తుడు. బసవని దర్శించి కళ్యాణకటకానికి వచ్చి నిల్చాడు. ఒకసారి జైనుడితో జరిగిన వాదనలో తన భక్తి చూపటానికి స్వయంగా శిరస్సు ఛేదించుకొన్నాడు. ఏడు రోజులు నగరమంతా తిరిగి శిరస్సు రామయ్యను చేరింది. భక్తిపరవశులైన శైవులు జైనులనే వారు నగరాన లేకుండా చేశారు. పరమభక్తుడయిన పోడ్డలదేవు బాచయ్య జాగారానికి సౌరాష్ట్రం వెళ్ళేవాడు. ఈ పర్యాయం పోకోరగా ఇరుకొలువులు తగదని నిరాకరించాడు బిజ్జలుడు. సౌరాష్ట్ర ప్రభువే రాగా బసవడు తగిన ఏర్పాట్లు చేశాడు. బాచయ్య భక్తిని నిరిస్తూ రాజు గోవిందుని ఆలయం నిర్మించి, ప్రారంభానికి రాని బాచయ్యను నిందించగా బసవడు బాచయ్య భక్తిని మెచ్చాడు. బాచయ్య హరికంటే హరుని విశిష్టతను రాజుకు తెల్పాడు.

ఉత్తముడూ భక్తుడూ అయిన శివనాగమయ్య బసవని ఛేత ప్రణిపత్తిగైకొంటూ సుఖిస్తూ ఉండగా, భూసురులు రాజుతో బసవని ఆశ్రితుల వల్ల వర్ణభ్రష్టత్వం కలుగుతూ ఉందని చెప్పారు. బసవని పిలిపించి, శివనాగుమయ్యతో వచ్చిన బసవని నిందించి నిలదీయగా శివభక్తే విశిష్టం కాని వర్ణం విశిష్టం కాదన్నాడు. శివనాగుమయ్య మహిమను చూడడానికి వాని చేతిని అదనముగా క్షీరధారలు ఎగసి దూకాయి. బిజ్జలుడు విస్మయంతో వారిని శరణు కోరాడు. ఒకనాడు బోయలందరూ కలసి వచ్చి శివప్రసాదాన్ని తనకివ్వక బసవడే ఆరగిస్తున్నాడని చెప్పడంతో రాజు బసవని పిలిపించి ప్రశ్నించాడు. బోయలతో ఈ రోజు శివప్రసాదం కాలకూటం అర్పితమైంది వచ్చి గొనిపొమ్మనగా, తగవులాడి బసవడు గ్రహించిన తర్వాత తాము పొందుతామని బోయలు తెల్పారు. కాలకూటాన్ని ఆరగించిన బసవడు వారికి కాలకూటం పంచగా వణికి వాళ్ళు ప్రస్తుతించారు. ఒకనాడు

బసవని ఇంటికి జగదేవ దండనాయకుడు వచ్చి ఆరగించటానికి తన ఇంటికి ఆహ్వానించగా బసవడు అంగీకరించాడు కానీ, బసవని రాక పూర్వమే జగదేవుడు అభిషేకాదులు ముగించడం తెల్పి బసవడు వెళ్ళక ఆగ్రహించాడు. వచ్చిన జగదేవుని నిందించగా దుఃఖితుడై పరితపించి ప్రాణాలు తీసుకొంటాను అనగా నివారించి త్వరలో శివద్రోహం జరుగబోతూ ఉంది, వానిని చంపి ప్రాయశ్చిత్తం చేసుకొమ్మని ఓదార్చి పంపాడు బసవడు. కళ్యాణ కటకంలోని భక్తులైన అల్లయ్య మధుపయ్యలను బిజ్జలుడు అకారణంగా కన్నులు పెకలించగా బాధపడిన బసవడు ఆ ఊరనింక ఉండకూడదని తలచి బిజ్జలుని చంప జగదేవునికి ఆజ్ఞ ఇచ్చి ఆ పట్టణానికి శాపాలిచ్చి భక్త కోటితోకూడి అప్పురం వీడిపోయాడు. ప్రజలు రాజ్యం వదిలారు. రాజవంశం సంతాన శూన్యమైంది. శాపఫలంగా రాజ్యం పోయింది. మల్ల బ్రహ్మయ్యలతో జగదేవుడు ఆ రాత్రి బిజ్జలుని వధించాడు. జగదేవుడు తన శిరస్సును ఛేదించుకొని కైలాసానికి ఏగాడు. బసవాది భక్తులు సద్గురు సంగయదేవుని చూశారు. బసవనితో ఆ గురువు సంభాషించి నిజరూపం దాల్చి తనలో ఐక్యం చేసుకొని గుడిలో ప్రవేశించాడు. బసవడు లింగైక్యం చెందటం భక్తకోటి ఆశ్చర్యచకితులై చూశారు.

బసవణ్ణ : బసవణ్ణ భక్తుల మహిమలే బసవ పురాణం. అది బసవణ శివుల అభేదకం, భక్తుల కథల్లోని మాహాత్మ్యాల వల్లనే ఇది పురాణమైంది. 'బసవణ్ణకు సమకాలికులు, పూర్వులునగు శివభక్తులు బసవణ్ణ చరిత్రకు ఈ భక్తుల చరిత్రలు ఉపాఖ్యానములుగా జోడింపబడి శివాంశ సంభూతులగు మహాపురుషుల మహాత్మ్యాధికములు అలౌకికములుగా వర్ణింపబడుటచే దీనిని పురాణమని పేర్కొనవచ్చును'. (6)

బసవణ్ణ, అతడి సమకాలికుల జీవిత విషయాలను వర్ణించటంలో మహిమకు ప్రాధాన్యం ఇచ్చినందువల్ల బసవ పురాణానికి పురాణ లక్షణం సమకూడినట్లుగా గుర్తింపవచ్చు. పిడుపర్తి సోమనాధుడు 16వ శతాబ్ది కవి. అనంతరం కాలంలో బసవ పురాణాన్ని మళ్ళీ రచించాడు. పాల్కురికి సోమనాథుడు ద్విపద కావ్యంగా రాసిన బసవ పురాణం ఈ కవి పద్య కావ్యంగా రాశాడు.

3.2.1.1. శైవ సాహిత్యం : యక్షగాన సాహిత్యంలో శివ పరంగా శైవపరంగా విశేష సృష్టి ఉంది. బసవ పురాణంలోని కథల్ని గ్రహించి స్వతంత్ర యక్షగానాలుగా కవులు వ్రాయగా, శివుడు పరీక్షించి కైలాసం అనుగ్రహించిన భక్తుల గాధలు యక్షగానాలుగా రూపొందాయి. అంతేకాక శివుడు జీవిత ప్రాధాన్యంతో యక్షగాన వాఙ్మయ విశేషంగా అవతరించింది.

ప్రథమంగా బసవ పురాణాంతర్గత కథలను యక్షగానాలుగా మలచిన సాహిత్యం పరికింపవచ్చు. బసవ పురాణంలోని గొడగూచి కథను పిన్నబయలాచార్యులు 'గొడగూచి చరిత్ర' రచించాడు. మార్జోళ్ళ వీరయ్య, బసవేశ్వరుని సమకాలికుడు, అష్టముగ్ధలలో ఒకడయిన ముగ్ధ సంగయ్య. 'సానింటికేగి ఋశ్యశృంగుని వలె బ్రవర్తించిన' (7) తీరును 'ముగ్ధ సంగయ్య'గా లిఖించాడు. చిరుతొండ నుంచి కొడుకు అయిన సిరియాలుని కథను జ్యోతి కోటదాసు 'చిలియాళ మహారాజు నాటకము' పేరిట రచించాడు.

శివభక్తుల్ని పరీక్షించి భక్తికి మెచ్చి వరాలు దానం చేసిన శివుడు కైలాసం అనుగ్రహించిన గాథలు అనేకం యక్షగాన సాహిత్యంగా రూపొందాయి. బసవడు చారిత్రక పురుషుడు. వీరశైవ మతవ్యాప్తి కారకుడు. శైవుల దృష్టిలో అత్యున్నత స్థానం పొందాడు. అతనిలో వీర శైవమత వ్యాప్తిచేసే తీవ్ర తాదాత్మ్య ప్రయత్నం చేత ప్రేరితుడై బసవ పురాణాన్ని పాల్కురికి సోమన రచించాడు. శైవ రచన నాటి నుంచి ఎవరు చేసినా ప్రత్యక్షంగానో పరోక్షంగానో బసవని గూర్చిన ప్రసక్తి ఉంటుంది. అందులో ఒకటి రెగళిగె నిమ్మనాథుడు రచించిన 'నిజలింగ చిక్కయ కథ'.

'బసవ నింట దొంగతనము సేయబోయి చిక్కయ లింగ దీక్ష గైకొనుట - చిక్కయను జూచి తలారి రామయ భార్య నీలకుంతల మోహించుట నిరాకరించిన చిక్కయకామె కుతంత్రము వలన శిరచ్ఛేదనమగుట, చిక్కయ శిరస్సు నిక్కము చెప్పగా, నాకాశవాణి సాక్ష్యము పల్కుట - తలారి భార్యను జంప నుద్యుక్తుడు కాగా శివుడు ప్రత్యక్షమై యెల్లరకు గైలాసమనుగ్రహించుట' (8) కథ.

శివభక్తి వైశిష్ట్యం ప్రకటించే యక్షగాన సాహిత్యంలో రాజులు శివభక్తులై శివుడి అనుగ్రహం పొందిన గాథలు పరిశీలనార్హాలు. 'బల్లాణరాజ చరిత్రము' శైవ సంబంధ రచన. దీనిని బుక్కమ సాంబయ్య 1812లో రచించాడు. భల్లాణుడనే వీరశైవుని శివుడు పరీక్షించి మోక్షమివ్వడం ఇందులోని ప్రధానాంశం. 'భల్లాణుడుమిండ జంగము వేషమున బంపుట - భవుడు భల్లాణుని భక్తి మెచ్చి కైలాసమనుగ్రహించుటయు ననునదీ కథ'. (9) 'భల్లాణ చరిత్ర' నింబాద్రి దాసుడు రచించాడు కథ. 'పూర్వోక్తము కాని యొక విశేషము కవి - సురాభాండేశ్వర కథ చెప్పి యందలి యీడిగ దంపతులే పిదప జన్మమున జల్లమా భల్లాణులైరని చెప్పినాడు'. (10) ఇదే కథ 'భల్లాణ రాజు చరిత్ర'గా వంకదారి బాలగురవప్ప రచించాడు.

క్రీ.శ.1810 ప్రాంతాలకు పూర్వం దొడ్డి నరసింహకవి 'కరియబంటుని కథ' రచించాడు. ధారా నగరాన్నేలే కరియబంటు హళియబీడు రాజు ఆహ్వానంపై వెళ్తూ తోవలో దొండనూరి పురాన్నేలే రక్కసి కుమార్తెను మోహించడం, ఆమెచేతిలో మృతి చెంది శివుని చేత పునరుజ్జీవుడు కావడం కథ.

1817కు పూర్వం వీరచోడవ్వ చరిత్ర గుబ్బిము చిన కపోతయ్య రచించాడు. శైవ ప్రాధాన్యం గల రచన.

'దాక్షారామమున నన్య(న్నె?) చోడను భోగపు జానకు బార్వతి యంశమున వీర చోడుడు పుట్టుట భీమనాయకుడామె శీలమును బరీక్షించి మెచ్చి యాపె యెంగిలికూడు గూడు గుడిచి యాపె మహిమను లోకమున వెలయించుట, ఆమె కైలాసమునకేగుటయను శైవ కథ' (11) ఇది.

గవండ్ల రాజలింగ కవి విరచితం 'పుణ్యాంగద చరిత్ర', '.....చోళదేశ రాజ పుత్రుడైన పుణ్యాంగుని రథము క్రిందపడి యొక గోవత్సము మడియుటయు నందుపై రాజు పుత్రునికి మరణ శిక్ష విధించుటయు బుణ్యాంగ పత్ని పతివ్రత చంద్రావతి

ప్రార్థనపై శివుడు ప్రత్యక్షమై వారెల్లరకు గైలాసమనుగ్రహించుట......'(12) ఇందలి కథ.

శివ పార్వతుల్ని పాత్రులుగా చేసి యక్షగాన సృష్టి చేసిన ప్రసిద్ధుల సాహిత్యం దర్శనీయంగా ఉంది. శివ పార్వతుల్ని పాత్రలుగా చూడటంలో భక్తుల తన్మయత్వం విశిష్ట లక్షణంగా పరికింపవచ్చు.

శీర్నాడు వెంకటరాయ కవి రచించిన శివనాటకము దక్షాధ్వర ధ్వంసము, పార్వతీ కళ్యాణ కథలతో రాశాడు. కురుచేటి సుబ్బరాయ కవి 'గౌరీశంకర విలాసం 1889 ప్రాంతాలలో రాశాడు. శివుని దారుకావన విహారం గౌరి అలుక సమాధానపరచడం కథ. శాహాజీ రచించిన 'సతీదాన శూరం' కథ మోరోభట్లనే బ్రాహ్మణుడు తిరునాళ్ళలో మతంగ స్త్రీని చూచి కామించాడు. ఆమె భర్త వారించినా వినకపోవడంతో ఆమెను ధారపోయడానికి భర్త సిద్ధపడడంతో బ్రాహ్మణుడు పరివర్తనం చెందాడు. చివరకు శివుడు ప్రత్యక్షమై అందరికి మోక్షమిచ్చాడు.

3.2.1.2. నాథ సంప్రదాయం : 14వ శతాబ్ది నుంచి 20 శతాబ్ది దాకా, అటు ప్రాచీన సాహిత్యంలోను, ఇటు ఆధునిక సాహిత్యంలోనూ నిలిచి ఉన్న ఒక శైవసంబంధి మతవాదం నాథ సంప్రదాయం. ఇది తెలుగులో కావ్యనాటక సృష్టికి భూమిక రూపొందించింది. ఇది మతదృక్పథంగా వెనుకబడి పోయినప్పటికిని, సాహిత్య దృక్పథంగా నిలిచి ఉంది. నవనాథ చరిత్ర సాహిత్యంలో మత దృక్పథం తెలుపగా, సారంగధర చరిత్ర మత నేపథ్యంలో సాహిత్య దృష్టి విశాలం కానించింది. ఈ మధ్య కాలంలో అశేష నాథ సంప్రదాయ సాహిత్య సృష్టి జరిగింది.

3.2.1.3. నాథ సంప్రదాయం - మత దృష్టి : క్రీ.శ. 9-10 శతాబ్దాలలో నేపాలులో శైవ బౌద్ధాలు ఏకమై, నాథ సంప్రదాయమవతరించింది. నాథ సంప్రదాయాన్ని భారతదేశంలో ప్రచారం చేసిన కవి మహారాష్ట్రంలోని మాలూ పండితుడు. 1319లో నాథుల చరిత్ర ద్వారా రచనా రూపంగా వచ్చిన ఈ సంప్రదాయం క్రమంగా ప్రాచుర్యం పొందింది.

ఎన్నో సిద్ధాంతపరమైన రచనలు వచ్చాయి. ఈ నాథ సంప్రదాయాన్ని గురించి ప్రథమంగా శ్రీగిరి పండితుడు రచించాడని అంటున్నా లభ్యమవుతున్న రచన మాత్రం గౌరన నవనాథ చరిత్ర.

'నాథపంథ పంద్రెండవ శతాబ్దిలో కర్ణాటకములో వ్యాపించెను. శివుడే ఆదినాథుడై అవతరించెను. 'నాథమత'మనగా యాచకుడు, ఉపతాపకుడు, ఈశ్వరుడు, ఆశీర్వదాత' అని నాలుగు అర్థములున్నట్లు 'సిద్ధ సిద్ధాంత పద్ధతి' అను గ్రంథములో చెప్పబడినది. దీనిని యోగ సంప్రదాయమందురు. 'ఓం శివగోరక్ష' అనునదే వీరి పంచాక్షరీ మంత్రము. వీరు గోరక్షుని శంభుయతి అని పిలుతురు. ఆది నాథుడనగా మహేశ్వరుడని నమ్ముదురు. ఈ విద్యలన్నియు శివుని కృపచేత మత్స్యేంద్రనాథ, జ్వాలేంద్ర (జాలంధర నాథ) నాథాది సిద్ధులకు లభించినవి. ఈ సర్వేశ్వరుడైన ఆదినాథుడే సర్వకారణుడు. అతనికి ఎవ్వరు కారకులు కారు. అతని మీద ఎవ్వరి అధికారమును లేదు. అతడు అసంగుడు.

శక్తియుతుడు. అతడు సమస్త చరాచర ప్రపంచమును లీలామాత్రమున రచింపగలడు'. (13)

నాథుల్లో ప్రసిద్ధుడైన గోరక్షకుడు అవ్యవస్థితంగా ఉన్న 12 శాఖలను ఒకటిగా చేసి 'బారహపంథీ' ని పేరు పెట్టాడు. ఈ సంప్రదాయం తెలుగులో తక్కువే, అయినా దాని స్థానం శ్రీశైల పర్వత ప్రాంతం. టిబెట్టు నేపాలు ఆఫ్ఘనిస్థానుల నుంచి దక్షిణ కాశి భూకైలాసం అని పేరుగాంచిన శ్రీశైలాన్ని చూడడానికి వచ్చే యోగుల వల్ల నవనాథుల గూర్చి వ్యాప్తి అయింది. నవనాథ చరిత్రకు టిబెట్టు కథలే మూలమై ఉంటాయని డా.ఓబి.రెడ్డి భావన. నవనాథుల గురించి వివిధ భాషల్లో రచనలు వెలువడినా, ఈ మతానికి మూలకారకులైన మీననాథుడు, గోరక్షకుడు వంటి ప్రధానుల పేర్లలో తప్ప మిగిలిన నామ సంఖ్య సరిపోయినా నామసారూప్యం కనపడదు.

శైవ సాంప్రదాయంలో పాశుపతం శైవం, ఆగమ శైవం అని రెండు విధాల శైవ సంప్రదాయాలు కనిపిస్తాయి. ఈ రెండింటి కంటే భిన్నమైన నాథ సంప్రదాయాలలో, ఈ రెండింటిలోని కొన్ని లక్షణాలు చేరి ఇది అభివృద్ధి అయింది. మూల పాశుపత పంచతత్వాలలో యోగం కూడా ఒకటి. వీరంతా శైవులే అయినా, భేదం మాత్రం వారి సాధన పద్ధతుల్లో ఉంది. మూల పాశుపత సంప్రదాయం నుంచి యోగసాధన కాయసాధన నాథ సంప్రదాయ మార్గానుయాయులు గ్రహించారు. అచల పూర్ణకాయం ద్వారా అమర ఆధ్యాత్మిక జీవనం పొందడమే నాథ సంప్రదాయమని డా.గుప్త అభిప్రాయం.

'........ నాథ సంప్రదాయము ప్రాచీన మహేశ్వర మతమునకు అంతర్గతముగా అభివృద్ధి చెందిన ఒక శైవ సంప్రదాయమని, కాలక్రమములో అనేక వైదిక, అవైదిక సంప్రదాయములు దానిలో విలీనమై అది ఒక మౌళిక సంప్రదాయమయ్యెనని స్పష్టమగును'. (14)

కాలక్రమాన వర్ణాశ్రమ ధర్మాలు నాథ సంప్రదాయంలో నిరసనకు గురైయాయి. వీటన్నిటికి అతీతంగా నిల్చినవారు నాథమార్గీయులు. వీరి ముఖ్య కేంద్రాలు ముస్లింలు అధికంగా ఉన్న ప్రాంతాలు. అవి మొదట సంప్రదాయ సంరక్షణాలయాలుగా ఉన్నా అనంతరం ఆచారాలకు దూరంగా, ప్రాచీన విధానాలకు వ్యతిరేకంగా, సమ్మిళిత సాంప్రదాయిక జాతి నిలయాలుగా ఏర్పడ్డాయి.

నాథ అంటే

'నకారో నాది రూపం థకారః స్థాప్యతే సదా
భువన త్రయమేవైకః శ్రీ గోరక్ష నమోస్తుతే' - 'రాజసహ్యము''
'శ్రీ మోక్ష దాన దక్షత్వాత్ నాద బ్రహ్మమ బోధనాత్
స్థగిత జ్ఞాన విభవాత్ శ్రీనాథ ఇతిగీయత్' - 'శక్తి సంగమ తంత్రము'

నాథమంటే పరమతత్త్వం, జ్ఞానాన్ని తొలగించి మోక్షాన్ని కలిగించేది. భువన త్రయకరణం. ఇందులో వర్ణధర్మాలకు ప్రాధాన్యం లేదు. అందరూ నాథ సంప్రదాయం అనుసరించి ఉండవచ్చు. బౌద్ధమతంలోని వర్ణవ్యతిరేకత, శైవ మతంలోని వర్ణ నిరసన

కలగలసి నాథ సంప్రదాయం రూపొందింది. హిందూ మతంలోని వర్ణధర్మాలను తిరస్కరించిన బౌద్ధమతం దేశాంతర గమన శిక్ష పొందిన కాలంలో, ఆ మతంలో ప్రజాభిమానం చూరగొన్నది వర్ణధర్మ వ్యతిరేకత. ఆ లక్షణం తుల్యంగా ఉన్న దేశాంతర గమన శిక్షపొందని శైవంతో చేరి, రెండు పేర్లూ లేక నూత్న మార్గంగా నాథ సంప్రదాయం ఏర్పడింది. నాథ సంప్రదాయం స్థూలంగా శైవభావనగా వైష్ణవ వ్యతిరేక దృక్పథంగా గుర్తించాలి. అందువల్ల అది కాలాంతరంలో మహమ్మదీయుల్ని శైవ మత నేపథ్యం నుంచి అందించే స్థితిని నాథ సంప్రదాయం సంతరించుకొంది.

3.2.1.4. నాథ సంప్రదాయం - తెలుగు సాహిత్య సృష్టి : వైష్ణవ మత దృష్టి, అవైష్ణవ మత దృష్టుల్ని అంతమొందించటానికి శాయశక్తులా కృషి చేస్తున్న కాలంలో నాథ సంప్రదాయం ఆ పోటీలో నిలబడలేక వెనుకబడిపోయి అంతరించి పోయింది. ఈ సంప్రదాయం అంతగా సాహిత్య రంగాన కూడా నిలువలేకపోయింది. నాథ సంప్రదాయంలో ప్రసిద్ధి గాంచిన నవనాథులను గూర్చిన ప్రశంస, ప్రసక్తి కుమార సంభవంలో, విక్రమార్క చరిత్రలో, కనిపిస్తుంది. వారిని గూర్చి రచించిన రచనలు తక్కువ. శ్రీగిరి అయ్యగారు, గౌరన రచించిన 'నవనాథ చరిత్ర', పచ్చకప్పురపు తిరువేంగళరాజు రచించిన 'చొక్కనాథ చరిత్ర' వంటివి మాత్రమే ఉన్నాయి.

వీటిలో శ్రీగిరి పండితుడు రచించిన నవనాథ చరిత్ర అలభ్యమే. అది చంపూ కావ్యమని దాన్ని గ్రహించి గౌరన నవనాథ చరిత్ర వ్రాశాడని, అది నాథ సంప్రదాయ ప్రసిద్ధంగా ఉందని స్పష్టంగా గుర్తించినందువల్ల శ్రీగిరి పండితుడి సాహిత్యం గౌరన సాహిత్యం నాథ సంప్రదాయం ప్రబోధకాలుగా లభించినట్లే అవుతుంది.

'1. మత్స్యేంద్రనాధుడు (మీననాథుడు), 2. చౌరంగి (సారంగధరుడు), 3.గోరక్షనాధుడు, 4. మేఘనాథుడు, 5.విరూపాక్షనాథుడు, 6. నాగార్జునుడు, 7. ఖణికుడు, 8.మంజునాథుడు, 9.బుద్ధ సిద్ధుడు...... గౌరన నవనాథ చరిత్రములోని నవనాథుల నామములు పైన పేర్కొనబడిన తొమ్మండుగురు మాత్రమేనని తోచును'. (15)

నవనాథులు సర్వమానవ సమానత్వం, ప్రజాశ్రేయస్సు కోరే ప్రసిద్ధ సిద్ధులు, భూతదయ కలిగినవారు. కొందరు రాజులకు వ్యతిరేకులై మృతి పొందినారు. రాజులు వైష్ణవ ధర్మప్రచారకులుగా ప్రాముఖ్యం పొందినప్పుడు సహజంగానే నాథ సంప్రదాయానుయాయులు ఆ రాజరికానికి వ్యతిరేకులయ్యారు. వర్ణవ్యవస్థ యదాతథంగా ఉండాలని భావించే వాళ్ళకు, ఉండనక్కరలేదని గుర్తించే వాళ్ళకు మైత్రి పొసగక పోవటం సామాన్యమే. మైత్రి లేకపోవటమే కాదు, శత్రుత్వం ఏర్పడటం వల్లనాథ సంప్రదాయ మార్గీయులు అంతరించిపోవటం కూడా మామూలుగానే జరిగిపోయింది. నవనాథ చరిత్ర కావ్యంలో వీరి జీవన విధానం, శైవుల స్థితి, నాటి సాంఘిక పరిస్థితులు వర్ణితమయ్యాయి.

నాథ సంప్రదాయం దక్షిణ భారతదేశంలో, గట్టి పునాది పొందింది. శైవం బాగా ఆదరించిన దక్షిణ భారతదేశంలో నవనాథుల పేర్లు వ్యక్తి నామాలుగా మారాయి. నాథనామం ఈ సంప్రదాయం తెలిపే దశకు చేరుకొంది. చొక్కనాథుడు నాథ

సంప్రదాయంలో నుంచి వ్యక్తి నామం ప్రభావితం చేసిన 'నాథ' శబ్ద స్థితికి సాక్ష్యం పలికే పేరు.

చొక్కనాథ చరిత్ర : అందువల్ల నవనాథ చరిత్ర చొక్కనాధ చరిత్ర కూడా నాధ సంప్రదాయానికి ప్రత్యేకంగా చెందింది కాదు కానీ, పరోక్షంగా దాని ప్రభావం కలిగి ఉన్నది అని మాత్రం గుర్తించాలి.

నవనాథులు ఉత్తరం నుంచి దక్షిణ సాహిత్యంలోకి ప్రవేశించిన ఉత్తరాది సిద్ధులు. దక్షిణంలో, తమిళ దేశంలోని మధుర దైవం సుందరేశ్వరుడనే చొక్కనాధుడు. దక్షిణ దేశ దైవం కావడం వల్ల, నాథ సంప్రదాయానికి ప్రత్యక్షంగా చెందడని, పరోక్షంగా చెందవచ్చునని గమనింపవచ్చు.

నవనాథులుగా వివిధ భాషలలో నామాలు ఉన్నాయి. అన్నీ అన్నింటిలోనూ పేర్కొనబడక పోయి ఉండవచ్చు. అయినా సుందరేశ్వరుడనే చొక్కనాథుడు శైవ మతమే కాదు, నాథ సంప్రదాయం కూడా ప్రతిఫలిస్తున్న దైవం.

పాండ్యుల రాజధాని మధుర. ఈ రాజుల ఇలవేల్పు చొక్కనాథుడు. తమిళ సాహిత్య చరిత్రలో ప్రముఖమైన 'సంగపలక'ను ప్రసాదించింది చొక్కనాథుడే. స్పష్టంగా చొక్కనాథుడు వైష్ణవ మత వ్యతిరేకతను శైవమత సంబంధాన్ని తెలిపే దైవం.

'చొక్కనాథుని లీలలు లెక్కకు అరవైనాలుగు. వాటినన్నింటిని క్రమంగా నెంబర్లు వేసుకొంటూ తిరువేంగళ రాజా కథనం చేశాడు...కృత యుగంలో ఒక పదహారు, త్రేతాయుగంలో మరో పదహారు, ద్వాపరయుగంలో మరో పదహారు, కలియుగంలో వేరే పదహారు లీలలు జరిగాయట'.(16)

ఈ చొక్కనాథ చరిత్రకే మధురా పురాణం అని, చౌషష్టి లీలావిలాసమని కూడా పేరుంది. ఇది శైవసంబంధి రచన కావటం వల్ల, వైష్ణవ వ్యతిరేకత కలది కావటం వల్ల నాథ సంప్రదాయ మార్గంలోని సాహిత్య సృష్టిగా నిర్ణయింపవచ్చు.

సారంగధర చరిత్ర : చేమకూరి వేంకటకవి రచన 'సారంగధర చరిత్ర' కావ్యం. నవనాథులలోని చౌరంగిగా గుర్తించి దీన్ని నాథశబ్ద ప్రచురం కాకపోయినా నాథ సంప్రదాయం సిద్ధంగా భావించాలి.

'తెలుగులో పద్యకావ్యంగా సారంగధర చరిత్రను వ్రాసిన వారిలో మొదటి వాడు వేంకటకవియే ..... దానికి మూలము గౌరన నవనాథ చరిత్రలోని చౌరంగి వృత్తాంతము' (17) ఇది మూడాశ్వాసాల కావ్యం 'ఈ కథ ఇంత సుప్రసిద్ధమైనా దాని మొట్టమొదట పద్యకావ్యంగా వ్రాసిన...' (18) వాడు మాత్రం చేమకూరి వేంకటకవే.

దీనినే సుముఖం వెంకట కృష్ణప్ప వచన కావ్యంగా రాశాడు. బాణాల శంభుదాసు 1750 ప్రాంతాలకు చెందినవాడు. గౌరన నవనాథ చరిత్ర ఆధారంగా సారంగధర చరిత్ర ద్విపదలో రాశాడు. అయితే చిత్రాంగిని చివర సారంగధరుడు బ్రతికించడం విశేషంగా ఇందులో ఉంది.

కూచిమంచి తిమ్మయ్య 1729లో ద్విపదగా ఈ సారంగధర చరిత్రను వ్రాశాడు. ఇందులో రాజు భార్య రత్నాంగి అనీ, భోగతరుణి చిత్రాంగి అనీ చెప్పాడు. అందువల్ల ఇతర కావ్యాలలో పట్టమహిషిగా ఉన్న చిత్రాంగి ఈ కావ్యంలో ఉంపుడుగత్తె స్థాయికి వచ్చింది.

సారంగధర కథ ఆంధ్రులకు చాలా ఇష్టమయింది. అందులోని పరస్పర సంప్రదాయ విరుద్ధాంశాలు, మానసిక శారీరక సంఘర్షణాంశాలు నాటక కర్తలను కూడా రచనోన్ముఖంగా నిలిపాయి. ప్రాచీన సాహిత్యం సారంగధర చరిత్ర చంపూ కావ్యాలుగా, ద్విపద కావ్యాలుగా వెలువడగా ఆధునిక సాహిత్యంలో ఈ వృత్తాంతం నాటకంగా అవతరించింది. ఒక్క నాటక కర్తకాదు, ఒక్క నాటకం కాదు. అనేక కర్తలు అనేక సృష్టులుగా ఈ వృత్తాంతం పెరిగింది. తెలుగులో తొలి విషాదాంత నాటక రచనంగా పరిశీలించి 'విషాద సారంగధర' నాటక కర్తను ధర్మవరపు కృష్ణమాచార్యులను ఆ మార్గంలో ప్రథముడుగా గుర్తించే స్థితికి చేరుకొంది ఈ వృత్తాంతం. మనిషి చేసే పొరపాట్లే ఆ మనిషి పతనానికి హేతువులన్న సత్యం సంఘర్షణాత్మకం కావటం ఈ వృత్తాంతంలోని ప్రత్యేకత. ఈ గుణమే దీన్ని ఉత్తమ విషాద సాహిత్య పరిధిలోకి తెచ్చింది.

నాదెళ్ళ పురుషోత్తమకవి ఈ వృత్తాంతానికి ఉన్న నాటకీయ ధర్మం సవతి తల్లి తనయుణ్ణి శారీరకంగా వాంఛించటం గుర్తించి నాటకంగా వ్రాశాడు. ఆ వస్తువు సామాన్యంగానే విషాదాంతమయింది. ఇందులో సారంగధరుడికి మరణదండనముంది. దాన్ని గమనించి సహజంగా ఉన్న నాటకంలోని విషాదం తొలగించి సుఖాంతంగా పానుగంటి లక్ష్మీనరసింహారావు మార్చి, నాటకం వ్రాశాడు. దాసునారాయణరావు నాటకం కూడా ఈ మార్గంలోనే ఉంది. సారంగధరుడి తండ్రి రాజుకావటం ఆ రాజరాజు భారతానువాదం చేయించిన చాళుక్య చక్రవర్తి కావటం వల్ల ఆంధ్రులకు మరీ ఆసక్తికి కారణమయింది.

అయితే కూచిమంచి తిమ్మకవి వ్రాసిన మార్గంలో చిత్రాంగిని వేశ్యగా చిత్రిస్తూ, సారంగధరుడికి భార్య ఉందని ఆమె కుముద్వతిని అని కల్పన జోడిస్తూ సుఖాంత నాటకం జయంతి భావనారాయణ 1909లో వ్రాశాడు. ప్రసిద్ధ నాటక రచయిత కాళ్ళకూరి నారాయణరావు చిత్రాంగీ సారంగధరుల వివాహం చిత్రించి సుఖాంతం కావించాడు.

సారంగధరుడు మరణశిక్ష పొందలేదని మతి తప్పి విరాగి అయినాడనీ ఆదిభట్ల నారాయణదాసు సారంగధర చరిత్ర నాటకం వ్రాశాడు. నందిరాజు చలపతిరావు 'చిత్రాంగి' నాయికగా ప్రధాన పాత్రగా చేసి అద్భుత నాటకం వ్రాశాడు. ఈ వృత్తాంతం ద్రోణంరాజు చలపతిరావు కాశీనాథుని వీరమల్లయ్యను ఉత్సాహపరచటం వల్ల వాళ్ళ నాటక సృష్టి చేశారు.

1944వలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి వ్రాసిన రాజరాజుల ప్రాధాన్యం రాజరాజుకిచ్చి, సారంగధర చరిత్రలోని విషాదమంతా మంత్రుల పొరపాటు ఫలితమని ప్రకటించాడు. సారంగధరుడికి ప్రాధాన్యమున్నా, రాజు రాజులకు ప్రాముఖ్యమున్నా, చిత్రాంగికి ప్రాధాన్యమున్నా మార్చినా చేర్చినా పెంచినా కుదించినా కథా సూత్రంలోని

సంఘర్షణాత్మక లక్షణం స్పష్టంకావటం విప్రతిపత్తి లేదు. నిషిద్ధ సాంఘిక శారీరక ధర్మాలకు, సహజ మానవ ప్రవృత్తికి మధ్య సంఘర్షణంగా సారంగధర చరిత్ర తెలుగు సాహిత్యంలో ఒక సంచలనాత్మకమైన ఇతివృత్తంగా ఉంది. ఇది అనేక కావ్యనాటక సాహిత్య సృష్టులకు దోహదకారి అయింది.

సారంగధర చరిత్ర ఉత్తర హిందూస్థానంలో జీవిత నేపథ్యం గల ఇతివృత్తంగా నాథ సంప్రదాయం దృష్టితో గమనింపవచ్చు. కాని ఇది స్థానికమైన స్థాయిని పొందింది. రాజమహేంద్రవరం రాజధానిగా చాళుక్య చక్రవర్తిగా పరిపాలించిన రాజరాజనరేంద్రుడు చిన్న భార్యగా చిత్రాంగిని ఆమె సవతి కుమారుడుగా సారంగధరుణ్ణి చిత్రించటం గమనార్హం. ఇది స్థానిక చరిత్రగా పరివర్తనం చెందిందనటానికి, నేటికీ రాజమండ్రిలో చిత్రాంగి మేడగా ప్రసిద్ధమయిన భవనం సందర్శింపవచ్చు.

మత నేపథ్యంలో అవతరించిన నాథ సంప్రదాయం సాహిత్య సృష్టి ద్వారా నాటినుంచి నేటిదాకా సాగుతూ వచ్చింది. గౌరన నవనాథ చరిత్రను చొక్కనాథ చరిత్ర ప్రముఖంగా ప్రాచీన సాహిత్యంలో, సారంగధర చరిత్రను ఆధునిక నాటక సాహిత్యంలో నిలిపిన నాథ సంప్రదాయం మత విషయికంగా అంత ప్రసిద్ధంగా నిలిచి ఉండకపోయినా సాహిత్య విషయికంగా శాశ్వత స్థానం పొంది, తన్మూలంగా నిలిచి పోయింది.

3.2.2. ప్రథమాంధ్ర పురాణం: మారన అనువాదం చేసిన మార్కండేయ పురాణాన్ని ప్రథమాంధ్ర పురాణంగా భావిస్తున్నారు. సంస్కృతం నుంచి తెలుగులోకి అనువదింపబడ్డ పురాణాలలో ఇది మొదట కావటం స్పష్టమే. దీనిని మారన రచించి, రెండవ ప్రతాపరుద్రుడి (1295-1323) సేనానికి అంకితమిచ్చాడు. మారనకు పూర్వం పురాణాలు ఉన్నాయని అన్నా, లభ్యమయ్యే మొదటి సంస్కృత అనువాదమిదే. 'చారిత్రక దృష్టితో, బరిశీలించినచో మారన మార్కండేయ పురాణ రచనము క్రీ.శ.పదునాలగవ శతాబ్ది తొలి యుషస్సులలో సాగినదని నిశ్చయింపవచ్చును'. (19)

మార్కండేయ పురాణం అష్టాదశ పురాణాలలో ఏడవది. తెలుగులోకి వచ్చిన మొదటిది. ఇందులోని కథలన్నీ మార్కండేయుడు చెప్పడం వల్ల దీనికి మార్కండేయ పురాణం అని పేరు వచ్చింది.

పురాణం పంచలక్షణ సమన్వితం. సర్గ ప్రతిసర్గ వంశం మన్వంతరం వంశానుచరితం. ఈ పంచలక్షణాలు ఉపాఖ్యానాల రూపంలో విస్తరించబడి ఉంటాయి. ఈ లక్షణాలన్నీ ప్రథమాంధ్ర పురాణంలో కనిపిస్తాయి. పంచలక్షణాలతో సంపూర్ణంగా ఉన్న పురాణం ఇది.

'డా.కె.యం. జెనర్జియా మార్కండేయ పీఠికలో దానిని అయిదు విభాగాలుగా విభజించి పేర్కొన్నాడు. అవి

1. పురాణారంభం నుండి మహాభారత సంశయార్థాలను గూర్చి జైమిని అడిగిన ప్రశ్నలకు పక్షులు సమాధానాలిచ్చినంత వరకూ ఉన్న భాగం - అనగా 1వ అధ్యాయం నుండి 9వ అధ్యాయం వరకు మొదటి భాగం.

2. జడోపాఖ్యానం (10వ అధ్యా నుండి 41వ అధ్యా వరకు) రెండవ భాగం.

3. సర్గాది వర్ణనం మొదలు సావర్ణిక మన్వంతరం వరకు గల పురాణ భాగం (42వ అధ్యా నుండి 77వ అధ్యా వరకు) తృతీయ భాగం.

4. సప్తశతి చతుర్థ భాగం (78వ మొ - నుండి 90వ అధ్యా వరకు)

5. రౌచ్య మన్వంతర కథనం నుండి పురాణ ఫలశ్రుతి వరకు గల భాగం (91వ అధ్యా నుండి 134వ అధ్యా వరకు).

పురాణ విమర్శకుల అభిప్రాయాలను వారు చూపించిన ఆధారాలను దృష్టిలో ఉంచుకొని నిర్ణయిస్తే - మార్కండేయ మహాపురాణ మూలస్వరూపమని చెప్పదగిన 3,5 భాగాలు క్రీ.శ.3వ శతాబ్ది నాటికే వెలసి ఉండాలని ఆపైన 1,2 భాగాలు క్రమంగా క్రీ.శ.5వ శతాబ్ది నాటికి అందులో చేరి ఉండాలనీ సప్తశతి క్రీ.శ.5,6 శతాబ్దాల నడుమ పొందు పరుపబడి ఉంటుందనీ భావించటానికి వీలున్నది'.(20) ఈ అభిప్రాయం సంస్కృత పురాణాన్ని దృష్టిలో ఉంచుకుని చేశారు.

మార్కండేయ పురాణంలోని కథను ఆధారం చేసుకొని, పురాణ లక్షణాలను పరిశీలించటం కర్తవ్యం. ఏ లక్షణం ఎంతవరకు నెరవేరిందో గమనించటానికి ఈ పరిశీలన అవసరం. దాని వల్ల పంచలక్షణ వ్యాప్తి అర్థం అవుతుంది. అది స్పష్టమయితే ద్వైవీయ వస్తువు పురాణ సాహిత్యం నుంచి పొందిన ఔత్కృష్ట్యం తెలిసి వస్తుంది. అయిదు భాగాలుగా గోచరమయ్యే మార్కండేయ పురాణంలో పంచలక్షణాలు ప్రవర్తిల్లినట్లు కనిపిస్తుంది కానీ వాస్తవం దర్శనీయం.

3.2.2.1. ప్రథమ భాగం : ప్రథమభాగంలో సర్గ ఉండాలి. సర్గ అంటే సృష్టి. ఇందులో మార్కండేయ పురాణం ఆరంభం ఉంది. భారత కథలో రాదగ్గ సంశయాలు తీర్చటం ఉంది. భారత ప్రశంస ప్రధానం. నిజానికి సృష్టి క్రమం వివరించటం లేదు. అయితే భారత కథ విషయికమైన అనేక సంశయాల నివృత్తికి ఇది ఉపయుక్తమయిన సందర్భం. అందువల్ల సందేహాలు, వాటి తొలగింపు ఇందులో దర్శింపవచ్చు.

తపోవనాన తపోనిష్ఠుడై భార్గవ వంశస్థుడయిన మార్కండేయుడు ఉండగా వ్యాస శిష్యుడయిన జైమిని నమస్కరించి భారతాన్ని ప్రశంసించి, భారతంలో తనకున్న సందేహాలను ప్రశ్నించగా విధ్యానగరాన ఉన్న ద్రోణపుత్రులను అడిగి తెల్సుకొమ్మన్నాడు. పక్షులు ద్రోణనందులు కావడమేమిటి అని ప్రశ్నించగా మార్కండేయుడు ద్రోణ చరిత్ర చెప్పసాగాడు. పూర్వం ఇంద్ర సభలో అప్సరాంగనలలో ఎవరెక్కువ అన్నది తేల్చడానికి వపువు పూనుకొని దుర్వాసుని తపం భంగం చేయబోయి శాపానికి గురయింది. గరుడ వంశాన జన్మించిన కంకుడనే వాడు ఏకాంతాన భార్యతో ఉండి అటువచ్చిన విద్యుద్రూపుడనే రాక్షసునితో వాదించి మృతుడయ్యాడు. కంకుని సోదరుడు కోపాన విద్యుద్రూపుని చంపి వాడి భార్య అయిన మదనికను చేసుకొన్నాడు. వారి పుత్రి వపువు శార్ఙ్గి మందపాలుని పుత్రుడయిన ద్రోణునికి భార్య అయి గర్భిణీ అయింది. ఈమెకు దుర్వాసుని శాప ఫలాన అర్జునుని బాణానికి కడుపు తెగి గుడ్లు నేలపై పడి ఒక గంట

దానిపై పడడంతో రక్షితమయ్యాయి. తార్క్షి మరణించింది. వీటిని చూచి పెంచటానికి దీసుకొని వెళ్లిన శమీకునికి గ్రుడ్ల నుంచి వెలువడిన ధర్మపక్షులు తమ వృత్తాంతం చెప్పసాగాయి. వృద్ధశ్రవుడను అతిథి తమ తండ్రిని పరీక్షించదలచివచ్చి మనుజ మాంసం కోరాడు. వృద్ధశ్రవుడి ఆకలిని తీర్చ సంసిద్ధం కమ్మని పుత్రులను కోరి నిరాకృతుడై వారిని శపించి తానే సిద్ధపడ్డాడు. విహంగరూపాన ఉన్న వృద్ధశ్రవుడు ప్రశంసించిపోయాడు. తమ తండ్రిని శాపవిమోచనం కోరి విఫలమైనా, తండ్రి దయతో సమస్త విద్యాజ్ఞానం మనుష్య జ్ఞానం కల్గిన పక్షులలా జన్మించామని తెల్పాయి. ఈ ద్రోణనందనులను సందేహాలను అడిగి తెలుసుకొమ్మని మార్కండేయుడు పంపాడు. జైమిని వారివద్దకేగి భారతార్థాలను ప్రశ్నించగా వాటిని నివృత్తి చేస్తూ శ్రీనారాయణ వ్యూహ చతుష్టయాన్ని వివరించారు. పిమ్మట పాంచాలి భర్తృ పంచకాన్ని వివరిస్తూ భూలోకాన మనుజాలను పరిమార్చడానికి ఇంద్రుడే పాండవ రూపాన ఐదు విధాల జన్మించాడని తెల్పాడు. పిమ్మట బలరాముడు బ్రహ్మ హత్యను గూర్చిని చెప్పసాగాడు. బలరాముడు కౌరవ పాండవుల యుద్ధం చూడలేక తీర్థయాత్రలకు రైవత శైలానికేగి అట పురాణ కథలు చెప్తున్న పౌరాణికుడు ప్రత్యుత్థానం చేయలేదని అలిగి వానిని వధించాడు. బలరాముడు తాను చేసిన పనికి పరితపించి తీర్థయాత్రలకేగాడు. పిమ్మట ద్రౌపదేయుని కథ ప్రకారం చెప్పసాగారు. సత్యవ్రతుడైన హరిశ్చంద్రుడు వేటకేగి రక్షింపుమనే మాటలు విని అటకేగి ఎవ్వరిని కానక, అట ఉన్న విశ్వామిత్రుని కోపాన్ని శాంతింప చేసి దక్షిణ నిమిత్త విత్తానికి సకల రాజ్యాన్ని ఇచ్చి పురం వదలి వెళ్ళసాగాడు. అది చూచి ప్రజలు దుఃఖించటం, ఆ దుఃఖం హరిశ్చంద్రుని నిలవరించటం చూచి విశ్వామిత్రుడు నిందించగా హరిశ్చంద్రుడు భార్యాసమేతుడై వెడలిపోయాడు. అది చూచి ప్రశ్నించిన విశ్వదేవతలను ద్రౌపదేయులుగా జన్మించమని విశ్వామిత్రుడు శపించాడు. అని తెల్పి జైమిని విషయం పట్ల ఆసక్తిగా ఉండడంతో దానిని కొనసాగించారు. హరిశ్చంద్రుడు కాశీకేగి అట కౌశికుడు నిర్బంధం చేయడంతో చింతాక్రాంతుడయ్యాడు. భర్త స్థితి చూచి భార్య ఇచ్చిన సలహాపై హరిశ్చంద్రుడు భార్యాపుత్రులను అమ్మి సొమ్ము కౌశికునికి ఇచ్చాడు. కొరత ఉన్న సొమ్ముకు తనను అమ్ముకోటానికి పూనాడు. తనను కొనటానికి వచ్చిన చండాలుని చూచి సంశయిస్తున్న హరిశ్చంద్రుడిని కౌశికుడు ఒత్తిడి చేయడంతో అమ్ముడుపోయాడు. చండాలునితో ఏగి శ్మశానంలో నివసించసాగాడు. ఒకనాడు దుస్స్వప్నాన్ని చూచి దుఃఖించాడు.

చంద్రమతి పాము కాటుకు మృతుడయిన పుత్రుని తేవడం చూచి శోకతప్తుడయ్యాడు. దంపతులు పుత్రునితో కూడి అగ్నిప్రవేశం చేయనెంచగా దేవతలు ప్రత్యక్షమై వారిని వారించి పుత్రుడిని బ్రతికించి స్వర్గానికి ఆహ్వానించారు. ఇంద్రునితో సంవాదించి పుత్రునికి పట్టాభిషేకం చేసి అయోధ్యా జనులతో కూడి స్వర్గానికేగాడు అని తెల్పాడు. అనంతరం అడబడిక యుద్ధ వృత్తాంతం చెప్పసాగాడు. పన్నెండేళ్ళ తపస్సు అనంతరం వచ్చి వశిష్ఠుడు హరిశ్చంద్రుని గూర్చి విని కోపించాడు. వశిష్ఠ విశ్వామిత్రులు ఇద్దరూ కోపాన కొంగనాడేలు కమ్మని శపించుకొన్నారు. నాడేలు కొంగల రూపాన అతి క్రోధంతో తీవ్ర పోరు సల్పడం చూసి బ్రహ్మ నిలవరించాడు అని చెప్పారు.

3.2.2.2. ద్వితీయ భాగం : ద్వితీయ భాగంగా జడోపాఖ్యానం గుర్తింపవచ్చు. నిజానికి ప్రతిసర్గ ఉండాలి. ప్రతిసర్గ అంటే పునస్సృష్టి. ఇందులో పునస్సృష్టి వివరణం లేదు. కాని .జంతూత్పత్తి క్రమం కొంత తెలుస్తుంది. నరకక్రమం విశదీకరణం ఉంది. కొంత సృష్టి మర్మం తెలిపే రచన జరిగింది. అందువల్ల ఈ కథా సందర్భం స్పష్టంగా చూడవచ్చు.

జైమిని జనన మరణ రహస్యాలడుగగా ధర్మ పక్షులు జడోపాఖ్యానం చెప్పసాగాడు. జడుడు తన తండ్రికి కుల్క్రాంతి విధం, మానవులు చేసే శుభాశుభాలకు అనుభవించే భోగం రౌరవనరకం జంతూత్పత్తి క్రమం వివిధ నరకాలను తెల్పాడు. తన సప్తమ జన్మాన పొందిన అమిత కర్దమ నరకాన్ని గూర్చి చెప్పసాగాడు. ఆ నరకానికి వచ్చిన జనకుడు అటురావటానికి కారణం, అక్కడ శిక్షలు అనుభవిస్తున్న వారు అక్కడికి రావటానికి కారణాలడిగి తెలుసుకొన్నాడు. వెళ్ళబోయినవాడు శిక్షలనుభవిస్తున్న వారు తన వల్ల పొందే చల్లదనాన్ని వారికి అందివ్వటానికి అక్కడే ఉండటానికి నిశ్చయించాడు. జనకుడు యమభటులతో ఇంద్రునితో ధర్మునితో వాదించి వారందరికి మోక్షం కలిగించి బ్రహ్మపథానికి ఏగాడు. ఈ విధంగా ముక్తి పొంది జన్మాంతరం పొందిన జడుడు తనకు తెల్పిన వివిధ నరకాలను భార్గవునికి తెల్పి తండ్రి కోరికపై చేయాల్సిన కర్తవ్యాన్ని తెలిపాడు. కర్మ బంధాలు పోయి ఆత్మ తిరిగి పుట్టకుండా ఉండడానికి దత్తాత్రేయుడు అలర్కునికి చెప్పి కౌశికుని భార్య ప్రాతివ్రత్యాన్ని చెప్పాడు. ప్రతిష్ఠానపురంలో కౌశికుడనే విప్రుడు పూర్వజన్మ పాపకారణాన చీము నెత్తురుఓడే శరీరంతో కృశించే శరీర భాగాలతో ఉండేవాడు. భర్తకు వేశ్యపై మనస్సు కలగడం విని తీసుకువెళ్తూ మార్గాన ప్రమాదవశాత్తు మాండవ్య మునికి ఎడమ మూపుకు అరేకుల్పెట్టి తాకింది. సూర్యోదయానికి తనను బాధ పెట్టినవాడు మరణిస్తాడని శపించడంతో దుఃఖిత అయి సూర్యుడు ఉదయించకుండా శపించింది. పతివ్రతే దానిని దిద్దగలదని దేవతలు అనుసూయను ప్రార్థించి పంపారు. వారివురి సంవాద ఫలితంగా పదిరోజుల అనంతరం సూర్యోదమయింది. భర్తను పునరుజ్జీవితుని చేసుకొంది. అనసూయ కార్య సఫలతకు ఫలం కోరమన్న త్రిమూర్తులను పుత్రులుగా పుట్టమని కోరి సోమదత్తాత్రేయ దుర్వాసులను పొందింది. ఈ దత్తాత్రేయుడు కాపసి. అంగనలతో కూడి మదిరపానం చేస్తూ తనదైన తపమాచరించసాగాడు. కృతవీరుడనే రాజు మరణించడంతో తత్పుత్రుడు కార్త్యవీర్యార్జునుడు తపానికి ఏగదల్చగా గర్గుడనే మంత్రి దత్తాత్రేయుని ఉపాసించమన్నాడు. దత్తాత్రేయునికి దేవతలకు జరిగిన సంవాదాన్ని, దత్తాత్రేయుని భార్య నపహరించబోయి దైత్యులు నశించడాన్ని, లక్ష్మి నివాస స్థానఫలాన్ని వివరించాడు. గర్గుని మాటలు విని కార్త్యవీరుడు దత్తాత్రేయుని సేవించి ఇష్టార్థాలను పొందాడు. ఇది చెప్పిన జడుడు అలర్కుని వృత్తాంతం తండ్రికి చెప్పసాగాడు. ఋతుధ్వజుడనే నామాంతరం గల కువలయాశ్వుని వృత్తాంతమిది. శత్రుజిత్తుని పుత్రుడు సద్గుణభరితుడు. వానితో విహరించాలని ఫణీంద్రకుమారులు తెంచారు. ఆ రకంగా వచ్చి బ్రాహ్మణ, వైశ్య పుత్రులతో విహరిస్తున్న అహిరాజ తనయులను చూచి నృపసుతుడు వారిని నెచ్చెలులుగా చేసుకొని విహరించసాగదాడు. ఇలా ప్రతి నిత్యం భూమికేగి రసాతలానికి వస్తున్న పుత్రులను ప్రశ్నించగా తమను

అభిమానించే రాజపుత్రుడు ఋతుధ్వజుని గూర్చి చెప్పారు. సంతసించిన తండ్రి వానికి తగిన బహుమతి ఇవ్వమని చెప్పాడు. అది దేవతలకు తప్ప ఇతరులకు సాధ్యం కాదని ఋతుధ్వజుడు తమకు చెప్పిన వృత్తాంతం చెప్పారు. శత్రుజిత్తు వద్దకు ఒక ముని వచ్చి విఘ్నం కలిగిస్తున్న రాక్షసుని చంపమని కోరాడు. వరాహరూపంలో ఉన్న ఆ రాక్షసుని వెంటాడి ఒక బిలంలో ప్రవేశించి అక్కడ ఒక సుందరిని చూచి మోహించాడు. కుండల అనే సఖి ద్వారా ఆమె మదాలస అని, విశ్వావసుడనే రాజపుత్రిక అని తెలుసుకొన్నాడు. పాతళకేతుడనే రాక్షసుడు బంధించడం దైవ నిర్ణయం. అది కుండల ద్వారా తెలుసుకొన్నాడు. కుండలతో తన వృత్తాంతం చెప్పి కుండల తుంబురుల సహకారంతో మదాలసను వివాహమాడాడు. కుండల తపమాచరించి దివ్యగతి పొందింది. తోవలో రాక్షసులతో పోరాడి వధించి రాజ్యం చేరాడు, అని పుత్రులు తండ్రికి తెల్పారని జడుడు చెప్పాడు.

అశ్వతరుడు పుత్రులను మదాలసా కువలయాశ్వులు ఎలా జీవించారని అడగగా వారు చెప్పసాగారు. సుఖ సంతోషాలతో వారుండగా శత్రుజితుడు కువలయాశ్వుని తపోధనులను కాపాడమని తెల్పాడు. దైవ ప్రసాదమైన ఆ అశ్వం మీద పగలంతా మునివరులను రక్షిస్తూ, రాత్రి మదాలసను చేరేవాడు. పాతాళకేతుని తమ్ముడయిన చిత్రకేతుడు పూర్వ వైరభావంతో మునివేషాన రాకుమారుని మోసగించి ఆశ్రమం దగ్గర ఉంచి వాని కంఠభూషణంతో రాజభవనం చేరి రాకుమారుడు మరణించాడని తెలిపాడు. మదాలస విని విగతజీవి అయింది. శత్రాజిత్తుడు తద్బుత్ని ఎంతో విచారించారు. తన మాయ ఫలించిన రాక్షసుడు ఆశ్రమం చేరాడు. ఇంటికి వచ్చిన కువలయాశ్వుడు మదాలస మృతివిని దుఃఖించి వేరొకరిని వివాహమాడనని ప్రతిజ్ఞ చేశాడు. మదాలసను దేవతలు తప్ప వేరొకరు ఇవ్వరని పుత్రులు చెప్పింది విని అశ్వతరుడు సరస్వతికై తపస్సు చేసి ప్రసన్నం చేసుకొని సోదరుడయిన కంబళునగా ప్రావీణ్యాన్ని వరంగా పొందాడు. ఆ ప్రావీణ్యంతో శివుని మెప్పించి మదాలసను వరంగా పొందాడు. ఆ పుత్రులతో కువలయాశ్వుని పిలిపించి మదాలసను బహుమతిగా ఇచ్చి పంపాడు. వారివురు రాజ్యానికి వచ్చి సుఖంగా ఉండి పుత్రులను పొందారు. మదాలస తన పుత్రులకు తత్త్వోపదేశం చేసింది. అలర్కుడనే పుత్రునికి కర్మమార్గం ఉపదేశించింది. కొడుకు కోరికపై వర్ణాశ్రమ ధర్మాలను, గృహస్థ ధర్మాన్ని, త్రయీధేనువుల వర్ణన ఆయాదేవుల కిచ్చే బలి, అతిథి పూజావిధానం, నైమిత్తికాది శ్రాద్ధ కర్మలు, ఏకోద్దిష్ట శ్రాద్ధ, సప్త పురుష లేప భాగాది నిర్ణయం, శ్రాద్ధకాలం, శ్రాద్ధంలో అనిమంత్రణీయాలు, శ్రాద్ధాచరణ విధానం, శ్రాద్ధంలో వర్జ్య ద్రవ్యాలు, పితృగీతాలు, కామ్యశ్రాద్ధాలు, సదాచార క్రమం, పాత్రాదిశుద్ధి, బ్రహ్మణాదుల అశౌచ ప్రకారం తెలిపింది. యౌవనానికి వచ్చిన అలర్కుడు రాజ్యానికి వచ్చాడు. ఒకనాడు మదాలస అలర్కునికి గాంగేయమయమైన ఉంగరమిచ్చి హితోపదేశం చేసింది. పిమ్మట తల్లిదండ్రు లిరువురు తపోవనానికి వెళ్ళారు. అలర్కుని రాజ్యాధికారం చూచి రోసిన తదగ్రజుడు సుబాహుడు కాశీరాజు ద్వారా తన రాజ్యాన్ని అడిగించి విఫలం కావడంతో ముట్టడించాడు. అలర్కుడు' తల్లిచ్చిన ఉంగరంలోని శాసనానుసారం ఉత్తముల 'సేవ అవసరమని తలంచి, దత్తాత్రేయుని చేరి శరణువేడి ఆత్మజ్ఞాని అయిన, దత్తాత్రేయుని ద్వారా యోగమార్గోపదేశం, ప్రాణాయామాది లక్షణాలు, యోగ విఘ్నకార్యాలు,

యోగిధర్మాలు, మరణ సూచకాలైన స్వాప్నికాది అరిష్టాలు, బ్రహ్మ ప్రాప్త్యుపాయ
తెలుసుకొన్నాడు. మునిబోధలో అలర్కుడు సుబాహుడు కాశి రాజాన్న చోటికేగి రాజ
పట్ల తన విరక్తిని వ్యక్తం చేయడంతో సుబాహుడు తమ్మునిలో వచ్చిన పరివర్తన
సంతోషించి తనకు సహకరించిన కాశీరాజు దీవించి ఆశ్రయించడానికి కారణాలు చెప్పా
సమస్త రాజ్యాధికారాన్ని పుత్రునికిచ్చి వైరాగ్యంతో అడవికేగి అలర్కుడు పరమ
పొందాడని జడుడు తండ్రికి తెల్పాడు.

3.2.2.3. తృతీయ భాగం : తృతీయ భాగంలో సాధారణంగా వంశం ఉండటి
గూర్చి పురాణ లక్షణాలు తెలుపుతాయి. అయితే సృష్టి పునస్సృష్టి వివరాలు తెలుపుతు
భాగంగా ఇది గోచరమవుతూ ఉంది. సర్గ ప్రతిసర్గ రచన మార్కండేయ పురాణంలో
భాగంలో పరిమితంగానే ఉంది. 'మార్కండేయ పురాణంలోని సర్గ కథనం సాంఖ్యదర్శనా
మధ్యే మార్గంలో నడిచింది. ఇది బ్రాహ్మణోక్త సర్గ విధాన పరిణామ దశను సూచిస్తుం
విష్ణ్వాది పురాణాలతో పోల్చి చూస్తే ఇందలి సర్గ కథనం నాతివిపులంగానూ నా
సంగ్రహంగానూ చేయబడిందని స్పష్టమౌతుంది'. (21) ఈ దృష్టితో కథాక్రమం సంక్షిప్తం
పరికింపవచ్చు.

జైమిని ముని జ్ఞానపక్షులను సర్గాదులను గూర్చి అడుగగా క్రోష్టుకి అనే ముని
మార్కండేయుడు చెప్పిన విషయం ఈ విధంగా ఉంది. మహదాది భూత సృష్టి, బ్రహ
జననం, చతుర్యుగ మన్వంతర కాలాలు, సురులు నరులు, తిర్యక్కులు వంటి నవవి
సృష్టి, బ్రహ్మఅవయవాల నుండి జరిగిన ప్రజోత్పత్తి క్రమం, మనుష్య దంపతి వ
గుణక్రియలు, పట్టణ గ్రామ ఘోషాదిపరిణామం, బ్రహ్మాదుల స్థానాలు, స్వాయంభు
మనుసంభవం, దక్షసృష్టి దుస్సహోత్పత్తి, జగాలను భక్షించడం ఆరంభించడంతో బ్రహ
దుస్సహకు ఆహారాన్ని ఏర్పర్చడం, దుస్సహ సంతాన దురాచార ప్రకారం వివరించాడ
ఇది తామస సృష్టి, పిమ్మట రుద్రసర్గం తెల్పాడు. భృగ్వాది సంతతి తెల్పాడు. ము
కోరికపై మను ద్వీప వర్షాధిపతులను వివరించాడు. వారు పాలించిన ద్వీపాలను చెపుత
జంబూ ద్వీపాన్ని వివరించాడు. వారు పాలించిన ద్వారాలను చెపుతూ జంబూ ద్వీపాని
మేరువు చుట్టు ప్రక్కలున్న పర్వతాలను, గంగావతరణాన్ని, భారత వర్ష విషయాన్ని
శ్రీకూర్మ సంస్థానాన్ని వర్ణించాడు. అనంతరం భద్రాశ్వ, కేతుమాల, కురు, కింపురుష
హరి, ఇలావృత, రమ్యక, హిరణ్మయ వర్షాలను వర్ణించాడు.

3.2.2.4. చతుర్థ భాగం : చతుర్థ భాగంలో మనువులకు జన్మ క్రమం ఉంది
పురాణ లక్షణాల చతుర్థాంశం మన్వంతరమే. మనువులు పుట్టుక మార్కండేయ పురాణంల
విశాల ప్రణాళికతో రూపం దిద్దుకొంది. 'అష్టాదశ పురాణాలలో మన్వంతరం కథనంల
మార్కండేయానికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. మన్వంతర చరిత్రలో ఈ పురాణం ఇచ్చినన్ని
వివరాలు గాని, చెప్పినన్ని కల్పనలు కానీ, చెప్పిన కథాకథన పద్ధతి గానీ, తత్ఫలను
భావించి గ్రంథించిన నైపుణ్యం గానీ యే యితర పురాణాదుల్లోనూ కానరాదు. 134
అధ్యాయాలలో 47 అధ్యాయాలు మన్వంతర కథలకు వినియోగించింది మార్కండేయం
(22) ఇందులో స్వాయంభువు మనువు జననం చెప్పిన అనంతరం స్వారోచి తదితర
మనుజననం ఉంది.

దేవతల దేవర్షుల గోత్రాలను తద్క్రమాన్ని తెల్పేది వంశం. 'జైమిని యడిగిన ప్రశ్నల కన్నింటికిని గ్రోష్టుకికి మార్కండేయుడు చెప్పిన పురాణార్థములందు సమగ్రములైన సమాధానములు లభించినవా యని పరిశీలించినచో దేవర్షి బ్రహ్మర్షి వంశముల నభివర్ణించెడి వంశలక్షణ మీ పురాణమునందు గానరాదు'. (23)

ఈ దృష్టితో మార్కండేయ పురాణ కథాభాగం దర్శింపవచ్చు. అనంతర కాలంతో ఆంధ్రసాహిత్య శాఖకు అశేష శక్తి సామర్థ్యాలు అనుగ్రహించిన మనుచరిత్ర ప్రబంధ కథకు మూలమయిన కథ ఈ సందర్భంలో దర్శింపవచ్చు.

తదనంతరం మను చరిత్ర చెప్పాడు. వరుణానది తీరాన అరుణాస్పద పురాన వేదవిదురుడైన ప్రవరుడు సిద్ధ ప్రసాదాన హిమవంతానికి ఏగి, పాదలేపనం కరిగిపోగా, తిరిగిపోయే మార్గం కనిపించక, వరూధినిని గాంచి మార్గం అడిగాడు. వాని రూపం చూచి మోహించిన వరూధిని వాని చేత తిరస్కరించబడింది. ప్రవరుడు అగ్ని ప్రసాదంతో నిజగృహం చేరాడు.

ప్రవరునిపై విరహం సహింపలేక వరూధిని విలపించింది. అమెపై మనస్సు గల కలి అనే గంధర్వుడు ప్రవర వేషాన వరూధినిని మోసగించాడు. తత్ఫలితంగా వరూధిని స్వరోచిని పొందింది. పెరిగి పెద్దై అస్త్ర విద్యా విశారదుడై మందరాద్రి భూముల్లో తిరుగుతున్న సర్వోచి కడకు ఒక స్త్రీ భయంతో వచ్చి తాను ఇందీవరాక్షుని పుత్రినని మునిశాప ఫలంగా తనను రాక్షసుడు వెంటాడుతున్నాడని రక్షించమని కోరి అస్త్ర హృదయమనే విద్యను తెలిపింది. ఆ అస్త్రం వేడికి తల్లడిల్లిన ఆ రాక్షసుడు శాప విముక్తి పొంది ఇందీవరాక్షుడయ్యాడు. బ్రహ్మమిత్రుడనే గురువు వద్ద విద్య దొంగలించి, శాపం పొంది కూతురునే మింగబోయానని చెప్పాడు. పిమ్మట స్వరోచి మనోరమను వివాహమాడాడు. దివౌషధులతో మనోరమ సఖులకు శాపవిమోచనం కలిగించాడు స్వరోచి. మందార విద్యాధరుని పుత్రిక విభావరి, ముని పుత్రి కళావతి తమ వృత్తాంతాలు చెప్పారు. వారివురిని వివాహమాడాడు. తన గురించి కలహంసీ చక్రవాకాలు మృగ దంపతులు. వాదించుకోవడం విని తనపై తాను ఏహ్యం పొందినా, తిరిగి యధాతథంగా సుఖాలనుభవింపసాగాడు. ముగ్గురు భార్యల ద్వారా ముగ్గురు పుత్రులను పొందాడు. ఒకనాడు వేటకేగిన స్వరోచిని వనదేవత మోహించి వాని వలన స్వారోచిషుని పుత్రినిగా పొందింది. స్వరోచి హంస నిష్ఠుర వచనాలు విని భార్యాసహితుడై అడవికేగి తపమాచరించి, అమరలోకాన్ని పొందాడు. స్వారోచిష మన్వంతరాన దేవేంద్రాది అధికార పురుషులను పద్మాఆది నిధి మహిమను, ఉత్తర మన్వంతర మహిమను తెల్పాడు. ఉత్తముడు వివాహితుడై భార్య ప్రతికూల కావడంతో ఆమెను అడవికి పంపాడు. అది ఆమె అనుగ్రహంగా భావించింది. ఆమెపై మనస్సు నిల్పిన రాజు వద్దకు విప్రుడొకడు వచ్చి తన భార్యను రాక్షసుడు ఎత్తుకుపోయాడని తెల్పడంతో రాజు వెదికి కనుగొని రాక్షసుని ద్వారా ఆమెలోని పాపగుణాన్ని హరింపచేసి బ్రాహ్మణుని వద్దకు పంపాడు. అర్ఘ్య యోగ్యత లేదని పలువురు విమర్శించడంతో యోచించి త్రికాలజ్ఞ ముని ద్వారా సర్పరాజు భార్యను బంధించాడని తెలుసుకొన్నాడు. అది తెలిసి వెనుదిరిగి వచ్చి భూపతి భార్యకోసం విప్రుడు

మిత్రకామేష్టి చేశాడు. రాజు సత్యవాక్కు గల రాక్షసుని ద్వారా భార్యను పొందాడు. భార్య బహుళ కోరికపై సుశర్మ చేత సారస్వతేష్టి చేయించి, బహుళకు సహకరించిన నాగకన్య మూగతనం పోగొట్టాడు. అనంతరం ఉత్తమ మనుజననం, తామస మన్వంతర మహిమను వివరించాడు. ఈ మన్వంతరాన, సురాష్ట్రుడనే రాజు అందరినీ కోల్పోయి అడవికి వెళ్ళాడు. విపరీత వర్షాలలో దుప్పి తోక పట్టుకొని ఒడ్డు చేరి, దాని వెంట మనోహర వనంచేరాడు. వానికర స్పర్శతో గర్భిణి అయిన పుత్రవతి అయిన మృగి పూర్వజన్మలో తాను చెదర్చిన దంపతులలో మృగరూపంలో ఉన్న ఋతువంతుడు సుతువుడి శాపఫలాన మృగిగా జన్మించానని తెల్పింది. పుత్రవతి ఆమెకు కావడంతో శాపవిమోచనం కలిగింది. రైవత మన్వంతరం మహిమ తెల్పాడు. ఋతువంతునికి రేవతి నక్షత్రాన సుతుడు జన్మించాడు. దుశ్శీలుడయిన పుత్రుని గూర్చి ఋతువంతుడు గర్గుతో సంభాషించాడు. గర్గు రేవతిని నేలకూలునట్లు శపించింది. రేవతి వెలది రూపాన వెలగడం చూచి ప్రముచుడు తన పుత్రికగా చేసుకొని అగ్నిదేవుని ద్వారా రేవతికి తగిన విభుడు దుర్గముడని తెలుసుకొన్నాడు. మృగయార్థి అయి వచ్చిన దుర్గమునికి ప్రముచుడు అర్ఘ్యమిచ్చి వివాహానికి అంగీకరింప చేశాడు. రేవతీ నక్షత్రాన ఇరువురికీ వివాహం అయింది. తదుపరి రైవత మన్వంతరాన ఇంద్రాదులు వివరాలు తెల్పాడు. చాక్షుష మను జన్మవృత్తాంతాన్ని చాక్షుష మన్వంతర మహిమను తెల్పాడు. ఆ మన్వంతరాన దేవేంద్రాదుల వివరాలు చెప్పాడు. వైవస్వతుడనే సప్తమ మను మహిమలు వివరించాడు. సంజ్ఞాదేవి పుత్రుడు వైవస్వతుడు. సూర్య శాపాన యముడు యమునలను సంజ్ఞ సంతానంగా పొందింది. సూర్యుని వలన ఛాయదేవి సావర్ణి మనువు శనైశ్చరుడు తపతి అనే సంతానాన్ని పొందింది. అనంతరం సావర్ణి మన్వంతర మహిమలు తెల్పాడు.

సావర్ణి జన్మ వృత్తాంతం చెప్పాడు. ఈ వంశాన సురథుడు జన్మించి పాలిస్తూ ఉండగా శత్రువులు మోసంతో రాజ్యాన్ని గ్రహించారు. అడవికేగిన సురథుడు అక్కడి సంపదంతా పుత్రులు పుచ్చుకొని వెళ్ళగొట్టిన సమాధుడనే వైశ్యుని చూశాడు. తామిరువురిలోనూ గత భోగాల పట్ల మక్కువ తీరకపోవటాన్ని గూర్చి మేధస్సు అనే మునిని అడగగా అది మహామాయా ప్రభావమని చెప్పాడు. వారి కోరికపై సర్వవ్యాప్తి కలిగిన జగన్మూర్తిని తదుత్పత్తి విధానాన్ని చెప్పాడు. యోగ నిద్రలో ఉన్న విష్ణువు కర్ణాల నుంచి మధుకైటభులు జన్మించి బ్రహ్మను చంపబోగా, బ్రహ్మ యోగ నిద్రను స్తుతించాడు. మాయాదేవి విష్ణువును వీడటంతో మేల్కొన్న విష్ణువు వారిని వధించాడు. బ్రహ్మ సృష్టికి పూనుకొన్నాడు. బ్రహ్మ స్తుతిపై దేవి మొదట ఉదయించింది. ఆ దేవి మహిమ చెప్పసాగాడు. దేవాసురులు యుద్ధంలో తన పుత్రులకు సురుల చేతిలో పోకుండడానికి, దితి అంబ సలహాపై ఇంద్రుని చంపదగ్గ పుత్రుని పొందడానికి మహిష రూపాన తీవ్రతపం చేసింది. ఆ తపో తీవ్రతకు సంక్షుభితుడయిన సుపార్శ్వుడు అలాంటి పుత్రుడే జన్మిస్తాడని శపించాడు. పిమ్మట బ్రహ్మ అనుగ్రహించాడు. తత్ఫలితంగా జన్మించిన మహిషాసురుని దౌష్ట్యాలను దేవతల ద్వారా విన్న శివకేశవులు కోపించారు. వారి తేజోపుంజాల వల్ల దేవి ఆవిర్భవించి దేవతల వల్ల యుద్ధోపకరణాలు పొందింది. మహిషాసుర సేనానులైన చక్షురాదులు దేవితో పోరాడి మరణించారు. మహిషాసురుడే

దండెత్తి వచ్చి మృతుడయ్యాడు. విజయ స్వరూపిణిని దేవతలు స్తుతించారు. ఆ దేవి లోకకళ్యాణార్థం గౌరి గర్భాన జన్మించిన కథ సురథునికి చెప్పాడు. పూర్వం శుంభనిశుంభులు అనే సురులు విజృభించడంతో దేవతలు దేవిని స్తుతించారు. తద్ఫలితంగా దేవి కౌశికుని పేరిట గౌరి కోశాన జన్మించి గౌర్యాజ్ఞతో హిమవంతానికేగింది. కౌశికీదేవి దివ్యస్వరూపం చూచి శంభునికి తగిన స్త్రీ అని వాని అనుచరులైన చండముండులు చెప్పడంతో సుగ్రీవునితో రాయబారం పంపాడు. రాయబారం విని తనను జయించిన వాడికి భార్యనవుతానని పేర్కొంది. బలవంతాన తీసుకుపోవటానికి యత్నించిన ధూమ్రాలోచనాదులను సంహరించింది. ఇది విని శంభుడు పంపగా బంధించ వచ్చిన చండముండులను సంహరించింది. శంభునిశుంభలు యుద్ధ సన్నద్ధులయ్యారు. దేవి శరీరం నుంచి సప్త మాతృకలు ఆవిర్భవించాయి. యుద్ధ సన్నద్ధ అయిన దేవి రాక్షససేనని చెండాడి నిశుంభశుంభులను వధించింది. తనను స్తుతించిన దేవతలకు తన భవిష్యదవతారాలను చెప్పింది. ఆ మాయాదేవి ప్రభావమే మోహమని తెలుసుకొన్న రాజు వైశ్యుడు తపం చేశారు. దేవి వరాన రాజు సావర్ణి మనువై జన్మించాడు. వైశ్యుడు పరమ జ్ఞానాన సుఖి అయ్యాడు.

నవమ మనువుగా దక్షపుత్రుడు సావర్ణి ఉన్నప్పుడు ఇంద్రాదులను గూర్చి వివరించాడు. ఈ క్రమంలో త్రయోదశరౌచ్య మన్వంతరాన్ని చెప్పాడు. దక్ష సావర్ణి ధర్మ సావర్ణి రౌద్ర సావర్ణి మనుసంభవాన్ని చెప్పి, రౌచ్య మనూత్పత్తిని చెప్పాడు. రుచి ప్రజానాథుడు అనగ్ని అనకేతనుడు అసంగుడయి చరించే అతనిని చూచి పితృవరులు గృహస్థాశ్రమాన్ని చేపట్టమన్నారు. వృద్ధుడయిన తననెవరు వివాహమాడుతారని చింతించి బ్రహ్మకై తపస్సు చేసి ప్రసన్నం చేసుకొని ఇష్టార్థాలను పొందాడు. దేవతలను స్తుతించి పత్నిని వరంగా పొందాడు మాలిని వివాహమాడాడు. వీరి పుత్రుడు రౌచ్య మనువు. అనంతరం భౌత్యమను జన్మం చెప్పసాగాడు. భూతి అనే ముని పుత్రునికై తపస్సు చేయ యత్నించి విఫలుడయ్యాడు. ఒకనాడు భూతి తన సోదరుని యాగానికి శాంతి అనే శిష్యను నియంత్రించాడు. ఆ హోత్రాగ్ని నశించడం చూచి చింతించి అగ్నిదేవుని ప్రార్థించి వరం పొందాడు. ఆ వరఫలాన భౌత్యుడు జన్మించాడు. ఈ భౌత్యమన్వంతరాన ఇంద్రాదులను,పిమ్మట మహారాజుల వంశాన్ని వర్ణించాడు.

3.2.2.5. పంచమభాగం : మార్కండేయ పురాణం పంచమ కథా భాగం మన్వంతరం కథాంతం నుంచి ఫలశ్రుతి దాకా ఉన్న భాగంగా గుర్తింపవచ్చు. పంచమ పురాణ లక్షణం వంశాను చరితం. ఇందులో సూర్యవంశ చరితం ఉంది.

'వంశాను చరితంలో మార్కండేయం సూర్యవంశం చక్రవర్తులను విశేషించి కీర్తించింది. వృషధ్ర నాభాగ, వత్సంధ్ర, ఖనిత్ర, కరంధ, మావేచేక్షిత, మరుత్త, నరిష్యంత చక్రవర్తుల కథలీ పురాణం విస్తరించి చెప్పినట్లు మరే పురాణం చెప్పలేదు'. (24) ఈ దృష్టి స్పష్టం కావటానికి మార్కండేయ పురాణం కథా ప్రణాళిక దర్శనీయం.

సూర్యుని జన్మ విధానం బ్రహ్మ సూర్యుని వేడి తగ్గించిన విధం మార్కండేయుడు తెల్పాడు. బ్రహ్మ తిరిగి సృష్టి చేశాడు. దానవుల విజృంభణ చూచి అదితి దేవతల

కొరకు సూర్యుని ప్రార్థించి, తన గర్భాన సూర్యతేజాన్ని మార్తాండునిగా పొందింది. ఆ తేజానికి దేవదానవులు భస్మమయ్యారు. విశ్వకర్మ తన కుమార్తె సంజ్ఞ కోసం మార్తాండుని వేడిని తగ్గించాడు. బ్రహ్మాదులు సూర్యుని స్తుతించారు. చిక్కిన సూర్యుని తేజంతో శూలాదులు నిర్మించారు. సంజ్ఞకు అశ్వినులు రేవంతుడు జన్మించారు. పిమ్మట క్రోష్టుకి కోరికపై అర్కుని వంశాన్ని చెప్పసాగాడు. యముని పుత్రుడు రాజ్యవర్ధనుడు పాలనలో ప్రజలు సౌఖ్యంగా ఉండేవారు. ఒకనాడు మానిని మగనికి అభ్యంగన స్నానం చేయిస్తూ చూచిన తెల్లవెంట్రుక గురించి చెప్పింది. తపానికిది తగిన వయసని భావించి సచివులకు తెలిపి శోకతప్తులైన పౌరులను సముదాయించాడు. సూర్యుని ద్వారా ఇష్టార్థాలను పొందారు. రాజు జీవనకాలం పెంపును పొందాడు. రాజు మానిని చెప్పినా వినక తన కొరకు ప్రజలు చేసినదానికి బదులుగా సూర్యుని ఆరాధించి పౌరులను దీర్ఘాయుష్మంతులుగా చేశాడు. తదనంతరం మార్కండేయుడు వైవస్వత మను సంతతిని గూర్చి చెప్పసాగాడు. వైవస్వత పుత్రునికై యాగం చేసి తల్లోప కారణాన పుత్రికను పొందాడు. మిత్రావరుణులను పూజించి పురుషునిగా మార్పించాడు. ఈ ఇలుడు వనాన తిరుగుతూ రుద్రుని శాపాన స్త్రీ అయ్యాడు. ఇల గర్భాన పుత్రుడుదయించాడు. అశ్వమేధం చేయడంతో తిరిగి పురుషరూపం లభించింది. స్త్రీగా ఉన్నప్పుడు ఇలుని చూచిన పురూరవుడు వచ్చి తనకు భూభాగం కావాలని కోరడంతో వశిష్ఠుని సూచనపై అతనిని ప్రతిష్ఠాన పురానికి రాజుని చేశాడు అని ఇలుని వృత్తాంతం చెప్పాడు. మార్కండేయుడు తిరిగి చెప్పసాగాడు. వృషభుడనే మను పుత్రుడు మృగయార్థి అయి వెళ్ళి ఆవును చంపి బాభ్రవుడనే ముని కుమారుని వలన శూద్రునిగా శాపం పొంది కారూషుడనే పేర ప్రఖ్యాతి గాంచి ఏడుగురు పుత్రులను పొందాడు. వీరు కారూషులుగా పేరు గాంచారు. ఈ వంశాన అభానుడు జన్మించి, ఒక వైశ్య కన్యను చూచి వివాహానికై కోరి తండ్రి చేత నిరాకరింపబడి కూడా కన్యను వివాహమాడాడు. విషయం తెల్సి పుత్రునిపైకి సేనను పంపి తండ్రి పరాజితుడయ్యాడు. పుత్రునితో యుద్ధానికి పూనుకున్న రాజును పరివ్రాజుడనే ముని వైశ్య వనితను వివాహమాడిన కారణాన అభాగుడు వైశ్యుడని పోరాడ తగదని తెల్పాడు. వివాహానంతరం వైశ్యుడయిన అభాగుడు తండ్రి బాభ్రవాది మునులు అతనికి పశుపాల్య కృషి వాణిజ్యాది ధర్మకర్మ కర్తవ్యాన్ని తెల్పాడు. అతనికి భనందుడు జన్మించి తల్లి మాటపై గోపాలుడవటానికి ఏగి హిమనగాన తపం చేసి నీపునిడనే రాజర్షిని రాజ్యం పొందే మార్గం తెల్పమని ఆశ్రయించి అతని ద్వారా అస్త్రాలను ఆర్జించి శత్రునాశం చేశాడు. సకల రాజ్యం పొంది తండ్రి వద్దకేగి ఇవ్వజూచి నిరాకరింపబడ్డాడు. అది చూచి నవ్విన సుప్రభ పుత్రినితో తన తండ్రి పూర్వజన్మ వృత్తాంతాన్ని చెప్పింది. పూర్వం సుదేవుడనే రాజు తన స్త్రీలతో మత్తుడై ఉండగా సుఖుడయిన నలుడు ప్రమతి అనే ముని భార్యను చేపట్టబోయాడు. ఆ అరుపులు విని వచ్చినముని రాజును కోమటి కులాన పుట్టమని, నలుని నిలువునా నీరవ్వమని శపించాడు. కోపం తగ్గిన పిమ్మట వైశ్య జన్మాన జన్మించిన పుత్రిక క్షత్రియుని వివాహమాడిన పిమ్మట పూర్వరూపం పొందుతాడని తెల్పాడు. ఆ కారణానే తన తండ్రి వైశ్యుడయ్యాడని ఆమె తెలిపింది.పిమ్మట తన జన్మ వృత్తాంతం చెప్పింది. సురథుడనే రాజర్షి శ్యేన ముఖాన చెదిరిపడ్డ శారికను చూచి తన శరీరం

నుంచి జనించడం చూచి కృపావతి అని పేరిడి పెంచసాగాడు. ఒకనాడు సఖులతో కూడి ఆడుతూ విశృంఖలంగా విహరిస్తూ ఉండగా ఆగ్రహాన శపించాడు. కోపం తగ్గిన తర్వాత వైశ్యగా జన్మించినా పుత్రుని వల్ల క్షత్రియత్వం వస్తుందని చెప్పాడని తెల్పింది, శాపవిముక్తి అయిన సుప్రభ. తండ్రి ఆజ్ఞపై భనందుడు రాజ్యాన్నేలుతూ సుఖంగా ఉన్నాడు. వీని పుత్రుడు వత్సంధ్రుడు. విదూరథుడనే రాజపుత్రి సునందను కుజంభాసురుడు ఎత్తుకు పోగా వానిని వధించి సునందను వివాహమాడాడు. క్రోష్టుకి కోరికపై ఆ వృత్తాంతం చెప్పసాగాడు. వేటకేగిన విదూరథుడు భూమి నోరు తెరచుకొన్నట్లు ఉండటం చూచి సువ్రతుని విషయం అడుగగా కుజంభుడనే రాక్షసునికి అది వాసమని బ్రహ్మ వరంగా పొందిన ముసలంతో భూమిని తూట్లు చేస్తుంటాడని తెల్పాడు. ఈ కుజంభుడు రాజపుత్రిని ఎత్తుకుపోవడంతో రాజసుతులు వాడిపైకి వెళ్ళి బంధీలయ్యారు. పుత్రుని తెచ్చిన వారికి సుతనిస్తానని రాజు చాటింపు వేయడంతో వత్సంధ్రుడు కుజంభుని చంపి రాజు పుత్రిని చేపట్టాడు. భనందుడు వృద్ధాప్యాన పుత్రునికి రాజ్యమిచ్చి అడవికి ఏగాడు.

మార్కండేయుడు అనంతరం వత్సంధ్ర సంతతిని తెల్పాడు. ఈ క్రమాన జన్మించిన వాడిలో ఖనిత్రుడు ఒకడు. ఖనిత్రుడు నలుదిశలను నలుగురికి ఇచ్చాడు. శౌరి అనే పుత్రునికి విశ్వవేది అనే మంత్రి చేసిన దుర్మంత్రం వల్ల అత్యధిక రాజ్యకాంక్షతో అందరూ మరణించారు. దుఃఖితుడయిన ఖనిత్రుడు భార్యతో అడవులకేగి తపం ద్వారా పుణ్యలోకాలు పొందాడు. నృపుని పుత్రుడు క్షుపుడు రాజ్యానికి వచ్చాడు. అష్టదిక్పాలకులు పూర్వం క్షుపుడనే రాజులాగే పాలన చేయమని తెల్పారు. అందుకు క్షుపుడు ప్రతిజ్ఞ చేశాడు. ఇతనికి ప్రమథ వానికి వీరుడు, వీరునికి వివింశుడు అతనికి ఖనిత్రుడు జన్మించారు. పుత్రసంతతి లేని ఖనిత్రుడు యాగానికి పూనుకొని మృగబోధతో కర్మాదులకు జీవ వధ వ్యర్థమని తెల్సుకొని తపం చేసి బలాశ్వుని పొందాడు. బలాశ్వుడు రాజ్యానికి రావడం ఇష్టంలేని దాయాదులు రేపిన రణంలో చేసిన పోరుకి కరంధముడు సిద్ధమయ్యాడు. వీర అనే పత్ని ద్వారా అవేక్షితుడు జన్మించాడు. విద్యావంతుడయిన అవేక్షితుడు స్వయం వరాన అనేకులను వరించాడు. విదిశాపుర స్వయంవరంలో పరాజితులైన రాజులందరూ కోపించి అవేక్షితునితో యుద్ధానికి సన్నద్ధలయ్యారు. అధర్మ యుద్ధాన బంధితుడు అవడంతో భార్యా ప్రేరితుడయిన కరంధముడు విడిపించాడు. వివాహ విషయంలో వైశాలిని విశాల కరంధమ అవేక్షితుల మధ్య మరణోద్యమాన్ని ఆపి దైవ యుక్తితో సమస్తం సిద్ధిస్తుందని తెల్పాడు. అట తల్లికి మిచ్చుకవ్రత మిషతో అవేక్షితుడిని పెండ్లికి అంగీకరింప చేసింది. అడివికేగిన అవేక్షితుడు అక్కడ దృఢకేశుడనే రాక్షసుని చంపి విశాలను రక్షించాడు. దేవతలు అవేక్షుతినికి సత్పుత్రుని వరంగా ఇచ్చారు. విశాల తన విషయమంతా తెలిపింది. తాను నాగలోకాన పొందిన సేవలు వారు తన పుత్రుని వలన కలిగే ఆపద నుంచి కాపాడమనడం తెలిపింది. పాణిగ్రహణానికి పూనుకోగా గంధర్వుడు ఏతెంచి తన పుత్రి అగస్త్యుని శాపాన మానవ జన్మ ఎత్తిన వైశాలినిగా చెప్పి వారిరువురికి వివాహం చేశాడు. ఇరువురు గంధర్వలోకమేగి విహరించి వచ్చారు. వీరి పుత్రుడు మరుత్తు. పుత్రాదులతో అవేక్షితుడు నగరానికి ఏగి తండ్రికి విషయం తెల్పాడు. కరంధముడు మరుత్తుకు

రాజ్యాన్నిచ్చి అడవులకేగాడు. ఒకనాడు ఒక ముని వచ్చి తానతని నాయనమ్మ వద్ద నుంచి వచ్చానని, పాలనా లక్ష్యాన్ని తెలుపుతూ ఆమె చెప్పిన సందేశాన్ని అందించాడు. మరుత్తు తనను తాను నిందించుకొని పితామహి ఉన్న ఆశ్రమానికేగి పాముల చేత చచ్చిన మునులను చూచి కోపాన సంవర్తాస్త్రం వేసి నాగలోకాన్ని తపింపచేశాడు. ఆ పాములను భామిని కోరికపై అవేక్షితుడు రక్షించటానికి ప్రతిన పూనాడు. అందుకు గాను మరుత్తునితో వాదించి పుత్రునిపై బాణం సంధించాడు. ఇరువురు ప్రచండులై ఉండడం చూచి మునులు వారిని వారించారు. మృతులైన వారు పునర్జీవితులవ్వడంతో ఇరువురూ దివ్యాస్త్రాలను ఉపసంహరించుకొన్నారు. తిరిగి రాజ్యానికి వచ్చి మరుత్తుడు వివాహితుడై నరిష్యాంతాదులైన పన్నెండు మంది పుత్రులను పొంది సుఖంగా రాజ్య మేలాడని వీరి వృత్తాంతాలను చెప్పి మార్కండేయుడు క్రోష్టుకి సంశయాలన్నీ తీర్చాడు. క్రోష్టుకి సంతుష్టుడై తన నిజాశ్రయానికి ఏగి తపమాచరించసాగాడని జైమినికి ధర్మపక్షుడు మార్కండేయ పురాణ కథను తెల్పాయి.

ప్రథమాంధ్ర పురాణం, మహాపురాణానువాదం అయిన మార్కండేయ పురాణంలో వంశం - అంటే రాజర్షి బ్రహ్మర్షి గోత్రాలు తద్క్రమాన్ని గూర్చిన వివరాలు లేవు. సర్గ ప్రతి సర్గలు సృష్టి ప్రతిసృష్టిని వివరించేవిగా లేవు. ఇందులో ఇతర కథాంశాలు చేరాయి. వంశం ఉండవలసిన చోట సర్గ ప్రతిసర్గ ధోరణిలో సాగిన రచన ఉంది. పంచ లక్షణాలు ఆ క్రమంలో లేకపోవటం,అన్ని లక్షణాలు సంపూర్ణంగా లేకపోవటం, మార్కండేయ పురాణంలో గమనార్హమయిన అంశాలు. ఇంతేకాక ప్రథమాంధ్ర పురాణమే సంపూర్ణ లక్షణాలతో కనిపించకపోవడం, తర్వాతి రచనల్లో పంచలక్షణాలతో కూడినవి లేకపోవడం, తెలుగు సాహిత్యంలో పురాణ సాహిత్య స్థితికి దర్పణం పడుతుంది. ఇంకా వెలువడ&డ పురాణాలు కూడా అన్ని లక్షణాలతో సర్వాంగ సుందరంగా ఉండనక్కరలేని స్థితిని ప్రథమాంధ్ర పురాణమే కలిగించింది. ఇంత విశాల కథా ప్రణాళికతోడి రచన కావటం ఒక కారణంగా విశాలకాలావధిలో పురాణం సృష్టి పొందటం మరొక కారణంగా పంచలక్షణ సమన్వితంగా ఈ పురాణమే కాదు ఏ పురాణమైనా సృష్టి పొందటం కష్టం కావటం అటుంచి, అది చాలా కాలం మౌఖిక సాహిత్యంగా నిలిచి ఉండటం మరో కష్టం. అందువల్ల సర్వలక్షణ సమగ్రంగా పురాణ సాహిత్యం ప్రభవించటం కష్టం, నిలిచి ఉండటం కష్టం. అందువల్లనే తెలుగులో గోచరమయ్యే పురాణాలు అన్నీ అన్ని అందాలా సలక్షణంగా ఉన్నాయని చెప్పటం సాధ్యం కాదు.

3.2.2.6. మార్కండేయ పురాణ కథాసూత్రం : ఎల్లకర నరసింహకవి ద్విపదలో మార్కండేయ పురాణం అనువదించాడు. ఇందుకు పద్మసాలెల ప్రోత్సాహం ఉండటం వల్ల ఇది సులభ గ్రాహ్యంగా అవతరించింది. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో ఆంధ్రకవితా పితామహుడుగా ప్రఖ్యాతి నార్జించిన అల్లసాని పెద్దన (1470-1540) మార్కండేయ పురాణంలో మన్వంతర భాగంలో పేర్కొన్న మనువుల్లో ఒక మనువు జన్మించటానికి నేపథ్యమయిన కథాంశం విస్తరింపచేసి రసవత్తర ప్రబంధంగా రూపొందించాడు. పెద్దన మరో పురాణ కథను ప్రబంధ కథగా పరివర్తింప చేసినప్పుడు రసోచితమయిన మార్పులు

చేశాడు. శృంగారోన్ముఖమయిన ప్రబంధం, శాంత ప్రచలితమయిన పురాణం సమన్వయించిన సందర్భం పెద్దన చేతిలో సాహితీ సౌందర్యానికి నికషోఫలమయింది.

ప్రవరుడు సిద్ధుని లేపన పుణ్యాన హిమవత్ప్రాంతానికి వెళ్ళడం వరూధినిని నిరాకరించడం, ఆమెను ఆశించిన గంధర్వుని మోసం వలన ఆమె స్వరోచిని పొందడం, స్వరోచి మనోరమ విభావసిని కళావతులను, వనదేవతలను వివాహమాడడం, వనదేవత వల్ల స్వారోచిషుని పుత్రునిగా పొందడం, అతడు మనువై ప్రజలను సుఖసంతోషాలతో ఉంచేటట్లు పాలించడం - కథను పెద్దన వర్ణనల ద్వారా పెంచి రసవత్తర ప్రబంధంగా రూపొందించాడు.

సవరము చిననారాయణ కవి (16001-1650) రచించిన 'కువలయాశ్వ చరిత్ర' మార్కండేయ పురాణం నుంచి గ్రహించిన కథా భాగానికి ప్రబంధ రూపం. ఇది ఆరు ఆశ్వాసాలలో సాగింది. 'ఋతుధ్వజుడను రాజు కువలయాశ్వుడను పేర కీర్తి గాంచి, పతివ్రతయైన మదాలస అను గంధర్వరాజ కుమార్తెను వివాహమాడిన వృత్తాంతమిందు....' (25)లో ఉంది.

శ్రీనాథుని 'మరుత్తరాట్ చరిత్ర' కథాంశం మార్కండేయ పురాణగతమయినదే. చదలవాడ మల్లన దర్భా వేంకటగిరి వ్రాసిన 'రుక్మాంగద చరిత్ర'లు అలభ్యంగా ఉన్నప్పటికీ మార్కండేయ పురాణంలోని గాథనే గ్రహించినట్లు స్పష్టమవుతుంది.

దైవీయ వస్తు ప్రముఖమయిన మార్కండేయ పురాణం అనంతర కాలంలో అనేక సాహితీ స్వరూపాల అవతరణకు అవకాశం ఇచ్చింది. ఇందులో ప్రముఖంగా పేర్కొనదగ్గ ప్రబంధం మనుచరిత్ర. విశాల దైవీయ వస్తు నేపథ్యంలో మార్కండేయ పురాణం, పరిమిత దైవీయ వస్తు ప్రపంచనంతో మను చరిత్ర శోభించాయి.

3.2.3. భాగవత పురాణం : సంస్కృత అష్టాదశ పురాణాలలో శ్రీమహాభాగవతం ప్రధానమయింది. ఇది వైష్ణవీయ పురాణం. 'భాగవత మా పురాణ లక్షణ నిర్వచనమునకు లభ్యమైన మంచి యుదాహరణము. అందు ద్వితీయ స్కంధమున బ్రపంచోద్భవ ప్రకారమును, నవమస్కంధమున వంశ వంశానుచరితములను వర్ణింపబడి యున్నవి. ఇతర స్కంధములందే యే యవతారముల నెత్తి యేయే కార్యములాచరించెనో విపులముగా చెప్పబడినది'.(26)

విష్ణు ప్రశస్తిని చాటే మహాభాగవతాన్ని సంస్కృతాన వ్యాసుడు రచించాడు. దీనిని తెలుగులో బమ్మెర పోతన రచించాడు. ద్వాదశ స్కంధాలున్న రచనిది. ఎన్ని రచనలు చేసినా తృప్తి కలగని వ్యాసుడు నారదుని ప్రబోధంతో నారాయణునిపై ఈ గ్రంథం వెలార్చాడు.

పురాణంగా ప్రసిద్ధి గాంచిన భాగవతం ఉపాఖ్యానాల కూర్పు. ప్రతి ఉపాఖ్యానం భగవంతుడైన శ్రీహరి అస్తిత్వాన్ని ప్రాముఖ్యాన్ని తెల్పేదిగా ఉంది. ప్రశ్నోత్తరాల రూపంలో సాగింది. శౌనకాది మునులకు సూతుడు చెప్పిన కథలివి. శుకుడు పరిక్షిత్తు రాజు మోక్షానికి చెప్పిన విశేషాలను సూతుడు చెప్పాడు.

**3.2.3.1.** భాగవతావరణం : పరీక్షిత్తు శాపం పొంది మృత్యువు కోసం ఎదురుచూస్తున్న శుకమహర్షి భక్తి మార్గాలు బోధించే సందర్భంలో భాగవతం అవతరించింది. ఈ రచనకు నేపథ్యమైన నారదుడు మునుల విషయం ఆరంభంలో వివరించాడు.

కురుక్షేత్ర యుద్ధం ముగిసింది. అశ్వత్థామ బారినుండి ఉత్తర గర్భాన్ని కృష్ణుడు రక్షించాడు. పిమ్మట ధర్మజునితో కూడి భీష్ముని దర్శించాడు. కృష్ణుని ప్రస్తుతించి సద్వర్తనను ధర్మజునికి బోధించిన భీష్ముడు ఉత్తరాయణ సమయాన మరణించడంతో తమ్ములతో కూడి ధర్మజుడు పాలించసాగాడు. కృష్ణుడు ద్వారక చేరాడు.

ఉత్తర పరీక్షిత్తుకు జన్మనిచ్చింది. కృష్ణ సమక్షాన ధర్మజుడు 3 అశ్వమేధాలు చేశాడు. పిమ్మట కృష్ణుడు ద్వారక వెళ్ళాడు. విదురుడు తీర్థయాత్రలకేగి ఆత్మజ్ఞానం పొంది వచ్చాడు. గాంధారి ధృతరాష్ట్రులు అడవులకేగి అక్కడ మరణించారు.

కృష్ణుని వద్దకు ద్వారకకు వెళ్ళి అర్జునుడు ఎంతకీ రాకపోవడంతో దుర్నిమిత్తాలు కనబడడంతో ధర్మరాజు కలత చెందాడు. ద్వారక నుండి దుఃఖభారంతో వచ్చిన అర్జునుడు కృష్ణ నిర్యాణాన్ని తెలిపాడు. స్థైర్యం కోల్పోయిన ధర్మరాజు పరీక్షిత్తుకు పట్టం కట్టి వానప్రస్థానానికి ఏగాడు. ధర్మయుక్త పాలకుడైన పరీక్షిత్తు వివాహితుడయి జనమేజయునకు తండ్రి అయ్యాడు. భూమాతను కలి పురుషుడు తన్నడం చూచి పరీక్షిత్తు అతణ్ణి చంపబోయాడు. శరణు కోరిన వానిని చంపక రాజ్య బహిష్కరణకు గురి చేశాడు. ఒకనాడు మృగయాసక్తుడయి వేటకేగి దాహంతో ఆశ్రమంలో తపమాచరిస్తున్న శమీక మునిని అభ్యర్థించి ఎంతకీ ప్రత్యుత్తరమివ్వని ముని మెడలో కుపితుడయి చచ్చిన పామును చుట్టాడు.అది చూచిన ముని పుత్రుడు శృంగి పాము విషం చేత మరణమని శపించాడు. విషయం తెల్సిన శమీకుడు బాధపడి పరీక్షిత్తుకు తెల్పాడు. పశ్చాత్తాప పడిన పరీక్షిత్తు పుత్రునికి రాజ్యాన్నిచ్చి శ్రీహరి ధ్యానంతో మృత్యువుకై చూస్తుండసాగాడు. అక్కడ వచ్చిన శుకమహర్షి ముక్తి మార్గం భక్తి మార్గాలే ముఖ్యమని తెల్పాడు.

2. నారదుడు నారయణుని అవతారాలను తెలిపిన సందర్భంలో సర్గ అనగా సృష్టిని, ప్రతిసర్గ అనగా పునస్సృష్టిని వివరించాడు. శ్రీమహావిష్ణువు అవతారాలను వివరించిన సందర్భంలో కృష్ణుని కంటే పూర్వం పొందిన అవతారాలను స్పష్టం చేశాడు. మహావతారం నుంచి నృసింహావతారం దాకా శ్రీమహావిష్ణువు పొందిన అవతారాలను చేసిన దుష్టశిక్షణ శిష్టరక్షణను శుకమహర్షి విశేషంగా వివరించి పరీక్షిన్మహరాజుకు చెప్పిన భాగంలో నారాయణుని వంశానుచరితం స్పష్టం చేసినట్లు విశదం అవుతుంది.

నారదుడు బ్రహ్మ ద్వారా తెలుసుకొన్న సృష్టిని, భిన్నావతారాలతో నారాయణుడు నిర్వహించిన లీలలను వివరించాడు. పరీక్షిత్తు ప్రశ్నకు సమాధానంగా బ్రహ్మ శ్రీహరి వరప్రసాదాన లోకాన్ని సృష్టించడం చెప్పాడు.

కురుక్షేత్ర యుద్ధారంభం కానుండగా విదురుడు తీర్థయాత్రలకేగి శ్రీహరి నివాస ప్రాంతాలలో ఉద్ధవుని చూచి కృష్ణాదుల వృత్తాంతం తెలుసుకొని ఉద్ధవుడు పంపగా

తత్త్వజ్ఞాని అయిన మైత్రేయుని చేరి అతని వద్ద సృష్టిని, సృష్టి రహస్యాన్ని తెలుసుకొన్నాడు. ప్రళయానంతరం సృష్టి కొరకు బ్రహ్మను పుట్టించగా, బ్రహ్మ సమస్త లోకాన్ని సృష్టించి, తనువు చాలించాడు. ఆ శరీర భాగంనుంచి స్వాయంభువు మనువు శతరూప ఉద్భవించి ప్రాణికోటిని వృద్ధి చేశారు. వీరికి తగిన స్థలం అవసరమవ్వడంతో శ్రీహరి వరాహ రూపాన భూమిని నీటిపై నిల్పి మాయమయ్యాడు. నీటిలో ఉండి భూమిని రక్షించే సమయాన హిరణ్యాక్షుని వధించాడు.

మైత్రేయుడు హిరణ్యాక్ష హిరణ్యకశిపుల జనన వృత్తాంతం చెప్పసాగాడు. కశ్య ప్రజాపతి భార్య దితి. ఒక సాయం సమయాన మదన పీడితఅయి భర్త వారించినా వినక భర్తను కూడింది. జన్మించేవారు ధూర్తవర్తనులై శ్రీహరి చేతుల్లో మరణిస్తారన్న భర్త మాటలకు చలించి ప్రార్థించగా, వారి పుత్రుడు ముల్లోకాలను కీర్తి గడిస్తాడని చెప్పాడు. జన్మించిన వారి తేజం చూచి భయపడిన దేవతలకు సనక సనందుల శాపం పొందిన జయ విజయులుగా బ్రహ్మ తెల్పాడు. శాప నివారణగా వారి చావు శ్రీహరి చేతుల్లోనని చెప్పాడు. ఆ ఇరువురు హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా జన్మించారు. తిరుగులేని బలంతో విహరించసాగారు. ఒకనాడు హిరణ్యాక్షుడు దాడి చేయగా వరుణుడు వానికి తగినవాడు శ్రీహరేనని తెల్పాడు. శ్రీహరి వారాహ రూపాన నీటిలో ఉన్న సంగతి నారదుని ద్వారా విని సముద్రంలో ప్రవేశించాడు. భీకర యుద్ధం చేశాడు. చివరకు సుదర్శన చక్రం వేటుతో హిరణ్యాక్షుడు మరణించాడు. మైత్రేయుని ద్వారా బ్రహ్మ చేసిన యక్షాది దేవతాగణ సృష్టి తెలుసుకొన్నాడు. అనంతరం కర్దమముని వృత్తాంతం తెల్పాడు. కర్దమమునికి ప్రత్యక్షమై స్వాయంభువు కుమార్తె దేవహూతి యందు తాను దశమసంతానంగా జనించి తత్త్వబోధ చేస్తానన్నాడు. స్వయంభువు తన కుమార్తెను కర్దమమునికి ఇవ్వ కోరగా ఆమె సంతానవతి అయ్యాక తాను తపమాచరించడానికి వెళ్తానన్నాడు. అందుకు అంగీకరించి వివాహం జరిపించాడు. వివాహం అనంతరం సతిసేవకు ముగ్ధుడయి తాను కల్పించిన విమానంపై ఆమెను విహరింపచేశాడు. తొమ్మిది మంది పుత్రికలు జన్మించారు. తపానికి పోనున్న కర్దమమునికి పుత్రిక వివాహం, పుత్ర సంతతి కాంక్షనిలువరించాయి. పిమ్మట పుట్టినవాడు కపిలుడు. కుమార్తెల వివాహానంతరం శ్రీహరిని గుర్తించి, కపిలుని సేవించి, భాగవతగతిని పొందాడు. దేవహూతి పుత్రుని ద్వారా భక్తియోగాన్ని, పిండోత్పత్తిని తెలుసుకొని యోగశక్తితో శ్రీహరిలో లీనమైంది. పిమ్మట కపిలుడు లోకాలు తిరిగి సాంఖ్య యోగం తత్త్వోపదేశం చేస్తూ ఉత్తర మార్గానికి వెళ్ళిపోయాడు.

మైత్రేయుడు విదురునకు స్వాయంభువు శతరూపల పుత్రికలవంశ విస్తారాన్ని కర్దమ దక్ష ప్రజాపతుల సంతతిని వివరించాడు. దక్ష ప్రజాపతి తన కుమార్తెను ఈశ్వరునికి మిగిలిన వారిని దేవతలకు ఇచ్చాడు. బ్రహ్మ చేసే యాగానికి వచ్చిన దక్షునికి గౌరవమివ్వలేదని ఈశ్వరుని యాగఫల శూన్యునిగా శపించాడు. ఈ విరోధంతో ఈశ్వరహితంగా యాగం చేయదలచి అందరినీ ఆహ్వానించాడు. శివుడు నివారించినా వినక సతి వెళ్ళింది. ఆమెను యజ్ఞవాటికలో తల్లి సోదరి తప్ప ఎవరూ పలకరించలేదు. దక్షునిచే అవమానిత అయి రుద్రరహితయాగానికి కుపిత అయి దక్షుని దూషించి తనను

[illegible]

ద్వారా విషయం విన్న శివుడు జటాజూటంతో వీరభద్రుని సృష్టించాడు. వీరభద్రుడు యాగానికి రుద్రగణాధిపతిగా వెళ్ళి దక్షుని తల నరికి యాగం ధ్వంసం చేశాడు. దేవతల స్తుతిపై ఈశ్వరుడు అనుగ్రహించాడు. తత్ఫలితంగా దక్షుడు అజాముఖుడై పునర్జన్మ పొంది యాగ సమాప్తి చేశాడు.

స్వయంభువు పుత్రుడు, ఉత్తాన పాదుడు. ఇతనికి సునీతి వలన ధ్రువుడు సురుచి వలన ఉత్తముడు జన్మించాడు. తండ్రి ప్రేమను ఉత్తమునిలాగే తానూ పొందాలని ఆశించి నిరాకరింపబడి, సురుచి దుర్భాషలకు బాధపడి ధ్రువుడు తల్లి వద్దకేగాడు.తల్లి సూచనపై శ్రీహరిని ప్రార్థించటానికి వెళ్ళాడు. నారదునిచే నారాయణుని మంత్రాన్ని తెల్సుకొని గొప్ప తపమాచరించాడు. దేవతల పంపున వచ్చిన శ్రీహరి వానికి విశిష్ట స్థానం ప్రసాదించాడు. తిరిగి పురానికి వచ్చిన ధ్రువుని అభిషిక్తుని చేసి ఉత్తానపాదుడు అడవులకేగాడు. ఒకనాడు ఉత్తముడు వేటకేగి మరణించాడు. భ్రాతృ మరణంతో కోపించి యక్షులను వధించాడు. స్వాయంభువు బోధలతో తేరుకొన్నాడు. కుబేరుని బోధతో శ్రీహరి నామస్మరణతో కాలం గడిపి పరమపథం చేరాడు.

అంగరాజు శ్రీహరిని పూజించి వేనుని పుత్రునిగా పొందాడు. పుత్రని దుశ్చర్యలు మాన్పలేక అంగరాజు రాజ్యం విడిచి వెళ్ళాడు. రాజ్యానికి వచ్చిన వేనుని పాలక కంటకమయింది. బోధించ వచ్చిన మునులను నిరాకరించి శాపానికి గురయి, మృతి చెందాడు. వాని తొడను మథించగా రాక్షసుడు జన్మించాడు. వాడిని అడవులకు పంపారు. భుజాల నుంచి అర్చి పృథువు జన్మించారు. ఈ ఇరువురి వివాహం వైభవంగా జరిగింది. ఇతని ప్రజారంజకమైన పాలనాకాలంలో క్షామం చెలరేగడంతో భూదేవిని గోవుగా ఉంచి మనువును లేగ దూడగా నిల్పి ఓషధులను పిదికాడు. రాజు శతాశ్వమేధాలు చేయనెంచాడు. తొంభై తొమ్మిది ముగిశాయి. శతమ క్రతువు అశ్వాన్ని ఇంద్రుడు ఎత్తుకుపోయాడు. వానిని చంపబోయిన పృధువుని బ్రహ్మాదులు చల్లార్చి శతయాగ ఫలాన్ని ఇచ్చారు. కొంతకాలం పాలన చేసి సతీసమేతుడయి భగవత్సన్నిధిని పొందాడు. విజితాశ్వుడు, వాని పుత్రుడు ప్రాచీన బర్హి రాజ్యాన్ని పాలించారు. బర్హి పుత్రుడు ప్రచేతనుడు తండ్రి అజ్ఞపై అడవికేగి ఈశ్వర సూచనపై శ్రీహరిపై మనస్సు లగ్నం చేశాడు. ఇట ప్రాచీన బర్హి వద్దకు నారదుడు వచ్చి శాంతి కలగడానికి యాగాలలో చేసిన బలుల కర్మ పోవడానికి జన్మాంతరాలలో ముక్తి పొందిన పురంజనుని కథ చెప్పాడు. ప్రచేతసులకు శ్రీహరి ప్రసన్నమై తన అంశ చేత పుత్రుడు కలుగుతాడని తెల్పాడు. ప్రచేతసుడు శ్రీహరి ఆజ్ఞపై సముద్ర తీరాన నిల్చి బ్రహ్మ ఆజ్ఞపై మారీషను వివాహమాడాడు. దక్షుడు జన్మాంతరాన వీరి పుత్రునిగా జన్మించాడు. భార్యను పుత్రుని వద్ద ఉంచి అడవికేగి జాబాలిని చూశాడు. నారదోపదేశంతో శ్రీహరిని కొలిచి ముక్తి పొందారు. ప్రచేతస వృత్తాంతానంతరం ప్రియవ్రతుని శక్తిసామర్థ్యాలు ముక్తి పొందిన విధానం తెల్పాడు. మైత్రేయుని వద్ద విని విదురుడు వెనుదిరిగాడు. తత్పుత్రుడు అగ్నిధ్రుడు బ్రహ్మ వరాన అప్సరస ద్వారా తొమ్మిది మంది పుత్రులను పొంది వారు పాలనకు రాగానే అప్సరసకై దైవలోకం చేరాడు. వాని పుత్రుని భార్య మేరుదేవి కోరికపై శ్రీహరి ఋషభుడుగా జన్మించాడు. ఋషభ పాలనకు తండ్రి అయిన

నాభి సంతోషించి అడవికి ఏగి అగ్నికి ఆహుతయ్యాడు. తరువాతి వాడు భరతుడు, పుత్రులకు రాజ్యాన్నిచ్చి అడవులకేగి ఒక లేడిని రక్షించి దానిపై మమకారం వీడక మరుజన్మలో లేడిగా తర్వాతి జన్మలో బ్రాహ్మణునిగా జన్మించాడు. అయినా శ్రీహరిపైనే మనస్సు పెట్టుకొన్నాడు. ఒక రాజు సంతాన కాంక్షకై ఈ బ్రాహ్మణుడిని కాళికి బలివ్వపోయి విఫలులై మరణించాడు. ఓ రాజు వానిని పరిహసించి వాని మాటలచే ప్రభావితుడయ్యాడు.

పిమ్మట శుకయోగి పరీక్షిత్తుకు నరకలోకాలను గూర్చి వివరించాడు. పరీక్షిన్మహారాజుకు కల్గిన పాప పుణ్యాలను గూర్చిన సందేహాలన్ని శుకమహర్షి శ్రీహరి పాదాశ్రయం వల్ల సర్వాన్ని తొలగిస్తుంది కలిగిస్తుందని అజామిళోపాఖ్యానాన్ని తెల్పాడు. కన్యాకుబ్జపురంలోని సర్వదుర్గణ శీలుడైన అజామిళుడు మరణ సమయాన పుత్రుడైన నారాయణుడిని తల్చుకొంటూ మరణించడంతో నేరుగా వైకుంఠం చేరాడు. విషయం భటుల ద్వారా విన్న యముడు విష్ణుతేజాన్ని వారికి తెల్పాడు. మారీష ప్రచేతసులకు దక్షుడు జన్మించాడు. తపం చేస్తున్న దక్షుని శ్రీహరి సాక్షాత్కరించి అసిక్ని అనే యువతిని భార్యగా ఇచ్చి ప్రాణకోటిని ప్రభవించమన్నాడు. దక్షుని పుత్రులు, బ్రహ్మ వరాన జన్మించిన వారందరూ నారదబోధతో విరాగులవ్వడంతో కోపించిన దక్షుడు ఏలోకంలోనూ వారికి స్థానం లేకుండా శపించాడు. తర్వాత పుట్టిన అరవైమంది పుత్రికలను యమ చంద్రాదులకిచ్చాడు.

ఒకనాడు వైకుంఠాన విష్ణువు విలాసంగా ఉండి, ప్రవేశించిన గురువు బృహస్పతిని ఆదరించలేదు. గురువు వెనుదిరిగి వెళ్ళాడని తెలిసి గురువును వెదుకుతూ వెళ్ళాడు. అప్పుడు చెలరేగిన దానవులను త్వష్ట ప్రజాపతి పుత్రుడైన విశ్వరూపుని ఆశ్రయించి గెలిచాడు. కారణాంతరాల వల్ల ఇంద్రుడు విశ్వరూపుని సంహరించడంతో కుపితుడయిన త్వష్ట ఇంద్రసంహారానికి వృత్రాసురుని సృష్టించాడు. విష్ణువు ఆదేశం మీద దధీచి వెన్నెముకను వజ్రాయుధంగా గ్రహించి ఇంద్రుడు వృత్రాసురుని చంపాడు. ఈ వృత్రాసురుడు విష్ణుభక్తి కల్గిన చిత్రకేతుడనే రాజు. పార్వతి శాపాన ఇలా జన్మించాడు.

శ్రీహరి వరాహ రూపాన హిరణ్యాక్షుని వధించాడని విని హిరణ్యకశిపుడు హరి భక్తులను పీడించసాగాడు. దుఃఖిత అయిన తల్లికి మరణం సృష్టి ధర్మమని బాలుని రూపాన యముడు తెల్పిన సుయజ్ఞుని కథను తెల్పి ఓదార్చి తపానికేగాడు. తపఃఫలంగా బ్రహ్మ నుంచి సాధారణ రీతుల్లో మరణం పొందకుండేటట్లు వరం పొందాడు. అతని విజృంభణకు దేవతలు శ్రీహరిని ఆశ్రయించారు. ప్రహ్లాదుడు హిరణ్యకశిపుని పుత్రుడు. హరిభక్తి పరాయణుడు. వాని దృష్టి విద్యపై నిల్పాలని ఎంత ప్రయత్నించినా ఫలితం లేకపోయింది. విష్ణుభక్తిని రూపుమాపడానికి చేసిన ప్రయత్నాలు అనుసరించిన హింసాత్మక చర్యలు నిష్ప్రయోజనమయ్యాయి. ప్రహ్లాదునిపై కుపితుడై ఈ స్తంభాన కలడా శ్రీహరి అంటూ దానిని బద్దలు చేయగా అందులోంచి నృసింహావతారాన శ్రీహరి ఉద్భవించి వానిని సంహరించాడు. ప్రహ్లాదుడు రాజయ్యాడు.

మయుని ఆశ్రయించి అసురులు బంగారు వెండి ఇనుములతో త్రిపురాలను నిర్మించుకొని వాటిపై తిరుగుతూ కల్లోలం సృష్టించసాగారు. శ్రీహరి సహకారంతో శివుడు త్రిపురాసులను నాశనం చేశాడు. పిమ్మట ధర్మనందనునికి నారదుడు ఆశ్రమ ధర్మాలను ప్రహ్లాద జగర సంవాదాన్ని తన పూర్వజన్మ వృత్తాంతాన్ని తెలిపాడు.

3. శుక మహర్షి పరీక్షిత్తుకు పద్నాలుగురు మనువులను గూర్చి తెలిపాడు. తామస మనువు వైవస్వత మనువుల కాలంలో శ్రీమహావిష్ణువు చేసిన లోకకళ్యాణం వివరించిన సందర్భంలో మన్వంతర లక్షణం వ్యక్తమవుతూ ఉంది.

శుకమహర్షి పరీక్షిత్తుకు పద్నాలుగురు మనువుల వృద్ధి చెప్పాడు. తామస మనువు కాలాన గజేంద్ర మోక్షం కలిగి ఇంది. గజరాజు తన గుంపుతో కూడి చెరువులో దిగగా మొసలి దానిని పట్టింది, సాధ్యమైనంత వరకు పోరు సల్పి శ్రీహరిని ప్రార్థించింది, ఏనుగు భక్తుని మొరవిని శంఖు చక్రాలనుకోక సరోవరం సమీపించి మొసలిని వధించాడు. పిమ్మట మొసలీ ఏనుగూ మోక్షం పొందాయి.

చక్షమనువు కాలంలో శ్రీహరి కూర్మావతారం ధరించాడు. అసురుల పీడనం భరించలేని సురులు శ్రీహరి సూచనపై క్షీరసాగర మధనానికి బలి చక్రవర్తిని అంగీకరింపచేశారు. కూర్మ రూపాన కుదురుగా శ్రీహరి నిల్చాడు. సాగరం నుంచి ఐరావతాది ఐశ్వర్యాలు జనించాయి. చివరగా అమృతం ఆవిర్భవించింది. విష్ణువు జగన్మోహిని రూపాన దానవులను ఉన్మత్తులను చేసి అమృతం సురులకిచ్చాడు. దానవులు దేవతలతో పోరి ఓడారు. కైలాసంలో ఉన్న శివుడు విష్ణువుని మోహిని రూపంలో చూడ వేడి, చూచి, తత్సౌందర్యానికి నిశ్చేష్టుడయ్యాడు.

వైవస్వత మనువు కాలంలో శ్రీహరి వామనావతారం ధరించాడు. అమృతాన్ని ఆస్వాదించిన దేవతలను దానవులు తరిమారు. సైన్యాన్ని కూర్చుకొని తగిన సమయం చూచి బలి చక్రవర్తి అమరావతిని చుట్టుముట్టి స్వాధీనం చేసుకొన్నాడు. దేవతల స్థితి మెరుగుకై అదితి ప్రార్థనపై ఆమె గర్భాన వామనునిగా శ్రీహరి జన్మించాడు. ఉపనయనానంతరం బలిని గూర్చి మూడడుగుల నేలను దానంగా అడిగాడు. శుక్రాచార్యుడు నివారిస్తున్నా వినక బలి అంగీకరించగా తన విశ్వరూపంతో శ్రీహరి భూలోక స్వర్గలోకాలను ఆక్రమించాడు. మూడో అడుగుకు బలి తన శిరస్సు చూపాడు. బలి చక్రవర్తి పత్ని, ప్రజాపతి మొదలయిన వారి వేడికోలుపై అనుగ్రహించి సుతలమిచ్చి అమరావతిని ఇంద్రునికిచ్చి వైకుంఠం చేరాడు.

కల్పాంత వేళ సత్యవ్రతుడనే రాజు హరికై తపస్సు చేయసాగాడు. తటాకంలోని నీటిని అర్పణ చేసే నీటిలో మీనం ఒకటి వెలువడి రక్షించమంది. నిత్యం రూపు మారుస్తూ ఎదుగుతున్న ఆ చేపను శ్రీహరి రూపంగా గ్రహించి కారణం అడగగా యుగ సమాప్తి కానున్నదని ఓషధీతతులతో ముని సంఘాలతో తాను పంపే నావలో రక్షణ పొందమన్నాడు. ప్రళయం సంభవించి యుగాంతమయింది. నావలోని సత్యవ్రతునకు శ్రీహరి పురాణ సంహితను ఉపదేశించాడు. తిరగి సృష్టి ఆరంభమయింది. అటు పిమ్మట పరీక్షిత్తుడు

సూర్యవంశారంభాన్ని ప్రముఖుల చరితను తెల్పాడు. అంబరీషుడనే రాజు శ్రీహరి భక్తుడు. ఒకనాడు ద్వాదశి వ్రతం చేసి వ్రతఫలం చెడకుండడానికై ఆహ్వానితుడయిన దుర్వాసుడు రాకమునుపే జలపానం చేశాడు. ఈ విషయం తెలిసి క్రోధంతో దుర్వాసుడు రాక్షసిని సృష్టించాడు. అది అంబరీషుడుని చంపకమునుపే సుదర్శన చక్రం దానిని చంపి దుర్వాసుని వెంట పడింది. దానిని అంబరీషుడు శాంతింప చేశాడు. పిమ్మట శుకుడు ఇక్ష్వాకువంశ క్రమాన్ని గంగను భగీరథుడు భువికి దింపిన వృత్తాంతాన్ని, రామచరితను, భవిష్యద్రాజుల వృత్తాంతాన్ని తెల్పాడు. చంద్ర వంశారంభాన్ని తెల్పాడు. ఋచికుని తపఃఫలాన తల్లీ కూతుళ్ళకు భిన్న వైఖరులు కలిగిన పుత్రులు జన్మించడం వివరించాడు. మునిపుత్రునిగా జమదగ్ని వాని పుత్రునిగా క్షత్రియ లక్షణాలు గల పరుశురాముడు, క్షత్రియ వంశాన విశ్వామిత్రుడు జన్మించి రాజర్షి మహర్షి కావడం వివరించాడు. తర్వాత ఆ వంశాన చెప్పుకోదగిన చరిత్ర కల్గిన వ్యక్తి, యయాతి. యయాతి దేవయానిని వివాహమాడడం; దేవయాని సేవకు నియుక్తురాలయిన శర్మిష్ఠపై యయాతి మరలుగొవడం, శుక్రాచార్యునితో శాపం పొందడం, ఆ శాపాన్ని పుత్రుడు పొంది వాని యౌవనం యయాతికివ్వడం, పిమ్మట శ్రీహరి ధ్యానంలో కాలం గడపడం వివరించాడు. చంద్రవంశజుడైన దుష్యంతుడు వేటకేగి మేనక కుమార్తె అయిన శకుంతలను గంధర్వ వివాహం చేసుకొన్నాడు. తిరిగి రాజ్యానికేగాడు, పుత్రవతి అయిన శకుంతల భర్త నుంచి పిలుపు రాకపోవడంతో కణ్వుడు రాజ్యసభకు పంపాడు. వారిని గుర్తించని దుష్యంతుడు అశరీరవాణి పలుకులను గ్రహించాడు. వీరి వంశాన జనించిన రంతిదేవుడు తన దాన గుణానికి పేరుగాంచాడు. ఈ వంశాన పాండవ కౌరవాదులు జన్మించారు. పిమ్మట ఋష్యశృంగుని వ్రతభంగం, యదువంశ చరిత్రను, వసుదేవుని వంశక్రమాన్ని వివరించాడు.

4. భాగవతంలో పరీక్షిత్తు కోరిక మేరకే కృష్ణ మాహాత్మ్యం చెప్పినట్లు స్పష్టమవుతుంది కాని, భాగవతమంతా కృష్ణుడి జీవితమే విస్తరించటం వాస్తవమే. శ్రీకృష్ణుని జీవితం, బాల్యం నుంచి మరణ పర్యంతం విశాల సాహిత్య రూపం పొందింది. భాగవతం ప్రధానంగా కృష్ణుని జీవిత ప్రదర్శనంగానే కనిపిస్తుంది. శ్రీకృష్ణుని జననం, బాల్యం, బాల్య చేష్టలు, శ్రీకృష్ణుని అద్భుతాలు, రాక్షస సంహారం, కంసుడి కపటోపాయాలు, శ్రీకృష్ణుడు కంసుని చంపటం, జరాసంధుడితో వైరం, అష్టమహిషీ కళ్యాణం, పుత్రులు కలగటం, నరకుణ్ణి సంహరించటం, పదహారు వేలమంది స్త్రీలతో శ్రీకృష్ణుడు అనురాగంతో జీవించటం, భీమసహాయంతో జరాసంధుణ్ణి చంపటం, కుచేలుని చెలిమి వంటి విభిన్నమైన శ్రీకృష్ణుని జీవితాంశాలతో సాగిన రచన, యాదవ వంశంలో ముసలం పుట్టి తుదకందరూ శ్రీకృష్ణుడు కూడా మరణించడం దాకా ఉన్న జీవితమంతా విశాల కథా వైభవంతో విలసిల్లింది.

ఈ కథాభాగం దర్శించినప్పుడు పురాణ లక్షణమయిన శ్రీకృష్ణ వంశలక్షణం అభివ్యక్తమయిందని స్పష్టమవుతుంది. శ్రీకృష్ణ వంశం కంటే శ్రీకృష్ణ జీవితమే అభివ్యక్తమయిందని భావించినా తప్పులేదు. అందువల్ల భాగవతంలో శ్రీకృష్ణ జీవితం అభివ్యక్తం అయిన కథాప్రణాళిక ఆవశ్యం దర్శింపవలసి ఉంది.

పరీక్షిత్తు కోరికపై శుకమహర్షి కృష్ణ మాహాత్మ్యాలు చెప్పసాగాడు. దేవకీ వసుదేవుల వివాహానంతరం వారి అష్టమ పుత్రుని కారణాన తనకు మరణముందని తెలిసి కంసుడు వారిని చంపబోయి, వసుదేవుని కోర్కెపై ఆగి వారిని బంధించాడు. మాట ప్రకారం తెచ్చిన వసుదేవుని పుత్రుని చంపక అష్టమ గర్భం కావాలన్నాడు. కాని నారదుడు ద్వారా శ్రీహరి దేవకీ గర్భాన జన్మిస్తాడని తెల్సి పుట్టిన అందరినీ చంపసాగాడు. దేవకీ ఏడో గర్భం విష్ణుమాయతో రోహిణీ గర్భాన బలరామునిగా జనించింది. దేవకీ ఎనిదో గర్భం గురించి విని భీతిల్లాడు కంసుడు. బ్రహ్మాదులు నుతించారు. జనించిన పుత్రుడిని దేవకి స్తుతించింది. వసుదేవుడు దేవసహాయాన యమున దాటి బిడ్డను యశోద ప్రక్కనుంచి ఆమె కూతురును దేవకీ పక్కనుంచాడు. ప్రసవ వార్త విని కంసుడు శిశువును చంపబోగా విష్ణుజననాన్ని తెల్పి మాయమయింది. దేవకీ వసుదేవులను విడుదల చేసి పసిపిల్లలను చంపమని ఆజ్ఞాపించాడు.

నందవనంలో నందుడు పుత్రోదయంతో సంతసించి గారాబంగా పెంచసాగాడు. కంసుడు పంపగా వచ్చిన పూతన కృష్ణునికి పాలిచ్చి చంపబోయి కృష్ణుని చేతిలో మరణించింది. యశోద కృష్ణ వేడుకల్లో దానాలు చేస్తుండగా ఆకలిగా ఉన్న కృష్ణుడు తన కాలితో దగ్గరిలో ఉన్న బండిని తన్నడంతో అది ఆకాశానికేగి తునాతునకలయింది. ఒకనాడు యశోద బిడ్డకు పాలిస్తూ బరువనిపించడంతో దింపింది. ఆ సమయాన తృణావర్తుడనే రాక్షసుడు సుడిగాలిలా వచ్చి కృష్ణుని ఎత్తుకు పోయాడు. కృష్ణుని బరువుని మోయలేక బాధపడుతూ కృష్ణుడి చేతిలో మరణించాడు. వసుదేవుడు పంపగా వచ్చిన గర్గు, రోహిణి యశోద పుత్రులకు బలరామకృష్ణులని నామకరణం చేశారు. వీరు క్రమంగా పెరిగి అడుగులెయ్యసాగారు. ఒకనాడు గోపవనితలు వచ్చి యశోదకు శ్రీకృష్ణుని వెన్నదొంగతనాన్ని గూర్చి చెప్పారు. ఇల్లు కదలని తన కుమారుని చూపి వారిని నిలదీయడంతో వెనుదిరిగిపోయారు. యశోద మందలించగా కృష్ణుడు తన నోరు చూపాడు. అందులో బ్రహ్మాండాన్ని చూచి యశోద చకితురాలయింది.

ఈ యశోదానందులు ద్రోణుడనే వసువు అతని పత్ని ప్రజాపతి కోరికపై భూలోకాన జన్మించారు. పని చేసుకొంటున్న యశోద ఆకలిగొన్న కృష్ణునికి పాలిచ్చి అతడి ఆకలి తీరకనే దించివేసింది. కోపించిన కృష్ణుడు ఉట్టిలోని వెన్న తినడం చూచి వాని అల్లరి భరించలేక రోలుకు. కట్టి వేసింది యశోద. నారద శాపాన మద్దిచెట్లుగా మారిన నలకూబర మణిగ్రీవుల మధ్యగా దాన్ని ఈడ్చి వారికి శాపవిమోచనం కలిగించాడు.

కంస బాధల నుంచి తప్పుకోవడానికి కొంత కాలం బృందావనానికి నందాదులు వెళ్ళారు. అట కృష్ణుడు పిల్లలతో ఆడుకొండున్న చోటుకి లేగదూడలా వచ్చిన వృత్తాసురుని చెరువు గట్టున బకాసురుని, తనను మింగిన కొంగని, కొండచిలువలా వచ్చిన అఘాసురిని చంపాడు. గోపాలురతో కలిసి చల్దులు తింటుండగా గోవులు; వాటిని వెదకబోయిన గోపాలుడు మాయమవ్వగా ఇది బ్రహ్మమాయ అని తెల్సుకొని తన మాయతో అందరిని వారింటికి చేర్చి బ్రహ్మస్తుతిని పొందాడు. ఒకనాడు అందరూ తాలవనానికేగగా ధేనుకాసురుడు గాడిద రూపాన వస్తే బలరామకృష్ణులు చెట్లకు మోది చంపారు. కృష్ణుడు స్నేహితులతో

కలసి కాళింది వెళ్ళాడు. అలసిన అందరూ కాళింది నీరు త్రాగి మృతి చెందారు. వారిని పునర్జీవితులను చేసి మడుగులో దూకి కాళిందిని మర్దించగా, చచ్చిన వాడిలా ఉన్న పతిని చూచి, కృష్ణుడిని అతని పత్నులు స్తుతించి పతి ప్రాణాన్ని పొందారు. ఆ రాత్రి కాళింది ఒడ్డున నిద్రిస్తుండగా అనలం గోప గోపికా గణాన్ని చుట్టుముట్టింది. వారి ప్రార్థనపై కృష్ణుడు పానం చేశాడు. క్రమంగా గ్రీష్మం ప్రవేశించింది. గోపాలురంతా క్రీడామత్తులై ఉండగా ప్రలంబుడనే రాక్షసుడు హంసరూపాన వచ్చిన సంగతి కృష్ణుని ద్వారా విని బలరాముడు దానిని వధించాడు.

కృష్ణుడు ఎన్నో బాల్య చేష్టలు చేస్తూ ఉండగా, గోపికలంతా కాత్యాయనీ వ్రతం చేసి కృష్ణుని భర్తగా పొందాలని కోరారు. గోపికా వస్త్రాలను అపహరించి వారి వేడుకపై తిరిగి ఇచ్చి వారి కోర్కెలు ఫలియస్తాయన్నాడు. ఆకలి గొన్న గోపాలురను ముని పత్నుల వద్ద ఆహారాన్ని పొందమన్నారు. కృష్ణరాక ఎరిగి ముని పత్నులు వచ్చి చూశారు. కాని కంసభీతితో మునులు మాత్రం రాలేకపోయారు.

నందాదులు కృష్ణ సూచన మేరకు ఇంద్రునికి కాక గిరిద్విజులకు పూజచేసి వెనుదిరిగాడు. కోపించిన ఇంద్రుడు కురిపించిన రాళ్ళ వర్షం నుంచి గోవర్ధనగిరి ఎత్తి నిల్పి అందరినీ కృష్ణుడు రక్షించాడు. నందుని వరుణుడు నందుని వరుణుడు ఎత్తుకుపోయిన విషయం తెలిసి తిరిగి విడిపించాడు. శరద్రాత్రితో తన వేణుగానానికి మైమరచి వచ్చిన గోపికలతో ఆడి విరహాన్ని కలిగించి రాసక్రీడలు సల్పి పంపాడు. అంబికా వనానికి జాతరకేగి అక్కడ పామురూపంలో ఉన్న సుదర్శనకు శాపవిమోచనం కలిగించాడు. బలరామకృష్ణ రక్షణలో ఉన్న గోపికలను ఎత్తుకు పోవటానికి యత్నించిన శంఖచూడుడనే రాక్షసుడు, హరికరిష్టం చేయ దాడి చేసి వృషభాసురులు, వారి చేతిలో మరణించారు.

నారదుడొకనాడు బలరామకృష్ణులు యశోద కూతురిని గూర్చి చెప్పడంతో కుపితుడయిన కంసుడు దేవకీ వసుదేవులను బంధించి బలరామకృష్ణులను వధించడానికి కేశి వ్యోముడనే రాక్షసులను పంపాడు. వారు కృష్ణుని చేతిలో మృతి పొందారు. కంసుడు అక్రూరుని పిలిచి యాగం పేరిట రామకృష్ణులను తీసుకొని రమ్మన్నాడు. కంసుని పంపున వచ్చిన అక్రూరుడు రామకృష్ణులతో కూడి తిరిగి ప్రయాణమయి మధుర యాగానికి చేరారు. అట తమపై ఉరికిన కువలయా పీడనం అనే మత్తగజాన్ని కృష్ణుడు చంపాడు. వారిపై పోరుకు సిద్ధమయిన మల్లయుద్ధవీరుడు చాణూరునితో పోరి బలరామకృష్ణులు వాడిని వధించారు. దీనితో ఉద్రిక్తుడయిన కంసుడు ఉగ్రసేన వసుదేవులను చంపమనడంతో కృష్ణుడు కంసుని పైకి ఉరికి వధించాడు. ఉగ్రసేనుని రాజుగా చేసిన అనంతరం గురుదక్షిణగా బందీ అయిన గురుపుత్రుని విడిపించి వాళ్ళు నగరం చేరారు. ఉద్ధవునితో గోపకాంతలకు సమయాన లేపనాదులిచ్చిన కుబ్జ ఇంటికి ఉద్ధవునితో కూడి వెళ్ళి ఆమెకు తృప్తి కలిగించాడు. పిమ్మట అక్రూరుని ఇంటికేగి పాండురాజు వియోగంలో ఉన్న కుంతి, పుత్రులను చూచి రమ్మన్నాడు. అక్రూరుడు హస్తినాపురం చేరి ధృతరాష్ట్రునికి హితోపదేశం చేసి తిరిగి మధుర చేరాడు.

కంస భార్యలు భర్తను కోల్పోయి, తండ్రి అయిన జరాసంధుని వద్దకేగి జరిగింది చెప్పారు. కోపంతో మధురపై దండెత్తి వచ్చి జరాసంధుడు ఓడాడు. తిరిగి జరాసంధుడొక ప్రక్క, నారద ప్రేరణతో వచ్చిన కాలయవనుడు మరో ప్రక్క దాడి చేయడంతో కృష్ణుడు పురజనులకు కష్టాలు రాకుండడానికి విశ్వకర్మ చేత ద్వారకను సముద్ర మధ్యన నిర్మింపచేశాడు. నగర వాసులందరినీ అందులో ఉంచి కృష్ణుడు నిరాయుధుడై కాలయవనుని ఎదుర్కొన్నాడు. పట్టుకోబోగా కాలయవనునకు దొరకక పరిగెత్తి ఒక గుహలో దాగాడు. అట రాక్షస సంహారానంతరం దేవతల వరప్రసాదాన గాఢ నిద్రలో ఉన్న ముచికుందుని చూచి కాలయవనుడు కాలితో తన్నాడు. మేల్కొన్న ముచికుందుని చూపులకు భస్మమై పోయాడు. శ్రీహరిని గుర్తించిన ముచికుందుడు స్తుతించాడు.

తిరిగి మధుర వచ్చి బలరామునితో కూడి భయపడిన వాడిలా పరుగు తీసి ప్రవర్షణగిరి ఎక్కాడు. జరాసంధుడు వారెక్కడ ఉన్నరో తెలియక నిప్పంటించి మరణించారని భ్రమించాడు. కొండపై నుండి దూకి ఇరువురూ ద్వారకకు చేరారు. బలరాముడు రైవతుని పుత్రి రేవతిని పెండ్లాడాడు. విదర్భరాజా ఆరవ సంతానం రుక్మి. రుక్మిణి తన చెల్లెలి పెళ్ళి శిశుపాలునితో నిర్ణయించాడని రుక్మిణి దూత ద్వారా విని, కృష్ణుడు గౌరీ పూజకు ఆలయానికి వచ్చిన రుక్మిణిని ద్వారకకు తెచ్చాడు. అడ్డుపడి అవమానితుడయిన రుక్మిని గురించి దుఃఖిస్తున్న రుక్మిణిని బలరాముడు ఓదార్చాడు. ద్వారకలో వీరి వివాహం వైభవంగా జరిగింది.

శివకోపాన భస్మమయిన మన్మథుడు ప్రద్యుమ్నునిగా రుక్మిణి గర్భాన జన్మించాడు. వీనిచే తనకు మరణం సంభవించునున్నదని గ్రహించిన శంబరాసురుడు వానిని సముద్రంలో వేయగా జాలరులు వానిని మాయరూపాన శంబరాసుర సతిగా ఉన్న రతికి ఇచ్చారు. పెద్దవాడయిన, మాయవిద్యలు నేర్చిన ప్రద్యుమ్నుడు శంబరాసుని చంపి రతితో కూడి ద్వారక చేరాడు నారదుని వలన పుత్రునిగా రుక్మిణి అతనిని తెలుసుకొంది.

శ్యమంతకమణి ధరించిన సత్రాజిత్తు నగరానికి రాగా కృష్ణుడు ఆ మణి కోరి నిరాకరణ పొందాడు. ఆ మణి ధరించి వేటకేగిన సత్రాజిత్తు సోదరుడు సింహం పాలిబడి మరణించగా, ఆ మణిని జాంబవంతుడు పుత్రిక ఉయ్యాలకు కట్టాడు. తనపై వచ్చిన నిందను పోగొట్టడానికి కృష్ణుడు అడవికేగి విషయం గ్రహించి జాంబవంతుని ఓడించి మణిని తత్పుత్రికను పొందాడు. సత్రాజిత్తు ఆ మణిని చూచి సంతసించి మణియుత సత్యభామను కృష్ణునికివ్వ చూడగా మణిని నిరాకరించిన శ్రీకృష్ణుడు సత్యను గ్రహించాడు. సత్యభామను ఆశించిన శతధన్వుడు ఆడినమాట తప్పిన సత్రాజిత్తును చంపి మణిని పొంది వెన్నంటే కృష్ణుని నుంచి తప్పించుకునే మార్గం లేక మణిని అక్రూరునికిచ్చాడు. కృష్ణుడు శతధన్వుణ్ణి చంపి అక్రూరుని వద్ద ఉన్న మణిని సభలో చూపి అతనికే ఇచ్చాడు.

శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థం ఏగి పాండవులను చూచి అచట కొంతకాలం ఉన్నాడు. కాళింది మిత్రవింద నాగ్నజితి భద్ర లక్షణ అనే రాజకన్యలను వివాహం ఆడాడు. నరకుని చంపి పదహారు వేలమందిని వివాహం చేసుకొన్నాడు. ఈ నరకుడు భూదేవి పుత్రుడు.

నరకునిపై దండెత్తుతున్న కృష్ణునితో సత్యభామ కూడా ఏగి నరకాసుర వద్ధకు సహకరించింది. దేవతలు సంతోషించారు. ఆ దేవేంద్ర వనంలో విహరించే వేళ సత్యభామ కోరిన పారిజాత వృక్షాన్ని అన్ని అడ్డంకులు తొలగించుకొని ద్వారకకు తెచ్చాడు.

విలాసవేళ రుక్మిణితో విరసోక్తులాడి దుఃఖిత అయిన రుక్మిణిని ఓదార్చాడు. రుక్మిణి తదాదులురు పుత్రవతులయ్యారు. రక్మిణి పుత్రుడయిన ప్రద్యుమ్నుడు రుక్మి పుత్రికను ఎత్తుకొని వచ్చి వివాహం చేసుకొన్నాడు. రుక్మి మనమరాలిని ప్రద్యుమ్న పుత్రుడు అనిరుద్ధునితో వివాహ సమయాన బలరామునితో రుక్మి తదితరులు జూదమాడి ఓడి మృతి చెందారు.

బలి చక్రవర్తి ప్రథమ పుత్రుడు బాణుడు. భక్తితో శివుని మెప్పించి తనకు రక్షణగా నిల్పుకొన్నాడు. ఎదురులేక అసంతృప్తిగా ఉన్న బాణుని రథం జెండా నేలకొరిగిన నాడు ప్రత్యర్థితో తలపడాల్సి వస్తుందని శివుడు తెల్పాడు. వీని పుత్రిక ఉష, సౌందర్యరాశి. ఒకరాత్రి కలలో తాను చూచిన సుందరుడు అనిరుద్ధుడని చెలికత్తె చిత్రరేఖ లిఖించిన పటం ద్వారా గ్రహించింది. చిత్రరేఖ ఆ రాత్రి అతనిని తెచ్చి ఉష ఎదుట నిలిపింది. వారిరువురు స్నేహఫలంగా ఉష గర్భవతి అయింది. విషయం తెల్సిన ఆమె తండ్రి అనిరుద్ధునితో నాగపాశబద్ధుని చేశాడు. ఆ నాడే రథంపై జెండా నేలకూలింది. నారదుని ద్వారా విషయం విన్న కృష్ణుడు ప్రద్యుమ్నుతో కూడి బాణునిపై యుద్ధానికి ఏగి తీవ్రయుద్ధం చేసి చంపబోగా శివుడు స్తుతించడంతో శాంతించాడు. ఉషానిరుద్ధుల వివాహానంతరం ద్వారకకు చేరారు.

ప్రద్యుమ్నాదులు వ్యాహ్యాళికేగి బావి తవ్వగా వెలువడిన ఊసరవెల్లికి కృష్ణుడు శాపవిమోచనం కలిగించాడు. బలరాముడు బంధుజనంతో వ్రేపల్లెకు వచ్చి సుఖంగా ఉన్న రోజుల్లో కరూశరాజైన పౌండ్రక వాసుదేవుడు ద్వారకకు వచ్చి ఎక్కువగా వాగడంతో కోపించిన కృష్ణుడు యుద్ధాన వానిని హతమార్చాడు. వాని పుత్రుడయిన సుదక్షిణుడు అగ్ని హోత్రుని అనుగ్రహాన జ్వాలలతో ద్వారకను చుట్టుముట్టగా సుదర్శనంతో కృష్ణుడు దానిని చల్లార్చి వానిని హతమార్చాడు.

బలరాముడు ఎందరినో పరిమార్చాడు. నరకుని మిత్రుడయిన సుగ్రీవ మంత్రి ద్వివదుడు నరకుని మృతికి పరిహారం చేయదలచి యత్నించి మృతుడయ్యాడు. జాంబవతి పుత్రుడొకనాడు దుర్యోధన పుత్రిక లక్షణను అపహరించుకుపోతూ దుర్యోధనుని చేతిలో బందీ అయ్యాడు. ద్వారకకు విషయం తెల్సింది. బలరాముడు శాంతంగా పరిష్కరింప చూచి దుర్యోధనుని దూషణలకు గురై హస్తినను గంగలో కలపబూనాడు. కురువృద్ధులు క్షమను కోరిన మీదట శాంతించాడు. దుర్యోధనుడు లక్షణ సాంబులకు కానుకలిచ్చి పంపాడు.

కృష్ణుడు పదహారు వేలమందితో అనురాగపూరితంగా ఉన్నది చూచి నారదుడు స్తుతించి వెళ్ళాడు. ఒకనాడు జరాసంధుని చేత బంధింపబడిన రాజుల తరపున ఒక విప్రుడు కృష్ణుని వద్దకు వచ్చి కృష్ణ రాకకై వారి ఎదురు తెన్నులను చూస్తున్న విషయం

తెల్పాడు. నారదుడటు వచ్చి ధర్మరాజు రాజసూయయాగాన్ని గూర్చి చెప్పాడు. కృష్ణుడు ధర్మరాజు కడకేగాడు. నలుదిశలు జయించిన పిమ్మట భీమార్జునులతో విప్రవేషాన జరాసంధుని చేరాడు. కృష్ణుడు సంగ్రామం భిక్షగా కోరి భీముడు జరాసంధుని మల్లయుద్ధాన కృష్ణుని సూచనానుసారం నిలువనా చీల్చివేశాడు. బంధీలైన రాజులు విడుదలయ్యారు. రాజసూయా యాగాన అగ్రపూజ పొందమన్న కృష్ణుని శిశుపాలుడు దుర్భాషలాడి కృష్ణుని చేతిలో విగతజీవుడయ్యాడు. కృష్ణుడు ద్వారక చేరాడు. జరాసంధ శిశుపాల వధలు విన్న సాల్వుడు శివుని తపస్సుతో మెప్పించి కామగమనం గల సౌభక విమానం పొంది ద్వారకపై దండెత్తాడు. యదువీరులెవ్వరూ ఎదుర్కోలేక పోయారు. శ్రీకృష్ణుడే స్వయంగా వచ్చి, వానిని చంపాడు. మిత్రుని కొరకు దంతువక్త్రుడు, సోదరుని కొరకు విదూరథుడు దండెత్తి మృతి చెందారు.

కౌరవ పాండవుల వైరం పెరిగి అరణ్యాజ్ఞాత వాసానంతరం రాజ్యభాగం పొందలేని పాండవులు యుద్ధ సన్నద్ధులయ్యారు. బంధువుల నడుమ పోరు చూడలేక బలరాముడు తీర్థయాత్రలకేగాడు. అనేక తీర్థాలు దర్శించి ప్రధాన తీర్థం చేరి భీమ దుర్యోధనుల గదాయుద్ధం విని నివారించలేక నైమిశారణ్యం వెళ్ళి క్రతువు చేసి ద్వారక చేరాడు.

చిన్ననాట సాందీపుని వద్ద విద్యనభ్యసించిన కృష్ణునికి తోటివాడు కుచేలుడు. దారిద్ర్యంలో సంసారాన్ని గడుపుతూ భార్య మాటలపై కృష్ణుని చూడవెళ్ళాడు. బాల్యమిత్రుని సాదరంగా ఆహ్వానించి తనకు తెచ్చిన అటుకులు ఇవ్వడానికి సిగ్గుపడుతున్న కుచేలుని వద్ద నుంచి అడిగి తిని మిత్రునికి సర్వసంపదలు ప్రసాదించాడు కృష్ణుడు.

సుఖపాలనను నిర్వహిస్తూ కృష్ణుడు సంపూర్ణ చంద్రగ్రహణం రావడంతో యువకులకు రాజ్యరక్షణనిచ్చి అందరి తీర్థస్నానానికై శ్యమంత పంచక్షేత్రం చేరాడు. అక్కడికి వచ్చిన రాజులు కృష్ణుడిని దర్శించారు. కృష్ణుని అష్టమ భార్య లక్షణ ద్రౌపదికి కృష్ణుడు తననెలా వరించిందీ తెల్పింది. నారదవ్యాసాది మునులు కృష్ణుని దర్శించి, కృష్ణుని మాటపైన వసుదేవునితో క్రతువు చేయించారు.

ఒకనాడు దేవకి బలరామకృష్ణులకు తన పుత్రశోకం తెల్పడంతో వారు రసాతలానికేగి బలిని కోరి బ్రహ్మ శాపాన దేవకి పుత్రులుగా జన్మించిన వారిని తెచ్చి దేవకికి ఇచ్చారు. పిమ్మట వారికి కృష్ణుడు శాప విమోచనం కలిగించాడు. కృష్ణ సోదరి సుభద్రను బలరాముడు దుర్యోధనునికి ఇవ్వతలచాడు. యతిరూపాన నగరం ప్రవేశించిన అర్జునుడు సుభద్రపై మనస్సు కలిగి దేవకీ వసుదేవ కృష్ణులకు తెలిపి ఉత్సవానికి వెళ్తున్న సుభద్రను ఇంద్రప్రస్థానికి గొనిపోయాడు. కోపంతో యుద్ధానికి సన్నద్ధుడయిన బలరాముడిని కృష్ణుడు శాంతపరిచాడు. మిథిలలో రాజైన బహుళాశ్వుడు, విప్రుడయిన శ్రుతదేవులు పరమభక్తులు. నారదాది మునులు వెంటరాగా కృష్ణుడు మిథిలకేగి వారిని తరింపచేశాడు. పిమ్మట శుక్రుడు విరాట స్వరూపుని గూర్చి శ్రుతిగీతాల పేరిట ప్రసిద్ధమైన నిగూఢ విషయాన్ని తెలిపాడు. వృకాసురుడు సజ్జన హింస నిరంతరాయంగా సాగడానికై నారద సూచనపై శివుని ప్రార్థించాడు. ప్రత్యక్షమయిన శివునితో ఎవరి తలపై చేయి

పెడితే వారు భస్మమవ్వాలనే వరం పొంది ఆ పరీక్షకై శివునిపై చేయి పెట్ట యత్నించగా విష్ణువు వానిని మాయలోవుంచి తనకు తానే భస్మమయ్యేట్లు చేశాడు. ఒకప్పుడు సరస్వతీ నదితీరాన క్రతవు చేసే మునులలో త్రిమూర్తులలో శ్రేష్ఠులెవరనే మీమాంసను భృగు మహర్షి శోధించి విష్ణువని తేల్చాడు.

కుశస్థలిలో కృష్ణుడున్న రోజులలో ఒక విప్రుడు వరుసగా బిడ్డలను పుట్టినట్లే కోల్పోతుండడంతో, తద్రక్షణలో అర్జునుడు విఫలమవ్వడంతో కృష్ణుడు వారిని బ్రతికించాడు. ద్వారక చేరిన కృష్ణుడు వంశం పుత్రపౌత్రాభివృద్ధితో అలరారింది.

దుష్టశిక్షణకు మానవరూపం ధరించి కురుక్షేత్రాన దుష్టులను కడతేర్చిన కృష్ణుడు యాదవ సంహారోద్దేశంతో ఉన్నాడు. ఆ వార్త తెలిసి విశ్వామిత్ర వసిష్ఠాది మునులు కృష్ణుని దర్శించారు. అప్పటికి మదాంధులయిన యాదవులు సాంభుని యువతి వేషాన మునుల ముందు నిలిపి ఆ గర్భాన ఏ సంతతి కలుగుతుందని ప్రశ్నించారు. వారి నాటకం తెలిసి కోపించిన మునులు ఆ గర్భాన ముసలం పుట్టి యదువంశ నాశనం చేస్తుందన్నారు. వాని వస్త్రాల నుంచి ముసలం వెలువడగానే కృష్ణుడిని ఆశ్రయించారు. తత్సూచనపై పర్వతం పైన దానిని అరగదీసి సముద్రంలో కలిపారు. దానిలోని ఓ ముక్కను చేప మింగింది. చివరికది జాలరి బాణపుకొన అయింది.

కృష్ణుని చూడవచ్చిన నారదుడు విదేహార్షభ సంవాదాన్ని తెల్పాడు. విదేహుడు విప్రులను ఆదరించాడు. ఋషభ కుమారుడయిన కవి పరమార్థోపదేశం చేయగా; హరి అంతరిక్షుడు ఋషభ కుమారునికి భాగవత స్వరూపోపదేశం చేశాడు. ఋషభ కుమారులైన చమస కరభాజనులు చేసిన పరమార్థోపదేశాన్ని నారదుడు తెల్పాడు. బ్రహ్మాది దేవతలు కృష్ణుని వైకుంఠానికి రమ్మనగా, యదువంశ నాశనాంతరం అవతారం చాలిస్తానన్నాడు. ఆ సమయాన ద్వారకలో ప్రమాద సూచనలు కనిపించడంతో అందరిని ప్రభాస తీర్థానికి తరలించాడు.

జ్ఞాని అయిన ఉద్ధవునికి కలియుగం ప్రవేశించనుందని పరమార్థోపదేశం చేసి అవధూత యదు సంవాదాన్ని, కపోత బాధను, పింగళ చరిత్రను, భాగవత సేవలోని ఉత్కృష్టతను తెలిపి బదరికా వనానికి వెళ్ళారు. ద్వారకను రామకృష్ణులు విడిచి వచ్చే వేళకు ముసలం కలిపిన సముద్రపు అలలకు అందరూ మృతి చెందారు. అది చూచి బలరాముడు యోగమార్గాన అనంతంలో కలిశాడు. చెట్టు సమీపాన విశ్రాంతి తీసుకొంటున్న కృష్ణుని చలితపాదాన్ని జింకగా భావించి బోయవేసిన బాణానికి కృష్ణుడు ప్రాణం విడిచాడు. అవతార సమాప్తి మనువు అర్జునుని రప్పించి యాదవ స్త్రీ వృద్ధులను హస్తినకు తీసుకొనిపొమ్మని దారకునికి చెప్పి వైకుంఠం చేరాడు.

ఇంత వరకు పూర్వ వృత్తాంతాన్ని చెప్పిన శుకుడు భవిష్యత్తు పాలకులను గూర్చి, వారి పాలనా కాలాన్ని, యుద్ధ ధర్మాలను, ప్రళయాన్ని గూర్చి తెలిపి, చావు వలన భయం వద్దని చావు అనంతరం ఆత్మ పరమాత్మలో కలుస్తుందని పరీక్షిత్తుకు తెల్పి వెళ్ళాడు. పిమ్మట తక్షకుడు విప్రవేషాన పరీక్షిత్తును రక్షించవస్తున్న కశ్యపుని వెనుకకు పంపాడు. పరీక్షిత్తు తినబోయే పండులో జనించి సర్పం కాటు వేసింది.

తండ్రి మరణంతో కుపితుడయిన జనమేజయుడు సర్పయాగం చేసి సర్పనాశనం చేయసాగాడు. తక్షకాది సర్పాలు ఇంద్రుని శరణు కోరాయి. ఇంద్రునితో సహా సర్పాలను ఆహుతి చేయబోగా అంగీరసుడు వచ్చి శాంతింప చేసి యాగం సమాప్తం చేయించాడు. మునులకు సూతుడు వేదవ్యాసుని పురాణ సృష్టిని గూర్చి తెల్పి సంతుష్టులను చేసి కృతార్థుడయ్యాడు.

5. నిశితంగా పరిశీలిస్తే నారదుడు నారాయణమూర్తి అవతారాలు తెలిపినప్పుడు సర్గ ప్రతిసర్గలు, దశావతార వివరణంలో నారాయణమూర్తి వంశానుచరితం, శుకమహర్షి విభిన్న మనువుల కాలంలో జరిగిన శిష్టరక్షణ తెలిపిన దశల్లో మన్వంతరం, శ్రీకృష్ణుని జీవితం బాల్య మరణ పర్యంతం ప్రవచించినప్పుడు వంశం స్పష్టమయ్యాయని అందువల్ల పురాణ లక్షణాలు ప్రవర్తిల్లాయని భావించి, భాగవతం సంపూర్ణంగా పురాణ లక్షణయుక్తంగా ఉందని గుర్తించటం, సహజమే.

కాని, పురాణ లక్షణాలు ఆ క్రమంలో లేకపోవటం కాని, సర్గ ప్రతిసర్గ విశాల కథా ప్రణాళికను పొంది ఉండకపోవడం కానీ, దశావతారాలలో శ్రీకృష్ణుని అవతారమే ప్రముఖంగా రూపొందిందని కాని, విభిన్న మనువుల కాలంలో దశావతార లీలల ప్రసక్తి ఉంది కానీ, ప్రస్తావన లేదని కానీ, శ్రీకృష్ణుని జీవితమే ఉందని శ్రీకృష్ణవంశం లేదని కానీ, వంశానుచరితంలో నారాయణ వంశ పరిణామ క్రమం సంక్షిప్తంగా ఉందని కానీ, గుర్తిస్తే పురాణ లక్షణం ప్రవర్తిల్లటంలోని ప్రతిబంధకం స్పష్టమవుతుంది.

శ్రీకృష్ణుడు దశావతారాలలో ఒక అవతారమని భావిస్తే ఇది భగవద్విషయం అవుతుంది. పాండవుల పక్షంలో చేరి కౌరవుల్ని ఓడించిన రాజకీయ చతురుడుగా శ్రీకృష్ణుడిని భావిస్తే, అది చారిత్రక విషయమవుతుంది. భగవద్విషయమయితే అది పురాణ సంబంధిగానూ, చారిత్రక విషయమయితే అది ఇతిహాస సంబంధిగానూ భావించే దశ ఏర్పడుతుంది.

భాగవతంలో శ్రీకృష్ణుడు మహా మానవుడిగా కంటే మాధవుడుగానే కనబడుతూ ఉన్నాడు. భారతంలో రాజనీతి చతురుడుగా శ్రీకృష్ణుడు కనిపిస్తే కనిపించవచ్చు కాని భాగవతంలో అవతారమూర్తిగానే దర్శనమిచ్చాడు శ్రీకృష్ణుడు.

అందువల్ల శ్రీమద్మహాభాగవతం తెలుగులో, అనువాద రూపంలో కూడా మూలంలో మాదిరిగానే పురాణంగానే ఉంది. అది కావ్యంగా ఇతిహాసంగా గోచరమయ్యే ప్రమాదం శ్రీకృష్ణ ప్రాధాన్యం వల్ల ఏర్పడింది. దశావతారాలలో శ్రీకృష్ణుడి అవతారం ప్రత్యేక ప్రసిద్ధి పొంది ఉండటం వల్ల శ్రీకృష్ణుని గూర్చి భాగవతంలో విస్తృత కథా ప్రణాళిక గోచరమయింది. అందువల్ల కలిగే భ్రమ ప్రమాదాలు పరిహరించి భాగవతం పురాణమని అది పంచలక్షణ సమన్వితమని గ్రహించాలి.

3.2.3.2. భాగవత వస్తువ్యాప్తి : భాగవత వస్తువే హరివంశంగా, ఉత్తర హరివంశంగా రూపొందిన స్థితి సాహిత్యంలో ప్రముఖాంశమే. ఆ ప్రాముఖ్యం కారణంగా ఆ వస్తు పరిశీలనం ప్రత్యేకంగా జరగవలసి ఉంది. తెలుగు సాహిత్యంలో భాగవతానువాదం

తరువాత వెలువడ్డ హరివంశ పూర్వోత్తర భాగాలతో సంబంధం లేకుండా వేరు వేరుగా ఈ ప్రయత్నంలోనే పరిశీలనం పొందుతూ ఉంది.

పురాణాలలోని భాగవతం తెలుగు సాహిత్యంలో ప్రముఖంగా ఉంది. భాగవత వస్తువు అనంతరం, ప్రబంధ, కావ్య, యక్షగాన, నాటక సాహిత్యేతివృత్తాలుగా రూపొందింది. భాగవతంలోని భిన్న కథాంశాలు విభిన్న సాహిత్య ప్రక్రియలలో అవతరించాయి.

1. ప్రబంధాలలో ప్రధానంగా పేర్కొదగ్గది పారాజాతాపహరణం. దీనిని ముక్కుతిమ్మనగా ప్రసిద్ధుడైన నంది తిమ్మన వ్రాశాడు. శ్రీకృష్ణదేవరాయల అస్థానంలోని ఈ కవి అరణపు కవిగా, శ్రీకృష్ణదేవరాయల ఆంతరంగికుడుగా ప్రసిద్ధి పొందాడు. శ్రీకృష్ణునికి శ్రీకృష్ణదేవరాయలకు అభేదం ప్రతిపాదించే పారిజాతాపహరణం శ్రీకృష్ణదేవరాయల కుటుంబ జీవిత వ్యాఖ్యానంగా సంభావితమయిన సందర్భం గమనార్హం.

నరకాసుర వధానంతరం సత్యభామతో దేవేంద్ర వనంలో విహరించే సమయంలో ఆమె అక్కడున్న పారిజాత వృక్షాన్ని కోరటం, శ్రీకృష్ణుడు అన్ని అవాంతరాలు తప్పించుకొని, దాన్ని ద్వారకకు తేవటం భాగవతం నుంచి గ్రహించి, ఆ కథ పూర్వాపరాలు పెంచి, శృంగార రసమయం కావించి, అద్భుత ప్రబంధంగా తిమ్మన ఈకథాంశాన్ని తీర్చిదిద్దాడు.

శ్రీకృష్ణుని భార్యలలో రుక్మిణి సత్యభామలు ముఖ్యలు. ఏకాంతంలో రుక్మిణిని కూడి ఉన్న కృష్ణునికి నారదడు స్వర్గలోక పుష్పం పారిజాతాన్నివ్వగా, కృష్ణుడు దానిని రుక్మిణికిచ్చాడు. ఇది తెలిసి అలిగిన సత్యభామను అనునయించి, వామపాద తాడనం కూడా లెక్కించక ఆమెను ఓదార్చాడు కృష్ణుడు. మరునాడు ఇంద్రలోకం వెళ్ళి నరకుని వధించి తెచ్చిన కుండలాలు దేవమాత అదితికి ఇచ్చి సత్యభామకిచ్చిన మాట ప్రకారం పారిజాత వృక్షాన్ని పెల్లగించి అడ్డువచ్చిన ఇంద్రుని ఓడించి సత్యభామ పెరటిలో నాటాడు. నారదుని ఉపదేశంలో పుణ్యకవ్రతం చేసింది. వ్రతంలో భాగంగా పారిజాతాన్ని, కృష్ణున్ని నారదునికి దానం చేసి తిరిగి పొందింది.

2. భాగవతంలోని కథాంశం గ్రహించి రూపొందిన మరో ప్రబంధం పింగళి సూరన కృతమయిన ప్రభావతి ప్రద్యుమ్నం. ద్వ్యర్థికావ్యంగా రాఘవపాండవీయం, అద్భుత కథా నిర్మాణ చాతుర్య సంజనిత సాహిత్య సృష్టిగా కళా పూర్ణోదయం, సృష్టించిన కవి రసవత్తర ప్రబంధంగా రూపొందిన కృతి ప్రభావతీ ప్రద్యుమ్నం. ఇందులో శ్రీకృష్ణుడి కుమారుడయిన ప్రద్యుమ్నుడు ప్రభావతిని పెళ్ళాడటం కథాంశం.

దీన్ని ప్రబంధంగా మలచటంలో సూరన అద్భుత కల్పనా చమత్కృతిని ప్రదర్శించాడు. ఇది హరివంశ కథాశ్రయమని కవి చెప్పి ఉండకపోతే స్వతంత్ర కల్పనగా భావించేంత విశిష్టంగా సాగిన సృష్టి. మూడు జన్మల కథను ముడి·పెట్టటంలో మనుష్య ప్రవృత్తిని రసవంతంగా మలచటంలో పక్షుల పాత్ర చిత్రణలో పరమాద్భుత రమణీయ దర్శనం చేయటంలో సూరన సాహితీ శూరుడే.

3. పారిజాత కథా సూత్రం అనేక కావ్యసృష్టికి దోహదం చేసింది. కృష్ణాధ్వరి, నారాయణతీర్థులు సిద్ధేంద్రయోగి క్రమంగా 'నైషధ పారిజాతం' 'పారిజాతం'కావ్యాలుగా

మలచారు. సిద్ధేంద్రయోగి పారిజాత కథను భామా కలాపం పేరిట రచించాడు. ఈ ఇతివృత్తమే క్రమంగా కలాపం పేరుతో ప్రసిద్ధమయింది. 'భామా కలాపమయిన పారిజాత కథ సత్యా స్వప్న కథనమున నిమిడిపోయినది. గ్రంథమంతయు నామె వలవంత, కల, కలత నిదుర, చెలికత్తెతో సొద వెళ్ళబోసి కొనటయు, నాయకునితో నామె రాయబారములు, సంవాదములు జివర రుక్మిణితో సవతి కయ్యము యిందలి ప్రధాన విషయములు'.(27)

రాధా మాధవ నాటకం పేరుతో బళ్ళ సీతారామరాజు 1906 ప్రాంతంలో వ్రాసిన యక్షగానం 'ప్రక్రియయంతయు భామా కలాపమునందలిదే' (28) అనిపించేట్లు రచితమయింది. 1906లో భమిడిపాటి అప్పకవి పారిజాత వృత్తాంతాన్నే భామాకలాపం పేరుతో రూపొందించాడు.

పారిజాత కథా ప్రణాళిక పలువురు యక్షగాన కవుల్ని ప్రభావితం చేసింది. వేణుగోపాల నాటకం అని పారిజాత కథని గరిమెళ్ళ వెంకటజోగి రచించాడు.

పారిజాత వృక్షాన్ని శ్రీకృష్ణుడు నందనోద్యానం నుంచి పెకలించి తీసుకొని రావటం ఇతివృత్తంగా కృష్ణ ప్రాధాన్యంతో పారిజాతాపహరణమని 1700 ప్రాంతంలో శ్రీ నారాయణతీర్థులు, అదే పేరుతో తరిగొండ వెంగమాంబ, 18వ శతాబ్ది ఉత్తరార్థంలో ఆపేరుతోనే మాతృభూతకవి, యక్షగానాలు వ్రాశారు.

యక్షగానమే నాటకం పేరుతో అవతరించటమూ జరిగింది. జ్యోతిరామయ్య విరచించిన పారిజాత నాటకం ఈ దృష్టినే స్పష్టం చేసింది.

ఈ కథా సూత్రం గ్రహించి 1813లో భారతి రామరాజు వచన సాహిత్యం 'పారిజాతం' పేరిట లిఖించాడు. 19వ శతాబ్ది పూర్వభాగాలలో చల్ల నారాయణ కవి పారిజాత కావ్యం వ్రాశాడు. ఈ పేరుతోనే పులిజాల లక్ష్మినారాయణ కవి కావ్యనిర్మాణం చేశాడు.

పారిజాత కథాంశంలోని నాటకీయత గుర్తించిన సాహితీమూర్తులు దీన్ని నాటకంగా కూడా మలచారు. ఆధునికాంధ్ర నాటక సాహిత్యంలో నాదెళ్ళ పురుషోత్తమ కవి, చిలమర్తి లక్ష్మీనరసింహకవి, మారేపల్లి రామచంద్రశాస్త్రి పారిజాత వృత్తాంతం నాటకాలుగా వ్రాశారు. ఈ సాహిత్య సృష్టికి తిమ్మన నాటకీయంగా వ్రాసిన పారిజాత ప్రబంధమే ప్రేరణంగా భావింపవచ్చు.

4. భాగవతమే అనంతర కాలంలో విభిన్న దృక్పథాలతో వెలువడింది.

వెల్లంకి తాతంభట్టు రచించిన సంక్షేప భాగవతం అలభ్యంగా ఉంది. అసమగ్రంగా లభిస్తున్న దోనూరి కోనేరునాథుడు రచించిన 'బాలభాగవతం' కృష్ణుని బాల్య చేష్టలకు మాత్రమే సంబంధించింది కాదు. పోతన రచించిన మహాభాగవతానికిది సంగ్రహ రూపం. పోతన భాగవతం తల్లి అయితే దాని సంగ్రహరూపమైన పిల్లభాగవతం కోనేరు నాథునిది. దీనిని ఇతడు పద్య భాగవతంగా ద్విపద భాగవతంగా రచించాడు. ద్విపద భాగవతం చివర 45 పురుషాంతరాలు వంశ చరిత్రను వర్ణించాడు. భాగవతము

వెంకమాంబ రచించింది. 'శ్రీ విష్ణు భాగవతమునకు ద్విపద రూపమగు తెలుగు సేత' (29)గా దీన్ని పండితులు గుర్తించారు. పోతరాజు గ్రంథాన్ని అనుసరించి టేకుముళ్ళ రంగశాయి ద్విపదలోని 'భాగవతము' రచించాడు. అయితే సంపూర్ణంగా లభ్యం కావటం లేదు. '...ద్విపద భాగవతం నేడు పూర్తిగా దొరకడం లేదు. నాలుగు స్కంధాలు మాత్రమే లభిస్తున్నాయి' (30) అని విమర్శకులు గుర్తించారు. 1660 ప్రాంతాలలో కట్టా వరదరాజు రచించిన 'పరమ భాగవతచరిత్ర' ఎనిమిది ఆశ్వాసాల కావ్యం అని అంచనా. ఇందులో లభ్యమయ్యేవి రెండు ఆశ్వాసాలు మాత్రమే. హరిభక్తులైన 14 మంది పరమ భాగవతుల కథ ఇది. పుండరీకరుక్మాంగద చరిత్రలు మాత్రమే లభిస్తున్నాయి. 14 మంది భాగవతులు - ప్రహ్లాద, నారద, పరాశర, పుండరీక, వ్యాస, అంబరీష, శుక, శౌనక, భీష్మ, దాల్భ్యాయన, రుక్మాంగద, అర్జున, వసిష్ఠ, విభీషణులు.

ఇతనే కాక 1674 ప్రాంతాలకు చెందిన గణపవరపు వెంకటకవి, 1730 ప్రాంతాలలో జీవించిన, ఆలూరి కుప్పన్న, 1750 ప్రాంతాల వాడైన శృంగార కవి తిరుమలనాథుడు భాగవతుల చరిత్రలు రచించారు. ఇవన్నీ అలభ్యాలే. భాగవతులలో ప్రసిద్ధుడయిన రుక్మాంగదుని చరిత్రను ద్విపద కావ్యంగా చదలవాడ మల్లన, దర్భావేంకటగిరి రచించారు. 18వ శతాబ్దానికి చెందిన కుందుర్తి వెంకటాచలం భాగవతాన్ని వచన కావ్యంగా రాశాడు. అక్కయ కవి భాగవత గాథను దృశ్యకావ్యంగా రచించాడు.

5. దశావతార కథలు : భీమన్న రచించిన దశావతార పద్యం ఒకటి లభ్యమవుతూ ఉంది. కాని అది ఏ కావ్యంలోనిదో తెలియటం లేదు. 1600 ప్రాంతాలకు చెందిన ధరణిదేవుల రామయ్య 'దశావతార చరిత్ర' అనే పది ఆశ్వాసాల కావ్యం విశృంఖల శృంగారంతో రచించాడు.

విజయ రాఘవ నాయకుడు కాళియమర్దనం, పూతన హరణం, ప్రహ్లాద చరితను యక్షగానాలుగా రచించాడు. కందుకూరి వీరేశలింగం పంతులు, ధర్మవరపు కృష్ణమాచార్యులు 'ప్రహ్లాద'ను చిలకమర్తి కృష్ణమాచార్యుడు 'ప్రహ్లాద చరిత్ర'ను ఫణిహారం శేషాచార్యులు 'ప్రహ్లాద చరిత్ర'ను రచించారు. 'ప్రత్యక్ష నారసింహం'ను శ్రీ జయంతి భావనారాయణ, 'వామన నాటకం' టేకుముళ్ళ లక్ష్మిబాయమ్మ లిఖించారు.

6.1. శ్రీకృష్ణుని శృంగార జీవితం కూడా పలువురు కావ్యనాటకాలుగా, వ్రాశారు. అష్టమహిషిత్వం శ్రీకృష్ణుని ప్రత్యేకత. వీరిని వివాహం చేసుకోవడం కావ్యాలుగా రూపొందాయి. రుక్మిణితోడి కళ్యాణం విశేష ఆకర్షణ గుణం కలిగి ఉండడం దానిని పలువురు కావ్యాలుగా రూపొందించడానికి కారణం. ఇదే ఇతివృత్తాన్ని 'రుక్మిణీ కళ్యాణం' అని అత్తాను రామానుజాచార్యులు 'రుక్మిణీ పరిణయం' అని కూచిమంచి తిమ్మయ్య, సత్యవోలు భగవంతం; 'రుక్మిణీకృష్ణ వివాహం' అని రఘునాథ నాయకుడు రచించారు.

కృష్ణుడు మత్స్య యంత్రాన్ని ఛేదించి లక్షణను వివాహమాడడం లోకేరావు సోమన 'లక్షణా పరిణయం' లోని కథ. అష్ట మహిషులలో ఒకటి సుదంత, 'సుదంతా కళ్యాణం' వెలిదండ్ల అళగిరి రచించాడు. 'మిత్రపరిణయం'ని ఆరు ఆశ్వాసాల ప్రబంధంగా

కుందుర్తి వెంకటాచలం రచించాడు. సుదామునితో బంతి ఆట ఆడడానికి వెళ్ళే కృష్ణునికి పంచకన్యలు ఎదురయ్యారు. జలక్రీడ లాడుతున్న వారిని ఏడిపించి కృష్ణుడు వివాహం చేసుకొన్నాడు. దీన్ని కథగా గ్రహించి బాలకవి సుబ్బన్న 'పంచకన్యా పరిణయం' రచించాడు. 'సత్యభామా విజయా'న్ని ఘట్టు (ప్రభువు) శేషయ్య రచించాడు. 'గజేంద్ర మోక్షా'న్ని రఘునాథ నాయకుడు రచించాడు.

6.2. శ్రీకృష్ణ జీవితం శ్రీకృష్ణుని బాల్యం - బాల్య చేష్టలు - యౌవనం - రాసలీలలు వివాహాలు దాంపత్యంలోని గడుసుదనం, వివిధ జీవన సందర్భాలను కవులు సాహిత్యంగా రూపొందించారు. ఆ సాహిత్యంలో భాగంగా ఉన్న యక్షగానాలలో శ్రీకృష్ణుని జీవితం, ఆ అవతారానికి మూలమైన శ్రీమహావిష్ణు విలాసాలను కూడా యక్షగానాల్లో కవులు చిత్రించారు.

శ్రీకృష్ణుడి జీవితం ఎన్నో ఇతివృత్తాలకు ఆలవాలం. కృష్ణుడి జీవనారంభం నుంచి, జీవితాంతం వరకు ఎన్నో ఘట్టాలు రసవత్తరాలయిన వాటిని కవులు గ్రహించారు. బాలక్రీడలు, గోపికా వస్త్రాపహరణం, రుక్మిణి సత్యభామలతోడి సరాగాలు వివాహాలు అనేకానేకం సాహిత్య రూపం సంతరించుకొన్నాయి. ఈ వివిధ ఘట్టాలు ఆధారంగా అనేక యక్షగానాలు వెలిశాయి.

పుత్రవాంఛతో ఉన్న యశోద వద్దకు విష్ణువు పంపున యోగమాయ ఎఱుకలా రావడం, నక్కలపాటి సంజీవ కవి కృతి 'ఎఱుకల కథ'లో ప్రధానాంశం. యశోద గర్భవతి కావడం, ప్రసవించడం; కథగా భారతి రామరాజు 'బాలింతవేష కథ'ను రూపొందించాడు.

కృష్ణుని బాల్యక్రీడల మీద అనేక యక్షగానాలు వెలువడ్డాయి. 'కృష్ణుని జన్మం నుంచి 'యమళార్జున భంజనము' (31) వరకున్న కథను దేవవరపు శోభనాద్రి 'బాలక్రీడా విహారం' పేరిట రచించాడు. భాగవత కథానుసారంగా జననం బాల్య క్రీడలను పాకపాటి గణపతి రెడ్డి 'గోపాల విలాసం'గాను, శీర్నాడు వెంకటరాయకవి 'కృష్ణనాటకంగా'ను యక్షగాన రూపమిచ్చారు. బాల్య క్రీడలు 'పూతనాపహరణం' ఆగడాలు కథగా భారతుల శ్రీరంగకవి 'కృష్ణలీలా విలాసం'గా శాహాజీ రచించారు.

శ్రీకృష్ణుని గడుసుతనానికి నిదర్శంగా వెలిసిన యక్షగానాలు జలక్రీడలకు సంబంధించి ఉన్నాయి. జలక్రీడలు, గోపిక వస్త్రాలను అపహరించడం వీటిలో ప్రధాన కథ. జలక్రీడలు రాధాకృష్ణుల అనుబంధాన్ని 'బాలకృష్ణ నాటకం'లో తరిగొండ వెంగమాంబ; జలక్రీడలను శాహాజీ వర్ణించారు. గోపికా వస్త్రాపహరణాన్ని 'జలక్రీడా విలాసం'గా నిముషకవి రామయ్య 'జలక్రీడ పేరిట ఆగడాలు, వస్త్రాపహరణాన్ని భారతి రామరాజు రచించారు. 'జలక్రీడా విలాసం'గా వేదం భట్లవెంకటరాయ కవి 'నౌకాచరిత్రం'గా కాకర్ల త్యాగరాజు ఇదే విషయాన్ని రచించారు.

గోపికా కృష్ణుల రాసక్రీడలు కానుకొలను వెంకటదాసు 'శ్రీకృష్ణ నాటక యక్షగాన మహాప్రబంధ రాసక్రీడా విలాసం'గా రచించాడు. వేణునాదం విని పరుగున వచ్చిన గోపికలతోడి సరాగాలను పరిగంటి శేషగిరి దాసు 'జగన్మోహన శ్రీకృష్ణ విలాసం' పేరిట మలిచాడు.

కంసుడు దేవకిపై ఆగ్రహించడం నుంచి రుక్మిణితో శ్రీకృష్ణుడి వివాహం దాకా కథను 'కృష్ణవిలాసం'గా అకలం శ్రీకృష్ణమాచార్యుడు రచించాడు. పులహరి ఫిరోజి 'సాత్రాజితీయము'రచించాడు. 'ఇందు శమంతకోపాఖ్యానము, జాంబవతీ సత్యకాళిందీ నాగ్నజత్తి భద్రా లక్షణా పరిణయం కథలు నరకాసుర సంహార కథయు వర్ణితములు'. (32)

'రుక్మిణీ కళ్యాణా'న్ని తిమ్మరాజు లక్ష్మణరావు, ఏనుగుల చూడమ్మ ఉపేంద్రశ్రీ రామరాజు; 'లక్ష్మణా పరిణయాన్ని' పండకండ్ల స్వామి రాయకవి; సత్యభామా కళ్యాణాన్ని' మండూరి సుబ్బరాయకవి, యక్షగానాలుగా రూపొందించారు. 'పార్థసారథి విజయం' పేరిట ఆలూరి కుప్పన అతి విస్తృతి ఉన్న రచన చేశాడు. 'విష్ణు పల్లకీ' సేవా ప్రబంధంగా శాహాజీ ఊరేగింపు పవళింపు సేవ వర్ణించాడు.

ప్రహ్లాదుని భక్తి వైష్ణవ మతస్థులలో కలికితురాయి. ఆ భక్తి తెల్పే యక్షగానాలు అనేకం ఉన్నాయి. బోడిచర్ల సుబ్బకవి రచించిన 'ప్రహ్లాద చరిత్ర' అందులో ఒకటి. ఇదే ఇతివృత్తాన్ని 'ప్రహ్లాద విజయం'గా నిశ్చింత ఎంబారయ్య; 'ప్రహ్లాద చరిత్ర'ంగా విజయ రాఘవనాయకుడు; 'ప్రహ్లాద భక్తి విజయం'గా కాకర్ల త్యాగరాజు రచించారు.

'ధ్రువోపాఖ్యానం' బెహరా అప్పల నరసింహులు; 'వామన చరిత్రా'న్ని ఉపాధ్యాయులు మృత్యుంజయకవి, గజేంద్ర మోక్షాన్ని 'గజేంద్రాళ్వారు చరిత్ర'గా కోకా వెంకట రామానుజలునాయుడు రచించారు. ఉషా పరిణయ ఘట్టాన్ని విరిపాటి నృసింహరాజు, యమ్మనూరి వెంకట సుబ్బకవి, విలాసం గండ ఓబుళరాజు తిరువీధి చెంచు సుబ్బదాసు తమదైన రీతిలో అక్షరరూపాన్నిచ్చారు.

క్షీరసాగార ఘట్టాన్ని యక్షగానంగా అనేకులు రచించారు. సాగర మథనంలో జగన్మోహిని వృతాంతాన్ని కంకంటి పాపరాజు 'విష్ణుమాయా విలాసం'గా పేర్కొన్నారు. ఈ మథనాన్ని ఆధారం చేసుకొని ఆత్రేయపురపు తమ్మయ్య ఆకెళ్ళ అప్పయ్య, గొల్లల గొప్పతనాన్ని 'గొల్ల కలాపం'లో తెల్పారు. దరువూరి అప్పలాచార్యులు, వారణాసి అచ్యుత రామకవి అనే జంటకవులు సాగరమథనం, లక్ష్మీనారాయణుల వివాహాన్ని 'లక్ష్మీనారాయణ విలాసం'గా రచించాడు. 'సముద్రమథనం'పేరిట గరిమెళ్ళ వేంకటేశ్వర కవి రచించాడు.

7. కుచేలోపాఖ్యానం : శ్రీకృష్ణుని జీవన ఘట్టాలలో అతి ప్రధానమయిన వాటిలో ఒకటి కుచేలునితోడి సంబంధం. స్నేహానికిచ్చిన విలువ, స్థానం, అత్యున్నతాలు. పేదవాడయినా ప్రేమతో తెచ్చిన అటుకులను తిని అనంత సంపదనిచ్చి కుచేలుని దారిద్ర్యం పోగొట్టే ఇతివృత్తం కృష్ణునిలోని కొత్తకోణ దర్శనం. దీనిని మూడాశ్వాసాల కావ్యంగా 'కుచేలోపాఖ్యానం' పేరిట ఘట్టుప్రభువు అద్భుతంగా ఆవిష్కరించాడు. ఇతని అసలు పేరు ఘట్టు శేషయ్య.

8. శ్రీకృష్ణుని గాథలు శ్రీకృష్ణుని రాయబారం, కృష్ణార్జునయుద్ధం, పాండవ ఉద్యోగ విజయాలు తిరుపతి వేంకటకవులు నాటకాలుగా వ్రాశారు. శ్రీకృష్ణుని మాయోపాయాలు, చతురోపాయాలు యుక్తులు నాటక సాహిత్యంలో సుప్రసిద్ధం. శ్రీకృష్ణుడి

జీవితం పురాణానికి ఇతిహాసానికి ప్రబంధానికి యక్షగానానికి నాటకానికి విశేషంగా యోగ్యమయి శోభించింది. ప్రాచీన సాహిత్యంలోనే కాదు, ఆధునిక సాహిత్యంలోనూ కృష్ణుని కథాంశాలకు ప్రత్యేకమయిన ఆకర్షణ ఉంది. నేటికీ శ్రీకృష్ణుని జీవితాంశాలతో సృష్టి పొందుతూ ఉండటం గమనార్హం.

3.2.4. అన్యపురాణాలు : అష్టాదశ పురాణాలు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల మాహాత్మ్యాల పూర్వాపరాలు వివరించేవిగా ప్రస్తుతించేవిగా ప్రకటించేవిగా ఉన్నాయి. అవి రాజస సాత్త్విక గుణ ప్రముఖంగా ఉన్నాయి. అనంతరం కాలంలో అష్టాదశ ఉప పురాణాలు అవతరించాయి. ఇవి ప్రత్యేక మాహాత్మ్య ప్రాధాన్యం కలిగి ఉన్నప్పటికిని పురాణ మార్గంలోనే సాగాయి. పురాణ వస్తుతత్త్వమే కలిగి ఉన్నాయి. ఉప పురాణాలు కూడా పంచ లక్షణ సమన్వితాలు అయినప్పటికి లక్షణాలలో సడలింపు అరంభమయింది. కొన్ని లక్షణాలు తొలగించటం కానీ, కొన్ని లక్షణాలు సంక్షిప్తీకరించటం కానీ, ప్రారంభమయింది. పురాణాలు ఉప పురాణాలు స్పష్టంగా సర్వలక్షణ శోభాయమానంగా ఉండటమే ఉద్దేశించినప్పటికి, నిర్వహణ భారం వల్ల కానీ, విభిన్న మహర్షి ప్రోక్తాలు కావటం వల్ల కానీ, విభిన్న కాలాలకు సంబంధించి ఉండటం వల్ల కానీ, ఒక తరం నుంచి మరో తరానికి వాటికి తీసుకుపోవటంలో ఉన్న కష్ట నష్టాల వల్ల కానీ, క్రమంగా పురాణానికి ఉండే విస్తృత ప్రణాళిక పరిమితం కాసాగింది.

పురాణానువాదం జరిగినప్పుడు ఒక కవి అనువాదం పూర్తిగా చేయలేకపోవటం వల్లనో, ఇదంతా అక్కర లేదనుకోవటం వల్లనో, ఇది రసవత్తరం కాదనుకోవటం వల్లనో, బహుముఖీనంగా సరస్వతీ స్వరూపాలు వ్యాప్తి చెందటం వల్లనో, సంస్కృతంలోని పురాణ కథ స్వరూపం యథాతథంగా తెలుగులోకి అనువాదం అయినట్లు గోచరం కావటం లేదు. తెలుగులోకి వచ్చిన పురాణాలు పరిశీలిస్తే సర్వలక్షణ సమగ్రంగా లేకపోవటంచేతనూ పరిమిత నిర్ణీత పరిధి పట్టి పురాణాలను బంధిస్తున్నట్లు ఉండడం చేతనూ, లక్షణ దృష్టితో లక్ష్యాలు ఉండకపోవటం చేతనూ, ఈ దృష్టి ఏర్పడుతుంది. ఒక్కొక్క పురాణానికో ఉపపురాణానికో ఉన్న పురాణ ధర్మాలు వింగడించటం వంటి కృత్యం కానీ వ్యాఖ్యానించటం వంటి పని కానీ, జరక్కపోవటం వల్ల అవగాహనకు ఈ సమస్య ఎదురవుతూ ఉంది.

తెలుగులోకి అనువాదంగా అవతరించిన పురాణాలు ప్రముఖంగా విష్ణు ప్రాధాన్యంతో గోచరమవుతూ ఉన్నాయి. మరీ ముఖ్యంగా శ్రీకృష్ణావతారం చుట్టూ పరిభ్రమించాయి. పురాణం పేరుతో స్వతంత్ర సాహిత్య సృష్టి కూడా జరిగింది. ఈ విశాల పురాణ సాహిత్య వికాసం దర్శనీయమే అవుతుంది.

3.2.4.1. నృసింహ పురాణం : వేములవాడ భీమకవి (1150-70) ప్రణీతంగా ప్రసిద్ధమయిన నృసింహపురాణం ఇంకా లభ్యం కావలసే ఉంది. 14వ శతాబ్దంలో ఎర్రన వ్రాసిన నృసింహపురాణం బ్రహ్మాండ పురాణం నుంచి గ్రహించబడ్డ కథాభాగం.

ఈ కథ విష్ణుపురాణంలోనూ కనిపిస్తుంది. దీనిలో పురాణ లక్షణాలు కనిపించవు. దీన్ని ప్రథమ ప్రబంధం అని కూడా అన్నారు. స్వతంత్ర కావ్యం కావడంతోనూ, ప్రబంధ

లక్షణాలు ఉండడంతోనూ ఈ మాట అనటం సాధ్యమయింది. 'ఇది బ్రహ్మాండాది పురాణోక్తమయిన నరసింహావతార కథననుసరించి అహోబల క్షేత్ర మాహాత్మ్యమును వర్ణించు అయిదు ఆశ్వాసాల స్వతంత్ర ప్రబంధము'. (33) అయితే ఇది కేవలం క్షేత్ర మాహాత్మ్యాన్ని తెల్పే కథ కాదు. ప్రధానేతివృత్తం భక్తుడయిన ప్రహ్లాదుడిని హిరణ్యకశిపుని బారి నుండి రక్షించడానికి విష్ణువు నరసింహావతారం ధరించడం కథ.

నారసింహ పురాణం పేరిట ప్రోలుగంటి చెన్నయ మంత్రి వ్రాసిన పురాణం లభించటం లేదు. హరిభట్టు వ్రాసిన పురాణం కావ్యధర్మమే పొందింది. నృసింహపురాణం పేరిట బారిగడుపుల ధర్మయ్య వ్రాసిన పురాణం బారిగడుపుల పుణ్య క్షేత్రంలో కొలువైన నరసింహస్వామి పై వచ్చిన సాహిత్యం. నృసింహపురాణం కథ మహావిష్ణువు అవతార వర్ణనమే అయినప్పటికి స్థానిక అవసరాలు దృష్టితో సాహిత్యం సృష్టికావటం మొదలయింది. పురాణాంతర్గతమయిన ఒక కథాసూత్రం గ్రహించి వ్రాసిన గ్రంథానికి పురాణం అని పేరు పెట్టటం గమనార్హమయిన పరిణామం.

హరిభట్టు రచించిన నారసింహ పురాణం పద్యకావ్యమే. అయితే ఎర్రన నరసింహావతార ఫలానంతరం అంటే ప్రహ్లాద పట్టాభిషేకానంతరం కావ్యం ముగించాడు. హరిభట్టు మాత్రం '.... ఎర్రయ్యగారు వదలి పెట్టేశారని వాటిని నారసింహ పురాణం ఉత్తరభాగంలో హరిభట్టు కథనం చేయదలిచాడని ఆంధ్రలోకం విశ్వసిస్తోంది.' (34) అనడం వల్ల కావ్యం పెంచినట్టుతోస్తుంది. ప్రోలుగంటి చెన్నయ్య మంత్రి వ్రాసిన నారసింహపురాణం అలభ్యమే అయినా అది ద్విపద కావ్యమని స్పష్టమవుతూ ఉంది. బారిగడుపుల ధర్మయ్య నృసింహపురాణం లభించే ప్రథమ ద్విపద కావ్యం.

3.2.4.2. విష్ణుపురాణం : విష్ణుపురాణం పేరిట వెలువడ్డ రచనలలో పశుపతి నాగనాథకవి, తుపాకుల అనంత భూపాలుడు వ్రాసిన కృతులు అలభ్యంగానే ఉన్నాయి. వెన్నెలకంటి సూరన, కలదిండి భావనారాయణ కృతులు లభిస్తూ ఉన్నాయి. 1530-55 ప్రాంతాలలో వెన్నెలకంటి సూరన విష్ణుపురాణం అనువదించాడు. ఇది విష్ణుతత్త్వాన్ని తెల్పే గ్రంథం. పోతన కావ్యప్రతిమ ప్రాభవాలతో ఇది మరుగైపోయి ఉండవచ్చు. విష్ణుపురాణాన్ని కలిదిండి భావనారాయణ రచించి పూరీ జగన్నాథ స్వామికి అంకితమిచ్చాడు. ఇతడు నాలుగు అంశాలనే తెనిగించాడు. ప్రోలుగంటి చెన్నయ్య మంత్రి సౌభరి చరిత్రను రచించాడు. ఇది విష్ణువు పురాణాంతర్గతం. సౌభరి అనేముని ఇహలోక సౌఖ్యాలను కోరి తద్పుత్రికలను వివాహం ఆడడం కథ.

3.2.4.3. పద్మపురాణం : పద్మపురాణాన్ని కమలాభామాత్యుడు, మడికి సింగన (1347 ప్రాంతం) వ్రాశారు. కమలనాభామాత్యుడి కృతమైన పద్మపురాణం సంగ్రహంగా ఉన్నట్లు స్పష్టమవుతూ ఉంది. ఇది అలభ్యం.

మడికి సింగన రచించిన పద్మపురాణం పదకొండు ఆశ్వాసాల గ్రంథం. ఇది సంస్కృత పద్మపురాణానికి అనువాదం. దీనిలోనూ సంపూర్ణ పురాణ లక్షణాలు కనిపించవు. దీనికి కారణం పద్మపురాణం ప్రతికి తీర్పు రాసిన జూలూరు అప్పయ్య పేర్కొన్నాడు.

ఆయన సంస్కృత పద్మపురాణానికి దీనిని పోల్చి చూచి ఉత్తరపురాణం మాత్రమే అనువాదం అయిందని స్పష్టం చేశాడు. అంతేకాక మిగిలిన ఖండాలు అనువాదం చేసినట్టుతెలుగులో ఎక్కడా కనిపించలేదని పీఠికలో పేర్కొన్నాడు. పద్మపురాణాన్ని అరవీటి రాజుల యుగంలో కామినేని మల్లారెడ్డి రచించాడు. '.....పద్మపురాణంలో ఒక భాగాన్ని తెనిగించాడు'. (35) శివుడు బ్రాహ్మణ వేషంలో అయోధ్యకు వెళ్ళి రామకథలు చెప్పడం ఇందులోని కథాంశం.

3.2.4.4. నారదీయ పురాణం : పిల్లలమర్రి పిన వీరభద్రుడు రచించిన విష్ణు ప్రాధాన్యం గల నారదీయ పురాణం అలభ్యంగా ఉంది. విష్ణుపారమ్యాన్ని తెల్పే నారదీయ పురాణం మరొకటి అల్లాడు నరిసంహకవి రచించినది. డా.వడ్లమూడి గోపాలకృష్ణయ్య పరిశోధన ఫలితంగా లభ్యమవుతూ ఉంది. వాసిరాజు రామయ్య రచించిన బృహన్నారదీయ పురాణం ఉపపురాణం. నారదీయ పురాణంలాగానే ఇది కూడా విష్ణు ప్రాధాన్యం కలదిగా ఉంది. దీనిలోనివి కేవలం మూడు పద్యాలు మాత్రమే లభ్యం. నారదీయ పురాణాన్ని గూర్చి ఇది గమనార్హం.

'ఈ పురాణం నారద సనత్కుమారుల సంవాదరూపకమైన రచన. ఇందులో గంగావతరణ కథ ఎక్కువగా ఉంటుంది. హైహయులకు ఓడిపోయి బాహున్నపతి అడవులు పట్టడం, అక్కడ అతడు మరణించడం, గర్భవతిగా నున్నఅతని భార్య సహగమనం చేయబోవడం, ఔర్వముని వారించడం, సగరుడు జన్మించడం, పెరిగి అశ్వమేధం తలపెట్టడం, దానికి విఘ్నం కలగడం, సగర పుత్రులు భస్మమవడం, భగీరథ ప్రయత్నాలు, గంగావతరణం మొదలైన సన్నివేశాలన్నీ వివరంగా వుంటాయి. ఈ ప్రధాన కథకు ముందు వెనుక సృష్టి ప్రకారం భారత వర్ష మహాత్మ్యం, ఏకాదశీ వ్రత సమాచరణం, పితృకార్య ప్రకారం మొదలైనవి వున్నాయి'. (36)

3.2.4.5. వరాహ పురాణం : వరాహ పురాణాన్ని 1480 ప్రాంతాలలో నందిమల్లయ ఘంట సింగనలు రచించారు. పన్నెండు ఆశ్వాసాల గ్రంథం ఇది. వరాహావతారంతో సంబంధమున్న కథేదీ లేని పురాణమిది. వరాహమూర్తి భూదేవికి చెప్పిన కథలివి. 'పాడ్యమి మొదలైన పున్నమి, అమావాస్యల దాకా రోజూ ఆచరించవలసిన వ్రతాలు, చేయవలసిన దానాలు, చైత్రం మొదలు ఫాల్గుణం దాకా పట్టవలసిన నోములు, ఇవ్వవలసిన దానాలు, కొన్ని స్థలపురాణాలు ప్రాచీన భూగోళ విజ్ఞానం మొదలైనవి ఈ గ్రంథంలో ఉన్నాయి.' (37) తర్వాతి కాలంలో హరిభట్టు వరాహపురాణాన్ని రచించాడు. వరాహావతార కథతో కూడి ఉండేటట్లు రచించాడు. 'వరాహ పురాణంలో రెండు ఖండాలున్నాయి. ఒకటి కైవల్య ఖండం, రెండోది విజ్ఞాన ఖండం. హరిభట్టు మొదటి దానిని అనువదించాడు. ఇందులోని వరాహావతార కథ ఒక్కటే కాదు, నరసింహావతార గాథ, ఆ మాటకొస్తే దశావతార సంక్షేమ గాథలు వగైరాలు ఉన్నాయి'. (38) పురాణాలు ఖండాలుగా ఉండటం గమనార్హ పరిణామం.

3.2.4.6. గరుడ పురాణం : పింగళి సూరన చేసిన అనువాదం ఇది. అష్టాదశ పురాణాలలో గరుడ పురాణం ఒకటి. ఇది విష్ణు సంబంధం గల సాత్త్విక పురాణం. విష్ణువు గరుత్మంతునికి చెప్పేదిగా ఈ పురాణం ఉంది.

'ఇందులో జీవుడు బొందిని విడిచిపెట్టాక ఎన్ని యాతనలు అనుభవిస్తాడో, ఏయే అంచెలు దాటుతాడో మొదలైన వివరాలు ఉన్నాయి. శ్రాద్ధాలు, కర్మలు ఎలా జరపాలో ఇది విశదపరుస్తుంది.' (39)

3.2.4.7. వామన పురాణం : లింగమగుంట రామయ్య, ఎలకూచి బాలసరస్వతి చేసిన అనువాద రచనలు రెండు తెలుగు సాహిత్యంలో కనిపిస్తూ ఉన్నాయి. అలభ్యంగా ఉన్న ఈ గ్రంధాలు సంస్కృతం నుంచి తెలుగులోనికి అనువాదం అయ్యాయని, విష్ణు మహిమలను తెల్పేవిగా ఉన్నాయని, స్పష్టమవుతూ ఉంది. వామన పురాణం పేరిట పొన్నతోట ఓబళకవి అనువదించిన పది ఆశ్వాసాల కావ్యం లభ్యమవుతూ ఉంది.

3.2.4.8 ప్రారంభ పురాణాలు : విష్ణువు యొక్క అవతారాలలో ముందటివిగా చెప్పబడే వాటిని గూర్చి కూడా పురాణాలు పుట్టాయి. వాటి అనువాదాలు కూడా తెలుగులో లభిస్తూ ఉన్నాయి.

1. బ్రహ్మాండ పురాణం : కావూరి ఎల్లయ్య రచించిన బ్రహ్మాండ పురాణం ఆరాశ్వాసాల కావ్యం. సంస్కృతం తెలుగు కావ్యాలలోని వరసకు సంబంధం లేదు. 'ఈ కావ్యం అర్థ పంచక వివరణ ఖండానికి మాత్రమే తెనిగింపు' (40) భైరవయ్య గారి మాచన్న బ్రహ్మాండ వచనం రచించాడు. చతుర్వేదాలు, అష్టాదశ పురాణాలు సారాంశంగా దీన్ని రచించాడని ప్రతీతి.

'ఈ ప్రపంచం ఎలా పుట్టింది? సకల జగత్తుల ఉత్పత్తి స్థితి లయ కారకులయిన త్రిమూర్తులు ఎలా పుట్టారు అనే ప్రశ్నలు.... పార్వతీ దేవి.... శంకరుణ్ణి అడిగింది. ఆయన ఈ బ్రహ్మాండ నిర్మాణ మెట్టిదో చెప్పాడు'. (41)

2. మత్స్య పురాణం : మత్స్య పురాణం హరిభట్టు రచించిన అయిదు ఆశ్వాసాల కావ్యం. 'మత్స్య పురాణంలో రసవద్ఘట్టాలు లేనేలేవు. ఉన్న కథలైన తులసి మాహాత్మ్యం, ఏకాదశీ వ్రత మాహాత్మ్యం, సప్త సంతాన ప్రతిష్ఠాఫలాలు వగైరాలు చెప్తాయి'. (42)

3. కూర్మ పురాణం : రాజలింగ కవి కూర్మ పురాణాన్ని తెనిగించాడు. ఆరాశ్వాసాల కావ్యమిది. శైవ ప్రాధాన్యం ఉన్న రచన.

4. ఆది పురాణం : ఆది పురాణం మాత్రం హిందూ మత గ్రంథం కాదు. ఇది జైనమత గ్రంథం. '.... క్రీ.శ. 953లో సర్వదేవుడనే కవి ఉండేవాడు. ఇతనికి పొన్నకవి అనే పేరు కూడా ఉంది. కన్నడ రత్నత్రయంలో రెండవ వాడు ఈయనే. ఇతడు తెలుగులో ఆదిపురాణం అనే జైనగ్రంథాన్ని వ్రాశాడు. ఆ గ్రంథం ఇవాళ మనకు దక్కలేదు. కాని అందులో పద్యాలు ఒక మూడు మిగిలాయి'. (43)

3.2.4.9. విష్ణు ప్రాధాన్యం : తెలుగులో వెలువడ్డ పురాణాలు చాలా వరకు విష్ణు ప్రాధాన్యం తెలుపుతాయి. అంత ప్రసిద్ధి లేని పురాణాలు పురాణ తుల్యాలు కూడా విష్ణు ప్రాముఖ్యం ప్రస్తుతించేవి ఉన్నాయి.

1. ముమ్మడి మల్లన శ్రీరామస్తవ రాజం రచించాడు. ఇది మూడాశ్వాసాల కావ్యం. రాముడు చారిత్రక పురుషుడయినా, ఇక్కడ కొంత మహిమ ఆ నామానికి ఉండడం, విష్ణు అవతారంగా పేర్కొనటం కారణాన ఇది పురాణ మార్గంలో చేరుతూ ఉంది. 'వ్యాసుల వారు శ్రీరామ మంత్ర ప్రభావాన్ని వేదాంత విషయాలను ధర్మరాజుకు ప్రబోధించిన వివరాలను ఈ గ్రంథంగా కవి రచించాడు'. (44)

2. కంభంపాటి నారప్ప 'భగవద్గీత'ను అనువదించాడు. 'మహాభారతంలో గీతను తిక్కన గారు తెనిగించలేదు. ఆ భాగాన్ని ఆంధ్రీకరించి కంభంపాటి నారప్ప హరిహరనాధునికే అంకితమిచ్చాడు. ఇది ఆరాశ్వాసాల గ్రంథం'.(45)

ఇది అసమగ్రంగా లభిస్తుంది. దీన్ని వచనంగా పెద తిరుమలయ్య వ్రాశాడు. 18వ శతాబ్దంలో కర్పూరం కృష్ణమాచార్యులు 'భగవద్గీత'ను ద్విపదలోనికి అనువదించాడు. స్కాంద పురాణంలోని 'సూత సంహిత'ను పట్టమట్ట సోమనాథుడు వ్రాశాడు.

3. 'విష్ణుమిత్రోపాఖ్యానం' అనే అయిదు ఆశ్వాసాల గ్రంధాన్ని కోటికెల పూడి సోమనాథుడు రచించాడు. కృష్ణమంత్రి పంచతంత్ర కథాకావ్యాన్ని వైష్ణవ ప్రబంధంగా మార్చి 'రాజనీతి రత్నాకరమ'నే పేరిట రచించాడు. 'విష్ణుమాయా నాటకం' పేరుతో కంకంటి నరసింహరాజు విష్ణులీలలను అయిదాశ్వాసాల ద్విపద కావ్యంలో అభివర్ణించాడు. బైతరాజు ముమ్మయ్య 'విష్ణుకథా నిదానం' రచించాడు. విష్ణు ప్రాధాన్యంతో యక్షగానాలు ఆవిర్భవించాయి. ఉపాధ్యాయుల మృత్యుంజయ కవి 'వామన చరిత్రము' ఐదు కాండల రచన చేశాడు.

పురాణాంతర్గత విషయాలు గ్రహించి పలువురు యక్షగానాలు వ్రాశారు. పురాణ విషయాలుగా స్థానిక విషయాలు కూడా కలుపుకొని సాహిత్యం సృష్టించారు. పురాణాలలోని విషయం ఆధారంగా ఉన్న యక్షగానాలు పరిశీలింపవచ్చు.

వాయు పురాణోక్తాలు అయిన ఇతివృత్తాలను త్యారకవిరామకృష్ణయ 'భవానీ శంకర విలాసము, వీరభద్ర విజయము' రచించాడు. బ్రహ్మాండ పురాణోత్తర కాండంలోని 'దేవతల చరిత్ర'ను గ్రహించి వెలుగోటి వెంకట రమణయ్య రచించాడు. భూలోకంలో శ్రుతులు కలుషితం కాకుండా శివుడు దేవాంగుని మానవ రూపంలో పంపాడు. అతడు వరరుచి భోజాస్థాన పతి అయి శాస్త్రజ్ఞుని పుత్రిక కళావతిని ఓడించి మూర్ఖునిగా బ్రాహ్మణునికిచ్చి వివాహం చేశాడు. వారి పుత్రుడు కాళిదాసు. 'వరరుచి విజయం'గా వెలువడ్డ యక్షగానం. 'ఇది యొక విచిత్రమైన కథ'. (46) స్కాంద పురాణాంతర్గతమయిన కన్యకా పరమేశ్వరి చరిత్రను ఇటికెల తిమ్మయ్య 'కన్యకా పురాణం'గా రచించాడు. దీని ప్రకారంగానే రఘునాయకం రామానుజసూరి 'కన్యకా విజయం' రచించాడు. గరుడ పురాణాంతర్గత 'దండధర విలాసాని'కి వికటవాది చరిత్రమనే మరో పేరుంది. దీనిని 1887లో వంగంటి వేంకటరమణదాసు రచించాడు. టంగుటూరు వెంకట రామయ్య వరాహ పురాణాంతర్గతమయిన పద్మావతి వేంకటేశ్వరుల ప్రణయ గాథను 'పద్మావతి పరిణయమ'నే పేరిట యక్షగానంగా రూపొందించాడు.

3.2.4.10. శివ ప్రాధాన్యం : విష్ణు ప్రధానంగా పురాణ ఉపపురాణాలున్నట్లే శివ ప్రాధాన్యంతోనూ ఉన్నాయి. కానీ తెలుగులోకి అవి అంత విరివిగా అనువాదం కాలేదు. అయితే కొంత వరకే సాహిత్యం కూడా వచ్చింది.

1. పోతన రచించిన వీరభద్ర విజయం శైవ ధర్మ పురోచకంగా ఉంది. ఇది నాలుగాశ్వాసాల కావ్యం. 'ఇందులో ప్రథమాశ్వాసంలో దక్షయజ్ఞం జరుగుతుంది. అందులో సతీదేవి మరణిస్తుంది గాని వీరభద్రుడు ప్రభవించాడు. నాలుగు ఆశ్వాసంలో మళ్ళీ దక్షుడు ఇంకో మన్వంతరంలో యజ్ఞం చేసి శివనింద చేస్తాడు. అప్పుడు వీరభద్రుని పుట్టించి శివుడు విజయానికి పంపిస్తాడు. ఈ రెండూ యజ్ఞాలకు మధ్య గిరిజ ప్రభవించడం, శివుని తపస్సు, ఆమెను శుశ్రూషకు వియోగించడం, దేవేంద్రుడు కాముణ్ణి పంపించి శివుని తపస్సు ఆపించమనడం, రతీ మన్మథుల వివాదం, కామదహనం, శివుడు ఎరుకల సాని వేషంలో పార్వతికి సోది చెప్పడం, పార్వతి తపశ్చర్య, శివుడు కపట బ్రహ్మచారి వేషంలో వచ్చి ఆమెను పరీక్షించడం తరువాత శంకరుడు సప్త మహర్షులను పిలిచి వాళ్ళను పెళ్ళికి పెద్దలుగా పంపడం, పెళ్లి మాటలు, వివిధ ఆచారాలు, నాలుగు రోజుల పెళ్ళి, పార్వతీ పరమేశ్వరులు సుఖంగా ఉండడం, ఆమె అతని కంఠం నీలంగా ఉండడానికి కారణం అడిగితే అతడు క్షీరసాగర మథనం హాలాహల భక్షణ కథనం చేయడం మొదలైనవి పోతరాజు గారు ప్రథమాశ్వాసంలో కొంతా, రెండు మూడు ఆశ్వాసాలలో పూర్తిగా వ్రాశారు'. (47)

2. కుంట ముక్కల తిమ్మయ్య 'శైవాచార సంగ్రహం' మూడాశ్వాసాల రచన. 'భస్మధారణ విధి, రుద్రాక్ష విధి, ముగ్గుల లక్షణం, రకరకాల పువ్వుల ఫల తారతమ్యాలు మొదలైన శైవాచార విధానాలను కవి సప్రమాణంగా వ్రాశాడు'. (48) పోతరాజు వీరయ్య 'త్రిపుర విజయం' అనే కావ్యాన్ని రాశాడు. ఇందులో 4 పద్యాలు మాత్రమే లభిస్తున్నాయి. కామినేని మల్లారెడ్డి శివధర్మోత్తరం వ్రాశాడు. మోచర్ల నన్నయ 'సాంబోపాఖ్యానం' అనే 5 ఆశ్వాసాల కావ్యం రచించాడు. శైవాచారాలకు సంబంధించిన మత గ్రంథాన్ని 'శైవాగమ శిఖామణి' పేరిట నెప్పల్లె అప్పన్న వ్రాశాడు. మల్లవరపు వీరేశ్వరుడు 'భల్లాణ చరిత్ర' అనే శైవాచార మహిమలతో కూడిన రచన చేశాడు. 'సానందోపాఖ్యాన'మనే శైవ ప్రాధాన్యం గల కావ్యాన్ని శివరామ కవి రచించాడు. వెణుకుదురుపల్లి విశ్వనాథం 'గౌరీ వివాహం'ని ద్విపద కావ్యంగా రూపొందించాడు.

ఏదుట్ల శేషాచలం 'జగన్నాటకం'గా రచించాడు. ఒక స్వప్నంలో అర్ధనారీశ్వరుని తల వద్ద శ్రీవైష్ణవుని చూశాడు. అది జగన్నాటకంగా కలలో శ్రీవిష్ణువు ద్వారా తెలుసుకొని దాన్నే రచించాడు. 'స్వప్నంలో చూసిన జగన్నాటకాన్ని కావ్యంగా వ్రాస్తున్నప్పుడు అది అధ్యాత్మ విద్యానుసారంగా, భరతశాస్త్రానుసారంగా శేషాచలం వ్రాశాడు'. (49)

ఘట్టు ప్రభువు రచించిన 'సురాభాండేశ్వర లింగకథ' స్కాంద పురాణాంతర్గత కథ. ఇది ఏడాశ్వాసాల గ్రంథం. కాశీ క్షేత్ర మాహాత్మ్యం చెప్పడానికి రచితమయిన కావ్యం. అక్కడ మరణించిన వారంతా శివలింగాలవుతారు. ఒక విప్రుడు నియమంగా ఉండి పిమ్మట చెడువర్తనతో మృతి చెంది కాశీ మాహాత్మ్యం వల్ల శివలింగం కావడం కథ.

'గంగా గౌరీ విలాసం' పేరిట పెదకెంపరాయుడు, 'పార్వతీ పరిణయం' పేరిట వాసుదేవ దీక్షితులు కావ్యాలుగా రచించారు. శాహాజీ రచించిన 'సతీదాన శూరం' మాతంగ యువతిని చూచి మరులు గొన్న బ్రాహ్మణునికి ఆమె భర్త విధిలేక దానం చేయడం,చివరకు ఆ మాదిగవానికి శివుడు సాయుజ్యం ఇవ్వడం, కథగా ఉన్న యక్షగానం. 'ముక్తి చింతామణి' యతిరాజు వెంకటాచారులు (1700) ప్రాంతాలు పూరి జగన్నాథుని మాహాత్మ్యాన్ని తెల్పే ప్రబంధం. ఇది నాలుగాశ్వాసాల కావ్యం. శివసంబంధి గాథలతో యక్షగానాలు అనేకం గోచరమవుతున్నాయి.

3.2.4.11. స్థానిక పురాణం : పురాణం అనువాదం కావటం తగ్గి స్వతంత్ర రచనగా రూపొందింది. స్థానికావసరాలు తీర్చటం ఆరంభమయింది. 'అరుణాచల పురాణం'స్థానికమే. అంతేకాదు, కులాలు ప్రాధాన్యం వివరించే స్థానిక పురాణాల సృష్టి పరిశీలిస్తే స్థానికావసరాలు తీర్చే అవసరం పురాణాలకు ఏర్పడినట్లు గమనింపవచ్చు.

అరవీటి రాజుల యుగంలో దైవక్షేత్ర వ్రత పురాణాలకు భిన్నంగా కులపురాణం అవతరించింది. అంతేకాదు భాస్కరాచార్యులు 'వాసవీ మాహాత్మ్యం' అనే వైశ్య పురాణాన్ని రచించాడు. ఇంతటితో ఆగలేదు. మల్లికార్జున సిద్ధయోగి 'గౌడ పురాణం' పేరిట సర్వాయి పాపడనే చారిత్రక వ్యక్తి జన్మించిన కులానికి సంబంధించిన రచన వెలువర్చాడు. 'పాపడు గవండ్ల కులంలో పుట్టాడు. ఆ కుల పురాణాన్నే మల్లికార్జున గౌడ పురాణం అనే పేర వ్రాశాడు. ఇది ద్విపద కావ్యం.'(50)

ఈ పద్ధతి మరింత ముందుకు కొనసాగుతూ పోయింది. భద్రకవి లింగ కవి 'దేవాంగ పురాణం' రచించాడు. ఇది దేవాంగుల కులచరిత్ర. ఏడాశ్వాసాల రచన. 'జైనులను ఖండించి శైవమతాన్ని స్థాపించాడు'. (51) ఈ పని రచయిత చేయడం గ్రంథంలో ముఖ్యమే కానీ, దేవాంగుల ప్రాధాన్యం ప్రస్తుతించటం దీని లక్ష్యం.

3.3. వంశం

పురాణానికి ఉన్న అయిదు లక్షణాలలో వంశం ఒకటి. పురాణ రచన పంచలక్షణ విశిష్టంగా చేయటం కష్టసాధ్యం. విశిష్టమూ విశేషమూ అయిన కృషి సర్గ, ప్రతిసర్గ, మన్వంతరం వంశానుచరితం అన్ని పురాణాలలో ఉండటం వల్ల, వాటిలో కొంత సాదృశ్యం ఉండటం వల్ల వాటి వల్ల కొంత పునరుక్తి ఏర్పడటం వల్ల, వాటిని కాక ముఖ్యమైన వంశ కథనే అనువాదం చేస్తే బాగుంటుందని, వంశం ప్రముఖంగా ఉన్న రచనా భాగం అనువాదం చేసేటప్పుడు పురాణమనటం సముచితంగా ఉండదని గుర్తించి వంశ ప్రాధాన్యంతో పురాణ గాథల్ని తెలుగులోకి అనువాదం చేయటం ఆరంభమయింది. అయితే ఎర్రన వ్రాసిన హరివంశంలో వంశ ప్రాముఖ్యంతో పాటు ఇతర పురాణ లక్షణాల ఉనికి కూడా ఉంది. అయితే పూర్వ హరివంశంకాక ఉత్తర హరివంశం వ్రాసిన నాచన సోమన పరిమిత కథలనే తీసుకొని పురాణ భాగమయిన వంశ రచన కావ్య రచన స్థాయికి తెచ్చాడు.

హరి వంశం ఉత్తర హరివంశం కథలు భాగవతంలో ఉన్నాయి. ఇవి ఆద్యరచనలయినా, భాగవతం అనంతరం రచన అయినా భాగవతం పురాణంగా విస్తృత రచనా ప్రణాళికతో ఉండటం చేతే, ప్రాధిక్య ప్రాచుర్యం వల్ల ముందుగా గ్రహించి పరిశీలించటం జరిగింది. ఇది విస్తృత సాహిత్య స్వరూపం. విశాల కథాంశ వేదిక, విభిన్నాంశ క్రోడీకరణంగా ఉండటం వల్ల దాని పరిశీలనం ముందుగా జరిగింది. అయితే ఉత్తరహరివంశం కథలు హరివంశంలో, హరివంశ కథలు భాగవతంలో ఉండటం వల్ల ఇవి నిజానికి భాగవతంలో గతార్థమవుతూ ఉన్నాయి.

భాగవతంలోని ఉపాఖ్యానాలు హరివంశంలో కానీ, ఉత్తర హరివంశంలో కానీ, ప్రసక్తమయినప్పుడు వాటికి ఉన్న పూర్వ ప్రస్తుతి వల్ల, ఇందులో అంత ప్రముఖంగా గ్రహించనవసరం లేదు. వంశ ప్రాధాన్యమున్న రచనలో వంశలక్షణ విస్తృతి దర్శించటమే ప్రముఖ కర్తవ్యం.

14వ శతాబ్దానికి పురాణ ప్రక్రియ విస్తృతి కొంత కుదించుకుపోయింది. సర్గ ప్రతిసర్గ వంశం మన్వంతరం వంశానుచరితాలలో నాలుగు లక్షణాలను విడిచి వంశంలో పురాణ రచన జరగడం కనిపిస్తుంది. అందుకు నిదర్శనం ఎఱ్ఱన రచించిన హరివంశం.

ఇందులో ఆదిసృష్టి క్రమాన్ని సంక్షిప్తంగా - భువి దివి నడుమ ఆకాశం కల్పించడం, సప్తర్షుల సృష్టి, తనమేని రెండు సగాల నుంచి స్త్రీ, పురుషులను - స్వాయంభువుడు శతరూపాలను - రూపొందించడం, వారి ద్వారా సంతతి అభివృద్ధి చేసిన తీరు - చిత్రితమయింది. సర్గ సంక్షిప్తంగా కొంత వరకు కనిపించినా ఇందులో ప్రతి సృష్టి కొంతవరకు ఉంది. కృష్ణుడు కథే కాక అనిరుద్ధ కథనం కూడా ఉంది. ఎఱ్ఱన ఈ వంశ వృత్తాంతం పూర్వోత్తరాలుగా, విస్తృతంగా రచించాడు. కథాభాగం అందువల్ల దర్శింపవలసి ఉంది.

3.3.1. హరివంశం : హరివంశం పురాణం. ప్రశ్నోత్తరాల కూర్పు. ఉపాఖ్యానాల సమాహారం. జనమేజయుడు వైశంపాయునుడిని; శౌనకాదిమునులు ఉగ్రశ్రవసుడిని అడిగిన ప్రశ్నలకు సమాధాన ఉపాఖ్యానాలే హరివంశం. జనమేజయునకు వైశంపాయనుడు చెప్పిన కథను శౌనకాది మునులకు ఉగ్రశ్రవసుడు తెలిపాడు.

పరమాత్ముడు చేసిన సృష్టి విధానాన్ని, స్వయంభువు మను జననం నుంచి దక్ష ప్రజాపతి సంతతి వారి వివాహాలను సంక్షిప్తంగా అయన పేర్కొన్నాడు. సృష్టి క్రమాన కశ్యపు భార్యైనదితికి హిరణ్యాక్ష హిరణ్యకశిపులు జన్మించారు. దేవదానవ వైరం వలన, పుత్రవతి కావాలనే అదితి కోరిక తెలుసుకొని కశ్యపుడు శుచిగా అచల వృత్తితో ఉంటే పరాక్రమ శాలిని జనిస్తాడని తెల్పాడు. శుచిగా ఉన్న అదితి వద్దకు సేవ నెపాన వచ్చిన ఇంద్రుడు అదను చూచి ఆమె గర్భాన్ని ఛేదించి వ్రక్కలయిన వారిని మారుతులనే దేవతులవుతారన్నాడు.

జనమేజయుని కోరికపై వైశంపాయనుడు వేనుని శరీరం నుంచి జనించిన పృథు చక్రవర్తి భూదేవిని గోవుగా చేసి ఓషధ తతులు గ్రహించిన తీరును తెల్పాడు.

భాగవత పురాణ కథలో (3.2.4.2.) రెండవ భాగంలో ఈ వృత్తాంతం కనిపిస్తుంది. పిమ్మట స్వయంభువు మనువుతో ఆరంభమై అనాగత మన్వంతరాన్ని తెల్పాడు.

వైవస్వత మనువంశ క్రమాన్ని విస్తరించాడు. ఆ వంశ రాజయిన రైవతుడు రేవతి అనే పుత్రికతో తపానికేగి, సిద్ధ పదాన కార్యార్థియై బ్రహ్మలోకానికేగి ముహూర్త కాలం ఉండి వచ్చే సరిగి భూలోకానేక యుగాలు గడిచాయి. ద్వారక వెలసి అటనున్న బలరామునికి రేవతినిచ్చి తపానికి ఏగాడు. తత్కుల సంభవులు క్షత్రియ పూజితులయ్యారు. వైవస్వత మనువు పుత్రులలో ప్రథముడు ఇక్ష్వాకుడు. ఈ వంశస్థుడు కువలయాశ్వుడు. ఇతడు పుత్రపౌత్రులను పొంది తపానికేగ నిశ్చయించగా ఉదంకుడనే బ్రహ్మర్షి వచ్చి దుందుడనే రాక్షసుడు సృష్టిస్తున్న అల్లకల్లోలాన్ని నివారించ తగిన వాడు కువలయాశ్వుడేనని నారాయణుడు చెప్పగా వచ్చాననడంతో కొడుకులతో ససైన్యంగా వెళ్ళి వానిని చంపి మునులను సంతృప్తి పరిచాడు. కువలయాశ్వ వంశ అభివృద్ధి అయింది. ఆ వంశరాజు సత్యవ్రతుడు కృత దారాపరిగ్రమడవ్వడంతో తండ్రి వెళ్ళగొట్టాడు. ఆ రాజ్యాన్ని కరువు కాలాన రాజపురోహితుడయిన వశిష్ఠుడు రక్షిస్తూ ఉండేవాడు. దేశాన తన కుటుంబాన్ని ఉంచి విశ్వామిత్రుడు తపానికేగగా తిండికై ఆ ఇల్లాలు పుత్రుని అమ్మబోగా సత్యవ్రతుడు నివారించి వారి భారాన్ని భరిస్తూ ఒనాడు ఏదీ దొరకక వశిష్ఠుని గోవును చంపి మాంసం గొనిపోయాడు. అది తెల్సిన వశిష్ఠుడు ముత్తెరుగుల పాపం చేశాడు, కనుక త్రిశంకునిగా కమ్మన్నాడు. యాగం నుంచి వచ్చిన విశ్వామిత్రుడు సత్యవ్రతునికి యాగాన పూజార్హుని చేసి సశరీరంతో దివికి పంపాడు. ఈ వంశపు వాడే సగరుడు. రాజ్యానికి వచ్చి అశ్వమేధం చేయనెంచి, అశ్వం వెంట పుత్రులను పంపాడు. ఇంద్రుడు దానిని రసాతలాన దాచాడు. భూతలాన కన్పించక పాతాళానికి వెళ్ళి కాంచి, కపిలుని శంకించి ఆ కోపాగ్నికి వాళ్ళు భస్మమయ్యారు. మిగిలిన వారు వచ్చి చెప్పగా సగరుడు కపిలుని పూజించి అశ్వాన్ని పొంది, సముద్రాన్ని పుత్రునిగా పొందాడు. వంశాంతరాన జనించిన భగీరథుడు గంగను భూమికి దింపి పితృదేవతలకు ముక్తి కలిగించాడు. (ఈ వృత్తాంతం - భాగవతంలో లేదు)

పిమ్మట సనత్కుమారుడు మార్కండేయునకు ధర్మరాజుకు భీష్ముడు చెప్పిన పితృదేవతా ప్రభావాన్ని, పితృగణాలలో మూర్తి సహితులు, మూర్తి రహితులు అని రెండు రకాలను చెప్పి పితృదేవతా ప్రభావాన్ని తెల్పాడు. పిమ్మట భీష్ముడు కౌశిక పుత్రుల చరిత్ర చెప్తూ తనను జయించదలచిన ఉగ్రాయుధుని చంపిన తీరును చెప్పి, కౌశిక పుత్రులు ఏడుగురు గర్గ మహర్షి వద్ద విద్యకు చేరి, ఒకేనాడు ఆకలిగొని గరుగోవును, గవిఘుస్మలుడు వద్దని వారిస్తున్నా వినక పిత్రర్థం వధించి భుజించి గురువుకు దానిని పులి తిన్నదని చెప్పారు. హింస, గురు వంచలనకు హీన జన్మాలను పొందారు. మృగాలుగా విహంగాలుగా విభిన్న జన్మలెత్తారు. వారి ఇచ్ఛానుసారం వేటకొచ్చిన విభ్రాజునితో స్వతంత్రుడనే విహంగం వ్యక్తం చేసిన కోరిక ప్రకారం యోగ భ్రష్టత్వం పొంది బ్రహ్మదత్తునిగా, దానిని అలకించిన రెండు పక్షులు బాభ్రవ్యకండరీకులనే విప్రులుగా జన్మించి మిత్రులయ్యారు. మిగిలిన వారు శ్రోత్రియునికి జన్మించి యోగీశ్వరులై ఉత్తమ

సిద్ధి పొందారు. హరి దయతో భార్య అలుక తీర్చిన బ్రహ్మదత్తుడు దేవీ సహితుడై పరమసిద్ధి పొందాడు.

పిమ్మట వైశంపాయనుడు సోమాన్వయ క్రమాన్ని తెలిపాడు. సురుల గురుపత్ని అయిన తారను చంద్రుడు గొనిపోయి ఎవ్వరు చెప్పినా వినకుండా విడవకుండా ఉన్నాడు. అంగీరసుని శిష్యుడు శుక్రుడు తద్పక్షాన నిలవడంతో దేవదానవ యుద్ధం జరిగి శివప్రమేయంతో తారను తెచ్చి ఇవ్వడంతో తగవు తీరింది. అంతఃప్రసవయైన తారను ప్రశిన్నంచి తత్తేజం సోముని పుత్రునిగా వాళ్ళు ఎరిగారు. సోముడు తద్పుత్రినికి బుధుడని పేరుపెట్టాడు. బుధుని గుణాలకు ఆకర్షిత అయిన ఊర్వశి వానిని చేరి పుత్రులను పొందింది. తద్వంశజుడు రజి. రజి చరిత్రను తెల్పాడు.

సహుషునకు పుత్రుడు యయాతి. యయాతి దేవయాని శర్మిష్టల వృత్తాంతం, యయాతి శాపం, పుత్రునికి ఆ శాపం ఇచ్చి యౌవనం పొందడం చెప్పాడు. ఈ ఇతివృత్తం భాగవతం (2.2.4.3.)లో విస్తృతంగా కనిపిస్తుంది.

జనమేజయుని కోరికపై పురువంశాభివృద్ధిని వివరించాడు. ఆ వంశ క్రమంలో ఒకడే కేశి. కేశిపుత్రుడు జహ్నుడు. జహ్నుడు సర్పమేధయాగం చేయబూనినాడు. గంగాదేవి ఆ ముఖాగారంపై నడవగా కోపించి త్రాగసాగాడు. మునివరులంతా అతనిని శాంతింప చేశారు. జహ్నుడు తాగిన నీరు కావేరిగా జనించింది. ఈ పురువంశాన్ని వివరించిన పిదప దుర్వసుని వంశాన్ని వివరించి క్రమంగా అదిష్యంతుని కాలంలో పురువంశాన కలిసిపోయిందన్నాడు. యాదవ వంశాన్ని వివరిస్తూ యాదవుకుతో అరంభమయిందీ వంశం అన్నాడు. కార్త్యవీరుడు, కృష్ణుడు వంటి ప్రసిద్ధులున్నారు. జ్యామదుడనే రాజ రాజ్యం వద్దని తపానికేగి విప్రబోధతో తిరిగి రాజ్యాధికారం చేపట్టదలచి శుక్తిమతి అనే పూరిని ఆక్రమించి అనేక రాజ్యాలు జయించాడు. రాజులందరూ పారిపోగా అడవిలో ఒంటరిగా ఉన్న ఒక తనూజను చూచి ఆమెను గ్రహించి పుత్రవంతుడయ్యాడు. కుకురుడు భజమానుడు శుచి అనే వారితో ఆరంభమయిన అంధకవంశంలో నిఘ్నునికి ప్రసేన సత్రాజిత్తులు జన్మించారు. (అంధక వంశ ప్రశంస భారతంలో కనిపిస్తుంది).

సత్రాజిత్తు తన తపశ్శక్తితో ఈశ్వర వరప్రసాదాన శమంతకమణిని పొందాడు. శమంతకమణి సత్రాజిత్తు నుంచి అక్రూరుని దాకా చేరిన వృత్తాంతం ఈ మధ్యలో జాంబవతి, సత్యభామలను కృష్ణుడు వివాహమాడిన వృత్తాంతం చెప్పాడు. కథ భాగవతంలో విశాలంగా వ్యాప్తి చెంది ఉంది. (3.2.4.4.)

అంధక వంశ క్రమాన్ని విశేషాలను చెప్పి శౌరి పరాక్రమాలను చెప్పసాగాడు. సౌష్కరమనే అవతారంతో మధుకైటభులనే దానవులను వధించాడు. వరాహ రూపాన భూదేవిని సప్తజలాల మధ్య నిల్పాడు. దైత్యరాజు, పరాక్రమవంతుడు, బ్రహ్మ వరాన ప్రసాదితుడయిన హిరణ్యకశిపుని నృసింహావతారాన అణచివేశాడు. పరుశురామావతారాన రాజులను అణచివేశాడు. రామావతారాన దశగ్రీవుని వధించాడు. పిమ్మట కృష్ణావతారం పొందాడు. దేవదానవులు పరస్పరం యుద్ధసన్నద్ధులై ఎదుర్కోగా విష్ణువు గరుడ

వాహనారూఢుడై దేవతలకు సహాయంగా నిల్చాడు. దానవుల చావుకు వగచి మయుడు నేత్రశక్తి ద్వారా ఔర్వుని దృష్టిని ప్రసరించాడు. దేవతలు బ్రహ్మను వేడగా ఔర్వుని వృత్తాంతం తెలిపి ఆ అనల తేజాన్ని సముద్రంలోనికి పంపి శాంతింప చేశాడు. మయుని పిమ్మట కాలనేమి పోరి ఇంద్రుని ఓడించి, శ్రీహరి పైకి పోరుకు వెళ్ళి చక్రాయుధానికి గురయ్యాడు. విష్ణువు తన నిజవాసమేగి యోగనిద్రాసక్తుడయ్యాడు.

విష్ణువు యోగనిద్రలో ఉండగా, భూదేవి క్లేశాలను చూచి బృందారకులు శతానందుని గూడి హరిని చేరి ప్రస్తుతించగా, భూమాత తన బాధలను తెలుపుకొంది. భూదేవి బాధలను మాన్పడానికి దేవతలు తమ అంశాలు వసుధపై జనించాలని నిర్ణయించారు. బ్రహ్మ ఆదేశానుసారం సముద్రుడు శంతనుడై జనించాడు. వంశాభివృద్ధి జరిగి కలి అంశాన జనించిన ధృతరాష్ట్రాదులు, సర్వప్రేరకుడయిన కృతాంతు అంశతో పాండుపుత్రులు జనించారు. దేవదాన యుద్ధంలో మరణించిన వారందరూ భూలోకాన జన్మిస్తున్నారని, కంసాదులుగా కాలనేమి తదితరులు జన్మించింది విష్ణువు చెప్పి, హరి అవతారం తప్పని సరి అని నారదుడు చెప్పగా, తన జన్మకు తగిన స్థానం బ్రహ్మ శాపకారణాన వసుదేవునిగా జన్మించిన కశ్యపునిగా గ్రహించి బ్రహ్మ ద్వారా జనించబోయే విధానం తెల్సుకొన్నాడు. నారదుడు కంసునికి, సోదరి దేవకి ఎనిమిదవ గర్భం మృత్యుహేతువు కాగలదని చెప్పిపోయాడు. విన్న కంసుడు దేవకి గర్భ ధ్వంసానికి నిర్ణయించుకొన్నాడు. నారదుడు కంసునిలో కలిగించిన కల్లోలాన్ని తెల్పాడు. విష్ణువు యోగమాయను యశోదా పుత్రిగా జన్మించ నియోగించాడు. నందునింట చేరడం, కంసుని దూషించి యోగమాయ మాయ కావడం, కృష్ణుని బాల్య క్రీడలు పూతన హరణం, ఉల్లూఖల వృత్తాంతం అతి విస్తృతంగా భాగవతం (3.2.4.4.) లో పోతన అభివర్ణించాడు.

శ్రీకృష్ణుడు బలరాముడితో ఎప్పుడూ ఒకే చోట ఉండటం శ్రేయం కాదు కనుక బృందావనం పోవటం శ్రేయం అన్నాడు. నారదుడు బృందావనం వెళ్ళితే శుభాలు చేకూరుతాయని నందగోపునితో చెప్పడంతో అందరూ బృందావని చేరారు. గ్రీష్మం ప్రవేశించింది. అడవిలో రగులుకొన్న అగ్నికి అడవి మాడిపోయింది. గోసంపద, గోపకులు రోగగ్రస్థులయ్యారు. పోగొట్టడానికి శివపూజా వ్రతం నిర్వహించారు. ఆ వ్రతాన మహోద్విజుడు శంఖ కర్ణుడనే భూతావేశాన విషపూరితమైన వృక్షం గురించి చెప్పడంతో బలరామకృష్ణులు తమ పరాక్రమంతో కపిత్థవృక్షాన్ని నాశనం చేశారు. స్వస్థులయిన గోపాలురతో కలసి కృష్ణుడు యమునలో జలక్రీడలాడాడు.

అట విదేహ పురాన, యశోద అనుజ్ఞుడైన కుంభకుని ఇంట, కాలనేమి కొడుకులేడుగురు వృషభాలై జన్మించారు. వాళ్ళు దేశ ప్రజల పంట నాశనం చేస్తుంటే రాజు కుంభకుని హెచ్చరించాడు. కుంభకుడు ఈ విషయమంతా నందునితో చెప్పాడు. శ్రీకృష్ణుని తండ్రి తదితరులతో మిథిల విచ్చేసి కుంభకునింటికి వెళ్ళి, సప్త వృషభాలను కాలనేమి పుత్రులుగా బలరామునితో తెలిపి, ఒక్కో ముష్టి ఘాతంతో వాటిని వధించి, కుంభకుని పుత్రిక నీళను గ్రహించి వెనుదిరిగాడు.

యౌవన దశలో యమునా తీరాన తిరుగుతూ తీర్థార్థులయిన వాసుదేవ

భరద్వాజులను చూచి సంతోషించాడు. వారు దివ్యదృష్టితో కృష్ణుని తెలుసుకొని స్తుతించి వెళ్ళారు. కృష్ణుని కాళింది నర్తనం, ధేనుకాసుర వధ, ప్రలంబాసుర వధ, గోవర్ధనగిరి ఇతివృత్తం, గోపికలతోడి క్రీడలు, కృష్ణలీలలు భాగవతంలో అశేషంగా కనిపిస్తాయి. భాగవతం (3.2.4.4.)లో ఈ ఇతివృత్తాలకు ఎంతో ప్రాధాన్యముంది.

గోపికా సమూహానున్న కృష్ణుని ఒక రాత్రి పరిమార్చ వృషభ రూపాన వచ్చి గోకులాన్ని కల్లోలం చేస్తున్న అరిష్టుడనే రాక్షసుని సంహరించాడు. కంసుడు కృష్ణ సంహారార్థం పంపిన కేశి వృత్తాంతం కంసుడు అక్రూరుని ద్వారా కృష్ణుని పిలవ పంపడం భాగవతం (3.2.4.4.) లో కనిపిస్తాయి. వారిరువురు మధురకు ప్రయాణమయ్యారు. యమునలో అక్రూరునికి కృష్ణుడు తన మహానుభవాన్ని చూపి చరితార్థుని చేశాడు. ప్రొద్దుపోకమునుపే కంసదర్శనంచేయాలని త్వరపరచి మధుర ప్రవేశించారు. నగర వీక్షణకు రామకృష్ణులను వీడి, అక్రూరుడు నృపతిని దర్శించాడు. రామకృష్ణులు మధురను అవలోకిస్తూ రాజ రజకుని వద్ద పట్టు వస్త్రాలు గ్రహించి ధరించారు. అనులేపనం రాజ మందిరానికి గొనిపోతున్న కుబ్జ అనే కంసదాసి వద్ద లేపనం గ్రహించి ఆమెకు సురూపం ప్రసాదించారు. పిమ్మట కంస మందిర ద్వార సమీపానున్న ఆయుధాగారం ప్రవేశించి శరాసనాలు ధ్వంసం చేశారు. ఆ వార్త విన్న కంసుడు కోపించాడు. కంసుడు నియుక్తం చేసిన మల్ల యుద్ధ వీరులను గూర్చి కువలయా పీడనం వృత్తాంతం, కంస వధ భాగవతం (3.2.4.4.)లో అతివిస్తారంగా అభివర్ణితమయింది. దుఃఖితులయిన కంసభార్యలు కంస దేహ సంస్కారానికి ఉగ్రసేనుని ద్వారా కృష్ణానుమతి పొందారు. ఉగ్రసేనుణ్ణి మధురకు రాజుగా చేసి కృష్ణుడు సోదరునితో కూడి సాందీపుని వద్ద విద్యాభ్యాసం చేశాడు. గురుదక్షిణగా సముద్రంలో కోల్పోయిన సాందీపుని మృతపుత్రుని తెచ్చిచ్చి మధురకు, అట నుండి బృందావనం వచ్చారు బలరామకృష్ణులు. ఈ వృత్తాంతం భాగవతంలోనూ కనిపిస్తుంది.

కంస భార్యలు జరాసంధుని కుమార్తెలు వారికి కృష్ణుడు పట్టించిన గతికి కోపించి దాడి చేయడం గోమంత పర్వతాన్ని రగల్చడం, ఓడడం తిరిగి దాడి చేయడం, ఓడడం, తిరిగి కాలయవన, జరాసంధుల దాడి, కాలయవనుడు ముచికుందుని చేతిలో మృతి చెందడం, కృష్ణుడు విశ్వకర్మతో ద్వారవతి నగర నిర్మాణం చేయడం భాగవతంలోనూ (3.2.4.4.) సుదీర్ఘంగా విస్తరించిన కథా భాగం.

కుండిన పుర రాజు భీష్మకుడు. రుక్మి అనే పరాక్రమవంతుడు రుక్మిణి అనే సౌందర్యవతి ఇతని సంతానం. గౌరీ పుజకు వెళ్తున్న రుక్మిణిని కృష్ణుడు పోరాడి తెచ్చి ద్వారకలో వివాహం చేసుకోవడం భాగవతం (3.2.4.4.)లోనూ కనిపించే కథాభాగం. అనంతర కాలంలో సప్త భార్యలను పొందాడు. రుక్మిణీ కృష్ణులకు ప్రద్యుమ్నుడు జన్మించాడు.

ఆ బాలుని శంబరాసుడు ప్రమాదంగా భావించి చంప ప్రయత్నించడం, వాడి భార్య పెంచడం, ఆమె ద్వారా జననాదులు తెలుసుకొని రాక్షసుని చంపి ద్వారక చేరడం భాగవతేతివృత్త (3.2.4.4.) భాగమే. విదర్భాధీశుడయిన రుక్మి పుత్రికను స్వయంవరాన పొందడం, రుక్మి బలభద్రుని చేతిలో జూదంలో ఓడి, మరణించడం హరివంశ భాగవతాలు రెంటిలోనూ గోచరిమయ్యే కథాంశాలు.

జనమేజయుని కోరికపై వైశంపాయనుడు బలరాముని పరాక్రమం చెప్పాడు. ద్వారకలో కృష్ణాదులు క్షేమంగా ఉన్న కాలాన నరకుడు బ్రహ్మ వరంతో ముల్లోకాలను అల్లకల్లోలం చేయసాగాడు. దేవతలను ఓడించి దేవమాత అదితి అనర్ఘరత్న కుండలాలను దొంగలించాడు. ఈ నరకుని పైకి కృష్ణుడు సత్యభామా సమేతుడయి దాడి చేసి వధించి, వాని చెరలో ఉన్న పదహారు వేలమందిని వివాహమాడడం, ఇంద్రుని అతిథ్యానికి దేవోద్యానవనానికి వెళ్ళి పారిజాత వృక్షాన్ని అన్ని అడ్డంకులు ఎదుర్కొని తేవడం ఇరు గ్రంథాలలో కనిపించే సమాన కథాసారాంశం.

ఇంద్రుని చేత పొందిన విశిష్ట సంపదలతో ద్వారకను, కృష్ణ మాహాత్మ్యాన్ని చూడటానికి ఎందరో రాజులు ఉత్సుకతతో ఉన్నారు. అట్టి సమయాన సుయోధనుడు యాగానికి ఆహ్వానించ కృష్ణుని దర్శించి అనుమతి పొందాడు. ఆ రాజులకు నారదుడు కృష్ణుని ప్రభావం తెల్పాడు. భీష్ముడు శరతల్ప గతుడై ధర్మరాజుకు అనేక పుణ్యకథలు చెప్పునప్పుడు అర్జునుడు తానెరిగిన కృష్ణ మాహాత్మ్యాన్ని ధర్మరాజుకు వివరించాడు. ఆ మాహాత్మ్యాన్ని వైశంపాయనుడు చెప్పసాగాడు. ధర్మరాజు పంపున అర్జునుడు ద్వారక ఏగి ఉండగా ఒక యాగానికి కృష్ణుడు దీక్షలో ఉన్నాడు.

ఒక విప్రుని మృతపుత్రుల వృత్తాంతం తెలిసి వారి మరణాన్ని అర్జునుడు నిరోధించలేక పోవడం, కృష్ణుడు మృతపుత్రులను తెచ్చిచ్చే వృత్తాంతం భాగవతం (3.2.4.4.)లోనూ ఉంది. పిమ్మట వైశంపాయనుడు త్రిపురాసుర మర్దనం చెప్పాడు.

రుక్మిణి కృష్ణులు కేళి విలాసాలలో ఉండగా కృష్ణుని వంటి తేజంగల పుత్రవాంఛను రుక్మిణి వ్యక్తం చేయడంతో, ఈశ్వరారాధనతో కొడుకును పొందుతానని పలికి బలరామాదులకు తన కైలాసయాత్ర తెలిపి కృష్ణుడు వెళ్ళాడు. బదరికావనం చేరి సమాధి స్థితుడై నిల్చాడు. ఆ వనాన కలకలం చెలరేగి రెండు మహాపిశాచాలు ప్రత్యక్షం కావడంతో జంతు కోటి హరిని ఆశ్రయించాయి. కృష్ణుడు వారిని ఎవరని ప్రశ్నించగా తాను ఘంటా కర్ణుడని, కుబేర కింకరుడని, తన సోదరుడు మత్స్యమానవీడుడని తెల్పి కొంత సంభాషించి, ప్రస్తుతించాడు. అతని ఉత్తమ ధ్యాన నిష్ఠకు మెచ్చి కృష్ణుడు తన దివ్యమూర్తిని సాక్షాత్కరించి కృతార్థుని చేయటంతో, కృష్ణుని స్తుతించి, పిశాచరూపం వీడి పుణ్య లోకాలను చేరాడు.

మరు ఉదయం గరుడారోహి అయి కైలాసం చేరి దాని వైభవాన్ని ప్రశంసించాడు. అట నియతభావుడయి పన్నెండు సంవత్సరాలు గడిపాడు. ఇంద్రాది దేవతలు కృష్ణుని చూడటానికి కైలాస పర్వతానికి వచ్చి గూఢ మనోరథ ఫల యత్నంతో ఉన్న కృష్ణుని చూశారు. మరునాడు శివుడు సపరివాడయి తపమాచరిస్తున్న కృష్ణుని వద్దకేగగా, కృష్ణుడు ఆసనం వీడి శివుని చేరి తన్మాహాత్మ్యాన్ని స్తుతించాడు. తపఃఫలంగా పుత్రుడు కలుగుతాడని చెప్పి కృష్ణ మాహాత్మ్యాన్ని వివరించి మునులను అభినందించి శివుడు వీడ్కొని ఏగాడు. హరి గరుడ వాహనం మీద బదరికావనం చేరాడు. వసుదేవుని కైలాసయాత్ర తెలిసి పౌండ్రక వాసుదేవుడు నారదునితో శ్రీకృష్ణుని మీద వైరం చెప్పగా విని మారాడక వెను తిరిగి బదరికావనంలోని కృష్ణునికి తెల్పాడు. పౌండ్రక వాసుదేవుడు ద్వారకపై దాడి

చేశాడు. సాత్యకి పౌండ్రక వాసుదేవునితో, ఏకలవ్యుడు బలదేవునితో తలపడ్డారు. పోరు తీవ్రమయింది. కృష్ణుడు తిరిగి ద్వారక చేరాడు. కృష్ణుని రాక విని పౌండ్రక వాసుదేవుడు వెనుతిరిగి పోయాడు. తనవారితో విశేషాలు విన్న కృష్ణుడు వానిని చంపదలిచాడు. ఆ వార్త తెలిసి పౌండ్రుకుడు యుద్ధానికి సిద్ధమయ్యాడు. కృష్ణుడు గరుడ వాహనారూఢుడై ఏగి పౌండ్రకునితో పోరి, తన చక్రాయుధంతో కాశీరాజు సుతుడు దక్షిణాగ్నిలో జనించిన కృత్యను కృష్ణ వధకు పంపగా, ప్రజల కోరికపై తన చక్రాయుధంతో వధించాడు.

పిమ్మట వైశంపాయనుడు బాణాసుర వృత్తాంతం చెప్పసాగాడు. ఈ వృత్తాంతం భాగవతంలో (3.2.4.4.) కనిపిస్తుంది. అయితే భాగవతంలో కంటే విస్తృతంగా హరివంశంలో కనిపించే ఇతివృత్తాలలో ఇది ఒకటి.

బాణుడు శివుని వరం పొందడం, అతని కుమార్తె ఉష, ప్రద్యుమ్నుని పుత్రుడైన అనిరుద్ధుని మోహించడం, తద్ఫలితంగా గర్భం ధరించడం, కోపించిన బాణుడు నాగపాశ బద్ధుని చేయడం, తెలిసి అనిరుద్ధుని కొరకు కృష్ణుడు ప్రద్యుమ్నుడు దాడి చేసి ఓడించారు. ఇరువురి వివాహం వైభవంగా జరిగింది. ఈ ఇతివృత్తం రసోచితంగా ఆవిష్కృతమయింది హరివంశంలో. పార్వతి ప్రార్థనలపై ప్రాణాలతో మిగిలిన బాణుడి పశువులు వరుణుని వద్ద ఉన్నాయని కుంభాండుడు చెప్పడంతో కృష్ణుడు యుద్ధానికేగి ఓడించాడు. ఇంద్రాది దేవతలతో కృష్ణుడు నగరం ప్రవేశించి, యదుగణాలతో పరిచర్యలు చేయించాడు. సంతసించిన ఇంద్రుడు కృష్ణావతారాన్ని ప్రశంసించి అమరావతి కేగాడు.

పూర్వప్రోక్తమైన హరివంశాన్ని విన్న శౌనకాది మునులు సంతోషించి జనమేజయుని వృత్తాంతం ఉగ్రశ్రవసుడిని కోరారు. జనమేజయుని వంశ విస్తృతి తెలిపి మునుల కోరికపై కథనం కొనసాగించాడు. జనమేజయుడు సర్పయాగానంతరం అశ్వమేధం చేయటానికి ప్రయత్నాలు ఆరంభించాడు. అక్కడకు వచ్చిన వేదవ్యాసుడు అనాగతం తెలిపి, నృపతి కోరికపై కలియుగ ధర్మాలను చెప్పి వెళ్ళాడు. అశ్వమేధానికి సిద్ధమయి సమగ్ర మంగళ దీక్షను గ్రహించాడు. ఆ రాత్రి జరిగిన ఉదంతమంతా ఇంద్రుని పరీక్షగా విశ్వాసుడనే గంధర్వుని ద్వారా తెలుసుకొని సంతృప్తుడయ్యాడు. ఉగ్రశ్రవసుడు జనుల కోరికపై జనమేజయునకు వైశంపాయనుడు చెప్పిన హరి మాహాత్మ్యాలను చెప్పసాగాడు. సృష్ట్యారంభాన మార్కండేయుడు మహామూర్తిని కని తత్‌కుక్షి ప్రవేశించి, మాయ తెలుసుకోలేక పోయాడు. అటనున్న బాలుని చూచి విస్మయం చెందాడు. ఆ బాలుని రూపాన ఉన్న నారాయణుడు తన ప్రభావాన్ని తెల్పాడు. ఆ ముని హరి ప్రసాద లబ్ధ విశేషాలతో ఉల్లసిల్లాడు. ఆ సమయాన నారాయణుడు సృష్టికి పూనుకొన్నాడు. హరి వంశాన ఉన్న రజస్తమో గుణాలు మధుకైటభులుగా, జన్మించి అతిశయాన హరి చేతిలో మృతులయ్యారు. యోగనిద్ర నుంచి లేచిన నారాయణుడు భూమి పాతాళ గతమవటం తెలిసి వరాహ రూపాన భూమిని ఉద్ధరించాడు. కొంత కాలానికి హిరణ్యాక్షుడు అనే రాక్షసరాజు తదితర గణాల బల దర్పంచే భూమి బాధింపబడసాగింది. వీరు ఇంద్రుని ఓడించారు. ఓడిన ఇంద్రుడు వరాహరూపుడయిన హరిని శరణు వేడాడు. వారిని రక్షించడానికి హిరణ్యాక్షునితో పోరి సంహరించాడు. అది యుగాన అసుర రాజయిన

హిరణ్యకశిపుడు ధైర్యాదిగుణ సంపన్నుడు. తీవ్ర తపస్సుతో బ్రహ్మ ద్వారా సర్వభూత దుర్జయునిగా వరం పొందాడు. దేవతల రక్షణకై నృసింహునిగా హిరణ్యకశిపుడు కొలువు తీరి ఉండగా అవతరించి వధించాడు. ఈ వృత్తాంతం భాగవత కథా, ప్రణాళిక (3.2.4.2.)లో భాగం.

హిరణ్యకశిపుని వంశజుడు - బలి. తన బలపరాక్రమాలతో ఇంద్రుని ఓడించి అమరావతిని ఆక్రమించాడు. దేవతల రక్షణార్థం విష్ణువు వామనావతారం ధరించడం, బలిని సుతలానికి పంపి అమరావతిని ఇంద్రునికివ్వడం వివరణాత్మకంగా ఇందులో ఉంది. భాగవతం (3.2.4.3.)లో కొంత సంక్షిప్తంగా ఉంది.

వామనావతార గాథ తెల్పి, భారతాన్ని పదిసార్లు వినాలని, దాని వలని ఫలాలను వివరించాడు. పర్వానంతరం చేయదగ్గ దానాలు తెల్పాడు అని వైశంపాయనుడు చెప్పిన హరివంశాన్ని తెల్పి మునులను సంతుష్టులను చేశాడు - రోమహర్షణుడు. •

3.3.2. ఉత్తర హరివంశం : తెలుగులోని ఉత్తర హరివంశం నాచన సోమనాథుని ప్రణీతం. హరివంశ కథాంశంలోని ఉత్తర భాగం మాత్రమే ఇందులో కనిపిస్తుంది. ఉత్తర హరివంశంలో భాగవత హరివంశాలలో ఉన్న ఉపాఖ్యానాలే ఉన్నాయి.

పురాణంలో ప్రసక్తమయ్యే సుదీర్ఘ కాల పరిధికి 14వ శతాబ్దంలో పరిమితి ఏర్పడింది. పురాణ లక్షణాలు తగ్గి వంశ లక్షణాలతో మాత్రమే ఈ రచన సంతరించుకొంది. ఎఱ్ఱన హరివంశం ఏకలక్షణ ఆశ్రితంగా ఉంది. ఈ ఒక్క వంశాన్ని గూర్చిన రచన రెండు భాగాలై, నాచన సోముని కాలానికి ఉత్తర భాగం మాత్రమే రచించే స్థితి వచ్చింది. ఎఱ్ఱన సోమనలు సమకాలికులే అయినా, ఒకే మూలాన్ని గ్రహించినా రచనలో వచ్చిన మార్పు ఇది. పురాణ పంచ లక్షణాలలోని ఏక లక్షణానికి చెందిన సగం మాత్రమే ఉత్తర హరివంశంలో కనిపిస్తుంది.

ఉత్తర హరివంశమని పేరుపెట్టినా నాచన సోముడు '... జరాసంధుడు మధుర మీద దండెత్తడం, రుక్మిణీ పరిణయం, పారిజాత వృత్తాంతం తెనిగించలేదు'. (52) 'ఎఱ్ఱన హరివంశము ఉత్తర భాగము నందున్న జరాసంధ కథ, కాలయవన సంహారము, రుక్మిణీ కళ్యాణము, ప్రద్యుమ్న జననము, రుక్మి కథ మొదలైనవి సోమనాథుని ఉత్తర హరివంశము నందు కానరావు'. (53)

ఉత్తర హరివంశంలోని ఉపాఖ్యానాలలో నరకాసుర వృత్తాంతం, బ్రహ్మణ పుత్ర రక్షణ, భాగవతం హరివంశాలు రెంటిలోనూ ఉన్న వృత్తాంతాలు. పుత్రార్థి అయి కృష్ణుడు శివునికై తపస్సు చేయటం, పౌండ్ర భూపతి వృత్తాంతం, హరివంశ కథా కల్పనలో భాగం బాణుని చరిత్ర భాగవత హరివంశాలు రెండింటిలోనూ కనిపిస్తుంది. ఉత్తర హరివంశానికి ప్రత్యేకమైనది హంసడిభకోపాఖ్యానం.

వైశంపాయనుడు జనమేజయునకు చెప్పిన కథలివి. సాల్వ దేశాధిపతికి సంతానం లేదు. శివుని ఆరాధించగా ఒకనాటి కలలో పుత్రద్వయాన్ని ప్రసాదించాడు. రాజమిత్రుడయిన విప్రుని భక్తికి మెచ్చి హరి, పుత్రవరాన్ని ఇచ్చాడు. తత్ ఫలితంగా శివ

ప్రాముఖ్యాన హంసడిభకులు, హరి ప్రాధాన్యాన మంత్రికి జనార్ధనుడు జన్మించారు. ముప్వురూ వేద విద్యానిపుణులు అయ్యారు. హంసడిభకులు శివునికై తపస్సు చేసి అజేయతను వరంగా పొందారు. రాజ్యానికి వచ్చి వివాహితులయ్యారు. ఒకనాడు హంసడిభకులు పుత్రులతో కూడి వేటకేగి అలసి సేదతీరారు. సమీపాన ఉన్న కశ్యపుని ఆశ్రమాన్ని సమీపించి మునితో తాము చేయబోతున్న రాజసూయ యాగాన్ని గూర్చి సంభాషించారు. పిమ్మట అడవిలో దుర్వాసుని కాంచి అవమానించారు. శపించబోయిన దుర్వాసుని జనార్ధనుడు నివారించాడు. దురహంకారంతో హంసడిభకులు వెళ్ళారు. అవమానితుడయిన దుర్వాసుడు ద్వారవతి ఏగి కృష్ణునికి హంసడిభకుల దుశ్చేష్టలను తెలిపాడు. అభయమిచ్చి పంపి, కృష్ణుడు వారిని వధించడానికి యోచించసాగాడు. అట హంసడిభకులు యజ్ఞ సంభారాలు తేవడానికి నిశ్చయించి, యాదవ నగర భాగం తేవటానికి జనార్ధనుని పంపారు. జనార్ధనుడు నగర ప్రవేశం చేసి బలరామకృష్ణులకు నమస్కరించి దూత కార్యం నడపగా, కృష్ణుడు కప్పం ఇవ్వ నిరాకరించి సాత్యకిని తన మాటలు చెప్పడానికి జనార్ధనుని వెంట పంపాడు. సాత్యకి సాల్వదేశాన యుద్ధ వార్త తెలిపి వెనుదిరిగి ద్వారకేగి విశేషాలను తెలిపాడు. కృష్ణుడు మరునాడు యుద్ధసన్నద్ధుడై వెడలి పుష్కర తీరాన నిల్చాడు. హంసడిభకులూ యుద్ధ సన్నద్ధులై నిల్చారు. కృష్ణుడు తనతో పోరాడుతున్న విచక్రుణ్ణి ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించి సంహరించాడు. యదువృష్ణిని నిరవశేషం చేస్తున్న రాక్షసుడయిన హిడంబుని ఎదిర్చి ఉగ్రసేన వాసుదేవులు నిలువ లేకపోయారు. బలరాముడు వానిని ఎదుర్కొని పోరాడి వధించాడు. మరునాటి పోరులో చెలరేగుతున్న భూతద్వయాన్ని పట్టి కృష్ణుడు కైలాసాద్రిపై పడవేశాడు. హంసునితో పోరాడి, యమునలో ముంచి అడుగంట తొక్కేశాడు కృష్ణుడు. హలాయుధునితో పోరాడుతున్న డిభకుడు హంసుని గతి విని యమున జలాల ప్రవేశించి హంసుని కానక దుఃఖించి వానికై వెదుకుతూనే మరణించాడు. వీరివురి మృతికి యాదవులందరూ ఆనందించారు. వీరి విజయవార్త విన్న యశోదా నందులు కృష్ణుని చూడ ద్వారవతి వచ్చారు అని తెల్పాడు.

3.3.3. ఇతర హరివంశాలు : తాళపాక పెద తిరుమలయ్య హరివంశం ద్విపదలో రచించాడు. 1600 ప్రాంతాలకు చెందిన గూళికల్లు వెంకట రమణకవి ఆంధ్రీకరించాడు. 'అయితే ఆ పుస్తకం నామమాత్రా వశిష్టమయింది'. (54) తామరపల్లి తిమ్మయ్య హరివంశంలో ఉన్న ధర్మబోధలు చేసే శేష ధర్మాలను, ఎఱ్ఱన అనువదించని భాగాన్ని అనువదించాడు.

తాళ్ళపాక చిన తిరువేంగళనాథుడు 'ఉషా పరిణయం' రచించాడు. ఇదే ఘట్టాన్ని భావన పెమ్మన 'అనిరుద్ధ చరిత్ర'గా రచిస్తే, కోననారాయణ 'వజ్రాభ్యుదయం'గా రచించాడు. దామెర్ల అంకరాజు అయిదాశ్వాసాల కావ్యంగా 'ఉషా పరిణయా'న్ని వ్రాశాడు. తరిగొప్పుల మల్లన శ్రీకృష్ణుని సంతానం, వారి కథను 'చంద్రభాను చరిత్ర'గా రచించాడు.

సత్యభామ వృత్తాంతంఅనంతర కాలంలో అనేక రచనలకు మూలమయింది. 'సత్యభామా సాంత్వనం' సుప్రసిద్ధం. భామాకలాపం పేరిట నాట్యమార్గంలో కూచిపూడి

సృష్టి గమనార్హం. సత్యభామా పారిజాతాపహరణం నుంచి శృంగార నాయికగా అందుకు ఆమె ఒక ప్రతీకగా ప్రభవించింది. పురాణ భాగమయి వంశ రచన శ్రీకృష్ణ మాహాత్మ్య బోధకంగా విశిష్టస్థానం పొందింది.

3.4. మాహాత్మ్యం

వివిధ పురాణాలలోని విభిన్నాంశాలు మాహాత్మ్యం పేరిట తెలుగు సాహిత్యంలో రూపం దిద్దుకొన్నాయి. స్థల, క్షేత్ర, తీర్థ, వ్యక్తి మాహాత్మ్యాలు సాంఘికంగా ప్రసిద్ధమే. అందులో కొన్ని సాహిత్యంలో ప్రవేశించి సుప్రసిద్ధం కావటం గమనార్హం.

పురాణం పంచ లక్షణాలలో కొన్ని తగ్గిపోయి, కొన్నింటితో మాత్రమే రూపొందే దశను దాటి వంశమే పురాణ విషయంగా పరిణామం చెందటం గుర్తింపు పొందింది. వంశం కూడా మారి మాహాత్మ్యం మాత్రం ప్రసక్తమయి పురాణాత్మ ప్రవర్తిల్లుతూ వచ్చింది. పురాణ తత్త్వదర్శనం చేసిన మాహాత్మ్య సాహిత్యం పరిశీలించడం అవసరం.

3.4.1. శ్రీరంగ మాహాత్మ్యం : 1347 ప్రాంతాలకు చెందిన శ్రీగిరి అయ్యగారు రచించిన శ్రీరంగ మాహాత్మ్యం అలభ్యంగా ఉంది. గరుడ పురాణాన్ని ఆధారం చేసుకొని తొలిరాయల యుగపు కవి భైరవుడు శ్రీరంగ మాహాత్మ్యాన్ని రచించాడు. 'వాస్తవానికి శ్రీరంగ మాహాత్మ్యంలో కథ విశేషంగా ఏమి లేదు' (55). ఇక్ష్వాకు మహారాజు తపః ఫలంగా రంగధామ సూర్యవంశ రాజధానిలో నిల్చింది. విభీషణుడు దానిని తెచ్చి కావేరి వద్ద తాత్కాలికంగా నిల్పి, తిరిగి లంకకు తీసుకెళ్ళ యత్నించి విఫలుడయ్యాడు. అది పుణ్యక్షేత్రం అయింది. అట మరణించిన వారిని తీసుకెళ్ళడానికి వచ్చిన యమదూతలు విష్ణుదూతల చేత ఆటంకం ఎదురుకొని యమరాజుకు తెలుపుకోవడం దీనిలోని కథ.

ఈ స్థల పురాణమైన శ్రీరంగ మాహాత్మ్యాన్ని ముకుందయోగి ద్విపదలో రచించాడు. తర్వాతి కాలంలో విష్ణుపారమ్యాన్ని తెల్పే ఈ మాహాత్మ్యాన్ని కట్టావరదరాజు పది ఆశ్వాసాల కావ్యంగా రచించాడు. విజయరంగ చొక్కనాథుడు (1706-32) ఇదే కావ్యాన్ని పది అధ్యాయాలు కలిగిన రచనగా వచనంలో వ్రాశాడు. చేకూరు సిద్ధయ్య దీన్ని అయిదు ఆశ్వాసాల పద్య కావ్యంగా రచించాడు.

3.4.2. శివరాత్రి మాహాత్మ్యం : ఇది 15వ శతాబ్దానికి చెందిన శ్రీనాథుని రచన. అయిదు ఆశ్వాసాల కావ్యం అయిన ఇందులో నాలుగు మాత్రమే లభిస్తున్నాయి. శివరాత్రి మాహాత్మ్యాన్ని తెల్పే ఈ కావ్యంలోని కథా భాగమిది.

నైమిశారణ్యంలో శౌనకాది మునులకు సూతుడు శివరాత్రి మాహాత్మ్యాన్ని చెప్పాడు. ప్రళయాంత కాలపు రాత్రి బ్రహ్మ విష్ణువులు తాను అధికుడనంటే తాను తానని పోట్లాడుకొంటూ పోరుకు దిగారు. వారిని ఆపడానికి శివుడు స్తంభ రూపంలో నిల్చాడు. ఆ స్తంభం ఆద్యంతాలు తెలుసుకోవడానికి ప్రయత్నించి విఫలులయిన బ్రహ్మ విష్ణువులకు శివుడు శివరాత్రి వ్రత చర్యను ఉపదేశించాడు. రత్నపురాన్నేలే హేమాంగదుడనే రాజుకు వ్రతఫలంగా జన్మించిన సుకుమారుడు యుక్తవయస్సులో చెడు త్రోవలనడిచి

చెడ్డ పేరు సంపాదించాడు. చండాల స్త్రీని వివాహమాడి ఆ ప్రాంతాలలో ఉండలేక వదలిపోయాడు. భార్య మరణించింది. వయస్సు ముదిరింది. అయినా వ్యసనాలు తగ్గలేదు. కూతుళ్ళ కోసం పూలకోసం వెళ్ళి శివరాత్రి ఉత్సవాలు చూశాడు. పిమ్మట కొన్నాళ్ళకు మరణించాడు. వానిని తీసుకోవటానికి వచ్చిన యమభటులు నుంచి శివదూతలు తప్పించి కైలాసానికి తీసుకొని వెళ్ళారు. శివరాత్రి ఉత్సవ దర్శన కారణాన అతనికి కైలాసం ప్రాప్తించింది.

3.4.3. కాంచీ మాహాత్మ్యం : దగ్గుపల్లి దుగ్గన్న కాంచీ మాహాత్మ్యాన్ని శైవపరంగా రచించాడు. ఇతడు రచించిన 'శివకాంచీ మాహాత్మ్యం' నేడు లభించడం లేదు. రెండు పద్యాలు మాత్రమే లభిస్తున్నాయి. ఇది స్కాంద పురాణంలోని కాశికాఖండంలోని తీర్థస్థల ప్రశంసంలో చెప్పబడిందని వేకుమళ్ళ అచ్యుతరావు పేర్కొన్నాడు.

ఈ కాంచీ మాహాత్మ్యాన్నే రామయ్య విష్ణుపరం చేసి 'విష్ణు కాంచీ మాహాత్మ్యం'గా రచించాడు. 'ఈ గ్రంథం నేడు లభ్యం కావడం లేదు గానీ ఇందులోని పన్నెండు పద్యాలు మాత్రం ఒక సంకలన గ్రంథకర్త ధర్మమా అని దొరుకుతున్నాయి' (56). కుడి చెర్లతిప్పరాజు కూడా 'కాంచీ మాహాత్మ్యం' అనే కావ్యం రచించినట్లు తెలుస్తూ ఉంది.

3.4.4. కాళహస్తి మాహాత్మ్యం : ఇది ధూర్జటి రచించిన ప్రబంధం. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలోని అష్టదిగ్గజాలలో ధూర్జటి ముఖ్యుడు. ఇది శైవ ప్రాధాన్యం గల్గిన క్షేత్రం మాహాత్మ్యాన్ని తెల్పే రచన ఇది. సంస్కృతంలోని 'శివరహస్య సంగ్రహం'లోని చిన్న పురాణానికి అనువాదమని, స్కాంద పురాణాంతర్గత వైష్ణవ ఖండంలోనిది దీనికి మూలం అని భిన్నాభిప్రాయాలు వ్యక్తం అవుతున్నాయి.

దీనిలో కథాంశమీ విధంగా ఉంది. రాజు, పరిచారిక ఇంటనున్న జంగమదేవర మహిమ విని, శివరూపాన ఉన్న జంగమ దేవరను చూచి ఆశీస్సులు పొందాడు. రాజు కోరికపై శివుడు కాళహస్తి మాహాత్మ్యాన్ని తెల్పాడు. వశిష్ఠుని కోరికపై జనులను తరింపజేసేందుకు శివుడు ఆ క్షేత్రంలో నిల్చాడు. అగస్త్యుడు ఆకాశగంగను సువర్ణముఖ నదిగా దించాడు. బ్రహ్మ అట తపస్సు చేశాడు. సరస్వతి పై కోరికతో నూరు రూపాలు ధరించిన సరస్వతితో విహరించి పుత్రులను పొందాడు. వారు రాక్షసులు కావడంతో ఉగ్రుడయిన బ్రహ్మకు ఉగ్రుడు జన్మించి రాక్షసులను వధించి తండ్రి శోకాగ్నిలో భస్మమయ్యాడు. ఆ వ్యథతో పుత్రార్థి అయి అట శివుడికై తపస్సు చేసి ఋభువును పొందాడు. పిమ్మట, సాలెపురుగు, పాము, ఏనుగులు శివుని పూజించి సాయుజ్యం పొందడం ఆ క్షేత్రానికి ఆ పేరు రావడం; తిన్నడి భక్తి శివుడు బ్రాహ్మణునికి తెల్పి వారికి ముక్తినివ్వడం; వృత్తి ధర్మాన్ని కాదని శ్రీకాళహస్తికి వచ్చిన వేశ్యకూతుళ్ళను దొంగల బారినుండి రక్షించడం తెల్పాడు. వారి పూర్వజన్మ వృత్తాంతం చెప్పి, శివునికి గుడి కట్టమని చెప్పి అంతర్ధానం అయ్యాడు. రాజు గుడి కట్టి తరించాడు.

లింగరాజు 1655లో 'పెద కాళహస్తి మాహాత్మ్యం' అనే పద్యకావ్యాన్ని రచించాడు. ఇది పన్నెండు అశ్వాసాల గ్రంథం. ఈ లింగరాజు కుమారధూర్జటి పుత్రుడు. ఇతని గ్రంథానికి 'శివరహస్య సంగ్రహము' మూలం. శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యంలోని 'కన్నప్ప చరిత్ర'ను కావ్యంగా కంచిరాజు సూరయ్య రచించాడు.

3.4.5. ఘటికాచల క్షేత్ర మాహాత్మ్యం : ఇది ఓ స్థల పురాణం. ఇది 108 తిరుపతులలో ఒకటైన చోళలింగపురానికి సంబంధించిన పురాణం. మూడాశ్వాసాల ఈ గ్రంథంలో నాలుగు కథలున్నాయి. 1. అయోధ్యను పాలించే ధవళాంగుడనే రాజు కిరాతకుడిగా మారాడు. ఇది విశ్వామిత్ర శాపం. వశిష్ఠ సాంగత్యంలో శాపవిమోచనం కావటాన్ని వివరించే కథ ఇది. 2. హరిచక్రపురంలోని ఓ బ్రాహ్మణుని ఇంటిలో దాసి, పొరుగున ఉన్న బ్రాహ్మణ యువకుడు పరస్పరాకర్షితులయ్యారు. తద్ఫలంగా నారదుడు జన్మించాడు. కౌండిన్య మునిని సేవించి తల్లి మరణానంతరం ఘటికాచల క్షేత్రానికేగి తపస్సు చేసి విష్ణువును సాక్షాత్కరింప చేసుకొన్నాడు. అయినా గుర్తించక నారదుడు దేహ త్యాగం చేసుకొన్నాడు. 3.శృతశృంగ పర్వతం మీద తపస్సు చేస్తున్న సప్తర్షులు అశరీరవాణి సూచనపై ఘటికాచల క్షేత్రంలో తపస్సు చేసి నరసింహమూర్తిని ప్రత్యక్షం చేసుకొని ఆ ప్రాంతాన్ని సస్యశ్యామలం చేయమని వరం కోరి దాన్ని పొందారు. 4.వైఖానసులు బ్రహ్మ పంపున ఘటికాచలానికి వచ్చి వశిష్ఠ బోధపై ఆంజనేయుని ప్రార్థించి, ఘటికాచలాన్ని సమతలం చేయించి, ఇందిరా నరసింహుల కళ్యాణాన్ని జరిపించారు. ఈ ఘటికాచల మాహాత్మ్యం విష్ణు ప్రాధాన్యాన్ని తెల్పే క్షేత్ర మాహాత్మ్యం.

3.4.6. పాండురంగ మాహాత్మ్యం : ఇది తెనాలి రామలింగ కవి రచించిన ప్రబంధం. శ్రీకృష్ణదేవరాయలి ఆస్థాన అష్టదిగ్గజాలలో ఒకడు. ఇది స్థలపురాణం. 'వివిధ పురాణాల నుండి తీసుకున్న కథలలో స్థల పురాణాన్ని రామకృష్ణుడు రచించి ఉంటాడు. ఇది ఐదాశ్వాసాల కావ్యం'(57). ఇందులో తొమ్మిది కథలున్నాయి. ప్రసిద్ధమయిన నిగమశర్మోపాఖ్యానం ఇందులోనే ఉంది.

పాండురంగ మాహాత్మ్యంలోని కథ - భూమిపై సర్వోత్తమ పుణ్యక్షేత్రం పుండరీక క్షేత్రమని చెప్పటానికి ఈశ్వరుడు పుండరీకుని కథ చెప్పాడు. పుండరీకుడు వేదవిదురుడు. తల్లిదండ్రుల పట్ల సేవాభావం కలవాడు. వారి తదనంతరం, సంసారం తీర్చిదిద్ది, బాలకృష్ణునికై తపస్సు చేసి కృష్ణుని ఆ క్షేత్రంలో నిలపమని కోరాడు. నిస్వార్థమయిన ఆ కోరికకు అంగీకరించాడు. ఆ క్షేత్రంలో ఎందరెందరో ముక్తి పొందారు. తరించారు. నిగమశర్మ మోక్షాన్ని పొందాడు. సుశర్మ పాపాలు క్షీణించాయి. సుశీల ముక్తిని పొందింది. కాకి చిలుక పాములు జన్మాంతరాన తరించాయి. అగస్త్యుని శిష్యుడు - అయుతుడు శాపవిమోచనం పొందాడు.

3.4.7. అన్య మాహాత్మ్యాలు : అంతగా ప్రసిద్ధి పొందక పోయినప్పటికి అనేక మాహాత్మ్యాలు విమర్శ సాహిత్యంలో, పరిశోధన రంగంలో ప్రసక్తమవుతూ వస్తున్నాయి. ఇవి అన్నీ లభించలేక పోయినా వాటి సృష్టి ఈ మార్గంలో ఉండటం గమనార్హం. ఇందులో అధికభాగం క్షేత్ర ప్రాశస్త్యం తెలిపే మాహాత్మ్య రచనలే గోచరమవుతున్నాయి.

1. శ్రీశైల మాహాత్మ్యం : దీన్ని తెనాలి శ్రీగిరి రచించాడు. నేడది అలభ్యంగా ఉంది.

2. ఆనంద కానన మాహాత్మ్యం : ఇది అయిదాశ్వాసాల గ్రంథం. లింగమగుంట రామయ్య రచించాడు. ఆనంద కాననం అంటే కాశి. దానిని విష్ణు క్షేత్రంగా వర్ణించాడు. దీనికి వాయు పురాణం మూలం.

3. చతుర్వాటికా మాహాత్మ్యం : క్షేత్ర మాహాత్మ్యాన్ని తెలిపే ఈ అయిదాశ్వాసాల కావ్యం లింగమగుంట రామయ్య రచన. ఇది చదులవాడ అనే గ్రామ ప్రాశస్త్యాన్ని, మాహాత్మ్యాన్ని తెల్పే కావ్యం. చదులవాడే చతుర్వాటిక అయింది.

4. గంగాపుర మాహాత్మ్యం : మల్లారెడ్డి దేశాయి 16వ శతాబ్దంలో స్వస్థలమయిన గంగాపురం గొప్పదని, తన్మాహాత్మ్యాన్ని చాటుతూ ఈ మాహాత్మ్యాన్ని రచించాడు. 'ఇది అముద్రితం, అసమగ్రం' (58).

5. హాలాస్య చరిత్ర : మధుర క్షేత్ర మాహాత్మ్యం తెల్పే గ్రంథం కళువె నంజురాజు వచనంలో వ్రాశాడు. ఇదే మాహాత్మ్యాన్ని తరువాతి కాలంలో అరవీటి రాజుల యుగంలో శ్రీపతి రామభద్రయ్య కూడా వచనంలోనే వ్రాశాడు.

6. వృద్ధాచల మాహాత్మ్యం : రేవూరి అనంతయ్య రచించాడు. వెంగుళంలో స్థిరపడ్డ కృతిభర్త లింగారెడ్డి కోరికమీద దీన్ని రచించాడు. లింగారెడ్డి భార్యకు వృద్ధాచలేశ్వరుడు కలలో కనిపించి వెంగుళంలో గుడి కట్టించమనటానికి అక్కడ పాలకుడు స్థిరనివాస మేర్పర్చుకోడానికి, కావ్య రచన చేయించడానికి కారణం.

7. శ్రీముష్ణ మాహాత్మ్యం : ఇది రేవూరి చిన అనంతయ్య రచించిన అయిదాశ్వాసాల ప్రబంధం. శ్రీముష్ణం దక్షిణ క్షేత్రం. దీని మహిమను తెల్పే రచన శ్రీముష్ణ మాహాత్మ్యం.

8. సింహాచల మాహాత్మ్యం సర్పరూప మాహాత్మ్యం : కూచిమంచి తిమ్మకవి రచనలివి. 1754లో సర్పపుర మాహాత్మ్యాన్ని రచించాడు.

10. జంబుకేశ్వర మహిమ : కవిధాటి బలభద్రయ్య రచించిన పద్యకావ్యం. ఇది దక్షిణాదిన ఉన్న పుణ్యక్షేత్రమైన జంబుకేశ్వర మహిమ తెల్పే రచన. 'దీనిని గజారణ్యం అంటారు. ఈ క్షేత్రం గురించిన వివరాలన్ని పద్మపురాణంలో ఉన్నాయి' (59).

11. పర్వత పురాణం : నాగలూటి శేషనాథుడు రచించాడు. 'సంస్కృత స్కాంద పురాణంలోని శ్రీశైల ఖండానికిది తెలిగింపు'(60) గా ఉంది.

12. మాఘ మాహాత్మ్యం : వాయు పురాణాంతర్గతమయిన మాఘమాహాత్మ్యాన్ని పిల్లల మర్రి పినవీరభద్రుడు, ఒడ్డెపూడి పెద్దయ్యలు ఇద్దరూ రెండు కావ్యాలు రచించారు. అయితే ఈ రెండు కూడానూ నేడు అలభ్యంగానే ఉన్నాయి.

13. విష్ణు సేవా మాహాత్మ్యము : కవి మల్లకవులు అరవీటి రాజుల కాలంలో కలసి చేసి రచన. 'బహుశా ఆరు ఆశ్వాసాలు ఉంటాయి' (61) అని అంచనా.

14. రత్నావళీ పరిణయం : ధూర్జటి వెంకటపతి 1680 రచించాడు. ఇది నాలుగు ఆశ్వాసాల ప్రౌఢ కావ్యం. 'ఇందులో రత్న లింగేశ్వర మాహాత్మ్యాన్ని కవి వర్ణించాడు' (62).

15. కార్తీక మాహాత్మ్యం : కుందుర్తి వేంకటాచలం కడపటి రాజుల యుగానికి చెందినవాడు. ఇతని కార్తీక మాహాత్మ్యం అరు ఆశ్వాసాల కావ్యం.

16. చిత్రకూట మాహాత్మ్యం : వెంకట సోమయాజిగారి తిరుమలయ్య చిత్రకూట మాహాత్మ్యం అనే యక్షగానం రచించాడు. 'అందులో నటరాజు కాళికాదేవిని నాట్యంలో ఓడించే కథ ఉంది' (63).

17. ధేను మాహాత్మ్యం : లింగనమఖి చినకామయ్య ధేను మాహాత్మ్యాన్ని రచించి చొక్కనాథ నాయకునికి (1659-82) అంకితమిచ్చాడు. 'ఇందులో ధర్మరాజుకు భీష్ముడు చెప్పిన ఆవుల మాహాత్మ్యాన్ని ......' (64) వర్ణించాడు.

18. సోమవార వ్రత మాహాత్మ్యం : 1715 ప్రాంతాలకు చెందిన తుమ్మలపల్లి నాగభూషణం రచించిన ఏకాశ్వాస గ్రంథం సోమవార వ్రత మాహాత్మ్యం.

19. జాహ్నవీ మాహాత్మ్యం: ఏనుగు చిన లచ్చనకవి రచించిన ప్రబంధం. '... కొద్దిగా మానసిక సంఘర్షణ కల వారాకాంతను చిత్రించే కావ్యం...'(65) ఈ జాహ్నవీ మాహాత్మ్యం.

20. రామేశ్వర పురాణం : ఏనుగు చిన లచ్చన రచించిన అయిదాశ్వాసాల కావ్యం. స్కాంద పురాణంలోని సేతు మాహాత్మ్యాన్ని గ్రహించి రామేశ్వర పురాణం రచించాడు.

21. సీమంతినీ పరిణయం : పెనుమళ్ళ సోమయ్య విరచితం సీమంతినీ పరిణయం. 'స్కాంద పురాణంలోని బ్రహ్మోత్తర ఖండంలోని సోమవార వ్రత మహోత్సవ కథను సీమంతినీ పరిణయం అనే పేరిట అయిదాశ్వాసాల కావ్యంగా వ్రాసి శ్రీశైల మల్లికార్జున స్వామికి అంకితమిచ్చాడు' (66).

22. జగన్నాథ మాహాత్మ్యం : రామయ్యగారి సూరన్న రచించిన అసమగ్ర కావ్యం.

23. నింబజా మాహాత్మ్యం: బడగలనాటి నరసయ 1740 ప్రాంతాలకు చెందినవాడు. నింబజా మాహాత్మ్యాన్ని ద్విపద కావ్యంగా రాశాడు. దీనికి ఏకవీరా మాహాత్మ్యం అనే నామాంతరం కూడా ఉంది. 'బ్రహ్మాండ పురాణంలో మౌద్గల గోత్రం ఏర్పడిన విధం ఉందట. అందులో దేవమల్లుని కథ, దేవీ మాహాత్మ్యం, మల్లుల శాఖలేర్పడిన పద్ధతి మొదలైన వివరాలన్ని ఉన్నాయి. వీటిని నింబజా మాహాత్మ్యం అనే పేరిట బడగలనాటి నరసయ్య అనే కవి వ్రాశాడు....' (67).

24. సేతు మాహాత్మ్యం: భాస్కర వెంకటాచలం 1731-67 ప్రాంతాలకు చెందిన వాడు. 4 ఆశ్వాసాల కావ్యంగా సేతు మాహాత్మ్యం రచించాడు.

25. రసికజన మనోభిరామం : ఇది గౌతమీ మాహాత్మ్యం తెల్పే రచన. గోదావరి తూర్పుపాయను గౌతమి అంటారు. దీనికి ప్రత్యేక మహిమలున్నాయి. 'దానిలో మునిగిన ముసలివాళ్ళు పడుచువాళ్ళవుతారట. ఈ సంగతి బ్రహ్మపురాణంలోని గోదావరి ఖండంలో ఉందట' (68). దీన్ని గ్రహించి గౌతమీ మాహాత్మ్యాన్ని చెప్పాడు. దీనిని కూచిమంచి తిమ్మయ్య రచించాడు. 'గౌతమీ మాహాత్మ్యాన్ని అల్లమరాజు బాపయ్య కూడా రచించాడు.

26. వెంకటాచల మాహాత్మ్యం: 1840 ప్రాంతాలకు చెందింది తరిగొండ వెంగమాంబ చేసిన వేంకటేశ్వరుని మాహాత్మ్య గాథా కథనం. 'సంస్కృత వరాహ భవిష్యోత్తర పద్మ పురాణములలోని వేంకటాచల మాహాత్మ్య ప్రశంసల నాధారముగా....'(69) చేసుకొని వేంకటాచల మాహాత్మ్యం రచించింది.

27. అంతర్వేది మాహాత్మ్యం: పెనుమత్స గోపరాజు రచించాడు.

28. తుల్యానదీ మాహాత్మ్యం: 1639-53 ప్రాంతాలకు చెందిన ఏనుగు లక్షణకవి దీన్ని అక్షరబద్ధం చేశాడు.

29. సాగరసంగ మాహాత్మ్యం : ఈ పురాణాన్ని బ్రహ్మవైవర్త పురాణంలోని కథను గ్రహించి కూచిమంచి తిమ్మయ్య రచించాడు.

3.4.8. ఇతర మాహాత్మ్యాలు : తెలుగులో మాహాత్మ్య రచన విశేషంగానూ, విస్తృతంగా ఉంది. ఇది పురాణ సంబంధం నుంచి స్థానిక సంబంధాన్ని, తన్మూలంగా క్షేత్ర సంబంధాన్ని కలిగి విశేషంగా రూపం దిద్దుకొంది. కాలక్రమంగా మాహాత్మ్య సాహిత్యం పురాణ సంబంధం కూడా కోల్పవటం గమనార్హం.

మాహాత్మ్యాల పరిణామంలో క్షేత్ర ప్రాశస్త్యం ప్రాధాన్యం వహించింది. క్షేత్రాలు కూడా సుదూర ప్రాంతాలలోనివి కాక సమీపం లోనివి స్థానికమైనవి ప్రాముఖ్యం సంతరించుకొన్నాయి. యక్షగాన సాహిత్యంలో స్థానిక క్షేత్ర మాహాత్మ్యే లక్ష్యం స్పష్టంగా గోచరమవుతూ ఉంది.

1. అహోబల క్షేత్రం : క్రొంజ వెంకటాద్రి రచించిన 'వాసంతికా పరిణయం' అహోబల క్షేత్రకథ. 'అహోబల నరసింహస్వామి వాసంతిక (వసంత స్వపుత్రి) యను చెంచెతను పెండ్లియాడిన కథయిందు వర్ణిము' (70). ఇదే కథను గ్రహించి ఓబయ మంత్రి 'గరుడాచల విలాసము' రచించాడు. 1789లో రచింపబడింది. 'ప్రహ్లాదుని కోరికపై లక్ష్మీ సమేతుడై వేదాచలమున విడిచిన నరసింహుడొక పరి గరుడాచల విహారమున బయలుదేరుట - అక్కడ నొక చెంచెతను జేబట్టుట - లక్ష్మి నరసింహుల నడుమ నారదుని కైలాటము - నరసింహుడు చెంచెతతో వేదాద్రికి బయనమగుట- బెట్టు సరిచేసిన లక్ష్మిదేవి నెట్టెటో సమాధానపరచుట - అంతలో జెంచెత తండ్రి శిఖి నాయకుడు తన కూతురును లేవదీసుకొని పోయెనని నరసింహునిపై నెత్తిన వచ్చుట - నరసింహుడోలిగట్టి వారితో గలసి మెలసి చెంచుహోబడగుట - క్రొంజ వెంకటాద్రి వాసంతికా పరిణయమున నరసింహుడు చెంచెతను జేపట్టుటతో సరి మఱి యా రెండవ ఘట్టము లేదు' (71).

2. రాయదుర్గ క్షేత్రం : రాయదుర్గ క్షేత్రంలోని స్వామి ప్రసన్నవేంకటేశ్వరుడు. ఇతని గూర్చి దళవాయి తిమ్మప్ప 'ప్రసన్నవేంకటేశ్వర విలాసము'రచించాడు. ఇందులోని కథ వేంకటేశ్వర సంబంధం కలది. ' ఈ స్వామి పురవీధుల 'దిరువీధి' వేంచేయగా గళావతియను వేశ్యకన్య యతని జూచి మరులు కొనును. చెలికత్తెయగు మంజువాణి యామె తల్లి యగుచకోరాక్షికీ విషయము తెలుపగా నామె కూతును మందలించును. తరువాత మంజువాణిచే స్వామికి గళావతి రాయబారము, అది విఫలము కాగా కళావతి స్వయముగా స్వామి సముఖమునకు బోయితన నాట్య కళా నైపుణ్యముచే నాతని బ్రసన్నుని జేసికొనును' (72).

3. ధర్మపురి క్షేత్రం : గౌతమీ తీరాన ఉన్న ధర్మపురి క్షేత్రానికి సంబంధించిన గాథ. 'శైలు పురీంద్రునికి ధర్మపురి రామలింగస్వామి దయవలన కలిగిన పుత్రుడు దీర్ఘరాజు ప్రతిష్ఠాన పురాధీశుడగు శాలివాహన భూపాలుని పుత్రిక యగు చంద్రరేఖను బెండ్లి యుకువ యగు కలియుగ పొన్నపూలు తెచ్చిన పెండ్లాడిన కథయది' (73). ధర్మపురి మాహాత్మ్యం పేరిట విశ్వేశ్వరుడు రచించిన కావ్యానికి 'చంద్రరేఖా విలాసం' అనే నామాంతరం ఉంది.

4. చిదంబర క్షేత్రం : తిరుమల కవి రచించిన కావ్యం. 'చిదంబర క్షేత్రమున విశ్వకర్మ నిర్మితమైన కనక సభలో నర్తనకళా ప్రావీణ్య విషయమున బోటీపడి యొకరికొకరు తీసిపోని ప్రతిస్పర్థులుగా నిలిచిన కనక సభాపతికి దిల్లాదేవికి (శివపార్వతులకు).....'(74) గంధర్వ వివాహం జరగడం ఇతివృత్తం. ఇదే కథ తుళుజరాజు 'శివకామసుందరీ పరిణయం' పేరిట రచించాడు.

3.5. విలాసం : తెలుగు సాహిత్యంలో విలాస రచన విశేషంగా జరిగింది. విలాస శాఖా సాహిత్యం విష్ణుపరంగానూ శివపరంగానూ ఉంది. ఈ రెండు విధాలుగా రూపొందిన విలాస సాహిత్యమే పురాణ సంబంధం కలిగిందిగా గుర్తింపు పొందుతూ వచ్చింది. వైష్ణవం కానీ, శైవం కానీ లేకుండా విలాస సాహిత్యం రచింపబడటం ఈ శాఖా విస్తృతిని తెలుపుతుంది. ఇందుకు ఉత్తమ ఉదాహరణం అద్భుత ప్రబంధమయిన విజయ విలాసం. విష్ణుశివ సంబంధి పురాణగుణం విలాస పరిమితంగా లభించినప్పుడే దాన్ని ఈ విభాగంలో గుర్తించటమవుతుంది. విలాస సాహిత్యం ఇతిహాస ధర్మ విస్తరణ కనిపించే వాటిని ఇక్కడ పరిశీలించటానికి అవకాశం మృగ్యం.

3.5.1. ప్రసిద్ధ విలాస రచనలు సాధారణంగా దైవ ప్రాధాన్యంతో ఉన్నాయి. ఇవి దైవ విలాసం ప్రకటించే సమర్థంగా ఉన్నాయి. దైవ ప్రాధాన్యం గల రచనలు విస్తృత రీతిలో పురాణాలుగా, దానిలో పరిమిత భాగం వంశంగా, మరికొంత పరిమిత భాగం మాహాత్మ్యాలుగా, ఇంకా కొంత పరిధి తక్కువ భాగాలు విలాసాలుగా, మరీ అల్పాంశ రచనలు ఖండాలుగా రూపొందాయి. విలాసాలలో అధికంగా విష్ణు పారమ్యాన్ని తెల్పే సాహిత్యం ఉంది. కొంత శైవ ప్రాధాన్యం గల సాహిత్యం లేక పోలేదు.

1. హరవిలాసం : ఇది 15వ శతాబ్దంలో శ్రీనాథుడు రచించిన కావ్యం. విలాసాలలో లభ్యమయ్యే తొలి కావ్యం. ఇది శైవ ప్రాధాన్యం కలిగిన రచన. ఇది స్వతంత్ర రచన.

ఏడాశ్వాసాల విస్తృత రచనా ప్రబంధం. '1,2 ఆశ్వాసాలలో తిప్పయ్య సెట్టి పూర్వీకుడయిన సిరియాళుని కథను వ్రాశాడు. 3,4 ఆశ్వాసాలలో గిరిజా కళ్యాణాన్ని చెప్పాడు. 5వ ఆశ్వాసంలో పరమేశ్వరుని దారుకావన విహారం, 6వ ఆశ్వాసంలో హాలహాల భక్షణం, 7వ ఆశ్వాసంలో కిరాతార్జునీయం రచించాడు' (75). పురాణం సంబంధ లక్షణమైన విస్తృతి ఇందులో కొంత తక్కువగానే అయినా గోచరమవుతుంది.

2. శివలీలా విలాసం : నిశ్శంక కొమ్మన 1408 ప్రాంతాలకు చెందినవాడు. ఇతడు వ్రాసిన కావ్యం శివలీలకు సంబంధించింది. శ్రీనాథుడు కొన్ని లీలలు మాత్రమే రచిస్తే నిశ్శంక కొమ్మన అన్నిటిని క్రోడీకరించి రచించాడు. దీనిలో ముప్పై ఆరు లీలలుంటే పదమూడు మాత్రమే నేడు లభ్యమవుతున్నాయి. 'శివలీలా విలాసం' పేరిట ఒక గ్రంథాన్ని రెండు ఆశ్వాసాల కావ్యంగా కూచిమంచి తిమ్మయ్య రచించాడు. ఇది 1756లో రచింపబడింది. ఇది రెండు ఇతివృత్తాలతో గంగా వివాహం, గంగా గౌరీ సంవాదం కథలుగా ఉన్న రచన.

శివమహాత్మ్యం, విలాసం, లీలలు, కంటే విష్ణు మాహాత్మ్యం, విలాసం, లీలలు, ఉన్న సాహిత్యమే ఎక్కువగా ఈ కోవలో గోచరమవుతుంది.

3. హరిలీలా విలాసం : దీన్ని తెనాలి రామకృష్ణకవి రచించాడు. వైష్ణవాన్ని స్వీకరించిన తర్వాత దీన్ని రచించాడు. ఇందులో ఇరవై ఒక్క పద్యాలను పెదపాటి జగ్గన్న ఉదాహరించాడు. 'జగ్గన్న ఎన్నుకొన్న ఈ పద్యాల వల్ల హరిలీలా విలాసంలో కథ ఏమీ తెలియదు' (76).

లక్ష్మీ విలాసం : ఇది రాయసం వెంకటపతి రచించిన గ్రంథం. అయిదాశ్వాసాల ప్రబంధం. దీనిలో క్షీరసాగర మథనం నుంచి లక్ష్మీనారాయణుల కళ్యాణం వరకున్న కథ అంతా ఉంది.

బాలగోపాల విలాసం : ఇది వెణుతుర్ల ఒడ్డెయ్య రచన. దీనిని హరివంశం ఆధారంగా చెప్పాడు.

విష్ణుమాయా విలాసం : కంకంటి పాపరాజు రచనిది. 1600 ప్రాంతాల్లో రచించిన యక్షగానం. 'ఇందులో విష్ణుమూర్తి మోహినీ వేషంలో శివగర్వ భంగం చేయడాన్ని కథనం చేశారు' (77). దీన్నే దోసనూరి వెంకటపతి 18వ శతాబ్దంలో మూడు ఆశ్వాసాలకావ్యంగా రచించాడు.

శ్రీకృష్ణలీలా విలాసం : వెన్నల కంటి వెంకటాచలం రచించాడు. ఇదే పేరిట వస్త్రాపహరణాన్ని కావ్యంగా అక్కన రచించాడు. 1740 ప్రాంతాలకు చెందిన కటికినేని రామయ్య రచన వుందని అది నష్టపోయిందని తెలుస్తూ ఉంది.

శ్రీకృష్ణ విలాసం : 18వ శతాబ్దంలో రాపాక లక్ష్మీపతి, విశ్వేశ్వర పండితుడు రచించారు. వీరివురి రచనలే కాక చల్లపల్లి వెంకయ్య రచించిన మరో కావ్యం కనిపిస్తూ ఉంది. 'ఇందులో శ్రీకృష్ణ చరిత్రంబు సవిస్తరంబుగా సూతుడు శౌనకాది మహామునులకు చెప్తే వాళ్ళానందించి కథకుణ్ణి పొగిడారు' (78).

కేశవ విలాసం : 1742 ప్రాంతాలలో శేషభట్టరు సింగరాచార్యులు చేసిన రచనిది.

బాలకృష్ణ లీలా విలాసం : ఇది అక్కన రచించిన కావ్యం. రుక్మిణీ సత్యభామల కయ్యాన్ని ఇందులో చిత్రించాడు. ఇది అముద్రితం.

4. మృత్యుంజయ విలాసం : ఇది గోగులపాటి కూర్మనాథం రచన. 'అది ప్రబంధం, యక్షగానం, నాటకం అన్నీ కలసిన కొత్త ఫక్కీ రచన. అందులో పద్యాలు, పాటలు, దరువులు, ద్విపదలు, చూర్ణికలు, శ్లోకాలు, దండకాలు ఒక్కటేమిటి అన్నీ ఉన్నాయి. దీనికి కూర్మనాథం 'శృంగార నాటకగేయ ప్రబంధం' అని కొత్త పేరు పెట్టాడు. ... చిన్నప్పుడు చెప్పుకొన్న కాళిదాసు సంస్కృత కావ్యాన్ని, పెరిగాక చదువుకొన్న నన్నెచోడుని ఆంధ్ర ప్రబంధాన్ని పదే పదే తలచుకొని కుమార సంభవ గాథను 'మృత్యుంజయ విలాసం' అనే కావ్య రూపంలో కూర్మనాథ మొదలుపెట్టాడు' (79). ఇది 1750 ప్రాంతాలలో రచింపబడిందని ఊహిస్తున్నారు. 'శివ పార్వతుల కళ్యాణ కథ యిందలి యితివృత్తము. మృత్యుంజయ విలాసమని పేరు పెట్టుటలో ప్రత్యేకత ఏమియు గానరాదు. ఈ కథలో నాయకుని మృత్యుంజయ నామము సార్థకము గాదు. ఇందలి కథా ప్రణాళిక కాళిదాసీయమున కంత విలక్షణముగా లేదు. కాని శివుని యెఱుకత వేషము, కటికము వంటి భృంగిరిటి హాస్యపాత్ర, గంగా గౌరుల సవతి ముచ్చరము యక్షగానమని పేరు పెట్టినందులకిందు జేరిన విశేషములు' (80). శివలెంక మల్లనారాధ్యులు రచించిన 'వీరభద్ర విజయం' దీనికి దగ్గరగా ఉందని పండితుల భావన.

5. ప్రబంధరాజ వేంకటేశ్వర విజయం విలాసం : ఇది గణవరపు వెంకటకవి రచించాడు. స్థానిక దేవుని కథ ఇది. వేంకటేశ్వరుడు ఒకనాడు వేటకేగి నాంచారు దేవిని చూచి మోహించి వివాహం ఆడాడు. కాపురానికి వస్తున్న నాంచారి దేవిని నాగదత్తుడనే దొంగ అడ్డగించాడు. వారంతా పోరులో స్వామి పుష్కరిణిలో పడి దైవసాయుజ్యం పొందడం కథ.

3.5.2. ఇతర విలాసాలు : యక్షగాన సాహిత్యంలో విలాస రచన విస్తృత ప్రణాళికాబద్ధంగా సాగింది. విలాసం యక్షగానంలో శ్రీకృష్ణ సంబంధిగా సాగి భాగవత పురాణ భక్తి మార్గం ప్రబోధించేవిగా వెలుగొందుతూ ఉంది.

శ్రీకృష్ణుని బాల్య చేష్ట ఒక విలాసంగా రూపుదిద్దుకొంది. 'జలక్రీడా విలాసం' (1756) పేరిట ఉన్న నిముషకవి రామయ్య రచనలో శ్రీకృష్ణుని గోపికా వస్త్రాపహరణ గాథ వ్యాపించింది. 'జలక్రీడా విలాసం' పేరుతో వేదం వేంకట కవి 1906 ప్రాంతంలో యక్షగానం రచించాడు. పాకపాటి గణపతి రెడ్డి రచించిన 'గోపాల విలాసం'లో శ్రీకృష్ణుని బాల్య క్రీడల కంటే ముందు జననం కూడా వర్ణితమయింది. 'కృష్ణలీలా విలాసం' వ్రాసిన శాహాజీ కూడా కృష్ణ జననం బాల్యక్రీడలు వర్ణించాడు. గోపికా కృష్ణుల రాసక్రీడను చిత్రించే యక్షగానం కానుకొలను వేంకటదాసు 'శ్రీకృష్ణ నాటక యక్షగాన మహాప్రబంధ రాసక్రీడా విలాసము రచించాడు. అకలంక శ్రీకృష్ణమార్యుడు రచించిన యక్షగానం 'కృష్ణ విలాసం' ...... దేవకిపై కంసుడు కత్తినొఱదూయటతో గధారంభము. చక్కని యెత్తుగడ. కథ రుక్మిణీ కళ్యాణము వఱకున్నది' (81). 'జగన్మోహన శ్రీకృష్ణ విలాసం' వ్రాసిన

పవగంటి శేషగిరి దాసు, వేణుగానలోలుడి గానమాధుర్యానికి పరవశులై వచ్చిన గోపికలతో శ్రీకృష్ణుడు సయ్యాటలాడటం వర్ణితమయింది.

3.5.3. పరిణయ ప్రతీతాలు : విలాస రచనా మార్గంలో పరిణయం, కళ్యాణం పేరిట యక్షగాన సాహిత్యం కవులు సృష్టించారు. ఇందులో శ్రీకృష్ణ కథతో పాటు భిన్న పౌరాణిక గాథలు విలాస రచనగా గోచరమవుతూ ఉన్నాయి.

1. శ్రీకృష్ణుడితోడి పరిణయం చిత్రించిన యక్షగానాలు బాలకవి సుబ్బన్న రచించిన 'పంచకన్యా పరిణయం', పడకండ్ల స్వామి రాయకవి రచిత 'లక్షణా పరిణయం'; 'సత్రాజిన్నాటకమని', నామాంతరమున్న సత్యభామ పరిణయమనే గుండు అద్వైత బ్రహ్మశాస్త్రి రచన, 'రుక్మిణీ పరిణయము' అనే ఉపేంద్ర శ్రీరామరాజు రచన, కృష్ణుని వివిధ వివాహాలు యక్షగానాలుగా రూపాన్ని ఇచ్చి సాహిత్యంలో నిల్చాయి.

2. శ్రీకృష్ణుని కుమారుడు అనిరుద్ధుడికి ఉషకు జరిగిన వివాహం చిత్రించిన యక్షగానాలలో, యమ్మనూరి వెంకట సుబ్బకవి 'ఉషా పరిణయము' చెప్పుకోదగ్గ రచన. ప్రసిద్ధమయిన కథని ఎలాంటి మార్పులు లేకుండా విరిసాటి నృసింహరాజు 'ఉషా పరిణయము' అనే పేరుతో రచించాడు, మీసర గండ ఓబుళరాజు, తిరువీధి చెంచు సుబ్బదాసు అదే పేరుతో వ్రాశారు.

3. ఇతర భాగవత సంబంధాలుగా ఉండి యక్షగానాలుగా వెలువడ్డ పరిణయ విషయస్థ రచనలు కొన్ని ఉన్నాయి. 'విఘ్నేశ్వర పరిణయం', సిద్ధి బుద్ధిలతో వివాహం అయితేనే భారత రచనకు పూనుకొంటానని వ్యాసుడు వాటిని నెరవేర్చుకోవడం కథగా ఏకోజి రచించాడు. మరో యక్షగానం 'మండోదరి పరిణయం', గోకర్ణ క్షేత్ర మాహాత్మ్యాంతర్గతమైన మండోదరి రావణుల ప్రణయ గాథను అణ్ణనాచార్యులు రచించాడు. శివాజి రచించిన 'అన్నపూర్ణా పరిణయం' మరొకటి.

4. విలాస రచనా రూపం పొందిన పరిణయ కావ్య మార్గంలోనే కళ్యాణ కావ్య సంపద యక్షగాన రూపంలో గోచరమవుతూ ఉంది. 1. 'రుక్మిణి కళ్యాణం' కథగా ఏనుగుల చూడమ్మ తిమ్మరాజు లక్ష్మణరావు రచించారు. 2. 'సత్యభామా కళ్యాణం' యక్షగానంగా మండూరి సుబ్బరాయ కవి వ్రాశాడు. 3. 'విఘ్నేశ్వర కళ్యాణం' శాహాజీ రచించిన యక్షగానం. 4. 'వల్లీ కళ్యాణం' 'కుమార స్వామి కళ్యాణ'మనే నామాంతరం గల ఈ యక్షగానాన్ని శాహాజీ రచించాడు.

3.5.4. యక్షగాన ప్రతీతాలు : శ్రీకృష్ణుని విలాస రచన విస్తృతంగా ఉన్న యక్షగాన సాహిత్యంలో శ్రీమహావిష్ణు విలాస రచన కూడా లభిస్తూ ఉంది. ఇందులో క్షీరసాగర మథనాంతరం అమృతం పంచిన శ్రీమహావిష్ణువు మాయా మోహినీ గాథ పలువురు గ్రహించారు. 'లక్ష్మీనారాయణ విలాసం' పేరిట దరుపూరి అప్పలాచార్యులు వారణాసి అచ్చుత రామకవి అనే జంట కవులు రచించారు.

ఈ విలాస రచనా విధానంగానే అనేక యక్షగానాలు అవతరించాయి. 'ఏకాంత సేవ' అనే మామిళ్ల పల్లివెంకటా చలమయ్య రచన వైష్ణవాలయంలో తలుపులు

మూసేముందు అర్చనను తెల్పే రచన. శేషము రంగాచార్యులు 'భావనారాయణ విలాసము' అనే యక్షగానం క్షేత్ర మాహాత్మ్యాన్నికి సంబంధించిన కథ. దళవాయి తిమ్మప్ప 'ప్రసన్న వేంకటేశ్వర విలాసము' వ్రాశాడు. మధుర మీనాక్షి సుందరేశ్వరుల వివాహాన్ని మారుపెద్ది చెంగల్వరాయ శాస్త్రి 'సుందరేశ్వర విలాసము'గా యక్షగానం రచించాడు.

3.5.5. శైవ సంబంధాలు : శ్రీకృష్ణుని గూర్చిన విలాస రచన విస్తృతంగా వెలువడగా, శ్రీమహావిష్ణు విలాస సృష్టి పరిమితంగా జరిగింది. విష్ణు విషయమే కాక శివ సంబంధిగా కూడా విలాస రచన గోచరమవుతూ ఉంది. 'గౌరీ శంకర విలాస'ంగా వేల్పూరి వెంకటకవి రచించిన 'గంగా శంకరుల చైత్ర రథ వన విహారము- అట శివుని గంధర్వాంగనల పొందు - వారును గంగయు సెట్లో సమాధాన పడిరనగా గౌరీదేవి యాగమనము - సవతుల కయ్యము - శివుడెట్లో సమాధానము కుదుర్చుట -....' (82) ఇందులోని కథ. 'కిరాత విలాసము' కిరాత వేషాన అడవికెళ్ళిన శివునికి భిల్ల వనితగా పార్వతి కలుసుకోవడం ఇతివృత్తం.

శివుడే కాక వీరశైవం శిరఃదఘ్నుంగా ప్రచారం చేసిన బసవణ్ణ జీవితం కూడా విలాస రచనకు ఉపయుక్తమయింది. బసవ మహిమామృత విలాసం కాసూరి వీరభద్రకవి రచించాడు. '.... మొదట బలదేవ రంగనాథ పుత్రియైన గంగమను, తదుపరి బిజ్జలునా స్థానమున దండాధుడైన పిదప, రాజ సోదరియగు నీలను బసవేశ్వరుడు వివాహమాడుట ప్రధాన విషయము' (83) గా ఈ యక్షగానంలో కనిపిస్తుంది. 'బసవ కళ్యాణము' చెల్వూరు సన్యాసి రచించాడు.

### 3.6. ఖండం

పురాణేతి వృత్తం మరింత పరిమితంగా గ్రహించి కావ్య నిర్మాణం కావటం తెలుగు సాహిత్యంలోని ఒక విశేష పరిణామం. పురాణంలోని పంచ లక్షణాలతో మాత్రమే కాకుండా అందులోని కొన్ని భాగాలను కథాంశాలను ఖండం పేరుతో తెలుగు సాహిత్యం అందించింది. ఖండం పరిమిత కథాభాగం కావటం వల్ల ప్రత్యేక లక్షణంతో లేదు. ఒక విషయం యొక్క సంపూర్ణ ఆవిష్కరణ ఖండగతంగా లభిస్తూ ఉంది. అందువల్ల ఖండం ప్రక్రియా వైవిధ్యంగా కంటే శాఖాబేధంగా గుర్తించి అది పురాణాంశను ప్రకటించటం దర్శించాలి. ఇక్కడ కూడా విష్ణు శివ తత్త్వదర్శనం ఉంటేనే దాన్ని ఖండంగా గ్రహించటం జరిగింది. అలాకాక చారిత్రక లక్షణం ఉంటే ఇక్కడ పరిశీలన పొందలేదు.

3.6.1. కాశీ ఖండం : 15వ శతాబ్దానికి చెందిన శ్రీనాథుని రచన. స్కాంద పురాణాంతర్గతమైన కాశీఖండానికి ఇది అనువాద రూపం. 'ఇది ఏడాశ్వాసాల మహా ప్రబంధం. అగస్త్యుడు కాశీ వదలి పెట్టడం మొదలై వ్యాసుల వారు కాశీని వీడి వెళ్ళవలసి రావడం ఆద్యంతాలలో ఉన్నాయి. మధ్య వివిధ లోకాల వృత్తాంతాలు, కాశిలోని వివిధ ప్రభావాల వివరణలు మొదలైనవి ఉన్నాయి. సాముద్రికం, యోగశాస్త్రం, మంత్రశాస్త్రం మొదలైనవి కూడా ఉన్నాయి'. (84) మోచర్ల నన్నయ కాశీఖండాన్ని ద్విపద కావ్యంగా రచించాడని వ్యాప్తిలో ఉన్నా అది అలభ్యంగానే ఉంది.

3.6.2. భీమఖండం : శ్రీనాథుని రచనే ఇది. ఇది ఆరు ఆశ్వాసాల కావ్యం. 'పేరుకు ఆరు ఆశ్వాసాల కావ్యమైనా మొదటా ఆశ్వాసమంతా అవతారికే. మిగతా ఆశ్వాసాలలో కూడా వర్ణనలే ఎక్కువ. వ్యాసుల వారి యాత్రలో మజలీల వర్ణన మూడో ఆశ్వాసంలో గాని వ్యాసుల వారు అడుగుపెట్టరు.... వ్యాసుల వారు ఎప్పుడూ కాశీలో ఉండేవారు. వారికీ శిష్యులకీ ఒకసారి కాశీలో భిక్ష దొరకలేదు. దాంతో వారు అలిగి కాశీని శపించబోయారు. వారిని వారించి కడుపు నిండా భోజనం పెట్టించి అన్నపూర్ణ విశ్వేశ్వరులు ఆయన్నే శపించి కాశీ నుంచి వెళ్ళగొట్టారు. వ్యాసుల వారు దక్షిణ కాశి అనే దాక్షారామానికి వచ్చి స్థిరపడ్డారు. ఇంతకు పూర్వం వేరే కారణాల వల్ల కాశీని వదిలి పెట్టిన అగస్త్యుల వారు ఈయన్ని కలుసుకున్నారు. ఇద్దరూ ఉమ్మడిగా తూర్పు గోదావరి జిల్లాలో కొంత సంచారం చేస్తారు. కావ్యం వ్యాసులు వారు కాశీని వదలిపెట్టడంతో మొదలవుతుంది. మూడో ఆశ్వాసంలో క్షీరసాగర మథనం, హాలాహల భక్షణం మొదలైన శివపురాణ కథలున్నాయి' (85). దీనికి భీమేశ్వర పురాణం అనే పేరు కూడా ఉంది. దాక్షరామ భీమేశ్వరుని లీలలు వర్ణించే రచన ఇది. ఇది స్థానికమైన కథాంశాన్ని వ్యక్తం చేసే స్థల మాహాత్మ్యాన్ని తెల్పే రచనగా గుర్తింపవచ్చు. స్కాంద పురాణంలోని గోదావరి ఖండం దీనికి మూలం.

కేదార ఖండం : ఇది పెదపాటి సోమయ్య రచన. ఇందులో కేవలం తొమ్మిది పద్యాలే లభిస్తున్నాయి. నాగర ఖండం - ఇది తురగరాజు కవి, అయ్యంకి బాల సరస్వతి అనే జంట కవుల రచన. ఇది అయిదాశ్వాసాల గ్రంథం. స్కాంద పురాణాంతర్గ కథ. 1586లో రచించిన ఈ గ్రంథం విశ్వకర్మను స్తుతించే రచన. బ్రహ్మోత్తర ఖండం - పట్టమట్ట సోమనాథుడు స్కాంద పురాణంలోని బ్రహ్మోత్తర ఖండాన్ని అనువదించాడు. పురుషోత్తమ ఖండం - కలదిండి భావనారాయణ రచన ఇది. 'ఇతడు జగన్నాథంలో సుభద్రా దేవి భక్తుడు. ఆ క్షేత్ర మాహాత్మ్యాన్ని చాటే పురుషోత్తమ ఖండాన్ని కూడా ఆంధ్రీకరించాడు. అది నష్టమయింది....' (86).

శివరహస్యఖండం - రాపాక వెంకటదాసు అనువదించాడు. దీనినే 1852 ప్రాంతాలకు చెందిన ముదిగొండ బ్రహ్మయ లింగం వచనంలో రచించాడు. స్కాంద పురాణాంతర్గతమైన శివరహస్య ఖండాన్ని కోడూరి వెంకటాచలం తెనుగించాడు. ఇది ఇరవై ఎనిమిది ఆశ్వాసాల గ్రంథం. మొత్తం ఏడు కాండాలున్నాయి. కొన్ని మాత్రమే సమగ్రంగా దొరికాయి. రేవూరి చిన అనంతయ్య దీనిని తొమ్మిదాశ్వాసాల గ్రంథంగా రచించాడు. అసలిది ఏడు కాండలు ఉంటే రేవూరి రచనలో నాలుగే కనిపిస్తాయి. ధర్మఖండం - ఈదులపల్లి భవానీశం ధర్మఖండాన్ని అనువదించాడు. ధర్మఖండం స్కాందపురాణంలో ఓ భాగం. 'దీనిలో భారత భాగవత రామాయణ గాథలు, మరికొన్ని ప్రాచీన గాథలు ఉన్నా, ముఖ్యంగా వాల్మీకి చరిత్రను ఇది కథనం చేస్తుంది. దీనిని తొమ్మిది ఆశ్వాసాలుగా భవానీశం వ్రాశాడు' (87).

3.7. దైవీయ సాహిత్య వస్తు పరిణామం : 12వ శతాబ్దం నుంచి 20వ శతాబ్దం దాకా వెలువడుతూ వచ్చిన సాహిత్యంలోని దైవీయ వస్తువు పురాణ ప్రక్రియాగతంగా

అభివ్యక్తమయింది. సంస్కృత పురాణ సాహిత్యం తెలుగులో రూపొందటం వాస్తవమే కాని, తెలుగులో దాని వికాసం మూలం కంటే భిన్నంగా సాగింది.

తెలుగులో ప్రారంభమయిన పురాణ రచనం స్వతంత్రంగా బసవ పురాణ రూపంలో అనువాదంగా కాకుండా అవతరించింది. అనంతరం దాని ప్రేరణతో అనువాదంగా పురాణ సాహిత్యం వెలువడసాగింది. భారత భాగవత రామాయణాల అనువాదం వెనుక మత కారణాలు బాహాటంగా కనిపించాయి. ఈ నేపథ్యంలోనే భాగవత పురాణం అనువాదమయినట్లుగా అనిపించినప్పటికీ, పురాణం తెలుగులో వెలువడసాగిన దశ కూడా ప్రోత్సాహకంగా ప్రేరకంగా గోచరమవుతూ ఉంది.

సాంఘిన నేపథ్యంతో వెలువడ్డ తెలుగు పురాణ సాహిత్యం సాంఘికావసరాలకు అనుగుణంగా వర్తిస్తూ వచ్చింది. స్థల క్షేత్ర తీర్థ వ్యక్తి మాహాత్మ్య తెలిపేదిగా అనువాదంగానూ స్వతంత్రంగానూ పురాణ వాఙ్మయం తెలుగు సృష్టి పొందింది.

పురాణాలు మహర్షుల ప్రోక్తాలు. అది మౌఖిక సాహిత్యంగా తరతరాలు మహర్షుల వాహికగా పొంది, వెలువడి, అందుతూ వచ్చింది. సంస్కృతంలో మహర్షులు సృజించిన పురాణ సాహిత్యం తెలుగులో మహాకవుల ప్రోక్తంగా లభించింది. మహాకవులు కూడా తొలిగి, మామూలు కవులు సృష్టించే స్థితి వచ్చింది. మామూలు కవులు సామాన్య మానవులు పురాణానువాదం చేసినప్పుడు తమ అవసరాలు స్థానికావసరాలు వచ్చి చేరాయి. అనువాదం వెనుకంజ వేయగా, స్వతంత్ర పురాణ సాహిత్య సృష్టి ముందంజ వేసింది.

సంస్కృతంలో పురాణం పంచ లక్షణ సముచితంగా ఉన్న సాహిత్య సంపద. దాని రచనా ప్రణాళిక విశాల దేశకాల ప్రాంత ప్రసిద్ధంగా ఉంది. తెలుగులోకి అష్టాదశ పురాణాలు, అష్టాదశ ఉప పురాణాలు అనువాదం కాలేదు. చాలా పరిమితంగానే అనువాదం జరిగింది. అనువాదం పొందిన పురాణాలు అన్నీ సంపూర్ణం కాలేదు. పాక్షికంగానే జరిగాయి.

అందువల్ల తెలుగు పురాణాలలో పంచ లక్షణాలు అన్వయించవలసిన అవసరం ఏర్పడుతూ వచ్చింది. కొన్ని సందర్భాలలో అన్ని లక్షణాలు అన్వయింపవు. కొన్ని సందర్భాలలో కొన్ని లక్షణాలు పాక్షికంగా అన్వయించాయి. ఈ అన్వయ క్లిష్టత్వం అనువాదంలో పురాణమంతా రాకపోవటం వల్ల వచ్చింది.

ప్రథమాంధ్ర పురాణం కానీ, భాగవత పురాణం కానీ సమగ్రమైన అనువాదాలుగా కానీ, సంపూర్ణ లక్షణ సమంచితాలుగా కానీ భావింపవచ్చు. అనంతరం వెలువడ్డ ఏ పురాణమూ సమగ్రం కాదు. నృసింహ పురాణంకావ్య ధర్మం పొందింది. మిగతా పురాణాలు నామ మాత్ర పురాణాలుగా రూపొందాయి.

ఈ సమస్య గ్రహించి ఎర్రన సోమనలు పురాణమంతటిని కాకుండా పురాణంలోని అయిదు లక్షణాలలో ఒక లక్షణం మాత్రం గ్రహించి వంశ ప్రసిద్ధంగా పురాణ భాగాలు వ్రాశారు. ఎర్రన హరివంశం పూర్వోత్తర భాగ విషయ విన్యస్తంగా వ్రాయగా, సోమన ఉత్తర హరివంశం మాత్రమే వ్రాశాడు. అందులోని అన్ని కథలూ గ్రహించలేదు. అభీష్టమయిన అంశాలు కొన్నింటినే గ్రహించాడు. ఈ మాత్రంగా కూడా పురాణ రచన

గుతూ రాలేదు. మాహాత్మ్యాల పేరిట ఒకే కథా సూత్రానికి పరిమితంగా రచన
ృతమయింది. ఇది మరింత పరిమితమయి విలాసంగానో ఖండంగానో ప్రత్యక్షమయింది.
ుగులో పురాణానువాదం విశాల కథానేపథ్యం నుంచి కుచించుకొని పోయి పరిమిత
ాంశానికి, ఏకకథా సూత్రానికి కట్టుబడే స్థితికి వచ్చింది. దైవ వస్తువు శివ కేశవం
ంగణాలలో చీలిపోయింది. శైవ సాహిత్యం ప్రజాభిమతంగా సాగగా, వైష్ణవ సాహిత్యం
జకార్యంగా విస్తరించింది. వైష్ణవ సాహిత్యంలో దశావతారాల కంటే శ్రీకృష్ణుని జీవిత
త్రం సాహిత్యేతివృత్తంగా విశాల సారస్వత రూపం సంతరించుకొంది.

పురాణం దైవ వస్తుగతం. పురాణ సృష్టి దేవ దానవ సంబంధ సంస్థాపనం
క్ష్యంగా ఉంది. అందుకే సృష్టి మూలం నుంచి, ముప్పై ఇద్దరు మునువుల వ్యాప్తి,
వ సంతానంగా ప్రభవించిన మనుష్యుల వంశక్రమం నుంచి వంశానుక్రమం రూపెత్తిన
ానవాత్మ దాకా పురాణ కథ సాగింది. పరమాత్మకు మానవాత్మకు అనుసంధానం
ర్పరచటం పురాణ సాహిత్య లక్ష్యం. ఈ అలౌకిక సంబంధ స్థాపనం దృష్టితో మానవుడు
ాహిమాన్వితుడుగా రూపొందడం కోసం, మానవుడి అస్తిత్వం అధిభౌతిక సంబంధంతో
ర్థవంతం కావటానికి ఉద్దిష్టమయిన పురాణ సాహిత్యం క్రమంగా దైవ సంబంధం
ల్పోసాగింది. దైవ సంబంధం ఉన్నప్పుడు కూడా స్థానికావసరం ప్రముఖమయింది.
స్తువు యొక్క స్థానిక ప్రతిబింబంగా రూపొందటం ప్రధాన విషయంగా అనంతరం
ురాణాలు భావింపసాగాయి. అందుకే కవుల కాలం, స్థలం, జీవితం ప్రధానమయి
ురాణ సృష్టి ఈ ప్రాధాన్యం తలదాల్చవలసిన పరిస్థితిని పొందింది.

దేవతల, దేవర్షుల, బ్రహ్మర్షుల, మహర్షుల, ఋషుల కోవలో మానవుల గోత్ర
క్రమం వర్ధించటమన్న సహజ మానవ స్వభావ పరిణామం పురాణ సాహిత్యంలో
భాగమయింది. గోత్రమే లేని మానవ జీవన పరిణామ సూత్రం పురాణ సాహిత్యంలో
హేతువును అన్వేషించే పరిస్థితి సంక్రమించటంతో పురాణ సాహిత్య వికాసం యొక్క
ఆంతర్యం స్పష్టం కాసాగింది. అప్పుడు పురాణ సాహిత్య సృష్టి సంకుచితం కావటం
ఆరంభమయినట్లు స్పష్టంగా గుర్తింపవచ్చు. దేవధర్మం, మనుధర్మం, మనుజ ధర్మం,
వర్ణాశ్రమ ధర్మం పరస్పరం విభేదిస్తూ వస్తున్న కారణాన పురాణ సృష్టిలో విశేషమయిన
పరిణామం ప్రవేశించింది. కాల ప్రభావం వల్ల, సమాజ పరిణామం సంభవించింది. ఈ
సామాజిక పరిణామం సాహిత్యావకాశం నిర్ణీతం చేసింది. ఈ నిర్ణీతపు హద్దుల్లో పురాణం
తన విశాల వస్తుతత్త్వాన్ని కోల్పోయింది. ఈ వస్తువు పరిమిత సాహిత్య ప్రాంగణానికి
సంక్రమించింది.

ఋషులు కాని వాళ్ళు పురాణ సృష్టిని అనువాదాన్ని తెలుగులో సాగిస్తున్నప్పుడు
సహజంగా వచ్చే పరిణమంగానే విశాలత సంక్షిప్తతకు చోటు ఇచ్చింది. శతాధికంగా ఒక్కొక్క
పురాణంలో ఉండే కథలు తగ్గిపోతూ, పదికో పరక్కో వంశంలో రూపొందగా, అంత కంటే
తక్కువగా మాహాత్మ్యాలలో, మరీ తక్కువగా విలాసాలలో, ఇంకా తక్కువగా ఖండాలలో
కనిపిస్తూ చిన్న కథ పెరిగి పెద్దదై ప్రబంధంగా నాటకంగా మారటం గమనార్హమైన
పరిణామం. విష్ణు జీవితంలో దశావతారాలు పరిమితం. దశావతారాల్లో శ్రీకృష్ణావతారం

మరీ పరిమితం. శ్రీకృష్ణుడి భార్యల్లో ఒక్కతి సత్యభామ. ఆమెతో శ్రీకృష్ణుడు జీవితం మరీ పరిమిత భాగం. ఆమె పారిజాతం కోరటం మరీ చిన్న విషయం. ఆ చిన్న విషయం అనేక ప్రబంధాలకు, అనేక నాటకాలకు, అనేక కావ్యాలకు ప్రాణదానం చేసింది. ఎంత విశాల కథా ప్రణాళికా పరిధి, ఎంత పరిమిత స్వల్పాంశ కథా సూత్రంగా మారిందో గుర్తిస్తే పురాణం పొందిన పరిణామం వ్యక్తమవుతుంది.

అనేక నాయకంగా ఉన్న పురాణం ఏక నాయకంగా మారిపోయింది. అనేక కాలాలకు చెందిన ఈ రచన ఏక కాలానికి పరిణమించింది. అనేక రసాలకు ఆలవాలంగా ఉన్న ఈ సాహిత్య సృష్టి ఏకరసాత్మకంగా మారింది. దైవీయ సాహిత్యం మానవీయమయింది. దైవత్వం ప్రతిష్ఠించే సాహిత్యం రస ప్రచురంగా పరిణామం చెందింది. దైవీయ వ్యవస్థ మానవీయ వ్యవస్థగా మారిపోసాగింది.

పురాణం దాని పరిణామ మార్గంలో ఐతిహాస ధర్మం పొందింది. అందుకే భాగవత పురాణం భాగవతేతిహాసంగా విమర్శకులు భావించే స్థితికి వచ్చింది. అది భౌతిక చర్యలు చారిత్రక చర్యలుగా గుర్తించే స్థితి ఏర్పడింది. సంస్కృత సాహిత్య సాహచర్యంతో తెలుగులో ప్రభవించిన పురాణ సాహిత్యం స్వతంత్ర ప్రతిపత్తిని పొంది, ఆంధ్రత్వం ప్రకటించే సాహిత్య స్వరూపంగా పరిణామం చెందింది.

## అధస్సూచికలు

1. సంస్కృత సాహిత్య చరిత్ర
   డా.ముదిగంటి సుజాతారెడ్డి, డా.ముదిగంటి గోపాలరెడ్డి — పుట 173
2. సంస్కృత సాహిత్య చరిత్ర
   డా.ముదిగంటి సుజాతారెడ్డి, డా.ముదిగంటి గోపాలరెడ్డి — పుట 173
3. సంస్కృత సాహిత్య చరిత్ర
   డా.ముదిగంటి సుజాతారెడ్డి డా.ముదిగంటి గోపాలరెడ్డి — పుట 177
4. సంస్కృత సాహిత్య చరిత్ర
   డా.ముదిగంటి సుజాతారెడ్డి డా.ముదిగంటి గోపాలరెడ్డి — పుట 179
5. మార్కండేయ పురాణము డా.జి.వి.సుబ్రహ్మణ్యం — పీఠిక XXI
6. తెలుగు సాహిత్య సమీక్ష I డా.జి.నాగయ్య — పుట 124
7. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర ద్వి.భా. డా.యస్వీ.జోగారావు — పుట 119
8. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర ద్వి.భా. డా.యస్వీ.జోగారావు — పుట 39
9. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర ద్వి.భా. డా.యస్వీ.జోగారావు — పుట 85
10. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర ద్వి.భా. డా.యస్వీ.జోగారావు — పుట 131

11. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర ద్వి.భా. డా.యస్వీ.జోగారావు పుట 87
12. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర ద్వి.భా. డా.యస్వీ.జోగారావు పుటలు 377, 378
13. నవనాధ చరిత్ర కావ్యానుపరిశీలనము డా.కె.ఓ.బి.రెడ్డి పుట 79
14. నవనాధ చరిత్ర కావ్యానుపరిశీలనము డా.కె.ఓ.బి.రెడ్డి పుట 15
15. నవనాధ చరిత్ర కావ్యానుపరిశీలనము డా.కె.ఓ.బి.రెడ్డి పుట 36
16. సమగ్రాంధ సాహిత్యం X ఆరుద్ర పుట 24
17. తెలుగు సాహిత్య చరిత్ర II డా.జి.నాగయ్య పుటలు 311, 312
18. సమగ్రాంధ్ర సాహిత్యం X ఆరుద్ర పుట 106
19. ప్రథమాంధ్ర మహాపురాణము డా.జి..సుబ్రహ్మణ్యం పుట 70
20. మార్కండేయ పురాణము డా.జి.సుబ్రహ్మణ్యం పీఠిక xviii
21. మార్కండేయ పురాణము డా.జి.సుబ్రహ్మణ్యం పీఠిక XXX
22. మార్కండేయ పురాణము డా.జి.సుబ్రహ్మణ్యం పీఠిక XX
23. ప్రథమాంధ్ర మహాపురాణము డా.జి.సుబ్రహ్మణ్యం పుట 50
24. మార్కండేయ పురాణము డా.జి.సుబ్రహ్మణ్యం పీఠిక XX
25. తెలుగు సాహిత్య సమీక్ష I డా.జి.నాగయ్య పుట 470
26. శ్రీ మహాభాగవతము డా.దోణప్ప పీఠిక 59
27. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర ద్వి.భా. డా.యస్వీ.జోగారావు పుట 33
28. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర ద్వి.భా. డా.యస్వీ.జోగారావు పుట 220
29. తెలుగు సాహిత&య సమీక్ష II డా.జి.నాగయ్య పుట 412
30. సమగ్రాంధ్ర సాహిత్యం 1966 ఆరుద్ర పుట 169
31. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర డా.యస్వీ.జోగారావు పుట 30
32. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర డా.యస్వీ.జోగారావు పుట 12
33. తెలుగు సాహిత్య సమీక్ష I డా.జి.నాగయ్య పుట 294
34. సమగ్రాంధ్ర సాహిత్యం IX ఆరుద్ర పుట 198
35. సమగ్రాంధ్ర సాహిత్యం V ఆరుద్ర పుట 216
36. సమగ్రాంధ్ర సాహిత్యం V ఆరుద్ర పుటలు 249, 250
37. సమగ్రాంధ్ర సాహిత్యం V ఆరుద్ర పుట 239
38. సమగ్రాంధ్ర సాహిత్యం V ఆరుద్ర పుట 189,190

39. సమగ్రాంధ్ర సాహిత్యం VII ఆరుద్ర పుట 190
40. సమగ్రాంధ్ర సాహిత్యం IX ఆరుద్ర పుట 236
41. సమగ్రాంధ్ర సాహిత్యం XII ఆరుద్ర పుట 25
42. సమగ్రాంధ్ర సాహిత్యం V ఆరుద్ర పుట 195,196
43. సమగ్రాంధ్ర సాహిత్యం I ఆరుద్ర పుట 89
44. సమగ్రాంధ్ర సాహిత్యం VIII ఆరుద్ర పుట 272
45. సమగ్రాంధ్ర సాహిత్యం VIII ఆరుద్ర పుట 275
46. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర డా.యస్వీ.జోగారావు పుట 161
47. సమగ్రాంధ్ర సాహిత్యం V ఆరుద్ర పుటలు197,198
48. సమగ్రాంధ్ర సాహిత్యం IX ఆరుద్ర పుట126
49. సమగ్రాంధ్ర సాహిత్యం XII ఆరుద్ర పుట 35
50. సమగ్రాంధ్ర సాహిత్యం XII ఆరుద్ర పుట 25
51. సమగ్రాంధ్ర సాహిత్యం IX ఆరుద్ర పుట 230
52. సమగ్రాంధ్ర సాహిత్యం III 1990 ఆరుద్ర పుట 149
53. తెలుగు సాహిత్య సమీక్ష I డా.జి.నాగయ్య పుట 315
54. సమగ్రాంధ్ర సాహిత్యం IX'1967 ఆరుద్ర పుట 236
55. సమగ్రాంధ్ర సాహిత్యం VI ఆరుద్ర పుట 60
56. సమగ్రాంధ్ర సాహిత్యం V ఆరుద్ర పుట 177
57. సమగ్రాంధ్ర సాహిత్యం V ఆరుద్ర పుట 288
58. సమగ్రాంధ్ర సాహిత్యం IX ఆరుద్ర పుట 233
59. సమగ్రాంధ్ర సాహిత్యం XII ఆరుద్ర పుట 306
60. సమగ్రాంధ్ర సాహిత్యం IX ఆరుద్ర పుట 113
61. సమగ్రాంధ్ర సాహిత్యం IX ఆరుద్ర పుట 177
62. సమగ్రాంధ్ర సాహిత్యం X ఆరుద్ర పుట 209
63. సమగ్రాంధ్ర సాహిత్యం XII ఆరుద్ర పుట 122
64. సమగ్రాంధ్ర సాహిత్యం XI ఆరుద్ర పుట 191
65. సమగ్రాంధ్ర సాహిత్యం XII ఆరుద్ర పుట 241
66. సమగ్రాంధ్ర సాహిత్యం XIIఆరుద్ర పుట 259
67. సమగ్రాంధ్ర సాహిత్యం XII ఆరుద్ర పుట 307